శ్రీ కూరనారాయణమునిప్రణీతమైన

# శ్రీసుదర్శనశతకము

# జ్వాలావ్యాఖ్యానము

ఈ. ఏ. ఆర్. రామన్

పరిష్కరణ

మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర
ఉ.వే. శ్రీమాన్. ఎస్. ఎన్. సి. రఘునాథాచార్యస్వామివారు

# శ్రీసుదర్శనశతకము - జ్వాలావ్యాఖ్యానము

వ్యాఖ్యాత :
ఈ. ఏ. ఆర్. రామన్



ప్రథమ ముద్రణ - చిత్రభాను-ఫాల్గుణ మాసము (మార్చి 2003)

ప్రతులు -

మూల్యము - రూ.

ప్రతులకు

1. శ్రీభాష్యకారసిద్ధాన్త పీఠము
   1-4-2, సూర్యనారాయణపురం,
   అడ్డవంతెనదగ్గర, జువ్వలపాలెం రోడ్,
   భీమవరం -2

2. శ్రీమతి ఈ. జయలక్ష్మి
   18-3-58/7, శాంతినగర్, కె.టి.రోడ్,
   తిరుపతి - 517 507, ఫోన్ (0887-2232091)

లేజర్‌టైప్‌సెట్టింగ్
**అన్నపూర్ణగ్రాఫిక్స్**, 53/4 , ఆర్. ఎస్. గార్డెన్స్
తిరుపతి. ఫోన్ : 2235006



జైగోవింద     శ్రీమతే రామానుజాయ నమః     జైజై గోవింద

## శ్రీభాష్యకారసిద్ధాన్త పీఠము

పరమహంసపరివ్రాజకాచార్య
శ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్రరామానుజ జీయరుస్వామివారు
1-4-2, సూర్యనారాయణపురం,     తేది : 19-1-2003
అడ్డవంతెనదగ్గర,
జువ్వలపాలెం రోడ్,
భీమవరం -2

శ్రీమాన్ ఉ.వే. ఈ. ఏ. ఆర్. రామన్ గారికి,

అనేక మంగళాశాసనములు. శ్రీకూరనారాయణులు అనుగ్రహించిన 'సుదర్శన శతకము'ను దేవరవారు విశేషార్థములతో చాలావివరముగా లోకమునకు అందించుట చాలా సంతోషకర విషయము.

శ్రీసుదర్శనుల వైభవమును శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణములు, ఆగమ గ్రంథములు అనేక విధములుగ కొనియాడుచున్నవి. శ్రీమన్నారాయణుని నిగ్రహానుగ్రహములు ఈ సుదర్శనుని ద్వారా లోకమునకు అందుతున్నవి. భక్తజనుల అజ్ఞానాంధకారమును తానుపోగొట్టి భగవత్సన్నిధికి చేరు మార్గమును చాలా స్పష్టముగ చూపు మహామహోపకారి ఈ సుదర్శనభగవానుడు. ముందుగ వీరి వైభవము తెలిసినగాని భగవానుని వైభవమును దర్శించలేరు కనుక ముందు వీరు తెలియవలెను. అట్టి వీరిని లోకమునకు స్తోత్రరూపమున కూరనారాయణులు, వివరణరూపమున దేవరవారు అందించి ఈ రూపముగ మార్గనిర్దేశకులు అగుచున్నారు.

దీనిని భక్తజనులందరు చక్కగనుపయోగించుకొని తరింతురుగాక !

శ్రీరామచంద్రరామానుజజీయర్
భీమవరం (ఆశ్రమం)

జైగోవింద

**మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర**
**ఉభయవేదాన్తమహావిద్వాన్**
**శ్రీమాన్ యస్. ఎన్. సి. రఘునాథాచార్యస్వామివారు**
అధ్యక్షులు, సత్సంప్రదాయపరిరక్షణ సభ, వరంగల్-

## ఆమోదపత్రము

శ్లో ॥ అస్తు స్వస్తి సదా వైరినిర్యాతనపటీయసే ।
ఊర్జస్వలాయ చక్రాయ హరిహస్తాబ్జవాసినే ॥

ఆన్ధ్రప్రదేశమున శ్రీవైష్ణవసిద్ధాన్త సంప్రదాయప్రవర్తకములైన అనేక ఆచార్య కుటుంబములలో కిళాంబి- ఈయుణ్ణి స్వాముల కుటుంబములు సుమారు 200 సంవత్సరములుగా అతిప్రసిద్ధి గాంచినవి. ఈ కుటుంబములవారు గోదావరిజిల్లాలో నివసించుచూ, సంస్కృతద్రవిడ వేదాన్తములలో పరిపూర్ణప్రజ్ఞావిశేషము కలిగి, పఠన పాఠనములయందును, బహుగ్రన్థరచనమునందును అగ్రగాములైన విలసిల్లుచున్నారు- అను విషయము ఆన్ధ్రదేశమున సర్వజనవిదితము. కొన్ని తరములుగా ఈ ఉత్తమసంస్కారము ఆ ఉభయాచార్యపురుషవంశములలో క్రమపరంపరగా ఈ కాలమునగూడ సంక్రమించుచూ వచ్చుట, తద్ద్వారా వేలకొలది శ్రీవైష్ణవ మతాభిమానులైన ఆస్తికులగు భక్తులు సంప్రదాయపరిజ్ఞానమునొంది, ఉజ్జీవించుట అస్మదాదులకు నిత్యప్రత్యక్షసిద్ధమైన అంశము. శ్రీమత్కిళాంబివంశమునుకు చెందిన విద్వన్మూర్ధన్యులైన ఉ.వే. గోపాలకృష్ణమాచార్యస్వామివారిని నేను సేవించలేదు గాని, వారిపుత్రపౌత్రులను సేవించితిని.

ఇట్లే, శ్రీ ఈయుణ్ణి వంశమున పరమసాత్త్వికులు, పండితప్రకాండులునైన ఉ.వే. శేషసింగరాచార్యస్వామివారిని సాక్షాత్ సేవించు భాగ్యము నాకు లభించుటతోపాటు, వారి పుత్రపౌత్రప్రపౌత్రులను దర్శించు భాగ్యము గూడ సంప్రాప్తమైనది. ఈ ఉభయ వంశీయులలో శ్రీవైష్ణవశ్రీసమృద్ధి విశ్వవిఖ్యాతమై అలరారుచున్నది. ఇది ఆన్ధ్ర దేశీయుల అదృష్టవిశేషము.

శ్రీ ఉ.వే. శేషశింగరాచార్యస్వామివారి పౌత్రులు, శ్రీ ఉ.వే. రంగాచార్యస్వామివారి పుత్రులునగు **''శిఱుమామనిశర్''** అని ప్రశంసింపదగిన శ్రీమాన్ అళగశింగరాచార్య



స్వామివారితో కొద్ది సంవత్సరములుగా నాకు పరస్పరసహకార రూపంగా మైత్రీబన్ధమేర్పడ్డది. నాకు అవసరమైన కొన్ని అముద్రిత సంస్కృత గ్రన్థాల సంపాదనలో వారి సహకారం, వారు ప్రకటిస్తున్న కొన్ని సద్గ్రన్థాలపై నాద్వారా గుణదోషపరిశీలనం- ఇట్టివే మా పరస్పర సహకారప్రయోజనాలు. వారు ప్రకటించిన శ్రీరంగరాజస్తవ వ్యాఖ్యానం పైన, వారి కుమారులు చి. ఇ.ఎ.ఆర్. రామన్ గారి తిరువేజ్గడత్తన్దాది వ్యాఖ్యానంపైన, పర్యవేక్షణ పూర్వకముగా నా శుభాకాంక్షలను తెలుపుకొనియున్నాను.

**సుదర్శనశతకవ్యాఖ్యానమునుగూర్చి –**

ఇపుడు కొత్తగా వెలువడుచున్న సుదర్శనశతకముపై ఆన్ధ్ర వివరణము పరిశీలనకై వారు సాదరముగా నావద్దకు పంపిరి. యథావకాశముగా పర్యవేక్షించి, **''రంగేశవిజ్ఞప్తి కరామయస్య. . .''** ఇత్యాది తనియన్శ్లోకముపైనను, స్తోత్రములో నొకటి రెండు చోట్ల ప్రతిపదార్థవివరణముపైనను, నాకు తోచిన పరిష్కారములను వారికి ప్రత్యక్షములోనే తెలుపుకొంటిని. వాటిని వారు గ్రహించియుందురు.

సూర్యశతకచ్ఛాయలో సాగిన ఈస్తోత్రరచన గాఢబన్ధయుతమై, పలుస్థలములలో సూర్యశతకమును మించి శోభించినది. ఏతదనంతరకాలికమైన శ్రీవేదాన్తదేశికుల వారి గరుడపంచాశత్‌లో ఈ సుదర్శనశతకప్రౌఢ పదప్రయోగములు కొన్ని స్వీకృతములైనవి. దీనిపై ప్రాచీనసంస్కృతవ్యాఖ్యానమొకటి ( అజ్ఞాతకర్తృకము) నిర్ణయసాగర ప్రెస్సువారిచే కావ్యమాలా గుచ్ఛములలో ముద్రితమైనది. శ్రీవైష్ణవపత్రికలో పెంటపాడువారిచే 50 సంవత్సరములకు పూర్వము ప్రతిపదార్థముతో ఆన్ధ్రభాషా వివరణ మొకటియు, మరికొందఱు పండితులచే ఈమధ్యనే కొన్ని సంగ్రహాన్ధ్రవ్యాఖ్యానములు గూడ వెలువరింపబడినవి. మణిప్రవాళభాషలో కాంచీపురం, శ్రీ ఉ.వే. ప్ర. భ. అణ్ణంగరాచార్యులవారు ఒక వ్యాఖ్యను 40 సంవత్సరాలకు పూర్వం వెలయించియున్నారు. ఇన్ని వ్యాఖ్యలుండగా ఇపుడు చి॥ ఈయుణ్ణి అనంత రంగరామన్ వారి వ్యాఖ్యానము అవసరమా ! అని కొందరికి సందేహ మేర్పడవచ్చును. దానిపై మా సమాధానమిది -

మల్లినాథుని సర్వంకషవ్యాఖ్యానమునకు పూర్వమే మాఘకావ్యముపై ఎన్నో వ్యాఖ్యలు ఆవిర్భవించినవి. వాటిలోని అసంపూర్ణతను గుర్తించిన మల్లినాథుడు పలు స్థలములలో ఆలోపములను ఎత్తిచూపుచూ, ఛందోవ్యాకరణరసాలంకారాది వివిధాంశములను ఆవిష్కరించుచూ, అచ్చటచ్చట రాజనీతిమర్మములను,

సాంఖ్య - యోగాదిదర్శన రహస్యములను స్ఫుటీకరించుచూ **'సర్వంకషా'** యను వ్యాఖ్యను రచించి, ఆ వ్యాఖ్యానారంభములో **''యే శబ్దార్థపరీక్షణ ప్రణయినః యే వా గుణాలంక్రియా శిక్షాకౌతుకినః, విహర్తుమనసో యే చ ధ్వనే రధ్వనిః, క్షుభ్యద్భావతరంగితే రసుసుధాపూరే మిమంక్షంతి యే, తేషా మేవ కృతే కరోమి వివృతిం మాఘస్య సర్వంకషామ్''** అను శ్లోకమున తాను చేసిన ప్రతిజ్ఞను సర్వాత్మనా నెఱవేర్చియున్నాడు గదా ! ఆ పద్ధతిలోనే ఇపుడీ సుదర్శనశతకవ్యాఖ్యానము ఆవశ్యకసర్వవిషయులపై అసందిగ్ధమగు చర్చను చేయుచూ కొనసాగినది. ఈ శతకావిర్భావమునకుగల హేతువులను వివరించుచూ, స్తుతికర్తయొక్క దేశకాలాదిచర్చను చేయుచూ, ప్రతిపాద్యమైన శ్రీసుదర్శనమూర్తి వైభవమును, తన్నిరూపకయంత్రమంత్ర గతబీజాక్షర వైశిష్ట్యదులను విపులీకరించుచూ, వీటితోపాటు ఛందోవ్యాకరణాలంకారాదివిశేషములను గూడ నిరూపించుచూ సాగిన ఈ ఆంధ్ర వివరణము జిజ్ఞాసువులగు పాఠకులకు సర్వాంశములను ప్రతిపాదించినందున, ఇతరవ్యాఖ్యలకంటె ఇందుగల వైశిష్ట్యము ప్రస్ఫుటమైనది. శ్రద్ధాళువులైన పాఠకులు ఇందు అవగాహనముచేయుదురు గనుక, విస్తరభయా దుపరమ్యతే వ్యాఖ్యానకర్తకు శ్రీసుదర్శనమూర్తి సర్వమంగళములను ప్రసాదించుగాక !

ఇట్లు

నివేదించు బుధవిధేయుడు

**శ్రీ న.చ. రఘునాథాచార్యులు**



**పండితరాజ, వాచస్పతి, రాష్ట్రపతిపురస్కారగ్రహీత,**
**ఉ. వే. శ్రీమాన్ డా॥ ఎన్.సి.వి నరసింహాచార్యస్వామివారు,**
విశ్రాంత సాహిత్యశాఖాధ్యక్షులు, యస్.వి. ప్రాచ్యకళాశాల, తిరుపతి.
విశ్రాంత భాగవతప్రాజెక్టుడైరెక్టర్, తి.తి.దేవస్థానములు, తిరుపతి.

## అభినందనము

శ్రీసుదర్శనమని శ్రీమన్నారాయణుని చక్రాయుధమునకు పేరు. **''శంఖో లక్ష్మీపతేః పాంచజన్య శ్చక్రం సుదర్శనమ్''** అని నిఘంటువు. **'శోభనం దర్శన మస్య'** అని దీనికి వ్యుత్పత్తి. చక్రాయుధదర్శనమైనంత మాత్రముననే సమస్తపాపములు అడుగంటిపోవును. అట్టి చక్రాయుధము శ్రీమన్నారాయణుని అసాధారణాయుధము. **'చక్రి'** అనుపదము విష్ణువును స్ఫురింపజేసినట్లు మరొకరిని సూచింపదు. ఈ హేతిరాజము చేతనే శ్రీవిష్ణువు అఖిలాండకోటిబ్రహ్మాండమును చక్కగా కాపాడుచున్నాడు. ఇట్టి దివ్యాయుధముయొక్క మహిమయే ముఖ్యముగా ఈ శతక మందలి నూఱవ పద్యమున వర్ణింపబడియున్నది.

> **యస్మిన్ విన్యస్య భారం విజయిని జగతాం జంగమస్థావరాణాం**
> **లక్ష్మీనారాయణాఖ్యం మిథున మనుభవత్యత్యుదారాన్ విహారాన్,**
> **ఆరోగ్యం భూతి మాయుః, కృత మిహ బహునా, యద్యదాస్థాపదం నః**
> **తత్త త్సద్య స్సమస్తం దిశతు స పురుషో దివ్యహేత్యక్షవర్తీ**

అని వర్ణించినట్లు జంగమస్థావరాత్మకమైన ఈజగత్తుయొక్క రక్షణభారమును సుదర్శనముపైనుంచి లక్ష్మీనారాయణులు అత్యుదారనిర్వేశమును అనుభవించు చున్నారు. ఆలాగున భగవంతునకు అన్ని విధములుగ చేదోడువాదోడుగా నుండి సమస్తభోగములు కలుగజేయుచున్నాడు సుదర్శనాళ్వారు. అట్టి సుదర్శనుని నూఱు శ్లోకములో శ్రీకూరనారాయణజీయర్ అనువారు అద్భుతముగా వర్ణించిరి. ఉభయలోకతారకమగు ఈ పవిత్రశతకమును పారాయణచేసి, కష్టములు గట్టెక్కుట భాగవతులకు అనుభవ పునరుక్తము.

స్తోత్రరచయితలు శ్రీకూరనారాయణ జీయరనువారు. వీరు కూరత్తాళ్వారుల కంటె భిన్నులు. వీరన్ని శాస్త్రములందు ఆరితేరినవారైనను, మంత్రశాస్త్రమునందును

దిట్టలు. కావుననే బీజాక్షర సంపుటితమైన శతకమును వ్రాసి లోకోపకారమొనర్చిరి. వీరిలో అనంతవైభవము లున్నట్లు అనేక దృష్టాంతముల మూలమున తెలియుచున్నది. ఒకకర్ణాటకప్రభువు శ్రీరంగనాథవిగ్రహమును దొంగిలింప ప్రయత్నింపగా, ఆ ప్రయత్నమును వీరు సాగనివ్వలేదు. అట్లే, శ్రీరంగనాథస్వామి ప్లవోత్సవమును ఒక మాంత్రికుడు అస్తవ్యస్తముచేయ ప్రయత్నింపగా వీరు ఆ ఉపద్రవమును పరిహరించిరి. ఇట్టి వెన్నియో వీరి మహిమలు.

ఇట్టి మహాస్తోత్రమున తెలుగింప మహాయోగ్యత కావలెను. సాహిత్యదర్శన జ్ఞానమే గాక, పరమవిశిష్టాద్వైత సంప్రదాయజ్ఞానము కలిగిన భాగవతుడే యోగ్యుడు. సంస్కృత ద్రావిడవేదాంతగ్రంథములోని రహస్యవృత్తాంతమును తెలిసినవాడే దీనికర్హుడు. దీనికి యోగ్యులు శ్రీ ఈ. అనంతరంగరామన్ గారు తెలుగు వ్యాఖ్య వ్రాయబూనుట భాగవతభాగ్యము. వీరు సంస్కృత వ్యాఖ్యలోని విశేషములనే గాక, ద్రావిడసంప్రదాయగ్రంథములోని రహస్యములను గూడ అక్కడక్కడ ఉట్టంకించిరి. ఈ గ్రంథమునకు ఒక ప్రవేశికను వ్రాసి, అక్కడక్కడ మెఱుగు పెట్టినారు.

ఈ శతక పారాయణము సకలవ్యాధులను పాఱద్రోలుననుటలో సందేహములేదు. అయినను, విశేషించి ఏయే మంత్రశ్లోకము ఏయే అభీష్టసిద్ధికి ముఖ్యమో తెలిపి వానిని జపించుట సంప్రదాయసిద్ధమనియు తెలియపఱచిరి.

సుదర్శనశతకము మయూరకవియొక్క సూర్యశతకమువలె ప్రౌఢగంభీర మగుటయేగాక, ఎన్నియో సంప్రదాయార్థములతోకూడ నిండి, గభీరమై యుండుట దీని ప్రత్యేకత. అట్టి శతకమును సంస్కృతము తెలియని తెలుగువారికి ఉపయోగపడుటకై సులభాంధ్రభాషలో వ్యాఖ్యా, విశేషార్థములు వ్రాసి, మహోపకార మొనర్చిన శ్రీ ఈ. అనంతరంగరామన్ వారు మిగుల శ్లాఘ్యులు. వీరు తిరువేఙ్గడత్తన్దాది అను ద్రావిడకృతికి తెలుగు వ్యాఖ్యవ్రాసి ప్రకటించినారు. వ్యాఖ్యారచనలలో వీరు సిద్ధహస్తులు. ఈగ్రంథము చూచి భాగవతులు ఎంతో తృప్తి పొందగలరు. ఇంకను వీరెన్నో గ్రంథములకు వ్యాఖ్యలు వ్రాసి, మహోపకార మొనర్చెదరు గాక !

తిరుపతి,
10-9-02.

సుధీవిధేయుడు
**యన్.సి.వి. నరసింహాచార్యుడు**



**మధురవాక్శిఖామణి, భాగవతామృతవర్షి**
**ఉ. వే. శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారు**
ఉభయవేదాన్తపండితులు (హవల్దార్)
శ్రీ వరాహలక్ష్మీనృసింహస్వామివారి దేవస్థానము,
11-203, ప్రహ్లాదపురము, గోపాలపట్నం పోస్టు
విశాఖపట్టణము - 530 027, ఫోన్ : 0891-2708605

శ్రీసుదర్శనాయ హేతిరాజాయ నమః

**బహిరన్తస్తమశ్ఛేధి జ్యోతి ర్వన్దే సుదర్శనమ్ ।**
**యేనావ్యాహతసంకల్పం వస్తు లక్ష్మీధరం విదుః ॥**

ఉ.వే. శ్రీమాన్ ఈ. ఏ. శింగరాచార్యస్వామివారియొక్క పుత్రరత్నమగు శ్రీమాన్ ఈ. అనంతరంగరామన్ స్వామివారిచే రచియింపబడిన శ్రీసుదర్శనశతక ఆంధ్ర వ్యాఖ్యానమును ఆమూలాగ్రము సేవించి ఆనందపరవశుడనైతిని. సుదర్శనమన్త్రనిష్ఠులు అగు శ్రీకూరనారాయణయతివరులచే అనుగ్రహింపబడిన శ్రీసుదర్శనశతకరాజము ఈనాటికి సమగ్రమైన ఆంధ్రవ్యాఖ్యానముతో లభించుట చాల ఆనందదాయకము.

శ్రీసుదర్శనభగవానుని వైభవమును, ఆయనను ధరించియున్నప్పటి శ్రీమన్నారాయణుని వైభవమును, సౌందర్యాతిశయమును తలంచి, ఆనందాతిరేకముతో అనేకమార్లు కీర్తిస్తారు ఆళ్వార్లు. శ్రీసుదర్శనభగవానుని స్పర్శసౌభాగ్యము నందుటే జీవితమునకు పరమార్థమని వేదము ఘోషిస్తే, ఆ అదృష్టమును పొందిన భాగ్యశాలురము మేమని సగర్వముగ **''తీయిఱ్పొలిగిన్ఱ శెఞ్జుడరాఴి తిగఴ్ తిరుచ్చక్కరత్తిన్ కోయిల్ పొఱియాలే యొత్తుణ్డునిన్ఱు''** అని ప్రకటించుకుంటారు శ్రీ పెరియాళ్వార్లు. ఈ సంబంధము తమకు మాత్రమేకాక తమ వంశమువారికందఱికీ కలదను విషయమును పరమానందముగ **''కుడికుడియాళ్శెయ్గిన్ఱోమ్''** అనికూడ తెలుపుకుంటారు.

ఇక సుదర్శనధారిగా భగవానుని భావించినపుడెల్ల నమ్మాళ్వార్ అనుభవించు ఆనందమునకు మేఱయే లేదు. **''ఆఴిప్పిరాన్దన్నై''** సుదర్శనుని ధరించిన ఉపకారకుడు భగవానుడు అని అంటారు. ఇచ్చట భగవానుడు చేసిన ఉపకారము ఏమో అచ్చటి వ్యాఖ్యాన పంక్తులలో నమ్బిళ్లై **''కైయుమ్ తిరువాఴియుమ్ ఆన అఴగై ఆశ్రితర్ క్కాక్కి, అత్తై క్కొణ్డు విరోధియై పోక్కువార్క్కు విరోధియై పోక్కి''** ''అందమైన శ్రీహస్తము, అందు అందముగా అమరియుండు సుదర్శనాయుధములను చూసి భక్తులను ఆనందపరవశులను జేయును. భగవానునివలన విరోధినిరసనము నపేక్షించువారికి

తనసుదర్శనాయుధముతో విరోధులను పోగొట్టి, ఆనందమును కలుగజేయునట్టి ఉపకారకుడు'' అని తెలుపుతారు. ఇందువలన భగవానునికి ఆభరణముగా అందమును ఇనుమడింపజేయుచూ, ఆయుధముగా ఆశ్రితవిరోధి నిరసనమున కుపయోగపడు శ్రీసుదర్శనుని ఉభయవిధస్వరూపము తెలుపబడినది.

అట్లే, మఱియొక చోట **''పొన్నెడుమ్ శక్కరత్తై పిరాన్లై''** అని విద్దులవుతారు ఆళ్వార్లు. ఇందలి భావమును శ్రీనమ్బిళ్లై తమవ్యాఖ్యాన పంక్తులలో **''అళ్లకుక్కుమ్ ఆభరణత్తుక్కుమ్, మిడుక్కుక్కుమ్ తనక్కవరుకిన్డిక్కే యిరుప్పదాయ్, భోగ్యతైయళవిఅన్డిరుప్పదాన తిరువాళ్లియై యుడైయనాయ్, అవ్వాళ్లియాలే ఎన్నై ఎళ్లుతిక్కొణ్డ ఉపకరాకరనై''** ''భగవానునికి ఆభరణముగా అమరియుండు సొబగులో కాని, సహస్రభాస్కరకోటితుల్యసహజసిద్ధ సౌందర్యములోకాని, బలాతిశయములోకాని తనను మించినది వేరొకటి లేనిదగు పరమభోగ్యమైన సుదర్శనాయుధమును ధరించి, ఆ సౌందర్యమును చూపి, నన్ను తనకు దాసునిగా జేసికొనిన ఉపకారకుడు'' అని తెలియజేస్తారు. మఱియొకచోట నమ్మాళ్వార్ భగవానుని **''కాలశక్కరత్తాయ్''** అనగా కాలమును నడపు చక్రాయుధమును గలవాడా ! అంటారు. ఇచ్చట తనను స్మరించిన వారికి కాలవశ్యతను పోగొట్టునదిగా చక్రాయుధమును అభిర్ణిస్తారు ఆళ్వార్లు. ఇట్లు ఆళ్వార్లు పదే పదే సుదర్శనాయుధధారిగా భగవానుని దర్శించి అభివర్ణించుటకు కారణ మేమైయుండును ? అని ఆలోచించిన , దివ్యప్రబంధ వ్యాఖ్యాతలు తమసమాధానమును **''భోక్తాక్కళుక్కు పిడితోఱుమ్ నెయ్‌వేణ్డుమాప్పోలే, అడిక్కడిక్కైయుమ్ తిరువాళ్లియుమాన అళ్లకై అనుభవిక్కిఱార్'',** ''భోజన ప్రియుడైన వాడు తాను భుజించుప్రతి ముద్దను నేతిలోముంచి, ఆరగించిరసించునట్లే ఈ ఆళ్వార్‌కూడ అన్నశబ్దవాచ్యుడగు పరమాత్మను మాటిమాటికి సుదర్శనాయుధధారిగా భావించి, ఆనందము ననుభవించుచున్నారు'' అని వెలిబుచ్చుతారు.

శ్రీసుదర్శన భగవానునివైభవము పాంచరాత్రశాస్త్రములోని అహిర్బుధ్న్యసంహిత వేనోళ్ళ సువిశదముగ వర్ణించినది. సుదర్శనచక్రమనగా కేవలము వట్టి ఆయుధము మాత్రమే కాదనియు, శ్రీమన్నారాయణుని దివ్యసంకల్పమే సుదర్శనాయుధమనియు **''తదా దేవస్య సంకల్పః సుదర్శనసమాహ్వయః । ఆయుధాదిస్వరూపేణాకారం ప్రతిపద్యతే''** అని తెలుపుతుంది. ఇతర ఆయుధము లన్నియుకూడ సుదర్శనాను ప్రవేశమువలనే కార్యకారులగుచున్నవనియు, ఆయా సమయవిశేషములను బట్టి భగవానుని అవతారాదుల కనుగుణమైన పరికరముగ తనను మలచుకొని సుదర్శనము స్వామికి వినియోగపడుచున్నదనియు సంహితయందు తెలుపబడినది.

ద్విభుజుడై బృహస్పతికి సాక్షాత్కరించిన సుదర్శనుడు తన ఇతర స్వరూపములను తెలియజేయుచూ, విశ్వమయమగు తన స్వరూపము దేవదానవులకు



కూడ తెలిసికొనుటకు, తర్కించుటకు అశక్యమైనదని **''అన్య ద్విశ్వమయం రూపం దృష్టం దేవదానవైః । అమీమాంస్య మమర్యాద మచక్షుర్గోచరం స్వతః''** అని తెలియజేస్తాడు. శ్రీసుదర్శన భగవానుని వివిధరూపములలో ఆరాధించి, వినియోగించుకొని ప్రయోజనములను పొందినవారిని గూర్చి సంహితయే మనకు తెలియజేస్తుంది. ఎట్లన, **'' ఆసనే నాంగులీయేన దర్పణేన ధ్వజేన చ । వితానేన చ విస్తీర్ణ భూతయో దేవసంనిభాః''** అనగా శ్రీసుదర్శనయన్త్రఘటితమగు ఆసనముద్వారా ముక్తాపీడుడను రాజు శత్రువులను జయించెను. విశాలుడను నృపతి పులహుని ఆదేశానుసారము సుదర్శనమహాయన్త్ర ఘటితమగు అంగుళీయకమును ధరించుట ద్వారా తనను సమీపించిన మృత్యువును జయించెను. ఇక, సునందుడను రాజు వాసుకి కుమార్తెయగు అనంగమంజరి అను నామెచే వరింపబడి, నాగలోకమునకు కొనిపోబడిన తనకుమారుడు సుమతియను అందగానిని, కణ్వమహాముని యాదేశానుసారము సుదర్శనమహాయన్త్రచిత్రితమగు ధ్వజమునుపొంది, ఆధ్వజప్రభావముతో అసురసైన్యమును జయించెను. ఇక, కీర్తిమాలియను నాతడు సుదర్శనయన్త్రఘటితమగు వితానప్రభావముచే దేవతలనే జయించెను.

వేయేల ? సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీదేవియే **''అహ మాధారభూతాఽపి శక్తీనాం జగత స్తథా । సుదర్శనప్రభావేణ కరోమ్యాశ్రితరక్షణమ్''** ''నేనన్ని శక్తులకూ ఆధారభూతురాల నైనప్పటికీ, సుదర్శనప్రభావముతోనే ఆశ్రితరక్షణమును జేయుచున్నాను'' అనుట శ్రీసుదర్శనప్రభావమును తెల్లము జేయుచున్నది.

ఇట్టి సుదర్శనవైభవసర్వస్వమనదగినది ఈ శతకరాజము. ఇట్టి శతకమునకు ప్రామాణికమైనవ్యాఖ్యను, ద్రావిడప్రబంధదివ్యసూక్తులతోను, పూర్వాచార్య దివ్యసూక్తులతోను మేళవించి అందించిన శ్రీమాన్ ఈ. ఏ. రంగరామన్ స్వామివారు బహుధా ప్రశంసనీయులు. ఇట్టి వ్యాఖ్యను సంతరించుట దివ్యప్రబంధ వాసనావాసితాంతఃకరణులకు మాత్రమే శక్యము. రచయిత తమ పితృపితామహ ప్రపితామహులనుండి ఇట్టి సంప్రదాయసంపదను వారసత్వముగ పొందినవారగుట చేతనే ఇది సాధ్యమైనది. పూర్వాచార్యుల స్తోత్రవాఙ్మయమున కంతటికీ ఇట్టి వ్యాఖ్యలను అనుగ్రహించునట్లు రచయితను కటాక్షించవలసినదిగా శ్రీసింహాద్రినాథుని చరణారవింద సన్నిధానములో ప్రార్థనము జేయుచున్నాను. ఆంధ్రలోకమూ ఈవ్యాఖ్యానమును సార్థకముగ ఉపయోగించుకొనుగాక !

ఇట్లు

**సా॥ గో॥ కృష్ణమాచార్యులు**

సింహాచలం, 28-10-2002

న్యాయవేదాంతవిద్వాన్,
**ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు**
అంతర్వేదిపాలెం.

శ్రీమతే రామానుజాయ నమః

## మంగళాశాసనము

శ్రీమన్నారాయణుని కుడిచేతిని సదా అలంకరించియుండి, ఆస్వామిమనస్సును ముందుగనే తెలిసికొని సేవించుచు, నిరంతరము భగవన్మఙ్గళమును ఆశాసించు భక్తాగ్రేసరుడు శ్రీ సుదర్శనుడు. నిత్యసూరుల కోవలోనికి చెందిన ఈ మహనీయుడు మనస్తత్త్వమునకు ప్రతీక అని శ్రీవిష్ణుపురాణములోని అస్త్రభూషణాధ్యాయము పేర్కొనుచున్నది. భగవానుని ఆరాధించుట సర్వార్థసాధకమైనట్లే, సుదర్శనుని ఆరాధనయు సకలమనోభీష్టసిద్ధిని, అనిష్టనివారణమును సమకూర్చును. భరద్వాజసంహితలో **''దుర్నిమిత్తే భయే ప్రాప్తే గ్రహాదీనాం విపర్యయే, విష్ణుతద్భక్తపూజాభిః శాంతిం కుర్వీత నాన్యథా, బ్రహ్మక్షత్ర విశాం విష్ణుభక్తానాం సతి పాప్మని, వైపరీత్యే గ్రహాదీనాం చ్యుతౌ వైష్ణవకర్మణః, విష్ణుపార్షద పూజాదికార్యం విష్ణుపరాయణైః''** అని తెలుపబడినది. ఇచటి **''విష్ణుతద్భక్తపూజా, విష్ణుపార్షదపూజా''** శబ్దములవలన సుదర్శనేష్టిని గాని, వైభవేష్టినిగాని సకలార్థసిద్ధికొఱకు అనిష్టనివారణముకొఱకును చేయవలెనని తెలియుచున్నది- అని అభిజ్ఞులగు ఆచార్యుల వివరణము. బోధాయనుడును **''అశుభగ్రహదారాసు సతి పుత్రాదిజన్మని, సౌదర్శనీ వైభవీ వా కార్యేజ్యా వైష్ణవై రపి''** అని తెలిపెను. ఇట్టి సుదర్శమూర్తి ఆరాధనలు అహిర్బుధ్న్యసంహితలో విస్తృతముగా ప్రతిపాదింపబడినవి. మఱియు సుదర్శనమూర్తి ఆరాధనలు ఈనాడు పలుచోట్ల అనేక సందర్భములలో విరివిగా చేయబడుట, దానివలన అభీష్టసిద్ధి కల్గుటయు ప్రత్యక్షసిద్ధములుకదా !

భగవానుడగు శ్రీమన్నారాయణుని స్తుతించు సహస్రనామస్తోత్రములు అనేకములున్నను, వానిలో భక్తాగ్రేసరుడైన భీష్మాచార్యుల ముఖతః విలసిల్లిన శ్రీవిష్ణుసహస్రనామమునకు గొప్ప వైశిష్ట్యము కలదు. కావుననే ఆ స్తుతికి పలువురు ఆచార్యులు తమ తమ సిద్ధాంతానుసారముగా వ్యాఖ్యానములను వెలయించిరి. అట్లే, శ్రీవైష్ణవస్తోత్రవాఙ్మయములో శ్రీసుదర్శనస్తుతులు అనేకములున్నను వానిలో



శ్రీకూరనారాయణముని ప్రణీతమైన శ్రీసుదర్శనశతకమునకు ప్రత్యేకత కలదు. ఇందలి ప్రతిశ్లోకమేకాక, **''ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్''** అని శ్రీరామాయణము కీర్తింపబడిన రీతిలో, ఈస్తుతిలోని ప్రత్యక్షరము క్రమాపేక్షలేకనే అనిష్టనివారకము, అభీష్ట ప్రదాయకము అనుట అనుభవసిద్ధము. ఇట్లు శబ్దమహిమవలననె కాక, ప్రతిపాద్యుడైన శ్రీసుదర్శనమూర్తియొక్క ప్రభావముచే కూడ ఇది సర్వార్థప్రదము. ఇందు అహిర్బుధ్న్యసంహితలో తెలుపబడిన పలు సుదర్శన వైభవప్రతిపాదకములైన అంశములు, మంత్రవిశేషములు, యంత్రవిన్యాస విశేషములును ఆయా శ్లోకములలో గూడముగా నిక్షిప్తములని పెద్దల సూక్తి. ఇట్టి ప్రబంధ - ప్రతిపాద్య వైలక్షణ్యములను బట్టియేకాక, వక్తృవైలక్షణ్యమును బట్టియు దీనికి గొప్ప విశిష్టత కలదు. భగవన్మఙ్గళాశాసనమునందు తత్పరతనుకల శ్రీసుదర్శనమూర్తియొక్క సంపూర్ణానుగ్రహమునకు పాత్రులగుటచే శ్రీకూరనారాయణులును తాము గడించిన మంత్రశాస్త్రనైపుణ్యమును లౌకికప్రయోజనములకొఱకు కాక, జగద్రక్షకుడగు శ్రీరంగనాథుని ఉత్సవసమయమునందు ఏర్పడిన ఆపదలను నివారించి, మంగళమును కలుగచేయవలెనని తలచినవారై, అందులకొఱకు ప్రయత్నించిన భక్తశిఖామణులు. ఇట్టి మహనీయుల సుదర్శనమూర్తిమహిమానుభవపరీవాహరూపముగా, అప్రయత్నముగా, భగవానుని నిర్హేతుకకృపవలన, సుదర్శనమూర్తి కరుణవలన వీరి ముఖమునుండి జాలువారిన స్తుతియే ప్రస్తుత శ్రీసుదర్శనశతకమను స్తోత్రరాజము.

పలు దివ్యసూరుల సూక్తుల భావములను అనుసరించుచు స్తుతికర్త ఈ స్తోత్రమును విరచించిరనుటను ఇందలి అనేకశ్లోకములు నిరూపించుచున్నవి. ఉదాహరణార్థము **''యస్మిన్ విన్యస్య భారమ్''** అను చివరిశ్లోకమున **''వానిల వారశు వైకున్దక్కూట్టన్''** అను శ్రీభట్టనాథుల సూక్తిలోని భావము అనుసంధింపబడినది. ఇట్టి అంశములు అనేకములున్నను, స్థాలీపులాకన్యాయమున వ్యాఖ్యాత కొన్నిటిని చూపుటచేతను, విస్తరభీతిచేతను వానిని గూర్చి ఇచట ప్రస్తుతించుట లేదు.

ఈ స్తుతికి సంస్కృతమున, తెనుగున, ద్రావిడమున ఇంకను పలు భాషలలో అనేకవ్యాఖ్యానములున్నను, వానిలో సదాస్మరణీయకీర్తివైభవులగు జగదాచార్యసింహాసనాధిపతి, మహామహిమోపాధ్యాయ, ఉభయవేదాంతమహావిద్వాన్, కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యానము పలు అంశములలో విశిష్టమైనది. ద్రావిడభాషామయమైన దానిని ఆధారముగా గొని శ్రీసుదర్శనశతకమునకు వ్యాఖ్యానము

వ్రాసి, ఆంధ్రభాషావిదులైన భక్తవరులకు నివేదింపవలెనను ఆశతో పౌత్రుడు, చిరంజీవి అనంతరంగరామన్ ప్రస్తుతప్రయత్నమును చేసెను. ఇందు అచట అతడు కొన్ని కొన్ని విశేషములను కూడ పొందుపఱచెను. ఇతని ఈ ప్రయత్నము స్వరూపానురూపమైన వాచికకైంకర్యములోనికి చేరును. కావున నేనును ఇతని సాహసమును కాదనలేక పోయితిని. ఇందు ఇతడు ఏపాటి కృతకృత్యుడయ్యెనో విజ్ఞులైన సంఖ్యావంతులే నిర్ణయింతురు. ఈవిధముగానే చి॥ రామన్ భవిష్యత్తులోకూడ పెద్దల పరిపూర్ణానుగ్రహమును, భగవత్కృపను పొంది మరింత జ్ఞానమును పెంపొందించుకొని, భగవద్భాగవతవాచిక కైంకర్యమును చేసికొనునట్లు కటాక్షింపవలసినదిగా వాత్సల్యగుణపూర్ణుడైన శ్రీనివాసప్రభువును, పెద్దలను ప్రార్థించుచు, అతనికి ఆయురారోగ్యైశ్వర్య స్వరూపజ్ఞానాది సకలశ్రేయస్సులు కలుగవలెనని నా హృదయపూర్వకముగ మంగళాశాసనములను చేయుచున్నాను. స్వస్తి.

అంతర్వేదిపాలెం — ఇట్లు

17-11-2002 — భాగవతవిధేయుడు

**ఈయుణ్ణి రంగాచార్యులు**



# ప్రవేశిక

శ్రీమన్నారాయణుని కుడిచేతిని విడువక ఎల్లప్పుడు అలంకరించుచు, ఆ స్వామి మనస్సును ముందుగానే గ్రహించి, తదనుసారముగా సేవించు భక్తాగ్రగణ్యుడు, ఆయుధాగ్రేసరుడు శ్రీసుదర్శనభగవానుడు. ఇతడు భగవానునకును అసాధారణ చిహ్నమగుటను **''చక్రీ, చక్రపాణిః, చక్రధారీ''** ఇత్యాది నామములు తెలుపుచున్నవి. పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చారూపములందు అంతట భగవానుని వెంటనే పలు ఆయుధముల, భూషణముల రూపముననుండి సేవించువాడితడు. అహిర్బుధ్న్యసంహితలో **''సోమసూర్యదహన-ప్రభోజ్జ్వలం చక్రమేత దుదితం''** అను సూక్తిని బట్టి, ప్రస్తుత స్తోత్రములోని **''త్రేధా భిన్నస్య ధామ్నః''** (69) అని చక్రాక్షము కీర్తింపబడుటయును బట్టి దేశికులు అభీతిస్తవములోని 23వ శ్లోకమున -**''దహన సోమసూర్యాత్మకమ్''** అనుచు శ్రీసుదర్శనుడు అగ్ని-చక్ర-సూర్యరూపుడనిరి. ఈ సూక్తిని సంస్కృత వ్యాఖ్యాత వివరించుచు - **''వారాణస్యాది దాహే అగ్నికృత్యమ్, అర్జునేన సహ వైదికపుత్రాన్వేషణావసరే సూర్యకృత్యమ్, ఉత్తరాగర్భసంజీవనాదౌ చంద్రకృత్యమ్''** అని పల్కిరి. ఇంతియే కాక లోకములోని తేజః పదార్థములన్నియు సుదర్శనాత్మకములే అనుటను - ''సర్వేషాం **తేజః పదార్థానాం సుదర్శనాంశత్వమ్ భగవచ్ఛాస్త్రే ప్రసిద్ధమ్''** అనుచు తెలిపిరి. (దేశికులే స్వయముగా షోడశాయుధస్తోత్రారంభములో - **''స్వసంకల్పకలాకల్పైః''** అనుట ద్వారా సుదర్శనుని చంద్రసామ్యమును సూచింపచేసిరి కదా!) ఈ విధముగా సుదర్శనుడు అగ్ని- సూర్య-చంద్ర రూపుడనుట స్పష్టము. **''అస్త్రగ్రామస్య కృత్స్నస్య ప్రసూతిమ్''** అనునట్లు భగవదాయుధములకన్నిటికిని సుదర్శనుడు మూలము. శ్రీవిష్ణుపురాణములో అస్త్రభూషణాధ్యాయమునందు సుదర్శనము మనస్తత్త్వమునకు ప్రతీక అని చెప్పబడినది. ఇతడు భగవత్సంకల్పమునకు ప్రతినిధి. సంకల్పసూర్యోదయమున **''సన్నాహసంకల్పౌ''** అనుచుదేశికులు - గరుడుని భగవానుని సన్నాహముగా, సుదర్శనుని సంకల్పముగా పల్కిరి. కావుననే **''కరుదుమిడమ్ పొరుతు''** అనురీతిలో స్వామి మనస్సును తెలిసి, తదనుగుణముగా సుదర్శనుడు వర్తించును. **''స్వరశ్మిమండలాంతఃస్థం వల్గంతం హేతి సంస్మరేత్, విభోరాజ్ఞాం ప్రతీక్షంతం ప్రహ్వాంగం రక్తలోచనమ్''** ఇత్యాదిగా సాత్త్వత సంహితలో తెలుపబడినది. భగవానుని సాధు పరిత్రాణము, దుష్కృతవినాశము, ధర్మసంస్థాపనమును సుదర్శన సహకృతములే. అహిర్బుధ్న్యసంహిత సుదర్శనుని కాలస్వరూపునిగా పేర్కొన్నది. సుదర్శనుని ఆయుధత్వమే కాక ఆభరణత్వమును సర్వత్ర ప్రసిద్ధము.

భగవద్వైభవము సుదర్శనోపలక్షితమైనట్లే, భాగవత వైభవమును సుదర్శన సాపేక్షమే. **''ఎన్నైయుమ్, ఎన్నుడైమైయైయుమ్ ఉన్ శక్కరప్పొఱి ఒత్తిక్కొణ్డు''** అను భట్టనాథ దివ్యసూరిసూక్తిరీతిలో భక్తులకు, వారి ద్రవ్యములకును ఉపాదేయత్వము సుదర్శనలాంఛనత్వము వలననే సిద్ధించునని శాస్త్రములు తెలుపుచున్నవి. చక్రాంకనము సుప్రసిద్ధముకదా ! **''పవిత్రం తే విततం బ్రహ్మణస్పతే ప్రభో ర్గాత్రాణి పర్యేషి విశ్వతః, అతప్తతనూః న తదామోఅశ్నుతే శృతాస యిద్వహంతీ తత్సమాశత''** అను శ్రుతి అన్వయ రూపముగను, **''చక్రం బిభర్తి ర్వపుషాభి తప్తం బలం దేవానా మమృతస్య విష్ణోః, స ఏతి నాకం దురితా న్విధూయ విశంతి యత్పదం వీతరాగాత్''** అను శ్రుతి వ్యతిరేక రూపముగను చక్రాంకనావశ్యకతను తెలుపు వైదికప్రమాణములు. **''చక్రాంకితాః ప్రవేష్టవ్యాః, నాముద్రితాః ప్రవేష్టవ్యాః''** అని అన్వయవ్యతిరేకములద్వారా శ్రీకృష్ణుడు భారతమున ఈ అంశమును తెలిపెను. **''పశుపుత్రాదికం సర్వం గృహోపకరణానిచ, అంకయేత్ శంఖచక్రాభ్యాం నామ కుర్యా చ్చ వైష్ణవమ్''** అని సుదర్శనోపనిషత్తు తెలుపుచున్నది. పూర్వకాలమునుండి దేవాలయభూములు, వస్తువులు అన్నియు సుదర్శన ముద్రాంకితములను కావించు పద్ధతి చరిత్ర ప్రసిద్ధము.

సుదర్శనమూర్తి వైభవము వేదములలో, ఆగములలో, స్మృతులలో, ఇతిహాసములలో, పురాణములలో, దివ్యసూరి ప్రబంధములలో, పూర్వాచార్య సూక్తులలో విస్తృతముగా ప్రపంచితము. వీనిలో ప్రత్యేకించి అహిర్బుధ్న్యసంహిత పేర్కొనదగియున్నది. అందు భగవానునకు సుదర్శనునకు మధ్య అభేదభావన అనుసంధింపబడుట విశేషము. భగవానుడు చేయు సృష్టి- స్థితి- లయములు సుదర్శన కార్యములుగా అందు చెప్పబడినవి. ఇట్లు భగవదంశ భూతుడగు సుదర్శనునకు చెప్పబడిన వైభవము అంతయు అంగియైన భగవానుని వైభవమునందే చేరునుకావున నిరతిశయమైన భగవద్వైభవమునకు లోపము లేదు. పూర్వాచార్య ప్రణీతములైన స్తోత్రములలో కొన్ని సుదర్శనవైభవ ప్రతిపాదకములై అలరారుచున్నవి. వానిలో కాలమునుబట్టియే గాక, కవితాసౌందర్యమున, ఇంకను పలు అంశములలో సుదర్శన శతకమను ప్రస్తుత స్తోత్రము ప్రథమ గణ్యము. దీనిని శ్రీవైష్ణవాచార్యపరంపరకు చెందిన శ్రీకూరనారాయణమునులను యతి వరులు రచించిరి. ఈ మహనీయుల వైభవము తెలిసినంత వరకు నివేదింపబడుచున్నది.

### శ్రీకూరనారాయణముని వైభవము :

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకాగ్రేసరులుగా విలసిల్లిన భగవద్రామానుజులకు గల అంతరంగశిష్యులలో కూరేశులు అగ్రగణ్యులు. వీరికి శ్రీవైష్ణవ సంప్రదాయమున **''కూరత్తాళ్వాన్''** అనిపేరు. చోళరాజు వలన ఏర్పడిన ఉపద్రవము కారణముగా వీరు కొంతకాలము **'వనగిరి'** అనబడు తిరుమాలిరుమ్‌శోలై దివ్యక్షేత్రములో నివసించిరి.



అపుడువీరిని కూరనారాయణులు ఆశ్రయించి, తత్త్వార్థములను గ్రహించినట్లు ద్రావిడభాషలో రచింపబడిన **''కోయిలొళ్గుకు''** అను శ్రీరంగక్షేత్ర సంప్రదాయ చరిత్ర గ్రంథమున కలదు. ఆచార్య ప్రావణ్యమును సూచించుకొనుటకై తమ పేరునకు ముందు నిరూపకముగా **''కూర''** పదమును కలుపుకొనిరని చెప్పబడుటచే వీరి నామధేయము నారాయణులని, దానికి ముందున్న కూర పదము కూరేశనామమునకు చెందినదని, చివరగల **'ముని'** అను పదము వీరు జీయర్ అగుటను తెలుపుచున్నదని ఏర్పడుచున్నది.

ఈ ఆచార్యవర్యులకు సంబంధించిన వివరములు చాల సంగ్రహముగామాత్రమే లభించుచున్నది. వీరు నఞ్జీయర్ కాలములో జీవించి యున్నట్లు తెలుపబడుటచే కూరేశులు వృద్ధులుగానుండగా వీరు చిన్నతనములో నుండియుందురని భావింపవీలున్నది. కావున కూరేశులకు- కూరనారాయణులకు మధ్య కనీసము ఒక తరము అంతరమున్నదని చెప్పవచ్చును. అందుచే వీరికాలము 11వ శతాబ్దిగా ఊహింపనగును. మఱియు వీరు సుమారు 60 సంవత్సరములు జీవించినట్లును కోయిలొళ్గుకులో కలదు. వీరు వేదాంతాది పలుశాస్త్రములందే కాక, మంత్రశాస్త్రమునందునుదిట్ట. తమకు భగవదనుగ్రహమువలన ప్రాప్తించిన మంత్రశాస్త్రప్రావీణ్యమును భగవద్భాగవతకైంకర్యమునకై వినియోగించిన ధన్యులు వీరు. అట్టి కొన్ని ఉదంతములు కోయిలొళ్గుకులో ప్రస్తావింపబడినవి. వానిలో ఒకటి, రెండుమాత్ర మిచట తెలుపబడుచున్నవి.

కర్ణాటకదేశములోని శ్రీరంగపట్టణమును పాలించు ప్రభువుప్రేరణతో మంత్రసిద్ధుడైన సన్న్యాసి ఒకడు శ్రీరంగములోని శ్రీరంగనాథుని అర్చామూర్తిని శ్రీరంగపట్టణమునకు తరలించుకొని పోవుటకై, కంటికి అంజనమును (కాటుకను) పూసికొని అదృశ్యుడై శ్రీరంగమును చేరెను. తన కార్యము నెఱవేరుటకు అతడు, కోవెలలో బలిపీఠమున సమర్పింపబడు ప్రసాదమును మంత్రవేత్తభుజింపవలెనను నియమమును బట్టి అట్లే చేయుచు, కొన్నాళ్లకు శ్రీరంగనాథునిమూర్తిని ఆది శేషతల్పమునుండి నాల్గు అంగుళములు పైకి ఎత్తెను. దీనిని ఆలయ పరిచారకులు, గమనించి అందఱికిని తెలియజేసిరి. కూరనారాయణులు ఈ సంగతిని విని అందులకు గల కారణమును గూర్చి నిశితముగా పరిశీలింపగా, బలిపీఠములోని ప్రసాదము ప్రతిదినము కానరాకుండుటను గ్రహించిరి. అందులకు సమాధానముగా వారు ఒకనాడు మిరియపుపొడిని, ఆవపొడిని కలిపిన ప్రసాదమును బలిపీఠములో సమర్పింపచేసిరి. పూర్వము వలెనే సిద్ధుడు ఆనాడును బలిపీఠ ప్రసాదమును తినగా, మిరియపుపొడి, ఆవపొడుల తీవ్రతచే కన్నులవెంట నీరుకారి, కంటికి పూసుకొనిన అంజనము కఱిగిపోవుటచే అతడు అందఱికిని కన్పించెను. అపుడు కూరనారాయణులు ఆ సన్న్యాసిని శ్రీరంగనాథుని

స్వర్ణాభరణముల నిత్తునని ఆశపెట్టి నమ్మించి, అతనిచే శ్రీరంగనాథుని అర్చామూర్తిని పూర్వమువలె ఆదిశేషశయనముపై ప్రతిష్ఠింపచేసిరి. పిమ్మట అతనికి ఆభరణముల నిచ్చిపంపి, అతనికి తెలియకుండగా నల్గురు వస్తాదులను నియమించి, దారిలో అతడు అశుచిగా నున్నప్పుడు వధించునట్లు చేసిరి. ఇట్లు కూరనారాయణులు తమ మంత్రశాస్త్రజ్ఞానముతో సిద్ధుని పన్నాగమును గ్రహించి, శ్రీరంగనాథుని మూలమూర్తిని కాపాడిరి.

వేరొక సమయమున కావేరీనదిలో శ్రీరంగనాథునకు తెప్పోత్సవముజరుగునపుడు, ఒక అజ్ఞాతవ్యక్తియొక్క మంత్రప్రయోగ కారణముగా తెప్ప వేరొకదిశలో ప్రయాణముచేయసాగెను. అపుడు కూరనారాయణులు తమ మంత్రశక్తిని ఉపయోగించి తమ చేతివేలికిగల వలయపవిత్రమును గుండ్రముగా కుడివైపుకు తిప్పగా, తెప్ప మరల యథాస్థానమును చేరెను. ఈ విధముగా శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని రక్షించిరి. ఇట్టి వృత్తాంతములు ఇంకను కొన్ని కోయిలొళ్ళుకులో కలవు.

కూరనారాయణులు శ్రీరంగనాథుని ఆలయములో తులాపురుషమండపమున శ్రీవరాహమూర్తిని, పెరుమాళ్ దేవర్ మండపములో లక్ష్మీనారాయణులను, ఉత్తరద్వారమునకు తూర్పున సరస్వతిని, హయగ్రీవులను, సుందరపాండ్యదేవుని తులాపురుషమండపమున వేణుగోపాలమూర్తిని, చంద్రపుష్కరిణీ తీరమున గోవిందుని, వేదవ్యాసుని, వరాహమూర్తిని, సుదర్శనమూర్తి ఆలయమునకు ఎదురుగా పార్థసారథిని, చక్రవర్తి తిరుమగన్ సన్నిధికి ఎదురుగా విఠ్ఠలేశ్వరుని ప్రతిష్ఠింపచేసిరట. రాజమహేంద్రన్ తిరువీధిలోని తూర్పునగల మండపమును పునరుద్ధరించిరి. యాగశాలలో శంఖనిధి పద్మనిధులను, ద్వారములలో బయట భద్రసుభద్రులను జీర్ణోద్ధారణము కావించిరి. ఇంకను పలురీతులలో ఆలయమున చక్కని కట్టుబాట్లను ఏర్పరచి, శత్రువులవలన ఆపదకలుగకుండునట్లు కాపాడిరి. వీరి ఈ కైంకర్యమును చూచిన స్థానికులు వీరిని మిక్కిలి అభినందించి, శ్రీరంగనారాయణ మఠములో జీయర్‌గా చేసి గౌరవించుటయే కాక, అంతవరకు కందాడైవంశీయులు నిర్వహించుచు వచ్చిన శ్రీరంగనాథుని ఆరాధనలో కస్తూరి, తిరుమణ్‌కాప్పు, అంజనకాప్పు, పునుగు కాప్పులను సమర్పించునట్టి సేవలను నిర్వహించు అవకాశమును కల్గించిరి - అను ఈ వివరములన్నియు కోయిలొళ్ళుకులో కలవు. శ్రీరంగనారాయణ మఠములో వీరు మూడవపట్టమును అలంకరించిరనియు కొందరందురు. కాని, ఇది ఇంకను విజ్ఞులు విచారింపతగిన విషయము. శ్రీరంగములోని సుదర్శనుని ఆలయమును వీరు పునఃనిర్మించిరని ప్రసిద్ధి కలదు.

ఇట్లుండగా, పెరియతిరుముడి యడైవు అను ద్రావిడభాషాత్మక సంప్రదాయచరిత్ర గ్రంథములో ఈ ఆచార్యులకు నలన్దికళ్ నారాయణ జీయర్ అనుపేరు కూడ కలదని, వీరు



పరాశర భట్టరు శిష్యులనియు తెలుపబడినది. అందు వీరి స్తుతి (తనియన్) శ్లోకమిట్లున్నది-
**''శ్రీ పరాశరభట్టార్యశిష్యం శ్రీరంగపాలకమ్, నారాయణమునింవందే జ్ఞానాదిగుణసాగరమ్''.**
ఇంతియేకాక, కూరనారాయణులు ఈశావాస్యాది ఉపనిషత్ భాష్యమును, స్తోత్రవ్యాఖ్యానమును, సుదర్శన శతకమును రచించిరని కలదు. వీనిలో స్తోత్రవ్యాఖ్యానము అలభ్యము. ఇక, ఉపనిషద్భాష్య కర్తృత్వ విషయము వివాదాస్పదము. సుదర్శన శతక వ్యాఖ్యానమును వ్రాసిన కొమాండూరి తిరువెంగళాచార్యులుగారు పీఠికలో ఈశావాస్య ఉపనిషత్ భాష్యము చివరగల **''వేదాంతగురుపాదాబ్జధ్యాననిర్మలచేతసా, వాజివేదాంతసారార్థః శ్రీవత్సాంకేన దర్శితః''** అను శ్లోకమును బట్టి అహోబలమఠమునకు అలంకరించిన శ్రీవత్సాంక శ్రీమన్నారాయణమునులచే ఆ భాష్యము రచింపబడినట్లు స్పష్టమగుచున్నదని, అట్లే, తైత్తిరీయభాష్యమును కూరనారాయణమునులకంటె అర్వాచీనులైన నలన్దికళ్ నారాయణ జీయర్ రచించిరని పల్కుచు, వీరిరువురు కూరనారాయణ జీయర్‌కంటె భిన్నులని అభిప్రాయపడిరి. కూరనారాయణ జీయర్‌కు తిరుక్కురుకైప్పిరాన్‌జీయర్, శేమమ్ జీయర్, సుందరపాండ్యదేవర్ మొదలగుశిష్యులు కలరు అని పెరియతిరుముడి యడైవు అను సంప్రదాయ చరిత్రగ్రంథములో పేర్కొనబడినది. వీరు మార్గశిరమాసము (తమిళమాసప్రకారము ''మార్గళి'' మాసము) లో జ్యేష్ఠానక్షత్రమున అవతరించిరని, తండ్రిగారిపేరు ఎమ్బార్ అని, వీరి ఆరాధనలోని అర్చామూర్తి హయగ్రీవులని, వీరు భారద్వాజగోత్రీయులనియు అచట తెలుపబడినది. వీరి మంగళాశాసన పాశురము ఈ క్రిందివిధముగా అనుసంధింపబడుచున్నది.

**మార్గళి యిల్ కేట్టైయదనిల్ వన్దుదిత్తాన్ వాళి యే**
**మాలరఙ్గర్ శీరరుళై మన్నుమవన్ వాళి యే**
**పారులకిల్ శుదర్శనత్తిన్ పుకళ్ఉరైప్పోన్ వాళి యే**
**పాషండియనైవరైయుమ్ పఱక్కడిత్తాన్ వాళి యే**
**శీరెతిరాశర్ పదత్తిల్ వీఱ్ఱి రుప్పోన్ వాళి యే**
**ఏరార్న్ద ఆళ్వాన్‌దన్ పదమ్ పణివోన్ వాళి యే**
**ఎళ్ళిల్‌కూరానారాయణ మునివన్ పదఙ్గళ్ వాళి యే**

**శ్రీసుదర్శనశతక ప్రణయనము :**

శ్రీకూరనారాయణమునులు సుదర్శనశతకమును రచించుటకుగల కారణమును కోయిలొళ్ళుకు ఇట్లు పేర్కొన్నది.

''నఙ్జీయర్ దర్శనమ్ నిర్వహిత్తు క్కొణ్డిరుక్కుమ కాలత్తిలే విణ్ణప్పమ్ శెయ్‌వారిలే ఒరుత్తర్

**పెరుమాళ్ సన్నిధిక్కు యోగ్యమాకామల్ ఇరుక్క, ఆళ్వానుడైయ దేవికళ్ ఆణ్డాళ్ అవరిడత్తిల్ కృపైయాలే, ఆళ్వాన్ తిరుమాలిరుమ్‌శోలైయిలే ఎళున్దరుళి యిరుక్కచ్చెయ్‌దే ఆళ్వాన్ తిరువడికళిలే ఆశ్రయిత్తు సన్న్యసిత్తు, వయోవృద్ధరాయ్, ఆచార్యన్ కుడియే నిరూపకమాక ''కూరనారాయణజీయర్'' ఎన్ఱు తిరునామత్తై యుడైయరాయ్, మహామాంత్రికరాయ్, కోయిల్‌వాసమ్ పణ్ణికొణ్డిరుక్కిఱవరై అళైత్తు- ''ఉమ్ముడైయ మంత్రఙ్గళుమ్ ఒరుకైంకర్యత్తిలే ఉపయోగిక్కుమ్ - ఎన్ఱు శొల్లియిరున్దీరే ! నీరిప్పోదు ఇన్ద విణ్ణప్పమ్ శెయ్‌వారై పెరుమాళ్ కైంకర్యత్తుక్కు యోగ్యరామ్బడి పణ్ణుమ్'' ఎన్ఱు నియమిక్క, అన్ద కూరనారాయణ జీయరుమ్ సుదర్శనశతకత్తై పణ్ణి, విణ్ణప్పమ్ శెయ్‌వారై నోయ్‌తీరు పెరుమాళ్ సేవాకాలత్తుక్కు యోగ్యరామ్బడి పణ్ణినార్''.**

(నంజీయర్ దర్శనమును నిర్వహించుచున్న కాలమున దివ్యప్రబంధమును విన్నపించు వారిలో ఒకరు (అరైయర్) వ్యాధిగ్రస్తులై, పెరుమాళ్ సన్నిధికి వచ్చుటకు యోగ్యతలేని వారైయుండగా, కూరేశుల ధర్మపత్ని ఆణ్డాళ్ వారి పట్ల దయతో, కూరేశులు తిరుమాలిరుమ్ శోలై దివ్యదేశమున వాసము చేయునపుడు కూరేశుల పాదములను ఆశ్రయించి, సన్న్యసించి, వృద్ధులై, ఆచార్యుల వంశనామమే తమకునిరూపకముగా కూరనారాయణజీయర్ అనుపేరును కలవారై, మహామాంత్రికులై, శ్రీరంగవాసమును చేయుచున్న వారిని పిలిచి, ''మీ మంత్రములును ఏదైనకైంకర్యములో ఉపయోగించునని అంటిరికదా ! మీరిపుడు ఈ అరైయర్‌ను పెరుమాళ్ సేవకు యోగ్యులగునట్లు చేయుడు'' అని నియమింపగా, ఆకూరనారాయణజీయర్ కూడ సుదర్శన శతకమును రచించి, అరైయర్‌ను పెరుమాళ్‌సేవాకాలమునకు యోగ్యులగునట్లుచేసిరి)

సంప్రదాయచరిత్ర ఇట్లుండగా, పరంపరాగతమైన వేరొక ఐతిహ్యమును కలదు. పూర్వము జైనసిద్ధుడొకడు తాను ఆరాధించు జైనవిగ్రహమునందు కళలను ఆవాహనచేయగోరి, అందులకై షోడశకళాపూర్ణుడైన శ్రీరంగనాథుని కళలను ఆకర్షింపవలెనని తలచెను. అతడు అదృశ్యముగ శ్రీరంగదివ్యాలయమును చేరి, కళలను ఆకర్షించుచు, నిత్యము వాయసరూపమున బలిపీఠములో సమర్పించు ప్రసాదమును తినుచుండెను. శ్రీకూరనారాయణులు ప్రతిదినము శ్రీరంగనాథునికళలు తగ్గుచుండుటను గమనించి, ఒకనాడు బలిపీఠములో సమర్పించు అన్నములో ఆవపొడిని కలిపించిరి. ఆ ప్రసాదమును తినిన సిద్ధుని కళ్లవెంటనీరు స్రవింపగా, అతడు నిజరూపమును పొంది అందరికిని కన్పించెను. అపుడు కూరనారాయణులు అతనిని మంత్రశక్తితో రూపుమాపి, శ్రీరంగనాథునియందు లోపించిన కళలను మరల ప్రవేశపెట్టిరి. ఇట్లు సిద్ధుని వధించుట దేవకార్యముకొఱకే అయినను, తత్ప్రభావముచే కూరనారాయణుల పవనశక్తి సన్నగిల్లెను. ఆశక్తిని మరల పొందుటకు మంత్రవిద్యయే తగినదని తలచిన ఆ ఆచార్యులు



శ్రీరంగనాథుని ఆలయమున ఎదురుగా నూరు దారములతో కూడిన ఉట్టిని కట్టించి, అందు తాము కూర్చుండి, దానిక్రింద అగ్ని హోత్రమును జ్వలింపచేసిరి. శ్రీసుదర్శన భగవానుని తదేకముగ ధ్యానించుచు సుదర్శనశతకమును ఆశువుగా చెప్పదొడగిరి. ఒక్కొక్క శ్లోకమును చెప్పుచు ఉట్టిలోని ఒక్కొక్కదారమును కోయుచు క్రమముగా 99 శ్లోకములను చెప్పిరి. అప్పటికి కూరనారాయణులు పోగొట్టుకొనిన పవనశక్తిని పూర్ణముగా తిరిగి పొందిరి. చివరిశ్లోకమును చెప్పిన పిమ్మట ఉట్టిలోని చివరిదారమును కోసివైచిరి. ఉట్టిక్రిందపడినది కాని, పవనశక్తి ప్రభావమువలన కూరనారాయణులు ఆకాశమున అటులనే నిలచిరి. ఇట్లు కూరనారాయణులు అనుగ్రహించిన సుదర్శనశతకస్తోత్రము శ్రీరంగదివ్యాలయములో నెలకొనియున్న సుదర్శనభగవానుని అర్చామూర్తిని గూర్చియే అని పెద్దలందురు. ఈ స్తోత్రమునకుగల సంస్కృతవ్యాఖ్యలో **''మాధవీయస్య- శ్రీరంగనాయక సంబంధినః, హేతేః ఆయుధస్య చక్రస్య''** అని, **''శ్రీధరాస్త్రస్య శ్రీరంగనాథదివ్యాయుధస్య సుదర్శనస్య''** (52) ఇత్యాదిగా పలుచోట్ల వివరింప బడుట ఇందులకు నిదర్శనముగా గ్రహింపవచ్చును.

**శ్రీసుదర్శనశతకవైశిష్ట్యము :**

శ్రీసుదర్శనమూర్తి వైభవమును సర్వతోముఖముగా అనితరసాధారణమైన రీతిలో ప్రపంచించు ఈస్తోత్రము 100 స్రగ్ధరావృత్తములలో కూర్పబడినది. అందుచే ఈ కృతి శతకవాఙ్మయ ప్రక్రియలోనికి చేరును. ఇది మయూరకవి విరచితమైన సూర్యశతకమును పలు విధముల పోలియుండుటయే కాక, అనేక అంశములలో దానిని మించి యున్నదని విమర్శకుల అభిప్రాయము. పలు అనుప్రాసలతో, అన్త్యప్రాసలతో, ఉపమలతో, ఉత్ప్రేలతో, రూపకములతో, శ్లేషలతో, తన్మూలకములైన విరోధాభాసలతో సహృదయుల హృదయములను సమ్మోహన పఱచు అత్యద్భుతముక్తక కావ్యసంపుటి ఇది. భాషలో, భావములో, శబ్దప్రయోగవైవిధ్యములో దీనికిదియే సాటి.

**''ఉగ్రంపశ్యాక్షమ్, శాణే రోషాణితానామ్, కేతకీభిః సదృశం కీర్తిమ్, దాశ్వాన్, దాశుషీమ్''** వంటి అపూర్వప్రయోగములు, సుదర్శన యంత్రవిశేషములను తెలుపు **''దంష్ట్రా కాంత్యా కడారేః''** (93), **''నానావర్ణాన్''** (90), **''గాయత్ర్యర్ణారచక్రే''** (96) వంటి శ్లోకములును ఇందు కాననగును. సుదర్శనవైభవమును తెలుపు **''రుద్రో ఽవ్యద్రే ర్దుహిత్రా సహ గహనగుహామ్''** ఇత్యాదిగా అపూర్వమైన వృత్తాంతములును ప్రస్తావింపబడినవి.

**సూర్యశతకసామ్యము :**

క్రీ.శ.7వ శతాబ్దమున జీవించిన మయూరుడు అనుకవి సంస్కృత భాషలో సూర్యుని స్తుతించుచు ఒకశతకమును రచించెను. ఇదియే సూర్యశతకము. ఇందు సుదర్శన శతకములో

వలె 100 స్రగ్ధరావృత్త నిబద్ధములగు శ్లోకములు (101వ శ్లోకముఫలశ్రుతి) కలవు. ఇట్టి సామ్యములు అనేకములు ఈరెండు స్తోత్రములమధ్య గోచరించుచున్నవి. ఉదాహరణార్థము కొన్ని సామ్యములు మాత్రము సంగ్రహముగా ఇచట ప్రస్తావింపబడుచున్నవి.

1. సుదర్శనశతకములో మొదటి 24 శ్లోకములలో జ్వాలావర్ణనము, పిమ్మట 14 శ్లోకములలో నేమివర్ణనము, అనంతరము12 శ్లోకములలో అరవర్ణనము, తదుపరి 11 శ్లోకములలో నాభివర్ణనము, తరువాత 13 శ్లోకములలో అక్షవర్ణనము, చివరి 26 శ్లోకములలో సుదర్శనపురుషవర్ణనమును చేయబడుటచే ఆఱు విభాగములుగా (24+14+12+11+13+26) ఈ శతకము విభజింపబడినది. ఇట్లే, సూర్యశతకములో కూడ మొదటి 43 శ్లోకములలో ద్యుతివర్ణనము, పిమ్మట 6 శ్లోకములలో అశ్వవర్ణనము, అనంతరము 12 శ్లోకములలో అరుణ వర్ణనము, తదనంతరము 11 శ్లోకములలో రథవర్ణనము, ఆపైనగల 8 శ్లోకములలో మండలవర్ణనము, చివరి 20 శ్లోకములలో సూర్యవర్ణనము చేయబడుటనుబట్టి మొత్తము 6 విభాగములుగా (43+6+12+11+8+20) ఆ స్తోత్రము చేయబడినది.
2. సుదర్శనశతకములో **''ఏకం లోకస్య చక్షుః''** ఇత్యాది (10) శ్లోకములో మొదటి అంకె నుండి పదివరకుగల అంకెల వాచకములు, నూరు, వేయి సంఖ్యలను తెలుపు పదములును చమత్కారపూర్వకముగా ప్రయోగింపబడినట్లే, సూర్యశతకములోని **''ఏకః జ్యోతిర్ద్వాభ్యాం త్రిజగతి. . . దశ దధతు శతం దీధితీనాం శతాని''** అను (13) శ్లోకములో కూడ ఇట్లే ప్రయోగింపబడినవి. విశేషమేమనగా, సూర్యశతకశ్లోకమున వేయి అను అర్థమిచ్చు పదము సాక్షాత్తుగా ప్రయోగింపబడలేదు. కాని, **''దశ శతాని''** అను ప్రయోగము ఈ సంఖ్యను లక్షించుచున్నది. **''దశ శతాని సహస్ర మితి యావత్''** అని సంస్కృత వ్యాఖ్య.
3. సుదర్శనశతకమునందు **''శుక్ల శ్శక్రస్తవ స్తే''** అను (95) శ్లోకములో శ్రీసుదర్శన భగవానుని సేవింపవచ్చిన అష్టదిక్పాలకులను ఉద్దేశించి యంత్రపాలకులు పల్కు రీతి తెలుపబడినది. అట్లే, సూర్యశతకములోని **''వజ్రిన్ జాతం వికాసీక్షణకమలవనం . . . వందే శర్వేతి జల్పన్ ప్రతిదిశ మధిపాన్ పాతు పూష్ణోఽగ్రణీ ర్వః''** అను (58) శ్లోకములో అరుణుడు దిక్పాలకులను గూర్చి పల్కువిధము వర్ణింపబడినది.
4. సుదర్శనశతకములో **''మాగా న్మోషం లలాటానల ఇతి మదనద్వేషిణా''** అను (24) శ్లోకములో శివుడు, బ్రహ్మ, ఇంద్రుడును సుదర్శనదీప్తిని స్తుతించునట్లు వర్ణింపబడగా, సూర్యశతకమున **''మౌలీందో ర్నైష మోషీత్ ద్యుతి మితి వృషభాంకేన''** అను 16) శ్లోకమున సూర్యుని ద్యుతిని శివుడు, బ్రహ్మ, విష్ణువును స్తుతించునట్లు చెప్పబడినది.



5. సుదర్శన శతకములో **''క్షిప్త్వా నేపథ్య శాటీ మివ నృత్య న్నానాలయాధ్యం నట ఇవ''** అను (36) శ్లోకమున సుదర్శనేమి నటునితో ఉపమింపబడినట్లే, సూర్యశతకములో **''ప్రాతః శైలాగ్రరంగే. . . సూత్రధారాయమాణః . . . జగదటనమహానాటికాం సూర్యసూతః''** అను (50) శ్లోకమున సూర్యసారథియైన అరుణుడు సూత్రధారునితో ఉపమింపబడెను.
6. సుదర్శనశతకమున **''యాత్రా యాత్రాతలోకా''** ఇత్యాది శ్లోకములలో కనుపించు అనుప్రాస విశేషము సూర్యశతకములోని **''సా నా సా నాదయే. . . యస్యా వయస్యా''** అను (38) శ్లోకములలో కూడ కానవచ్చును.
7. సుదర్శనశతకములోని **''భ్రామ్యంతీ సంశ్రితానామ్''** అను(18) శ్లోకము విరోధాలంకార ప్రక్రియలో కూర్చబడినట్లే, సూర్యశతకమునగల **''చక్షు ర్దక్షద్విషో య న్నతు దహతి''** అను (80) శ్లోకమును ఆ అలంకారప్రక్రియలోనే నిబద్ధము. ఇట్టి అలంకార సామ్యములు అనేకములు ఇంకను ఉన్నను విస్తరభయముచే వానిని ప్రస్తుతించుటలేదు.
8. సుదర్శనశతమున **''రక్షః పక్షేణ''** అను (74) శ్లోకములో క్షకారముయొక్క అసకృదావృత్తి రూపమైన అనుప్రాసాలంకారముకలదు. కాని, ఇట్లు నాల్గుచరణములలో ''క్ష'' అను ఒకే అక్షరము ఇన్ని మార్లు ప్రయోగింపబడినదో **''గంధర్వైః గద్యపద్య''** (36) ఇత్యాది సూర్యశతకశ్లోకమున ద్య అను సంయుక్తాక్షరము అన్నిమార్లే ఆవృత్తమైనది.
9. **''గాయత్ర్యర్ణార చక్రే, దంష్ట్రాకాంత్యా కడారే''** ఇత్యాది (93) శ్లోకములందు సుదర్శన యంత్రమునకు సంబంధించిన ఆగమవిశేషములు ప్రస్తుతింపబడినవి. ఇట్టి ఆగమవిశేషములు ప్రస్తుతింపబడిన శ్లోకములు సూర్యశతకములో కనుపింపవు. మయూరుడు స్వార్థమునకై (తన వ్యాధిని బాపుకొనుటకై) సూర్యశతకమును రచింపగా, కూరనారాయణులు పరార్థముగా సుదర్శనశతకమును అనుగ్రహించిరి- ఇట్టివైశిష్ట్యములను సుదర్శనశతకమున గోచరించుచున్నవి.

**శ్రీసుదర్శనశతక పారాయణక్రమ వివరణము :**

బీజాక్షర సంపుటితమైన శ్రీసుదర్శనశతకములోని ప్రతిశ్లోకము భక్తులకు అభీష్టప్రదాయకమే. దేనికదియే సాటి. అయినను, వివిధములైన కోరికలను పొందగోరువారు అనుష్ఠింప తగిన విధానము పెద్దల అనుష్ఠాన మును బట్టి ఈ క్రింది విధముగా తెలియనగును. ఇచట తెలుపబడిన శ్లోకములను నలుబది రోజులపాటు ప్రతిదినము నలుబదిమార్లకు తక్కువ కాకుండ జపింపవలెను. పారాయణ ప్రారంభమున, సమాపనమున ఏదైనా మధురపదార్థమును నివేదించుట శిష్టాచారము. ఈ శ్లోకములను పెద్దలద్వారా ఉపదేశమును పొంది,

పారాయణమొనర్చుట తగినపని. ఈ వివరము లన్నియు మధురవాక్ శిఖామణి, భాగవతామృతవర్షి, ఇత్యాది సార్థకబిరుదాంకితులు ఉ.వే. శ్రీవాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామివారి సుదర్శనశతకవ్యాఖ్యనుండి కృతజ్ఞతాపూర్వకముగా గ్రహింపబడినవి.

| అభీష్టము | శ్లోకసంఖ్య | శ్లోకప్రారంభము |
|---|---|---|
| 1. సర్వాభీష్టసిద్ధి | 1 | సౌదర్శన్యుజ్జిహానా |
| 2. నిరతిశయానందము | 3 | పూర్ణే పూర్ణైః |
| 3. చతుర్విధపురుషార్థములు | 4 | ఆరా దారాత్ |
| 4. పాపనాశనము | 6 | శంసంత్యున్మేషమ్ |
| 5. శత్రునాశనమునకు | 8 | దృష్టేఽధివ్యోమ చక్రే. . |
| 6. ఈతిబాధానివారణమునకు | 10 | ఏకం లోకస్య చక్షుః. . |
| 7. విజ్ఞానలాభమునకు | 12 | పద్మౌఘో.... |
| 8. సంసారవ్యాధినిర్మూలనమునకు | 13 | భానో భా నోత్పదీయా.. |
| 9. స్థిరమగు యశస్సునకు | 20 | ఉద్యన్బింబా దుదారాత్.. |
| 10. సాటిలేని సంపదలకు | 25 | శస్త్రాస్త్రం.... |
| 11. సుఖమునకు | 27 | యాత్రా యా త్రాతలోకా.. |
| 12. కీర్తివృద్ధికొఱకు | 30 | కృష్ణాంభోదస్య.... |
| 13. మనోనిగ్రహమునకు | 31 | వప్రాణాం భేదనీం యః... |
| 14. విజయము కొఱకు | 32 | నాకౌకశ్శత్రుజత్రు |
| 15. పాండిత్య సంపాదనమునకు | 41 | జ్వాలాజాలాబ్ధిముద్రం... |
| 16. గొప్పదనమునకు | 42 | బ్రహ్మేశోపక్రమాణాం.. |
| 17. పదోన్నతికొఱకు (ప్రమోషన్) | 45 | దావోల్కామణ్డలీవ... |
| 18. శత్రునాశనమునకు | 47 | నాభీశాలానిఖాతాం... |
| 19. లక్ష్మీకటాక్షమునకు | 49 | దీప్తై రర్చిప్రరోహైః |



| అభీష్టము | శ్లోకసంఖ్య | శ్లోకప్రారంభము |
|---|---|---|
| 20. ధనకనకవస్తువాహనములకు | 50 | ధాతుస్యన్దై రమన్దైః |
| 21. శ్రేయస్సుకొఱకు | 52 | శస్త్రశ్యామే... |
| 22. విచ్ఛేదములేని సుఖముకొఱకు | 56 | పాణౌ కృత్వా హవాగ్రే... |
| 23. కుబేరుని మించిన సంపదలకొఱకు | 58 | పర్యాప్తా మున్నతిం యా... |
| 24. అనిష్టనివారణ, ఇష్టప్రాపణములకు | 61 | అంహ స్సంహత్యదగ్ధ్వా |
| 26. శత్రుపరాజయమునకు | 65 | తుఙ్గా ద్ద్వారద్రిశృఙ్గాత్.. |
| 27. పెద్దగొప్పదనముకొఱకు | 66 | ఉన్మీలత్పద్మరాగం.. |
| 28. బుద్ధివిశేషమునకు | 67 | క్రీడత్రావ్రక్రోడ దంష్ట్రాహతి. |
| 29. ఉభయ విభూతులను సాక్షాత్కరింప జేసికొని జ్ఞానమునకు | 70 | మత్తానా మిన్ద్రియాణాం.. |
| 30. సర్వాభీష్టములకు | 71 | ప్రాణాదీన్ సంనియమ్య... |
| 31. ఆధిక్య స్వభావము కొఱకు | 73 | శ్రీవాణీవాఙ్మృడాన్యో... |
| 32. పౌరుషముకొఱకు | 75 | జ్యోతిశ్చూడాలమౌళిః... |
| 33. దైవాధీనము, మనుష్యాధీనము అగు ఆపదలు పోవుటకు | 76 | వాణీ పౌరాణికీయం.. |
| 34. శత్రునిరాసకమగు తేజస్సుకొఱకు | 78 | ధామ్నా మైరమ్మదానాం.. |
| 35. సంపదలకొఱకు | 80 | చక్రం కున్తం కృపాణం... |
| 36. ఐశ్వర్యము కొఱకు | 82 | చిత్రాకారైః... |
| 37. ఎడతెగని సంపదలకొఱకు | 88 | రక్తౌఘాభ్యక్త... |
| 38. అందరిచే శ్లాఘింపబడు సంపదలకు | 89 | కాశీవిప్లోష |
| 39. వ్యాధినివారణముకొఱకు | 93 | దంష్ట్రా కాన్త్యా.. |
| 40. బద్ధకమును తొలగించుటకు | 95 | శుక్ల శ్శక్ర స్తవ స్తే... |
| 41. సత్కీర్తి కొఱకు | 97 | పాశ్చాత్యాశోక.. |
| 42. ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికి | 100 | యస్మి న్విన్యస్య భారం.. |

## శ్రీసుదర్శనశతక వ్యాఖ్యలు :

ఇట్టి మహనీయస్తోత్రమునకు సంస్కృతమున ప్రాచీనవ్యాఖ్య ఒకటి కలదు. దీనిని 1891సం॥న నిర్ణయసాగర్ వారు అజ్ఞాతకర్తృకముగా ముద్రింపగా, 1936లో లక్ష్మీవేంకటేశ్వర స్టీమ్ ప్రెస్ వారు మాధవార్యకర్తృకముగా ప్రచురించిరి. సంస్కృతమున వేరొక వ్యాఖ్య ఉన్నదేమో తెలియదు. తమిళమున ప్రాతఃస్మరణీయ కీర్తివైభవులు కాంచీమహావిద్వాన్ శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామి వారు అనుగ్రహించిన **'విద్వత్ప్రహర్షిణీ'** అను చక్కని వ్యాఖ్యకలదు. ఇది పలుమార్లు ముద్రింపబడుట దీని విశిష్టతను చాటుచున్నది. సమీపకాలము (1990సం.లో) గుడ్‌విల్ పబ్లిషర్సువారు శ్రీమాన్ ఇయ్యుణ్ణి వీరరాఘవాచార్యులుగారు, శ్రీమాన్ కొమాండూరు తిరువేంగళాచార్యులుగారు రచించిన ఆంధ్రవ్యాఖ్యను ప్రాచీన సంస్కృతవ్యాఖ్యతోపాటు తెలుగులిపిలో ముద్రించిరి. ఇది ఇంతకుముందే పెంటపాడుగ్రామములో గతశతాబ్దము పూర్వార్థమున స్థాపింపబడి, చిరస్మరణీయమైన విశిష్టాద్వైతసిద్ధాంత ప్రచారసేవను చేసిన శ్రీవైష్ణవ పత్రికలో ప్రచురింపబడినది. సుప్రసిద్ధవిద్వద్వరేణ్యులు, భాగవతామృతవర్షి ఉ.వే. శ్రీమాన్ సాతులూరిగోపాలకృష్ణమాచార్యస్వామివారి తెలుగువ్యాఖ్య రెండుపర్యాయములు ముద్రింపబడినది. ఇందు సుదర్శనపారాయణ విధానము తెలుపబడినది.

ప్రస్తుతవ్యాఖ్య ముఖ్యముగా శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామివారి ద్రావిడవ్యాఖ్యను అనుసరించుచు వ్రాయబడినది. ఇందులకు ఆ మహనీయుల సన్నిధిలో దాసుడు పరశ్శత ప్రణామములను సప్రశ్రయముగా సమర్పించుకొనుచున్నాడు. అనుబంధముగా శ్రీసుదర్శన సహస్ర నామస్తోత్రము చేర్చబడినది. ఇంకను చక్రాంకనావశ్యకతను తెల్పు పలు ప్రమాణములు స్మృతి- పురాణ- ఆగమాదులలో ఉన్నను విస్తరభీతిచే చేర్చలేదు.

ఇంతకుముందే దాసుని పితృవ్యులగు ఉ.వే. శ్రీమాన్ భాష్యకారాచార్యస్వామివారు శ్రీదేశికకృతములైన శ్రీసుదర్శనాష్టక- శ్రీషోడశాయుధస్తోత్రములకు తెలుగులో వ్యాఖ్యను సంతరించి, దానిని పూర్వసంస్కృతవ్యాఖ్యతో పాటు ముద్రించిరి. ఆ గ్రంథమునందలి పీఠికలో సుదర్శనవైభవము విస్తృతముగా ప్రతిపాదింబడుటచే ఇందు సుదర్శనస్వామివైభవమును గూర్చి దిఙ్మాత్రముగా నివేదింపబడినది. నా ప్రార్థనను దయతో అంగీకరించి తమ అమూల్యములైన మంగళాశానములను అనుగ్రహించుటయే కాక, ఈవ్యాఖ్య ముద్రించుటకు అవసరమైన ప్రోత్సాహమును అందించిన పరమహంస పరివ్రాజకాచార్య, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్రరామానుజ జీయర్ స్వామివారి దివ్యసన్నిధిలో సాష్టాంగముగా దండము



సమర్పించుకొని, కృతజ్ఞతాంజులులను నివేదించుకొనుచున్నాను. ఈవ్యాఖ్యానప్రయత్నములో నాకు మార్గదర్శకులై, నన్ను సర్వదా ప్రోత్సహించి, అన్నివిధములైన సహాయములను అందించిన పితామహవరులు, ఆచార్యులు అగు న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి దివ్యసన్నిధిలో, నా ప్రార్థనను కాదనక, నిర్హేతుక కృపతో, వాత్సల్యముతో ఈ వ్యాఖ్యను సాంతము కటాక్షించి ఉచితములైన సవరణలతో పరిష్కరించుటయేగాక, మంగళాశాసనమును అనుగ్రహించిన మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర, ఉ.వే. శ్రీమాన్ ఎస్. ఎన్. సి. రఘునాథాచార్యస్వామివారి దివ్యసన్నిధిలో, సవినయముగా కృతజ్ఞతాంజలులను సమర్పించుకొనుచున్నాను. అట్లే, నా వేడికోలు ను మన్నించి మంగళాశాసనములతో నన్ను కటాక్షించిన పండితరాజ, వాచస్పతి బిరుదాంకితులు, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఎన్. సి. వి. నరసింహాచార్యస్వామివారి సన్నిధిలో, మధురవాక్శిఖామణి, భాగవతామృతవర్షి, ఉ.వే. శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారి సన్నిధిలో సవినయముగా, సాంజలిబంధముగా కార్తజ్ఞ్యమును తెలుపుకొనుచున్నాను. శ్రీసుదర్శనయంత్రమును అనుగ్రహించిన సహృదయులు ఉ.వే. శ్రీమాన్ ఎన్. వి. ఎల్. ఎన్. రామానుజాచార్యస్వామి (పెంటపాడు) వారికి నమఃపూర్వాక కృతజ్ఞతలు. ఈ గ్రంథమును ప్రకటించుటకు అవసరమైన ఆర్థికసహాయమును అందచేసిన తిరుమల తిరుపతి దేవస్థానము అధికారులకు నా ధన్యవాదములు. అందమైన తీరులో అక్షరయోజనను చేసి, సహాయమందించిన అన్నపూర్ణాగ్రాఫిక్స్ అధినేత, మన్మిత్రము శ్రీ శర్మగారికి, వారి సహోదరులకు, విశేషించి ఓపికతో నాకు సహాయమొనర్చిన చి॥ జయలక్ష్మిగారికి, చి॥ సౌ॥ స్వర్ణలతగారికిని నా మనఃపూర్వక కృతజ్ఞతలను తెలియజేసుకొనుచున్నాను. సహృదయులైన పాఠకులను ఈ ప్రయత్నమును నీరక్షీరన్యాయమున స్వీకరింప ప్రార్థించుచున్నాను.

> **శ్రీమద్భి రఘునాథార్యగురువర్యైః పరిష్కృతా ।**
> **వ్యాఖ్యేయం కల్పతాం ప్రీత్యై సతాం నిష్పక్షపాతినామ్ ॥**

> ''ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్''

ఇట్లు

తిరుపతి
18-7-2002

సహృదయవిధేయుడు
ఈ. ఏ. ఆర్. రామన్

శ్రీమతే సుదర్శనభగవతే నమః

## తనియన్ (స్తోత్రకర్తస్తుతి)

రంగేశవిజ్ఞప్తికరామయస్య యః చకార చ క్రేశనుతిం నివృత్తయే ।
సమాశ్రయేఽహం వరపూరణాయ నః తంకూరనారాయణ నామకం మునిమ్ ॥

యః = ఏ కూరనారాయణముని, రంగేశవిజ్ఞప్తికర = తిరువరంగప్పెరుమాళ్ అరైయర్ అను ఆచార్యులయొక్క, ఆమయస్య = వ్యాధియొక్క, నివృత్తయే = ఉపశమనముకొఱకు, చక్రేశనుతిమ్ = శ్రీసుదర్శనస్తోత్రమును (శ్రీసుదర్శన శతకమును), చకార = చేసెనో, తమ్ = ఆ, కూరనారాయణనామకం మునిమ్ = శ్రీకూరనారాయణమునిని, నః = మాయొక్క, వరపూరణాయ = అపేక్షితములు నెఱవేరుటకొఱకు, అహమ్ = నేను, సమాశ్రయే = ఆశ్రయించుచున్నాను.

శ్రీరంగమున తిరువరంగప్పెరుమాళ్ అరైయర్ అను ఆచార్యుల దేహములో ఏర్పడిన వ్యాధినివారణకై శ్రీకూరనారాయణజీయర్ అను ఆచార్యులు శ్రీసుదర్శనభగవానుని విషయమున నూఱు శ్లోకములను కల ఈ సుదర్శన శతకమను స్తోత్రమును రచించిరి. ఈ స్తోత్రము సర్వాభీష్టప్రదము. ఇట్టి స్తోత్రమును అనుగ్రహించిన ఆ ఆచార్యులను నేను ఆశ్రయించుచున్నాను.

శ్లోకములో మూడవపాదమున **''వరపూరణీయమ్''** అను అపపాఠము పలు చోట్ల కానవచ్చుచున్నది. **''రంగేశవిజ్ఞప్తికరామయస్య చకార చక్రేశనుతిమ్''** ఇత్యాదిగా నున్న తనియన్ శ్లోకము వాక్యగర్భితత్త్వదోషజుష్టమని, కావుననే సుమారు 60 సంవత్సరములకు పూర్వము ప్రచురింపబడిన స్తోత్రార్ణవములో ఈ తనియన్ శ్లోకము పైన చూపబడిన విధముగా సంస్కరింపబడి ముద్రింపబడినదని, కావున ఆ పాఠమే ఆదరణీయమని మహామహోపాధ్యాయ ఉ.వే. శ్రీమాన్ ఎస్. ఎన్. సి. రఘునాథాచార్యస్వామివారు సెలవిచ్చిరి. అందుచే ఆ పాఠమే ఇచట గ్రహింపబడినది.



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీసుదర్శనాయహేతిరాజాయ నమః



# శ్రీసుదర్శనశతకము - జ్వాలావ్యాఖ్యానము

### జ్వాలావర్ణనము

### శ్రీసుదర్శనుని జ్వాల మీ మనోరథాలను తీర్చాలి.

**1.** సౌదర్శన్యుజ్జిహానా దిశి విదిశి తిరస్కృత్య సావిత్ర మర్చిః
బాహ్యాబాహ్యాంధకారక్షతజగదగదంకారభూమ్నా స్వధామ్నా ।
దోఃఖర్జూదూరగర్జద్విబుధరిపువధూకంఠవైకల్యకల్యా
జ్వాలా జాజ్వల్యమానా వితరతు భవతాం వీప్సయాఽభీప్సితాని ॥

శ్రీమత్సుదర్శనస్యేదం శతకం కృపయా గురోః ।
అనంతరంగరామోఽహం వ్యాకరో మ్యాంధ్రభాషయా ॥

బాహ్య = వెలుపల, అబాహ్య = లోపలగల, అంధకార = చీకటిచే, క్షత = గాయపడిన, జగత్ = లోకములకు, అగదంకారభూమ్నా = వైద్యుడుగా నుండు గొప్పతనమును కల్గిన, స్వధామ్నా = తన కాంతిచే, సావిత్రమ్ = సూర్యునకు సంబంధించిన, అర్చిః = కాంతిని, తిరస్కృత్య = తిరస్కరించి (తక్కువచేసి), దిశి విదిశి = అన్ని దిక్కులలో, ఉజ్జిహానా = వ్యాపించి, ప్రకాశించునదియు, దోఃఖర్జూ = భుజముల తీటచే, దూర = మిక్కిలి, గర్జత్ = సింహనాదమును చేయు, విబుధరిపు = అసురుల, వధూ = స్త్రీలయొక్క, కంఠ = కంఠములలోని మంగళసూత్రములకు, వైకల్య= వికలత్వమును కల్గించుటలో (లేకుండచేయుటలో), కల్యా = సామర్థ్యమును కల్గినది, జాజ్వల్యమానా = నిస్సమాభ్యధికముగా మిక్కిలిప్రకాశించునది అగు, సౌదర్శనీ జ్వాలా = సుదర్శనము యొక్క జ్వాల, భవతామ్ = మీకు, అభీప్సితాని = కోరిన కోరికలను, వీప్సయా = మాటిమాటికి, వితరతు = ఇచ్చునుగాక !

ఈ స్తోత్రమున మొదటి 24శ్లోకములు శ్రీసుదర్శన భగవానుని జ్వాలను వర్ణించుచున్నవి. లోకమున చీకటి రెండు విధములుగా నుండును. బాహ్యతమస్సు అని,

ఆంతరతమస్సు అని అది రెండు విధములు. ఆంతర తమస్సు అజ్ఞానాంధకార మనబడును. బాహ్యతమస్సు లోకమున ప్రసిద్ధమైన చీకటి. ఈ రెండు విధములైన చీకట్లవలన అలమటించు లోకములోని జనులకు, ఆ చీకట్లను పారద్రోలి ఉజ్జీవింప చేయగల్గినది శ్రీసుదర్శనభగవానుని తేజస్సు. ఇది సూర్యుని తేజమును వెలవెలపోవునట్లు చేయుచున్నది. (సూర్యుని తేజస్సు బాహ్యతమస్సును మాత్రము పోగొట్టగలదు. కాని, సుదర్శనుని తేజస్సు రెండు విధములైన చీకట్లను తొలగింపగలదు. కావున అది సూర్యతేజమును తిరస్కరించినదను హేతుహేతుమద్భావమును శ్లోకములో పూర్వార్ధమున చెప్పనగును) రాక్షసులకు ఎల్లప్పుడును యుద్ధముచేయుటలోనే ఉత్సాహము. కావున తమతో యుద్ధమునకు ఎవరు వత్తురా ? అని వారి భుజములు యుద్ధకండూతిని కల్గియుండును. అందువలన వారు మాటిమాటికి సింహనాదములను చేయుదురు. అట్టి వారిని అందఱిని సంహరించి, వారి భార్యల కంఠములలోని మంగళసూత్రములకు వైకల్యమును, అనగా లేకుండపోవు స్థితిని కల్పింపగల్గినది సుదర్శనుని జ్వాల. ఇట్టి జ్వాల మీ అందఱి కోరికలను మాటిమాటికి తీర్చునుగాక !

**''సుదర్శనస్య ఇయం సౌదర్శనీ''** అనునది సౌదర్శనీశబ్దవ్యుత్పత్తి. **''ఉజ్జిహానా''** అనురూపము **''ఓ హాఙ్ – గతౌ''** అను ధాతువునుండి పుట్టిన శానచ్ ప్రత్యయాంతము. **''ఉత్''** అను ఉపసర్గ ఇందు చేరినది. **''సవితుః ఇదమ్ సావిత్రమ్''** అనగా సూర్యునకు సంబంధినది అని అర్థము. **''కంఠకైవల్యకల్యా''** అను పాఠము కూడ కలదు. ఇదియు స్వరసమైనదే. **''కల్యా''** అనుటకు సిద్ధమైనదని, సమర్థమైనదనియు అర్థము. **''వీప్సా''** అనగా వ్యాపింపవలెనను కోరిక. అనగా మాటిమాటికి అని భావము. ఈ స్తోత్రమునందు అంతట స్రగ్ధరావృత్తము ప్రయోగింపబడినది.

బాహ్యాంధకారమనుటకు **''సంసారసర్పదష్టానాం భోగ్యాః స్రక్చందనాలయః, మోహేన మధురాయంతే విసర్గా న్నింబసన్నిభాః''** అనునట్లు వేపవలె చేదైన బాహ్యవిషయములగు స్రక్చందనాదులవంటి అను అభోగ్యవస్తువులయందు భోగ్యతారూపమైన అంధకారము. అనగా వానిని భోగ్యములుగా తలచుట. అట్లే, అబాహ్యాంధకారమనుటకు అబాహ్యవిషయమైన అంధకారము - అనగా, అంతర్యామియగు భగవానుని జ్ఞానశక్త్యాది కల్యాణగుణములను కల్గిన వానినిగా తలంపక, ఆస్వామి యందు నిర్గుణత్వాది భ్రాంతిని కల్గియుండుట. లేక, అజ్ఞాన- అన్యథాజ్ఞాన- విపరీతజ్ఞాన మనియు చెప్పవచ్చును- అని సంస్కృతవ్యాఖ్యాత వివరించెను. **''అథవా, విశ్వవిశృంఖల విజృంభమాణ తమఃపటలం బాహ్యాంధకారః, అజ్ఞాన– అన్యథాజ్ఞాన – విపరీతజ్ఞానాదిః అబాహ్యాంధకారః''** అని అచటి వాక్యవిన్యాసము.

ఈ శ్లోకము శ్రీసుదర్శనభగవానుని ఆశ్రితరక్షణసామర్థ్యమును నిరూపించుచున్నది.



రక్షణ మనునది అనిష్టనివారణము, ఇష్టప్రాపణము అని రెండు విధములు. ఇందు ఆరెండును తెలుపబడినవి. **''బాహ్యాబాహ్యాంధకార''** ఇత్యాదిగా అజ్ఞానమును పోగొట్టుట, **''దోఃఖర్జూ''** ఇత్యాదిగా అసురసంహారమును చేయుటయు తెలుపబడుటచే అనిష్టనివారణము, **''వితరతు భవతాం వీప్సయాఽభీప్సితాని''** అనుటచే ఇష్టప్రాపణమును సూచింపబడినవి. **''అనేనాశ్రితానామిష్టానిష్టప్రాపణపరిహారణనిపుణేత్యుక్తమ్''** అని సంస్కృతవ్యాఖ్య. **''సావిత్ర మర్చిః తిరస్కృత్య''** ఇత్యాదిగా గలసూక్తికి అనుగుణముగా **''సుదర్శనం భాస్కరకోటితుల్యమ్''** వంటి సూక్తుల అర్థము అనుసంధేయము. మఱియు సైంధవవధసందర్భములో సుదర్శనముతో శ్రీకృష్ణభగవానుడు సూర్యుని ఆచ్ఛాదించిన వృత్తాంతమును స్మరణీయము. వేదాంతదేశికులు సుదర్శనాష్టక స్తోత్రమున ప్రారంభములో **''ప్రతిభటశ్రేణిభీషణ వరగుణస్తోమభూషణ''** అని పల్కిరి. ప్రస్తుతశ్లోకమున **''దోఃఖర్జూ''** ఇత్యాదిగా ప్రతిభట శ్రేణిభీషణత్వము, **''ఉజ్జిహానా దిశి విదిశి''** ఇత్యాదిగా తేజస్సు, జ్ఞానము తద్ద్వారా వీర్యము, శక్తి, బలము, ఐశ్వర్యములును సూచింపబడుటను బట్టి వరగుణస్తోమభూషణత్వము ను తెలుపబడినవి. కావున ఒక విధముగా పైదేశికసూక్తికి ఈప్రథమశ్లోకము మూల మనదగును. సుదర్శనజ్వాలను **''తీయిల్ పొలికిన్ఱ శెఞ్జుడరాழி''** ఇత్యాదిగా భట్టనాథులు, **''వెయ్యదోర్ తழల్ ఉమిழ்''** ఇత్యాదిగా గోదాదేవి, **''అనల్ ఆழியార్''** అని మునివాహనసూరి, **''తழల్ ఆழி''** ఇత్యాదిగా భూతయోగి, **''అழలుమ్ శెరువాழி''** అని సరోయోగి, **''వెయ్య ఆழி''** అని భక్తిసారులు, **''వెయ్యార్శుడరాழி''** అని శ్రీశఠకోపులు, **''కనల్ ఆழி''** అని మహాయోగి, **''వెయ్య ఆழி''** ఇత్యాదిగా పరకాలసూరియు అభివర్ణించిరి.

''సౌదర్శనీ జాజ్జ్వల్యమానా జ్వాలా వితరతు భవతాం వీప్సయాఽభీప్సితాని''

## శ్రీసుదర్శనజ్వాల మీకు సంపదను ఇవ్వాలి

**2.** ప్రత్యుద్యాతం మయూఖైః నభసి దినకృతః ప్రత్తసేవం ప్రభాభిః
భూమౌ సౌమేరవీభిః దివి వరివసితం దీప్తిభిః దేవధామ్నామ్ ।
భూయస్యై భూతయే వః స్ఫురతు సకలదిగ్ర్భాంతసాంద్రస్ఫులింగం
చాక్రం జాగ్రత్ప్రతాపం త్రిభువనవిజయవ్యగ్ర ముగ్రం మహ స్తత్ ॥

భూమౌ = భూలోమునందు, సౌమేరవీభిః ప్రభాభిః = మేరుపర్వతముయొక్క కాంతులచే, ప్రత్తసేవమ్ = సమర్పింపబడిన సేవనుకల్గినది, నభసి = ఆకాశమునందు, దినకృతః = సూర్యునియొక్క, మయూఖైః = కిరణములచే, ప్రత్యుద్యాతమ్ = ఎదురేగి, ఉపచారమును

చేయబడినది, దివి = దేవలోకమునందు, దేవధామ్నామ్ = దేవతల గృహములయొక్క, (లేక, నక్షత్రాది తేజః పదార్థములయొక్క), దీప్తిభిః = ప్రకాశములచే, వరివసితమ్ = శుశ్రూషచేయబడినది, సకలదిగ్భ్రాంతసాంద్ర స్ఫులింగమ్ = అన్ని దిక్కులయందు తిరుగుచు వ్యాపించి, నిబిడముగానున్న అగ్ని కణములనుకల్గినది, త్రిభువనవిజయవ్యగ్రమ్ = ముల్లోకములను జయించుటలో మిక్కిలి ప్రయత్నించునది, (కావుననే), జాగ్రత్ ప్రతాపమ్ = ఎల్లప్పుడు వెలుగొందు ప్రతాపమును (తపింపచేయుశక్తిని) కల్గినది, ఉగ్రమ్ = (శత్రువులకు) భయంకరమైనది, చాక్రమ్ = సుదర్శనచక్రమునకు చెందిన, తత్ = ఆ (ప్రసిద్ధమైన, వర్ణింపశక్యముకాని), మహః = తేజస్సు, వః = మీకు, భూయస్యై = మిక్కిలి అధికమైన, భూతయే = సంపదకొఱకు, స్ఫురతు = ప్రకాశించుగాక !

భూలోకమందు మేరుపర్వతకాంతులచే సేవింపబడినది, ఆకాశమునందు సూర్యునికిరణములచే ఎదురేగి, ఉపచరింపబడినది, దేవలోకమునందు దేవతల గృహముల దీప్తులచే సేవింపబడినది, అన్నిదిక్కులలో వ్యాపించిన దట్టమైన అగ్నికణములను కల్గినది, ముల్లోకములను జయించుటలో మిక్కిలి తీవ్రముగా యత్నించునది, శత్రువులకు భీకరమైనది అగు ప్రసిద్ధమైన ఆ సుదర్శనచక్రతేజము మీకు అధికమైన సంపదను అనుగ్రహించుగాక !

**''వరివసితమ్, ప్రత్యుద్యాతమ్, ప్రత్తసేవమ్''** అను పదముల ప్రయోగములచే ఉత్కృష్టుడైన వానిని అతని అభిప్రాయానుసారము అతనికంటె తక్కువ వారు వర్తించుట, అతనికి ఎదురేగి ఆహ్వానమును పల్కుటయు ధ్వనించుచున్నది. నాల్గవ పాదములోనున్న **''త్రిభువనవిజయవ్యగ్రమ్''** అను విశేషణమునకు వివరణమును మిగిలిన మూడు పాదములు చేయుచున్నవి అని చెప్పవచ్చును. **''పాఠక్రమా దర్థక్రమో బలీయాన్''** అను న్యాయమును అనుసరించి **''భూమౌ సౌమేరవీభిః ప్రత్తసేవమ్''** అను ప్రయోగము ముందు గ్రహింపబడినది. **''పృథివ్యంతరిక్షం ద్యౌ ర్దిశః''** అని కదా శ్రుతి.

భూలోకమున మేరుపర్వతముయొక్క కాంతులు శ్రీసుదర్శనభగవానుని దివ్యతేజస్సునకు సేవచేయుచున్నవి అనుటలో భావ మేమనగా - మేరుపర్వతముయొక్క విస్తరించిన తేజస్సుకంటె సుదర్శనుని తేజస్సు మిక్కిలి గొప్పది - అని భావము. సేవింపబడువాడు గొప్పవాడు, సేవించువాడు తక్కువవాడును అగుట సహజము కదా ! ఆకాశమున సూర్యుని కాంతులు ఎదురేగుచున్నవనుట, స్వర్గలోకమునందు దేవతల గృహముల దీప్తులు శుశ్రూష చేయుచున్నవనుటయు ఇట్టి భావమునే తెలుపును. కావున మూడు లోకములందున్న తేజఃపదార్థము లన్నియు సామర్థ్యమును కల్గి, వెల్గుటకు శ్రీసుదర్శనుని తేజస్సు మూలకారణమని తెలిపినట్లయినది. **''సుమేరోః ఇమాః సౌమేరవ్యః, తాభిః సౌమేరవీభిః''** అని



విగ్రహము. **'ధామన్'** శబ్దము గృహమునకు, తేజస్సునకు వాచకము. ఆ రెండు అర్థములను ఇచట గ్రహింపనగును.

ఇట్లు ఈ శ్లోకమున శ్రీసుదర్శనభగవానుని జ్వాలాచక్రము భూమి, అంతరిక్షము, స్వర్గములందు వ్యాపించుట, అందుగల తేజఃపదార్థములన్నియు శ్రీసుదర్శనుని సేవించుట, శ్రీసుదర్శనుని ప్రతిపక్షనిరసనసామర్థ్యమును తెలుపబడినవి. **''చక్రరాజజ్వాలా చ చక్రస్య భూమ్యంతరిక్షస్వర్గవ్యాప్తిశ్చ, తద్గతతేజఃపదార్థ సముదాయసంసేవిత్వంచ, ప్రతిపక్షవిక్షేపదక్షత్వంచ ప్రత్యపాది''**అని సంస్కృతవ్యాఖ్య **''ప్రాప్తసేవమ్''** అనువేఱొక పాఠము ప్రసిద్ధముగా కన్పించుచున్నది. కాని, **''ప్రత్తసేవమ్''** అను పాఠము సంస్కృతవ్యాఖ్యానానుసారము ప్రాచీనము. ''ప్రత్త'' శబ్దనిష్పత్తికూడ అచట **''ఉపసర్గాత్తః''** (అష్టా 7-4-47) అను సూత్రమునుదాహరించి, వ్యాఖ్యలో ప్రదర్శితమైనది - అని శ్రీ రఘునాథాచార్యస్వామివారి పరిష్కరణమునుబట్టి ఈ పాఠమే ఆదరింపబడినది.

**''చాక్రం జాగ్రత్ప్రతాపం మహః వః భూయస్యై భూతయే స్ఫురతు''**

## శ్రీసుదర్శన జ్వాల మీకు గొప్ప సంతోషాన్ని ఇవ్వాలి.

**3.** **పూర్ణే పూరై స్సుధానాం సుమహతి లసత స్సోమబింబాలవాలే**
**బాహాశాఖావరుద్ధక్షితిగగనదివ శ్చక్రరాజద్రుమస్య ।**
**జ్యోతిశ్ఛద్మా ప్రవాలః ప్రకటితసుమనస్సంపదుత్తంసలక్ష్మీం**
**పుష్య న్నాశాముఖేషు ప్రదిశతు భవతాం సప్రకర్షం ప్రహర్షమ్ ॥**

సుధానాం పూరైః = అమృతరసప్రవాహములచే, పూర్ణే = నిండినది, సుమహతి = మిక్కిలి గొప్పతనమును కల్గినదగు, సోమబింబ+ ఆలవాలే= చంద్రబింబమను పాదులో (కుదురులో), లసతః = వెల్గునది, బాహాశాఖావరుద్ధక్షితిగగనదివః = భుజములను కొమ్మలతో భూమిని, ఆకాశమును, స్వర్గమును ఆక్రమించినదైయున్న, చక్రరాజద్రుమస్య = సుదర్శనచక్రరాజము అను కల్పవృక్షముయొక్క, ప్రకటితసుమనస్సంపత్ = పుష్పసమృద్ధిని ప్రకటింపచేయునది (దేవతల సంపదను వెలుగునట్లు చేయునది), ఆశాముఖేషు = దిఙ్మండలములలో, ఉత్తంసలక్ష్మీం పుష్యన్ = శిరోభూషణ శోభను అధికముగా చేయునదియైయున్న, జ్యోతిశ్ఛద్మా = జ్యోతిస్సునెపమున నున్న, ప్రవాలః = చిగురు, భవతామ్ = మీకు, సప్రకర్షమ్ = ఆధిక్యముతో కూడిన, ప్రహర్షమ్ = సంతోషమును, ప్రదిశతు = ఇచ్చును గాక !

శ్రీసుదర్శనుని ఒక కల్పవృక్షముగా, ఆస్వామి తేజస్సును ప్రవాళము (చిగురు)గా

కని ఇందు రూపించుచున్నారు. లోకమున వృక్షము నీటితోనిండిన పాదులో (కుదురులో) ప్రకాశించును. చుట్టును పెరిగి వ్యాపించియున్న కొమ్మలను కల్గియుండును. అట్టి స్వభావము శ్రీసుదర్శనునకు కలదనుటకు పూర్వార్ధము వివరించుచున్నది. అమృత ప్రవాహము నిండిన చంద్రబింబమను పాదులో శ్రీసుదర్శనమను వృక్షము వెలుగుచున్నది. శ్రీసుదర్శనుడు చంద్రమండలమున వెల్గునట్లు చెప్పుటలో అర్థమేమనగా, సుదర్శనయంత్ర సంస్థాన క్రమమున సుదర్శన భగవానుడు చంద్రమండలమున వేంచేసియున్నట్లు తెలుపబడుటను అనుసంధించుటయే. **''చంద్రబింబస్య మధ్యే తు తారం కుర్యాత్ సమాహతః, తస్య మధ్యే లిఖే ద్దేవం రక్తవర్ణం సుదర్శనమ్''** అను అహిర్బుధ్న్య సంహితలోని (36-5) ప్రమాణవచన మిచట స్మరణీయము. ఈ స్తోత్రమునందును **''ప్రణవశశధరాధారషట్కోణవర్తీ''** అని, **''చంద్రాధఃకారియంత్రే వపుషి చ''** అని, **''స్వపదశశధరం ప్రేక్ష్య తారానుషక్తమ్''** అనియు తెలుపబడుటయు గమనింపతగినది. లోకమున వృక్షము నీరునిండిన ఆలవాలమున వెలుగునట్లే, శ్రీసుదర్శనవృక్షము అమృతప్రవాహపూర్ణమగు చంద్రబింబమను ఆలవాలమున వెలుగుచున్నదని భావము. వృక్షము తన చుట్టును విస్తరించియుండు శాఖలతో క్రిందిభాగమున, పైభాగమునను వ్యాపించియుండునట్లే, ఈసుదర్శనవృక్షముకూడ తన బాహువులను శాఖలతో దివిని, భువిని అంతటిని ఆక్రమించి యున్నదనుటను రెండవపాదము తెలుపుచున్నది. దీర్ఘములైన బాహువులను వృక్షశాఖలతో పోల్చుట కవిసమయము. **''చక్రరాజద్రుమస్య''** అను చోట ద్రుమశబ్దము వృక్షసామాన్య వాచకమైయున్నను ఇచట కల్పవృక్షమను వృక్షవిశేషమునకు వాచకముగా గ్రహింపనగును. **''ద్రుమాణాం రాజా రాజద్రుమః, చక్ర మేవ రాజద్రుమః''** అను వ్యుత్పత్తిని కూడ కొందరు వ్యాఖ్యాతలు తెలిపిరి. వృక్షముపక్షమున చిగురు అని భావము.

**(ప్రకటితసుమనస్సంపత్)** - చిగురు పుష్పసంపదను ఇచ్చును. అట్లే ఈ సుదర్శనజ్యోతి అను చిగురుకూడ పుష్పసంపదను ఇచ్చుచున్నది. ఇచట సుమనశ్శబ్దము శ్లేషించుట గమనింపతగినది. ఈ శబ్దము పూవును, దేవతలను బోధించును. పల్లవము సుమనశ్శబ్దవాచ్యమగు పుష్పమును ప్రకటనముచేయును. (అనగా ఇచ్చును.) సుదర్శనజ్యోతి అను పల్లవము సుమనశ్శబ్దవాచ్యులగు దేవతల సంపదను ప్రకటిత మగునట్లు చేయును. దేవతల సంపదను కొల్లగొట్టి, వారిని పీడించు అసురులను, రాక్షసులను శిక్షించుట ద్వారా శ్రీసుదర్శనభగవానుని జ్యోతిస్సు దేవతల సంపదను ప్రకటింపచేయుచున్నది అని భావము. **''సర్వదా సత్పురుష పరిషదుపాస్యః ఇత్యర్థః''** అని సంస్కృతవ్యాఖ్య.

**(ఆశాముఖేషు ఉత్తంసలక్ష్మీమ్ పుష్యన్)** స్త్రీలు చిగుళ్లను శిరోభూషణముగా చేసికొందురు. సుదర్శనుని జ్యోతిస్సు దిఙ్మండలములందు శిరోభూషణముగా వెల్గుచున్నదని తాత్పర్యము. సుదర్శనతేజము దిక్కులన్నిటియందు అందముగా వ్యాపించుచున్నదని సారము.



**''ఆశా''** శబ్దముయొక్క స్త్రీలింగ స్వారస్య మిచట గమనింపతగినది.

ఇట్టి ప్రవాళమువంటి సుదర్శనతేజము మీకు గొప్ప సంతోషమును కల్గించునుగాక ! అని భావము. **''చక్రరాజద్రుమస్య''** ఇత్యాదిగా రూపకాలంకారము కలదు. ఇది **''సుమనస్సంపత్''** అనునపుడు సుమనశ్శబ్దము శ్లేషించుటచే శ్లేషానుప్రాణితము. **''ఉత్తంసలక్ష్మీమ్''** అనునపుడు కర్ణాభరణశోభ అని సంస్కృతవ్యాఖ్య.

**''చక్రరాజద్రుమస్య జ్యోతిశ్చద్మాప్రవాలః భవతాం సప్రకర్షం ప్రహర్షం ప్రదిశతు''**

## శ్రీసుదర్శన జ్వాల మీకు చతుర్విధపురుషార్థాలను ఇవ్వాలి.

**4.** ఆరా దారాత్ సహస్రా ద్విసరతి విమతక్షేపదక్షా ద్యదక్షాత్
నాభే ర్భాస్వత్సనాభేః నిజవిభవపరిచ్ఛిన్నభూమే శ్చ నేమేః ।
ఆమ్నాయై రేకకంఠైః స్తుతమహిమమహో మాధవీయస్య హేతేః
తద్వో దిక్ష్వేధమానం చతసృషు చతురః పుష్యతాత్ పూరుషార్థాన్ ॥

మాధవీయస్య = భగవానునకు చెందినదగు, హేతేః = ఆయుధమగు సుదర్శనముయొక్క, యత్+మహః = ఏ తేజస్సు, సహస్రాత్ ఆరాత్ = వేలాది అరసమూహములనుండి, విమతక్షేపదక్షాత్ = శత్రువులను తరుముటలో సమర్థమగు, అక్షాత్ = అక్షమునుండి, భాస్వత్సనాభేః = సూర్యునితో పోలియున్న, నాభేః = నాభిప్రదేశమునుండి, నిజవిభవపరిచ్ఛిన్నభూమేః = తన గొప్పతనముచే (విస్తృతిచే) పరిచ్ఛిన్నముగా చేయబడిన భూమిని కల్గినది అగు, నేమేః = నేమినుండి, ఆరాత్ విసరతి = అంతటను వ్యాపించుచున్నదో, ఏకకంఠైః ఆమ్నాయైః = ముక్తకంఠములగు (ఒకేవిధముగాపల్కు) వేదములచే, స్తుతమహిమ = స్తుతింపబడిన గొప్పతనమును కల్గినది, చతసృషు దిక్షు = నాల్గు దిక్కులలో, ఏధమానమ్ = వ్యాపించుచున్నదగు, తత్ = ఆతేజస్సు, వః = మీకు, చతురః పూరుషార్థాన్ = ధర్మ, అర్థ, కామ, మోక్షములను నాల్గు పురుషార్థములను, పుష్యతాత్ = పోషించునుగాక ! (వృద్ధిచేయునుగాక !)

అరము, అక్షము, నాభి, నేమి అనునవి శ్రీసుదర్శనుని అవయవములు. ఈ అవయవము లన్నిటియందు ఎగయు జ్వాలయే సుదర్శనజ్వాల. (అవయవసంఘాతమే కదా అవయవి). దాని కీర్తి సకలవేదములందు స్తుతింపబడినది. అట్టి సుదర్శనజ్యోతిస్సు ధర్మార్థకామమోక్షములను నాల్గు పురుషార్థములను మీకు అనుగ్రహించునుగాక ! అని భావము.

**''ఆరాత్ ఆరాత్''** అను రెండుపదములలో ఒకటి పంచమీ విభక్త్యంతపదము; వేరొకటి అవ్యయము. **''అరాణామ్ సమూహః ఆరమ్, తస్మాత్ ఆరాత్''** అని సుబంతపదము

యొక్క విగ్రహమును చెప్పనగును. ''ఇచట గమనింపతగిన అంశ మొకటి కలదు. **''శతం, సహస్రమ్''** ఇత్యాది సంఖ్యావాచకశబ్దములను విశేషణములుగా కల్గిన విశేష్యపదములు బహువచనాంతములుగా నుండవలెను. **''శతం పుత్రాః, సహస్రం పశవః''** ఇత్యాదిప్రయోగములు ఇందులకు ఉదాహరణములు. కావున ఈ సందర్భమున **''సహస్రాత్ అరేభ్యః''** అనియుండవలెనే తప్ప, **''ఆరాత్''** అని ఏకవచనాంతముగా నుండుట పొసగదుకదా ! అను సంశయమిచట కలుగవచ్చును. దీనికి పలు సమాధానములు కలవు. సహస్రసంఖ్యావత్త్వము అరసమూహమందు సాక్షాత్తుగా అన్వయించుటలేదు. సమూహావయవమగు అరములలో అన్వయించును. సమూహమనునది ఒకటే అగుటచే **''ఆరాత్''** అని ఏకవచనాంతప్రయోగము యుక్తమేనని కొందఱు అందురు. అంతియేకాక, సహస్రశబ్దము సహస్రావయవపరమై, పిమ్మట **''అర్శ ఆద్యచ్''** అను సూత్రమువలన **''సహస్రావయవవిశిష్టాత్ అరసమూహాత్''** అనగా సహస్రావయవ విశిష్టమైన అరసమూహమునుండి అని అగునని మరి కొందరు అందురు. ఇట్లుకాక, నడదూర్ అమ్మాళ్ విరచితమైన పర్వతాది పంచకస్తుతిలో **''శ్రీరంగస్థలవేంకటాద్రికరిగిర్యాదౌ శతేఽష్టోత్తరే స్థానే గ్రామనికేతనేషు చ సదా సాన్నిధ్య మాసేదుషే''** అను శ్లోకమునందు **''అష్టోత్తరే శతే స్థానేషు''** అని ప్రయోగింపక, **''స్థానే''** అని ఏకవచనప్రయోగము చేయబడుటచే అట్లే ఇదియును యుక్తమని ఇంకొందరు పల్కుదురు. ఇట్లు నిర్వహించు రీతులు పలు ఉన్నను హృదయంగమమైన నిర్వాహము వేరొకటి కలదు. అది ఏమనగా - **''అరాణాం సమూహః ఆరమ్''** అను విగ్రహమును కాక, **''అరాణాం సంబంధి ఆరమ్''** అని గ్రహించి, ఆరశబ్దమును విశేషణముగా, సహస్రపదమును విశేష్యముగా గొని ''అరములను కల్గినదగు సహస్రమునుండి'' అను అర్థమును చెప్పుట మిక్కిలి స్వరసము. అరములయొక్క సహస్రమని చెప్పినచో వేయి అరములనియే అర్థము వచ్చును. **''సహస్రం గాథానాం శతమథసూరి స్సమతనోత్'', ''పద్యానాం శత మాతనోత్''** ఇత్యాది ప్రయోగములలో **''సహస్రం గాథా, శతం పద్యాని''** అను అర్థము స్ఫురించుటను గమనింపనగును. ఈ శతకమునందును **''భూమానం భూయసా వో దిశతు దశశతీ భాస్వరాణా మరాణామ్''** అను ప్రయోగమకూడ ఇచట దృష్టాంతముగా గ్రహింపతగినది. **''అరాణాం దశశతీ''** అనగా, **''సహస్రమ్ అరాణి''** అనియే కదా అర్థము. ఈ పద్ధతిలో కాక, వేరొక రీతిలో కూడ ఈ ప్రయోగమును సమర్థింపవీలున్నచో విజ్ఞులు దానిని ఊహింపగలరు.'' అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామివారి వివరణము. **''ఆరాత్''** అను అవ్యయము **''ఆరా దూరసమీపయోః''** అను అమరకోశవచనము ప్రకారము సమీపము, దూరము అను రెండు అర్థములను తెలుపును. **''నిజవిభవపరిచ్ఛిన్నభూమ్నే''** అను నేమివిశేషణము శ్రీసుదర్శనుని నేమి భూమికంటె మిక్కిలి విస్తారమును కల్గినదనుటను తెలుపును. **''ఆమ్నాయై రేకకంఠస్తుతమహిమా''** అనియు వేరొక పాఠముకలదు. **''ఆమ్నాయైః''** అనుటకు సంస్కృత



ద్రావిడవేదములచే అనియు చెప్పవచ్చును. ఈ రెండింటియందు సుదర్శనభగవానుని వైభవము విస్తృతముగా ప్రతిపాదితము కదా !

''మాధవీయస్య హేతేః తత్ మహః వః చతురః పూరుషార్థాన్ పుష్యతు''

---

## శ్రీసుదర్శనజ్వాల మీ సుఖాన్ని వర్ధిల్లజేయాలి.

5. శ్యామం ధామప్రసృత్యా క్వచన భగవతః క్వాపి బభ్రు ప్రకృత్యా
శుభ్రం శేషస్య భాసా క్వచన మణిరుచా క్వాపి తస్యైవ రక్తమ్ ।
నీలం శ్రీనేత్రకాంత్యా క్వచి దపి మిథునస్యాదిమస్యేవ చిత్రాం
వ్యాతన్వానం వితానశ్రియ ముపచినుతా చ్ఛర్మ వ శ్చక్రభానమ్ ॥

క్వచన = ఒకచోట, భగవతః = భగవానునియొక్క, ధామప్రసృత్యా = దివ్యదేహము కాంతియొక్కవ్యాప్తి చే, శ్యామమ్ = పచ్చనిదై, క్వాపి = వేరొకచోట, ప్రకృత్యా బభ్రు = స్వభావముచే పింగళవర్ణమును కల్గినదై, క్వచన = ఇంకొకచోట, శేషస్య భాసా = ఆదిశేషుని కాంతిచే, శుభ్రమ్ = తెల్లనిదై, క్వా+అపి = మరియొకచోట, తస్యై+ ఏవ = ఆ ఆదిశేషునియొక్కయే, మణిరుచా = (పడగలపైనున్న) మణుల కాంతులచే, రక్తమ్ = ఎఱ్ఱనిదై, క్వచిత్ +అపి = ఇంకొకచోట, శ్రీనేత్రకాంత్యా = లక్ష్మీదేవి నేత్రముల ప్రకాశముచే, నీలమ్ = నల్లనిదై, (ఇట్లు పలువర్ణముల కలయికనుకల్గినదగుటచే), ఆదిమస్య మిథునస్య = ఆదిదంపతులయొక్క, చిత్రామ్ వితానశ్రియమ్ = విచిత్రమైన మేలుకట్టుయొక్క శోభను, వ్యాతన్వానమ్ ఇవ స్థితమ్ = విశేషముగా విస్తరింపచేయుచున్నట్లున్న, చక్రభానమ్ = శ్రీసుదర్శన చక్రముయొక్క తేజస్సు, వః = మీకు, శర్మ = సుఖమును, ఉపచినుతాత్ = వర్ధిల్లచేయునుగాక !

నీలమేఘవర్ణుడగు భగవానుని దివ్యదేహకాంతి వ్యాపించుటచే కొన్ని చోట్ల నల్లని వర్ణమును కల్గినదియై, కొన్నిచోట్ల సహజసిద్ధమైన పింగళవర్ణమును కల్గినదియై, ఆదిశేషుని శరీరకాంతివలన కొన్నిచోట్ల తెల్లనిదై, ఆ శేషుని పడగలపై ప్రకాశించురత్నముల కాంతిచే కొన్నిచోట్ల ఎఱ్ఱనై, నల్లకలువలవంటి కన్నులను కల లక్ష్మీదేవి యొక్క నేత్రముల కాంతివలన కొన్నిచోట్ల నల్లనై - ఇట్లు పలు వర్ణములు వ్యాపించియున్న శ్రీసుదర్శన భగవానుని జ్యోతిస్సు దివ్యదంపతుల విహారమునకై నిర్మింపబడిన, చిత్రవర్ణమును కల్గిన మేలుకట్టువలె తోచుచున్నది. ఇట్టి ఆజ్యోతిస్సు మీ సుఖమును అభివృద్ధి చేయునుగాక !

**''వ్యాతన్వానం వితానశ్రియమ్''** అనుటచే శ్లోకమున ఆర్థికమైన ఉత్ప్రేక్ష కలదు. **''భగవతః ధామప్రసృత్యా శ్యామమ్''** ఇత్యాదిగా అన్యగుణసంక్రాంతి రూప తద్గుణాలంకారమును కలదు. ఇందు **''శ్యామమ్'', ''నీలమ్''** అని రెండు పదములు కలవు.

**''కృష్ణనీలాసితశ్యామకాలశ్యామల మేచకాః''** అను అమరకోశవచనము ప్రకారము ఆపాతతః ఈరెండును పర్యాయవాచకములుగా తోచును. కాని, ఆ కోశమునందే నానార్థవర్గములో **''త్రిషు శ్యామౌ హరిత్కృష్ణౌ''** అని యున్నందున పాచియొక్క పచ్చనివర్ణమువంటి రంగు శ్యామశబ్దముచే అభిప్రేతమని చెప్పనగును. శామమనుటచే అత్యంతనైల్యమును, నీలమనుటచే తెలుపుతో కూడిన నలుపును చెప్పబడినదని వేరొక వ్యాఖ్య. దీపశిఖాతుల్యవర్ణమును బభ్రువర్ణ మందురు. ఇది సుదర్శనుని తేజస్సుయొక్క సహజ సిద్ధమైన వర్ణము. **''శేషస్య''** అను పదముయొక్క అర్థస్వారస్యమునకు అనుగుణముగా **''శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిజ్గాశనమామ్ నిన్ఱాల్ మరవడియామ్ నీళ్‌కడలుళ్ ఫూమ్‌పట్టామ్ పుల్‌కు మణైయామ్ తిరుమాల్కురవు''** అను సరోయోగిసూక్తిని, దానిని అనుసరించు **''నివాసశయ్యాసన- పాదుకాంశుకోపధానవర్షాతప వారణాదిభిః శరీరభేదై స్తవ శేషతాం గతైః యథోచితం శేష ఇతీరితే జనైః''** అను యామునుల సూక్తిని స్మరింపనగును. ఆదిశేషుని వర్ణము **''దుగ్ధోదన్వద్ధవళ''** వర్ణముకదా ! సంస్కృత వ్యాఖ్యలో **''భగవతః''** అనుపదము **''ప్రకుంఠితనీలకంఠకంఠచ్ఛవేః''** అని, **''ధామన్''** పదమును **''నిర్జితనీలోత్పలనీలమేఘనీలశిలాకాంతేః''** అని వివరింపబడినవి. భగవానుని దివ్యదేహవర్ణము నెమలి కంఠముయొక్క రంగువలె మెఱయునని ఉపనిషత్ భాష్యకారులగు శ్రీరంగరామానుజమునులు వివరించిరి.

''చిత్రాం వితానశ్రియం వ్యాతన్వానం చక్రభానం వః శర్మ ఉపచినుతాత్''

## శ్రీసుదర్శన జ్వాల మీ పాపాన్ని పోగొట్టాలి.

**6.** శంసంత్యున్మేష ముచ్చోషితపరమహసో భాస్వతః కైటభారేః
ఇంధే సంధ్యేవ నక్తంచరవిలయకరీ యా జగద్వందనీయా ।
బంధూకచ్ఛాయబంధుచ్ఛవిఘటితఘనచ్ఛేదమేదస్వినీ సా
రాథాంగీ రశ్మిభంగీ ప్రణుదతు భవతాం ప్రత్యహోత్థాన మేనః ॥

యా = ఏ, రశ్మిభంగీ = జ్వాలాప్రకారము, ఉచ్చోషితపరమహసః = చంద్రుడు మొదలగు గ్రహములయొక్క తేజస్సును కబళీకరించునట్టి, భాస్వతః = సూర్యునియొక్క, ఉన్మేషమ్ = ఉదయమును, శంసంతీ = తెలుపునట్టి, సంధ్యేవ = ప్రాతః సంధ్యవలె, ఉచ్చోషిత పరమహసః = మిగిలిన పదార్థములన్నిటియొక్క తేజస్సును లేకుండచేయు, కైటభారేః = భగవానునియొక్క, ఉన్మేషమ్ = శోభాతిశయమును, శంసంతీ = ప్రకాశింపచేయునదియై, నక్తంచరవిలయకరీ = రాత్రియందు సంచరించు దుష్టజంతువులయొక్క (రాక్షసులయొక్క) నాశనమును చేయునదియై, బంధూకచ్ఛాయబంధుచ్ఛవిఘటిత = మంకెనపూల కాంతివంటి కాంతితో



కూడికొనినవగు, ఘనచ్ఛేదమేదస్వినీ = మేఘశకలములచే దట్టమైనదియై, ఇంధే = ప్రకాశించుచున్నదో, సా = ఆ సుదర్శనజ్వాల, భవతామ్ = మీకు, ప్రత్యహోత్థానమ్ = ప్రతిదినము సంభవించు, ఏనః = పాపమును, ప్రణుదతు = పోగొట్టును గాక !

శ్రీసుదర్శనభగవానుని జ్వాలావైఖరిని శ్లేషాలంకారప్రక్రియలో ప్రాతః సంధ్యగా వర్ణించుట ఇందలి ప్రధానాంశము.

ప్రాతః సంధ్య మిగిలిన జ్యోతిఃపదార్థముల కాంతిని అంతటిని అణగదొక్కునట్టి సూర్యుని ఉదయమును సూచించును. అట్లే, శ్రీసుదర్శనుని జ్వాల **''ఉచ్చోషితపరమహసః కైటభారే రున్మేషం శంసంతీ''**- అనగా ప్రత్యర్థుల తేజమును అంతటిని కబళీకరింపగల్గిన శ్రీరంగనాథుని ఉన్మేషమును- అనగా అఘటితఘటనాసామర్థ్యమును ప్రకాశింపచేయును. ప్రాతఃసంధ్య నక్తంచరవిలయకరి, ఎట్లనగా - రాత్రియందు తిరుగు క్రూరజంతువు లన్నియు ప్రాతః సంధ్యకాగానే లోపలకుపోవును. శ్రీసుదర్శనుని జ్వాలయు రాత్రియందు సంచరించు రాక్షసులను, అసురులను చూచినంతనే నాశనమొనర్చును. ప్రాతఃసంధ్య జగద్వందనీయ. అదెట్లన - **''సంధ్యాయై నమః''** అనునట్లు లోకములన్నియు ప్రాతః సంధ్యకు నమస్కరించును. శ్రీసుదర్శనుని జ్వాలయు **''వడివార్ శోది వలత్తుఱైయుమ్ శుడరాళి''** ఇత్యాదిగా అందఱిచే నమస్కరింపబడును. ప్రాతఃసంధ్యాసమయమున సూర్యుని ఎఱ్ఱని జ్యోతిస్సు అంతటను వ్యాపించుటచే ఆసమయమున ఆకాశముననున్న మేఘసమూహము తన సహజసిద్ధమైన నల్లని రంగును వీడి ఎఱ్ఱగా మారును. కావున మంకెనపూల కాంతితో పోలిన కాంతియగు సూర్యుని ప్రాభాతికకాంతితో కలసి ఎఱ్ఱనివై వెల్గునట్టి మేఘశకలములచే నిబిడమై ప్రాతఃసంధ్య ఉండును. శ్రీసుదర్శనుని జ్వాలయు అట్టిదే. బంధూకపుష్పము యొక్క కాంతితో పోలిన కాంతినికల సుదర్శనుని కిరణములు మిగిలిన సకలతేజస్సులను మించి, తామే అతిశయించి, అంతట వ్యాపించుటచే కాలమేఘములును తమకాంతిని పోగొట్టుకొని, సుదర్శనజ్వాలయొక్క ఎఱ్ఱదనమును పొందును. కావున **''బంధూకచ్ఛాయబంధుచ్ఛ విఘటితము''**లైన మేఘశకలములచే దట్టమై యున్నవి. ఇందుచే మేఘములను ఎఱ్ఱగా చేయగల్గిన జ్యోతిస్సుయొక్క అతిశయము సుదర్శనకిరణములకు ఉండుట తెలుపబడినట్లయినది. ఇట్లు సుదర్శనతేజస్సు ప్రాతఃసంధ్యాకాలముతో రూపసామ్యమును కల్గియుండుటను ఇంతవరకు తెలిపిన కవి, క్రియాసామ్యమును కల్గియుండుటను **''భవతః ప్రత్యహోత్థానమ్ ఏనః''** అనుచు తెలిపిరి. అనగా, **''మనసా వాచా హస్తాభ్యామ్ . . . . యత్ పాప మకార్షమ్. . . . యత్కించిత్ దురితం మయి . . . తత్ అవలుంపతు''** అని ప్రాతఃసంధ్యలో ప్రార్థించు నిత్యపాపనిబర్హణము అను కార్యమును శ్రీసుదర్శనజ్వాలయు చేయుచున్నదని భావము. **''బంధూకానామ్ ఛాయా''**,

**''బంధూకచ్ఛాయమ్''** అని అగును. ఇందులకు **''ఛాయాబాహుళ్యే''** (2-4-22) అనుపాణిని సూత్రము స్మార్యము. **''ఉచ్ఛోషితమ్''** అనుటకు **''కబలీకృతమ్, అథవా శుష్కీకృతమ్''** అని సంస్కృత వ్యాఖ్య.

**''భవతాం ప్రత్యహోత్థాన మేనః రాథాంగీ రశ్మిభంగీ ప్రణుదతు''**

---

## శ్రీసుదర్శన జ్వాల మీకు సంతోషాన్ని కల్గించాలి.

**7.** సామ్యం ధూమ్యాప్రవృద్ధ్యా ప్రకటయతి నభ స్తారకాజాలకాని
స్ఫౌలింగీ యాంతి కాంతిం దిశతి యదుదయే మేరు రంగారశంకామ్ ।
అగ్ని ర్మగ్నార్చి రైక్యం భజతి దిననిశావల్లభౌ దుర్లభాభౌ
జ్వాలావర్తా వివ స్తః ప్రహరణపతిజం ధామ వ స్త ద్ధినోతు ॥

యత్+ఉదయసమయే = ఏ సుదర్శనజ్వాల ఉదయించుకాలమునందు, నభః = ఆకాశము, ధూమ్యా ప్రవృద్ధ్యా = పొగసమూహముయొక్క గొప్ప అభివృద్ధితో, సామ్యమ్ = సామ్యమును, ప్రకటయతి = తెలుపుచున్నదో, తారకాజాలకాని = నక్షత్రసమూహములు, స్ఫౌలింగీమ్ = అగ్నికణములకు సంబంధించిన, కాంతిమ్ = ప్రకాశమును, యాంతి = పొందుచున్నవో, మేరుః = మేరుపర్వతము, అంగారశంకామ్ = కొఱవి కట్టె అను సందేహమును, దిశతి = కలుగుచేయుచున్నదో, అగ్నిః = అగ్ని, మగ్నార్చిః = అణగిన జ్యోతిస్సును కల్గినదై, ఐక్యం భజతి = (సుదర్శన భగవానుని జ్వాలల కంటె వేరుగా వెలుగలేనిదై దానితో) ఏక మగు స్థితిని పొందుచున్నదో, దిననిశావల్లభౌ = సూర్యచంద్రులు, దుర్లభాభౌ = తేజస్సును పోగొట్టుకొనినవారై, జ్వాలా వర్తౌ + ఇవ స్తః = జ్వాలయొక్క వలయమువలె నున్నవారో, తత్ = అట్టి, ప్రహరణపతిజం ధామ = శ్రీసుదర్శనునివలన జనించిన తేజస్సు, వః ధినోతు = మిమ్ములను సుఖింపచేయునుగాక!

శ్రీసుదర్శనభగవానుని జ్యోతి ఉదయించుకాలమున మిగిలిన తేజః పదార్థములన్నియు ప్రకాశమును కోల్పోయి, అసత్కల్పమగుటను కవి ఇందు తెలుపుట విశేషము. పలు తేజఃపదార్థములతో నిండి, ప్రకాశించు ఆకాశమండలము సుదర్శనచక్రజ్వాలముందు కాంతివిహీనమై, ''ఇది పొగసముదాయము'' అనునట్టి స్థితిని పొందినది. నక్షత్రసమూహము లన్నియు ''ఇవి క్షుద్రములైన అగ్నికణములు'' అనునట్లున్నవి. మేరుపర్వతము ''ఇది వెలుగు కొఱవి కట్టెయా!'' అని సందేహపడునట్లున్నది. (సగము కాలిన కట్టెకు, అగ్ని సంక్రాంతమైన కట్టెకును (మండునట్టి కట్టెకును) కాలి, ఆరినకట్టెకును అంగారమని పేరు. వీనిలో ఏ అర్థమునైనను ఇచట గ్రహింపవచ్చును.) అగ్ని తన ప్రకాశమునంతటిని పోగొట్టుకొని, సుదర్శన భగవానుని జ్వాలయందు అంతర్భావమును పొందినదే తప్ప తాను ఒక తేజఃపదార్థముగా



ప్రకాశించుటలేదు. ఇక సూర్యచంద్రులన్ననో, తమ తేజస్సు ఎచటికి పోయెనో తెలియని వారై, కాంతిని కోల్పోయి, చిన్నపిల్లలు ఆడు పూలపొట్లమువలె (నిప్పునెరసులను వెలువరించు పొట్లము రూపములో గుండ్రముగా నున్న బాణసంచా) తోచిరి. ఇట్లు సకల తేజఃపదార్థములను రూపుమాపి, అతిశయించి వెలుగునట్టి శ్రీసుదర్శనభగవానుని తేజస్సు మిమ్ములను సంతోషింపచేయునుగాక !

**''ధూమ్యా''** అనగా ధూమసమూహము. **''పాశాదిభ్యో యః''** **(4-2-49)** అను సూత్రముద్వారా ఈ రూపము నిష్పన్నము. **''పాశ్యా, వన్యా, వాత్యా''** ఇత్యాది రూపములు ఇట్టివే. **''తారకాజాలకాని''** అనుటకు **''క్షారకో జాలకం క్లీబే కలికః కోరకః పుమాన్''** అను అమరకోశవచనము ప్రకారము నూతనమైన మొగ్గవంటి నక్షత్రముల సమూహములను అర్థమును కూడ చెప్పనగును. **''అథ వా కోరకా ఇవ స్థితత్వాత్ జాలకానీత్యుచ్యంతే, తదా కోరకవత్ స్థితాని నక్షత్రాణీత్యర్థః''** అని సంస్కృతవ్యాఖ్య.

**''ప్రహరణపతిజం ధామ వ స్త ద్ధినోతు''**

---

## శ్రీసుదర్శన జ్వాల మీకు శత్రువినాశనాన్ని కల్గించాలి.

**8.** దృష్టే ఽధివ్యోమ చక్రే వికచనవజపాసన్నికాశే సకాశం
స్వర్భాను ర్భాను రేష స్ఫుట మితి కలయ న్నాగతో వేగతోఽస్య ।
నిష్టప్తో యై ర్నివృత్తో విధు మివ సహసా స్ప్రష్టు మద్యాఽపి నేష్టే
ఘర్మాంశుం తే ఘటంతా మహితవిహతయే భానవో భాస్వరా వః ॥

వికచనవజపాసన్నికాశే = అపుడే వికసించిన జపాపుష్పముతో పోలిన, చక్రే = శ్రీసుదర్శన భగవానుడు, అధివ్యోమ దృష్టే = ఆకాశమునందు కనుపించినవాడుకాగా, స్వర్భానుః = రాహువు, ఏషః భానుః = ఇతడు సూర్యుడు, స్ఫుటమ్ = (ఇది) స్ఫుటము, ఇతి కలయన్ = అని తలచువాడై, వేగతః = వేగముగా, అస్య సకాశమ్ ఆగతః = ఈ సుదర్శనుని సమీపమునకు వచ్చినవాడై, (ఆసమయమున), యైః = ఏ కిరణములచే, నిష్టప్తః సన్ = మిక్కిలి తపింపబడినవాడగుచు, నివృత్తః = తిరిగిపోయినవాడై, అద్య+అపి = ఈనాటికిని, ఘర్మాంశుమ్ = సూర్యుని, విధుమ్ ఇవ = చంద్రునివలె, సహసా స్ప్రష్టుమ్ = శీఘ్రముగా తాకుటకు, న+ఈష్టే = అసమర్థుడైయున్నాడో, తే = అట్టి, భాస్వరాః భానవః = మిక్కిలి వెలుగుచున్న సుదర్శన కిరణములు, వః = మీయొక్క, అహితవిహతయే = శత్రువినాశనముకొఱకు, ఘటంతామ్ = సమర్థములగునుగాక !

లోకమున చంద్రగ్రహణ, సూర్యగ్రహణములు రెండింటిలో రాహువు చంద్రుని

వేగముగా మింగును; సూర్యుని మెల్లగా మింగును. ఇందులకు కవి ఈ శ్లోకమున ఒక అద్భుతమైన కారణమును ఉత్ప్రేక్షించుచున్నారు. అపుడే వికసించిన జపాపుష్పమువలె ప్రకాశించు సుదర్శనభగవానుని ఒకానొక సమయమున చూచిన రాహువు ''ఇడుగో ! సూర్యుడు కనుపడినాడు. ఇతని గ్రహింతును'' అని తలచి సూర్యభ్రాంతివలన సుదర్శనుని సమీపమునకు వేగముగా వచ్చెను. నిజమునకు అతడు సూర్యుడుకాక, సుదర్శనభగవానుడగుటచే, ఆస్వామికిరణములచే మిక్కిలి తపింపబడి, వెనుకకు తిరిగి పోయిన రాహువు ఆ పిమ్మట నిజమైన సూర్యుని వద్దకుపోవుటకును భయపడి ''ఇతడు సూర్యుడే !'' అను నిస్సంశయవిపర్యయమగు నిశ్చయమును పొందినపిమ్మటనే అతనివద్దకు పోయెదము అని తలచి, చంద్రుని శీఘ్రముగా మింగునట్లు సూర్యునికూడ వేగముగా మింగలేక ఆలస్యమును చేయుచున్నాడు. కావున రాహువునకు సుదర్శనుని ప్రతాపము సహ్యమైన సూర్యప్రతాపమువలెకాక, మిక్కిలి అసహ్యమయ్యెను. ఇట్లు సూర్యుని ప్రతాపముకంటె అతిశయితమైన ప్రతాపమును కల్గినవాడై వెలుగుచున్న శ్రీసుదర్శనభగవానుని కిరణములు మీ శత్రువులను నిర్జించునుగాక! అనిభావము.

ఇందు రాహువు సూర్యుని మెల్లగా గ్రసించుటకు ఒక కారణమును ఉత్ప్రేక్షించుటచే హేతూత్ప్రేక్ష కలదు. **''వ్యోమ్ని అధివ్యోమ''** అని విగ్రహము. **''నిష్టప్తః''** అను పదమునకు **''నిశ్శేషమ్ యథాతథా తప్తః''** అను విగ్రహమును చెప్పనగును. రాహువు భయపడుటను సంస్కృతవ్యాఖ్యాత **''భల్లూకతాడితస్య భ్రాంత్యా ఇవ''** అని చమత్కరించుచు పల్కెను.

**''తే భాస్వరాః భానవః వః అహితవిహతయే ఘటంతామ్''**

## శ్రీసుదర్శన జ్వాల మీకు ప్రీతిని కల్గించాలి.

**9.** దేవం హేమాద్రితుంగం పృథుభుజశిఖరం బిభ్రతీం మధ్యదేశే
నాభిద్వీపాభిరామా మరవిపినవతీం శేషశీర్షాసనస్థామ్ ।
నేమిం పర్యాయభూమిం దినకరకిరణాదృష్టసీమః పరీత్య
ప్రీత్యై వ శ్చక్రవాలాచల ఇవ విలస న్నస్తు దివ్యాస్త్రరశ్మిః ॥

పృథుభుజశిఖరమ్ = బాగుగా బలసిన (బలిష్ఠములైన) భుజములు అను శిఖరములను కల్గిన, హేమ+అద్రితుంగమ్ = మేరుపర్వతమువలె ఉన్నతుడు అయిన, దేవమ్ = సుదర్శనపురుషుని, మధ్యదేశే = మధ్యభాగమునందు, బిభ్రతీమ్ = ధరించునది, నాభిద్వీప+ అభిరామామ్ = నాభి అను ద్వీపముచే అందమైనది, అరవిపినవతీమ్ = అరలు అను వనమును కల్గినది, శేషశీర్ష+ ఆసనస్థామ్ = ఆదిశేషుని తల అను ఆసనమునందున్నది, (కావుననే), పర్యాయభూమిమ్ = భూమియొక్క వేరొక రూపమును ధరించినది అగు (భూమితో పోలినదగు) నేమిమ్ = నేమిని, పరీత్య = చుట్టి, విలసన్ = వెల్గునదియై, దినకరకిరణాదృష్ట సీమః = సూర్యకిరణములు చూడని ప్రదేశమునుకల్గిన, చక్రవాలాచల ఇవ = లోకాలోకపర్వతము వలెనున్న, దివ్యాస్త్రరశ్మిః = శ్రీసుదర్శనభగవానుని జ్వాల, వః = మీకు, ప్రీత్యై అస్తు = ప్రీతికొఱకు అగుగాక !

శ్రీసుదర్శనభగవానుని నేమిని చుట్టి, ఆస్వామి జ్వాల వెలుగు ప్రకారమును చూడగా భూమినిచుట్టి లోకాలోకపర్వతము వెలుగుచున్నదని ఉత్ప్రేక్షింపదగినట్లున్నదని కవి పల్కుట ఇందలి విషయము. నేమిని భూమిగా రూపించుటకు తగిన ఉపపత్తులన్నియు పూర్వార్ధమున ప్రదర్శింపబడినవి.

శ్రీసుదర్శన భగవానుని నేమిని చుట్టి వెలుగుచున్న జ్వాలలను చూడగా భూమిని చుట్టి లోకాలోకపర్వతము ప్రకాశించుచున్నట్లు తోచుచున్నది. భూమి గొప్పశిఖరమును కల మేరుపర్వతమును తనయందు కల్గియున్నది. ద్వీపములను, అరణ్యములు మొదలగు వానిని కల్గి, ఆదిశేషునిపై నిలచి యున్నది. అట్లే, శ్రీసుదర్శనుని నేమియు నడుమలో శ్రీసుదర్శనపురుషుడను మేరుపర్వతమును కల్గియున్నది. ఆ పురుషుని బలిష్ఠములైన బాహువులే ఆపర్వత శిఖరములు. ఆపురుషుని నాభియే దీవి. అరములే వనము. భూమిని చుట్టి లోకాలోకపర్వతము ఉన్నది. అది సూర్యకిరణములు సోకని ప్రదేశము. చీకటితో నిండియుండును. ఇట్టి లోకాలోక పర్వతము వలెనున్న సుదర్శనజ్యోతి ఎల్లప్పుడు మీకు సంతోషమును కల్గించును గాక !

**''దినకరకిరణాదృష్టసీమః''** అను విశేషణముచే లోకాలోపర్వతమునకు దివ్యాస్త్రరశ్మితో నున్న సాదృశ్యము తెలుపబడినది. **''శేషశీర్షాసనస్థామ్''** అనుటకు తగినట్లు సుదర్శన యంత్రమున ఇట్టి స్థితి శాస్త్రోక్తము అగుట స్మరణీయము. ఇది ప్రత్యక్షసిద్ధమును. భూమిని చుట్టి లోకాలోకమను పర్వతము కలదనియు, ఆ పర్వతమునందు రవి కిరణములు సోకని ఒక భాగము కలదనియు పురాణప్రసిద్ధము. దివ్యాస్త్రరశ్మికిని, ఆ పర్వతమునకును సామ్యము శబ్దశ్లేష ద్వారా సాధింపబడినది. **''దినకరకిరణైః అదృష్ట సీమా యస్య సః''** అను విగ్రహము రెండిటి యందును సమన్వయించును. కాని అర్థమున భేదము కలదు. చక్రవాళపక్షమున సీమాశబ్దమునకు స్థలమని అర్థము. సూర్యకిరణములు ప్రవేశింపని ప్రదేశమే అది. దివ్యాస్త్రరశ్మి పక్షమున దాని అవధి సూర్యకిరణములచేకూడ చూడబడలేదు అని భావము. దీని

తాత్పర్యమేమనగా సూర్యకిరణములకంటెగొప్పది అని. ఉత్తుంగమైన వస్తువునకును అపరిచ్ఛేద్యము అన్నచో దానికంటె ఉన్నతమైనదనియే కదా అర్థము !

''దివ్యాస్త్రరశ్మిః చక్రవాలాచల ఇవ విలసన్ వః ప్రీత్యై అస్తు''

## సుదర్శనజ్వాల మీ అన్ని దుఃఖాలను తీర్చాలి

**10.** ఏకం లోకస్య చక్షు ర్ద్వివిధ మపనుదత్ కర్మ నమ్రత్రినేత్రమ్
దాత్రర్థానాం చతుర్ణాం గమయ దరిగణం పంచతాం షడ్గుణాఢ్యమ్ ।
సప్తార్చిశ్శోషితాష్టాపదనవకిరణశ్రేణిరజ్యద్దశాశం
పర్యస్తా ద్వ శ్శతాంగావయవపరిబృఢజ్యోతి రీతీ స్సహస్రమ్ ॥

లోకస్య = లోకమునకు, ఏకమ్ = అద్వితీయమైన (ముఖ్యమైన), చక్షుః = కన్నువంటిది, ద్వివిధం కర్మ అపనుదత్ = పుణ్యపాపరూపమైన రెండు విధములగు కర్మలను పోగొట్టునది, నమ్రత్రినేత్రమ్ = శివునిచే నమస్కరింపబడినది, చతుర్ణామ్ అర్థానాం దాతృ = నాల్గుపురుషార్థములను ఇచ్చునది, అరిగణమ్ = శత్రుగణమును, పంచతాం గమయత్ = నాశనముచేయునది, షడ్గుణ+ ఆఢ్యమ్ = జ్ఞానము, శక్తిమొదలగు ఆఱుగుణములను పూర్ణముగా కల్గినది, సప్త+ అర్చిస్+శోషిత+ అష్టాపదనవకిరణశ్రేణిరజ్యద్దశాశమ్ = అగ్నిలో దహింపబడిన బంగారమువంటి నూతనములైన కిరణముల సమూహముచే ఎఱ్ఱబడిన పది దిక్కులను కల్గినది, శత+ అంగ+ అవయవ పరిబృఢజ్యోతిః = శ్రీసుదర్శనభగవానుని తేజస్సు, వః = మీకు, సహస్రమ్ ఈతీః = పలు దుఃఖములను అన్నిటికిని, పర్యస్తాత్ = పోగొట్టును గాక !

లోకమునకు నేత్రమువంటిది, పుణ్యపాపములను రెండు విధములైన కర్మములను నశింపచేయునది, త్రినేత్రుడగు శివునిచే నమస్కరింపబడునది, ధర్మార్థకామమోక్షములను అనుగ్రహించునది, శత్రువుల సమూహములను నశింపచేయునది, జ్ఞానము, శక్తి మొదలగు ఆఱుగుణములను నిండుగా కల్గినది, అగ్నిలో దహింపబడిన బంగారము వలె ఎఱ్ఱగా మెఱయునట్టి కిరణములతో పదిదిక్కులయందు వ్యాపించియున్నదగు శ్రీసుదర్శనుని జ్యోతిస్సు మిమ్ములను రక్షించునుగాక !

ఈ శ్లోకమునందు **''ఏకమ్, ద్వి, త్రి''** ఇత్యాదిగా మొదటి సంఖ్యమొదలు పదివరకుకల అంకెలపదములు, నూఱు, వేయి సంఖ్యల వాచకములు కూర్పబడియుండుట గమనింపతగినది. దీనిని అనుసరించుచు వేదాంతదేశికులు గరుడపంచాశత్ స్తోత్రమున **''ఏకో విష్ణోః ద్వితీయస్త్రిచతురవిదితం పంచవర్ణీరహస్యం, షాడ్గుణ్యాస్మేరసప్తస్వరగతి రణిమాద్యష్ట-సంపన్నవాత్మా, దేవో దర్వీకరారి ర్దశశత పవనారాతి సాహస్రలక్షైః విక్రీడత్ పక్షకోటిః విఘటయతు భయం వీతసంఖ్యోదయో నః''** అను శ్లోకమును రచించిరి. ప్రస్తుతశ్లోకమున కవి వేయితో నిలుపగా, దేశికుల శ్లోకమున అంతకంటె మించి లక్ష, కోటియు కూర్పబడుట విశేషము. ప్రస్తుతమున **''అరిగణం పంచతాం గమయత్''** అనుచోట అయిదు అను సంఖ్యకు, **''నవకిరణ శ్రేణి. . .''** అనునపుడు తొమ్మిది అను అంకెకును అర్థమున సాక్షాత్ స్ఫూర్తి లేకున్నను, స్థూలదృష్టిలో **''శబ్దతః సంఖ్యాప్రతీతి''** కలదని చెప్పనగును. **''తిరువెழுకూర్ఱిరుక్కై''** అను పరకాలసూరి ప్రబంధమునందును ఇట్టి ప్రక్రియను కాననగును.

**''ఏకం లోకస్య చక్షుః''** అనునపుడు **''చక్షు ర్దేవానా ముత మర్త్యానామ్''**, **''దివీవ చక్షు రాతతమ్''** ఇత్యాది సంస్కృతవేదసూక్తులను, **''కణ్ణావా నెణ్ణుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు''**, **''కణ్ణా యేழுలకుక్కుమ్''** ఇత్యాదిగానున్న ద్రావిడ వేదసూక్తులను స్మరింపనగును. ఈ సూక్తులు భగవానునిగూర్చి ప్రతిపాదించు అర్థమును కవి సుదర్శనభగవానుని పట్ల అనుసంధించిరి. **''ద్వివిధం కర్మఅపనుదత్''** అనునపుడు పాపమును మాత్రమే నశింపచేసికొనవలయును కాని, పుణ్యమును పోగొట్టుకొనవలసిన అవసరమేమి ? అను ప్రశ్న కలుగవచ్చును. పాపము నరకావహము అయినట్లే, పుణ్యమును స్వర్గాదిక్షుద్రఫల ప్రాపకము. వీనిలో ఒకటి ఇనుపగొలుసువంటిది కాగా, రెండవది బంగారు సంకెలవంటిది. కావున ఈ రెండును త్యాజ్యములే. శ్రుతియు **''తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి''** అని పల్కుచు మోక్షాధికారికి రెండు విధములైన కర్మలు తొలగవలెనని తెలిపినది. **''శార్న్ద ఇరు వల్ వినైకళుమ్ శరిత్తు''** అని పల్కిరికదా ఆழ்వార్లు కూడా. పుణ్యముకూడ పాపశబ్దవాచ్యమే అనుటను శ్రుతప్రకాశికాచార్యులవారు శ్రీభాష్యములోని లఘుసిద్ధాంతమును వివరించునపుడు తెలిపి, ఇందులకు ఉపోద్బలకముగా శ్రుతిని ఉదాహరించుచు ఇట్లనిరి - **''శ్రుతి శ్చ దుష్కృతేన సహ పూర్వనిర్దిష్టం సుకృత మపి పాప్మశబ్దేన నిర్దిశంతీ నిగమయతి- నైతం సేతు మహోరాత్రం తరతో న జరా న మృత్యుః న శోకో న సుకృతం న దుష్కృతం, సర్వే పాప్మానోఽతో నివర్తంతే - ఇతి.''**

(శతాంగావయవపరిబృఢజ్యోతిః) - ''శతాంగ స్స్యందనో రథః'' అను అమరకోశవచనము ప్రకారము శతాంగశబ్దము రథమును తెలుపును. దాని అవయవములలో చక్రము పరిబృఢము- అనగా గొప్పది.

(ఈతీః సహస్రమ్) - ఈతిబాధలు ఆఱు. అవి ''అతివృష్టి రనావృష్టిః మూషకా

**శ్శలభా శ్శుకాః, అత్యాసన్నా శ్చ రాజానః షడేతా ఈతయ స్స్మృతాః''.** ఇచటి ఈతిశబ్దము ఈ ఆరింటినేకాక, అన్ని విధములైన బాధలకును ఉపలక్షణము. అనగా పీడాసామాన్యవాచకము. దేశికుల సుదర్శనాష్టకములోని **''భువననేత్ర''** అను ప్రయోగమునకు ప్రస్తుతశ్లోకములోని **''లోకస్యచక్షుః''** అనుసూక్తి మూలమని చెప్పనగును.

''శ్వతాంగావయవపరిబృఢజ్యోతిః వః సహస్రమ్ ఈతీః పర్యస్తాత్''

## శ్రీసుదర్శన తేజస్సు మిమ్మలను కాపాడాలి.

**11.** ఉచ్చండే యచ్ఛిఖండే నిబిడయతి నభః క్రోడ మర్కో-ఽటతి ద్యామ్
అభ్యస్య ప్రౌఢతాపగ్లపితవపు రపో బిభ్రతీ రభ్రపంక్తీః ।
ధత్తే శుష్యత్సుధోత్సో విధు రపమధునః క్షౌద్రకోశస్య సామ్యం
రక్షం త్వస్త్రప్రభో స్తే రచితసుచరితవృష్టయో ఘృష్టయో వః ॥

ఉచ్చండే = (శత్రువుల విషయమున) మిక్కిలి తీవ్రమైన, యత్+శిఖండే = ఏ సుదర్శశన కిరణముల శిఖాప్రదేశము (సుదర్శనసంబంధమైన జ్వాలాసమూహము), నభః క్రోడమ్ = ఆకాశమధ్యభాగమును, నిబిడయతి (సతి) = నిబిడముగా చేయునదికాగా, అర్కః = సూర్యుడు, ప్రౌఢతాప గ్లపితవపుః సన్ = మిక్కిలితాపముతో బాధింపబడిన శరీరమును కలవాడై, ఆపః బిభ్రతీః అభ్రపంక్తీః = నీటిని ధరించియున్న మేఘముల సమూహములను, అభ్యస్య = మాటిమాటికి అవగాహించి, ద్యామ్ అటతి = ఆకాశమున సంచరించుచున్నడో, విధుః = చంద్రుడు, శుష్యత్సుధోత్సః = ఎండిన అమృత ప్రవాహమునుకలవాడై, అపమధునః క్షౌద్రకోశస్య = తేనెలేని తేనెపట్టుయొక్క, సామ్యమ్ = పోలికను, ధత్తే = ధరించుచున్నాడో, అస్త్ర ప్రభోః = (భగవానుని) దివ్యాయుధములకు అధిపతి అగు శ్రీసుదర్శనునియొక్క, తే = ఆ, రచితసుచరిత వృష్టయః = పుణ్యసమృద్ధిని కలుగచేయగల్గినవగు, ఘృష్టయః = కిరణములు, వః = మిమ్మలను, రక్షంతు = రక్షించునుగాక !

**''వళరొళియకనలాళ్ళి''** అనునట్లు మిక్కిలిగాజ్వలించు శ్రీసుదర్శనునియొక్క జ్వాలాగ్రము ఆకాశమున అంతట దట్టముగా వ్యాపింపగా, ఆకాంతియొక్క తాపము సోకి మిక్కిలి వాడిన సూర్యుడు తాపశాంతికొఱకు నీటిని గ్రహించిన మేఘమండలములలో మాటిమాటికి ప్రవేశించి, తద్ద్వారా తాపమును పోగొట్టుకొని, తిరిగి తన కర్తవ్యమును చేయగల్గినవాడయ్యెను. సూర్యుని గతి ఇట్లున్నది. ఇక చంద్రుని గూర్చి అన్నచో -

**(ప్రౌఢతాపగ్లపితవపుః)** – ఈ విశేషణము చంద్రునకు అన్వయింపనగును. తన



అమృతరసమంతయు ఎండినవాడై, తేనెలేని తేనెపట్టువంటివాడయ్యెను. ప్రసిద్ధులైన తేజోమూర్తులగు సూర్యచంద్రులను ఇట్టి అవస్థను పొందింపగల్గినట్టి గొప్పతనమును కల శ్రీసుదర్శనుని కిరణములు మిమ్మలను రక్షించునుగాక !

**'ఉత్స'** మనగా ప్రవాహము . **'' ఉత్సః ప్రస్రవణం వారిప్రవాహమ్''** అని అమరము. **''మధ్వ ఉత్సః''** అనువైదిక ప్రయోగము ఇచట స్మరణీయము. **'వృష్టి'** అనగా సమృద్ధి.

''అస్త్రప్రభోః ఘృష్టయః వః రక్షంతు''

## శ్రీసుదర్శన జ్వాల మీకు గొప్ప ఆనందాన్ని ఇవ్వాలి.

**12.** పద్మౌఘో దీర్ఘికాంభస్యవనిధరతటే గైరికాంబుప్రపాతః
సిందూరం కుంజరాణాం దిశిదిశి గగనే సాంధ్యమేఘప్రబంధః ।
పారావారే ప్రవాలో వనభువి చ తథా ప్రేక్ష్యమాణః ప్రముగ్ధైః
సాధిష్ఠం వః ప్రమోధం జనయతు దనుజద్వేషిణ స్త్విషరాశిః ॥

దీర్ఘికాంభసి = బావుల నీటిలో, పద్మ+ ఓఘః = ఎఱ్ఱతామరల గుంపులుగా, అవనిధరతటే = పర్వత చఱియలలో, గైరిక +అంబుప్రపాతః = ధాతుజలముల వాగులప్రవాహముగా, దిశిదిశి = ప్రతిదిశలో, కుంజరాణామ్ = దిగ్గజముల, సిందూరమ్ = సిందూర చూర్ణముగా, గగనే = ఆకాశమున, సాంధ్యమేఘప్రబంధః = సంధ్యాసమయములోని మేఘసమూహముగా, పారావారే = సముద్రమున, ప్రవాళః = పగడముగా, వనభువి చ = అరణ్యభూమిలో, తథా = అట్లే (పల్లవముగా), ప్రముగ్ధైః ప్రేక్ష్యమాణః = ముగ్ధులచే దర్శింపబడు, దనుజద్వేషిణః = దనుజులను దండించు సుదర్శనునియొక్క, త్విషరాశిః = కిరణసమూహము, వః = మీకు, సాధిష్ఠమ్ = గొప్ప, ప్రమోదమ్ = ఆనందమును, జనయతు = కల్గించునుగాక !

శ్రీసుదర్శనభగవానుని జ్యోతిస్సమూహము సర్వదేశసర్వకాలవ్యాపి అనుటను అందమైన భ్రాంతిమదలంకారప్రయోగముద్వారా కవి తెలుపుట ఇందలి ప్రధానాంశము. బావులు, పర్వతముల చఱియలు, ఆకాశము, సముద్రము, అరణ్యము మొదలగు అన్నిచోట్ల సుదర్శనుని జ్యోతిస్సుయొక్క ప్రవాహము వ్యాపించియున్నది. కాని, ఈ నిజమును తెలియలేని ముగ్ధజనులు- ''ఇవి అన్నియు సుదర్శనుని తేజములే'' అనుటను గమనింపలేనివారై, ఒక్కొక్క చోట ఒక్కొక్క వస్తువుగా భ్రాంతిపడుచున్నారు. సుదర్శనుని కాంతి పుంజములను బావులలోని ఎఱ్ఱతామరపూవులుగా, పర్వతచఱియలో ధాతుజలప్రవాహముగా, గజముల

సిందూరచూర్ణముగా, ఆకాశములో సంధ్యాకాలమున విస్తరించి యున్న మేఘమండలముగా, సముద్రమున పగడముగా, అరణ్యములలో ఎఱ్ఱని చిగుళ్లుగా ముగ్ధులైన (అమాయకులైన) జనులు తలచుచున్నారు. (నిజమును గ్రహింపగల్గిన ఇట్లు భ్రమింపరు. ఎఱ్ఱతామరలు, గైరికాంబు ప్రపాతము, సిందూరము, ప్రవాళము మొదలగు వానిని సుదర్శన ప్రభాప్రసరములుగనే గ్రహింతురు అని తాత్పర్యము) ఈ శ్లోకమున అతిశయోక్తి అలంకారము కలదు.

మూడవ పాదమున **''తథా''** అనుటకు **''ప్రవాళః''** అను పదమును స్మరించి, దానికి అర్థమును వేరుగా చెప్పవలయును **''ప్రవాళోఽస్త్రీ కిసలయే వీణాదండే చ విద్రుమే''** అను నిఘంటువచనము ప్రకారము ప్రవాళశబ్దమునకు పగడమని, చిగురు అనియు అర్థము. **''సాధిష్ఠం వః ప్రబోధమ్''** అను పాఠాంతరము చివరి పాదమున కలదు. ప్రమోదమనగా సంతోషము. ప్రబోధ మనగా గొప్ప జ్ఞానము. సంస్కృతవ్యాఖ్యాత ఈ రెండుపాఠములను ఆదరించుచు **''పరమాత్మ స్వరూపజ్ఞానం, ప్రహర్షంచ జనయత్విత్యర్థః''** అని వివరించెను.

**(దనుజద్వేషిణః)** – దనుజద్వేషీ అనునది స్వామికి పేరు అయినట్లే, సుదర్శనకును ఆపేరు కలదు. **''సురద్విషాం ప్రాణవినాశీ''** కదా. **''త్విషాం సంబంధీ త్ర్వైషః, స చాసౌ రాశిశ్చ''** అని కాని, **''త్విషాం సమూహః త్వైషమ్, తస్య రాశిః''** అనికాని **''త్వైషరాశిః''** అనుసమాసమును వివరింపనగును. సమూహముయొక్క సమూహము అనుటవలన బాహుళ్యమే సిద్ధించును. సంస్కృతవాఖ్యలో **''దీర్ఘికాంభసి పద్మౌఘః కిమ్, అవనిధరతటేగైరికాంబుప్రపాతః కిమ్''** ఇత్యాదిగా శ్లోకమున అంతటా కాకుస్వరము అనుసంధింపదగునని తెలుపబడినది. దీనివలన ఎఱ్ఱతామరల గుంపా ? అను మొదలగు సందేహములు ఇచట తోచుటనుబట్టి, ఇట్టి సందేహాస్పదమైన సుదర్శనతేజము మీకు (గల అజ్ఞానమును పోగొట్టి) పరమాత్మ స్వరూపజ్ఞానము, మోదమును కల్గించునుగాక ! అని పల్కుట ఒక అద్భుత చమత్కారోక్తి.

**''త్వైషరాశిః సాధిష్ఠం వః ప్రమోదం జనయతు''**

## శ్రీసుదర్శనజ్వాల మీ సంసారమనే వ్యాధిని తీర్చాలి.

**13.** **భానో భా నో త్వదీయా స్ఫురతి కుముదినీ మిత్ర తే కుత్ర తేజః**
**తారాః స్థాఽఽరా దధీరోఽస్యనల న భవతః స్వైర మైరమ్మదార్చిః ।**
**శంసంతీత్థం నభఃస్థా యదుదయసమయే చక్రరాజాంశవ స్తే**
**యుష్మాకం ప్రౌఢతాపప్రభవ భవగదాపక్రమాయ క్రమంతామ్ ॥**

యత్+ ఉదయసమయే = ఏ సుదర్శనుని కిరణముల ఉదయకాలమునందు, నభఃస్థాః = ఆకాశముననున్న దేవగంధర్వాదులు, భానో = ఓ సూర్యుడా, త్వదీయా = నీకు సంబంధించిన, భాః = తేజస్సు, నో స్ఫురతి = (సుదర్శనుని తేజముముందు వెలుగుటలేదు అని సూర్యుని ఉద్దేశించి), కుముదినీమిత్ర = చంద్రుడా !, తే తేజః = నీ తేజస్సు, కుత్ర = ఎక్కడ ? (అని చంద్రున ఉద్దేశించి), తారాః = తారకలారా !, ఆరాత్ స్త = దూరమున నిలుపుడు (అని నక్షత్రములతో), అనల = అగ్నీ, అధీరః అసి = ధైర్యములేని వాడవైతివే ! (అని అగ్నితో), ఐరమ్మదార్చిః = మెఱపు యొక్కతేజమా !, భవతః = నీకు, స్వైరం న = వేరుగా వెలుగగల్గిన స్వాతంత్ర్యము లేదు (అని వజ్రాగ్నితేజస్సును ఉద్దేశించి), ఇత్థమ్ = ఇట్లు, శంసంతి = పల్కుచున్నారో, తే = అట్టి మహిమనుకల, చక్రరాజ+ అంశవః = సుదర్శనుని కిరణములు, యుష్మాకమ్ = మీకు, ప్రౌఢతాప = ప్రబలమైన తాపత్రయములకు, ప్రభవ = ఉత్పత్తిస్థానమగు, భవగద = సంసారమను వ్యాధియొక్క, అపక్రమాయ = నివారణకొఱకు, క్రమంతామ్ = పరాక్రమించునుగాక !

ఈస్తోత్రమున ఏడవశ్లోకములో ప్రతిపాదింపబడిన అర్థము ఇందు ప్రకారభేదమున వివరింపబడినది. సుదర్శనుని కిరణములు ఉదయించునపుడు ఆకాశమున దివ్యవిమానచారులగు దేవగంధర్వాదులు సూర్యుడు, చంద్రుడు మొదలగు తేజః పదార్థములను చూచి ఇట్లనుచున్నారు. '' ఓయీ ! సూర్యుడా ! నీతేజస్సు వెలుగలేక మఱుగు పడియున్నది చూడుము. చంద్రుడా ! నీతేజము ఎచటికి పోయినది ? నక్షత్రములారా ! ఇక మీరు దూరముగా నిలుపుడు. అగ్నిదేవా ! నిన్ను మేము గొప్పగా తలచి యుంటిమి. కాని ఇట్లు కాంతిని కోల్పోయి, వెలవెలపోయితివే ! ఓ మెఱపుయొక్క తేజమా ! నీవు సుదర్శనుని తేజమందు లయమును పొంది, రూపుమాసి, స్వతంత్రముగా వెల్గుస్థితిని పోగొట్టుకొంటివే తప్ప నీకు స్వతంత్రముగా వెలుగు శక్తిలేదుసుమా !'' అనుచు పల్కుచుండిరి. (నిజమునకు వారిట్లు పల్కుచుండిరా ? అనినచో, అట్లు పలుకకున్నను అట్లు పలుకవలసినట్లు సూర్యచంద్రాదుల స్థితి ఉన్నదనియే ఈసూక్తిలోని తాత్పర్యము.) అట్టి మహిమనుకల సుదర్శనుని కిరణములు మీ సకల దుఃఖములకు కారణమగు సంసారమను వ్యాధిని పోగొట్టునుగాక !

రెండవపాదమున **''తారాః స్థారాత్''** అనువేరొక పాఠముకలదు. అపుడు **''అసి – స్థః – స్థ''** అని లట్ మధ్యమపురుషబహువచన రూపముగా గ్రహింపనగును. ఇంతకంటె లోట్ మధ్యమ పురుష బహువచనరూపమే అర్థస్వారస్యమునకు అక్షరానుప్రాసకును సరిపోవును. పెద్దలు అనుసంధించు పాఠమును అదియే. అది **ఏధి, స్యాత్– స్తం– స్త** అనునది ఆరూపము. **''అర్చిశ్శబ్దో నపుంసకేఽపి వర్తతే, అభియుక్తైః ప్రయుక్తత్వాత్. అర్చి ర్వైష్ణవ మాసాద్య స్వగత శ్శత్రుసూదన''** అనుచు సంస్కృతవ్యాఖ్యాత అర్చిశ్శబ్దమును శ్రీరంగములోనే కాక నపుంసక

లింగములో కూడ నున్నదనెను. ఇది సకారాంతమే కాక, ఇకారాంతముకూడ. ఇందులకు అనుగుణముగా ''అగ్నేః భ్రాజంతే అర్చయః'' అనుచు అమరసుధాకారుని ఉదాహరణము గమనింపతగినది.

''చక్రరాజాంశవః తే భవగదాపక్రమాయ క్రమంతామ్''

## శ్రీసుదర్శన జ్వాల మీకు నిరంతరమైన వృద్ధిని ఇవ్వాలి.

**14.** **జగ్ధ్వా కర్ణేషు దూర్వాంకుర మరిసుదృశా మక్షిషు స్వర్వధూనామ్**
**పీత్వా శ్చాంభ శ్చరంత్య స్సవృష మనుగతా వల్లవేనాదిమేన ।**
**గావో వ శ్చక్రభర్తుః పర మమృతరసం ప్రశ్రితానాం దుహానాః**
**బుద్ధిం స్వాలోకలుప్తత్రిభువనతమసః సానుబంధాం దదంతామ్ ॥**

అరిసుదృశామ్ = శత్రుస్త్రీల (రాక్షసస్త్రీల), కర్ణేషు = చెవులలో (మంగళార్థముగా అలంకరింపబడియున్న), దూర్వాంకురమ్ = గఱిక పోచ మొలకను, జగ్ధ్వా = భక్షించి, స్వర్వధూనామ్ = దేవతల స్త్రీల, అక్షిషు = నేత్రములందు (వృద్ధిచెందుచున్న), అంభః = కన్నీటిని, పీత్వా = త్రాగి, సవృషం యథా తథా చరంత్యః = ధర్మమార్గమును విడువక వర్తించునవియు (గోవుల పక్షమున ఆబోతులతో పాటు తిరుగునవి), ఆదిమేన వల్లవేన = ఆది గోపాలుడగు భగవానునిచే, అనుగతాః = అనుసరింపబడినవి, ప్రశ్రితానామ్ = ఆశ్రయించినవారికి, పరం అమృతరసమ్ = గొప్పక్షీరరసమును (గొప్పమోక్షరుచిని), దుహానాః = స్రవించునవి (ఇచ్చునవియును) అగు, స్వాలోకలుప్త త్రిభువనతమసః = తమ ప్రకాశముచే ముల్లోకములలోని చీకటిని లేకుండచేయునవి (తనకటాక్ష వీక్షణముచే ముల్లోకములోని వారి అజ్ఞానమును పోగొట్టునవి) అగు, చక్రభర్తుః = చక్రరూపములోని స్వామియొక్క (చక్రమునకు భర్తయగు శ్రీకృష్ణభగవానునియొక్క), గావః = కిరణములు (గోవులు), వః = మీకు, సానుబంధామ్ బుద్ధిమ్ = విచ్ఛేదములేకుండగా పరంపరగా సంభవించు అభివృద్ధిని (సంపదను), దదంతామ్ = ఇచ్చునుగాక!

శ్రీసుదర్శనభగవానుని కిరణములను శ్రీకృష్ణభగవానుని గోవులతో రూపించుచు, అట్టి కిరణములు మీకు అవిచ్ఛిన్నమైన సంపదను ఇచ్చుగాక అని కవి పల్కుట ఇందలి ప్రధానాంశము. ఇందు కవి రూపణమును నిర్వహించిన తీరు పరమరమణీయము. ''**గౌః స్వర్గే చ బలీవర్దే రశ్మౌ చ కులిశే పుమాన్, స్త్రీ సౌరభేయీ దృగ్బాణాదివాగ్భూష్వప్సు భూమ్ని చ**'' అనుమేదినీకోశములోని ప్రమాణమును అనుసరించి గోశబ్దమునకుకల అర్థములలో గోవు



కిరణములను అర్థములను రెండిటిని ఏకకాలములో ఇచట వివక్షించి కవి ''**గావః**'' అనుపదప్రయోగమును చేసిరి ''**చక్రభర్తా**'' అనుపదమునకు శ్రీసుదర్శనస్వామి పక్షమున - ''**చక్ర శ్చాసౌ భర్తా చ**'' అనగా చక్రరూపములోనున్న స్వామి అని, భగవానుని పక్షమున ''**చక్రం బిభర్తి**'' అనగా చక్రమును ధరించువాడనియు అర్థములను చెప్పనగును. కావున ''**చక్రభర్తుః గావః**'' అను ఒకే ఉక్తివలన శ్రీసుదర్శనుని కిరణములు అను అర్థము, శ్రీకృష్ణ భగవానుని గోవులు అను వేరొకఅర్థమును స్ఫురించునట్లు కవి తమబుద్ధి వైలక్షణ్యముతో పదప్రయోగమును చేసిరి. ఈ రెండు అర్థములకు తగిన విధమున విశేషణములను కవి ప్రయోగించినతీరు అనితరసాధ్యము. **(అరిసుదృశామ్ కర్ణేషు దూర్వాంకురం జగ్ధ్వా, స్వర్వధూనామ్ అక్షిషు అంభః పీత్వా చ చరంత్యః)** - పశువులు గడ్డి (గఱిక) పోచ చిగుళ్లను తిని, నీటిని తాగి తిరుగును. శ్రీసుదర్శనుని కిరణములును అట్లే చేయుచున్నవి. అసురస్త్రీలు, రాక్షసస్త్రీలు తమ చెవులలో సౌమంగల్యాలంకరణముగా అలంకరించుకొనిన దూర్వాంకురములను భక్షించి, దేవతాస్త్రీల కన్నులలో ఊఱు శోకజలమును తాగి, సవిలాసముగా తిరుగుచున్నవని అర్థము. దీని సారమేమనగా రాక్షసస్త్రీలు విధవలు అగునట్లు, అనగా రాక్షసులు నశించునట్లుచేసి వారిచే బాధను పొందిన దేవజాతియొక్క దుఃఖమును తీర్చగల్గినవి శ్రీసుదర్శన భగవానుని కిరణములని. కంఠమున మంగళసూత్రమును ధరించునట్లే, చెవులలో దూర్వాలంకరణమును సుమంగలులగు స్త్రీలు చేసికొందురు. ఆ అలంకారము పోయినదనగా వారికి వైధవ్యము ప్రాప్తించెనని అర్థము. శత్రువులు చనిపోయినపిమ్మట దేవతాస్త్రీలు కన్నీరు విడచుటకు ప్రసక్తియే లేదు. కావున వారి కన్నీరు శ్రీసుదర్శనుని కిరణములచే తాగబడినదని ఉల్లేఖింపబడినది ''**సవృషమ్**'' అనునది ''**చరంత్యః**'' అను కరణక్రియకు విశేషణముగా అన్వయింపతగినది.

**(సవృషం చరంత్యః)** - వృషశబ్దమునకు వృషభమని, ధర్మమనియు రెండు అర్థములు కలవు. గోవులు వృషభముతో కలసి తిరుగును. శ్రీసుదర్శనుని కిరణములు ధర్మముతో సంచరించును. అనగా పాపులను నిరసించుట, ధర్మాత్ములను రక్షించుటయే. అధర్మయుద్ధమును తెలియని భగవానుని వలెనే అతని ఆయుధము అగు సుదర్శనమును ధర్మమును అనుసరించి పోరాడునని తాత్పర్యము.

**(ఆదిమేన వల్లవేన అనుగతాః)** - ఆదిగోపాలుడగు భగవానుని వెంట వచ్చుట గోవులకు, సుదర్శనుని కిరణములకును సమానము. ఇవి ప్రవేశించు చోటులలో అంతట భగవానుడును పోయినిలచును. భగవానుడు సర్వదేశవ్యాపి కదా. ఈ సర్వవ్యాపిత్వమునకు ఏనాటికి లోటు లేదు.

**(ప్రశ్రితానామ్ అమృతరసం దుహానాః)** ''**అమృతం యజ్ఞశేషే స్యాత్ పీయూషే సలిలే ఘృతే, అయాచితే చ మోక్షే చ**'' అనుమేదినీ కోశవచనమును బట్టి అమృతశబ్దమునకు కల

పలు అర్థములలో పాలు, మోక్షము అను రెండు అర్థములు ఇచట వివక్షితములు. గోవులు తమను పోషించువారికి పాలును ఇచ్చును. కిరణములు ముక్తిని ఇచ్చును.

**(స్వాలోకలుప్త త్రిభువనతమసః)** అనునది ప్రథమాబహువచనాంతముగా గ్రహించి, **''గావః''** అను పదమునకు విశేషణముగా కొందఱు అన్వయింతురు. షష్ఠ్యంతముగా గొని **''చక్రభర్తుః''** అనుటకు విశేషణముగా అన్వయించుట మిక్కిలి స్వరసము. మొదటి అన్వయమును సంస్కృత వ్యాఖ్యాత చూపెను.

**(స్వాలోకలుప్తత్రిభువనతమసః చక్రభర్తుః)** - ఆలోక మనుటకు ప్రకాశమునకు, చూపునకును పేరు. భగవానుడు తనకటాక్షవీక్షణముచే ముల్లోకములలోని తమస్సును హరించి, రక్షించును. శ్రీసుదర్శనుడు తన ప్రకాశములతో ముల్లోకములను రక్షించును. మొదటి అర్థమున తమస్సు అనగా చీకటి అని అర్థము. రెండవ అర్థమున అజ్ఞానమని అర్థము.

**(సానుబంధామ్ ఋద్ధిః దదంతామ్)** - ఐశ్వర్య పరంపరతో కూడియుండుట అనగా, విచ్ఛేదములేకుండ ఉండుట. శాశ్వతమని సారము. **''దదంతామ్''** - ఈ తిజంతరూపము **''డుదాఞ్- దానే''** అను ధాతువునుండి నిష్పన్నమైనది అని కొందఱు భ్రమించి, **''దదతామ్''** అని కదా ప్రయోగము ఉండియుండవలెను, **''దదంతామ్''** అని ఉండుటకు అవకాశములేదని తలతురు. కాని, భ్వాదులలో **''దద దానే''** అనువేరొక ధాతువు కలదు. దానియొక్క లోట్ లకారమున ప్రథమపురుష బహువచనాంతరూపము **''దదంతామ్''** అగును. **''దదతామ్- దదేతామ్- దదంతామ్''** అని ఆలకారములోని రూపములు ఉండును. కూరేశులు సుందరబాహుస్తవమున - **''స్వాభీష్టం మమ మద్గురో శ్చ దదసే నో కిమ్ వనాద్రీశ్వర''** అని ప్రయోగించిరికదా ! ''ఈ శ్లోకమున శ్రీకృష్ణభగవానుని గోవుల పరముగా ఒక అర్థము స్ఫురించునట్లు శబ్దవిన్యాసమును చేయుటకు ప్రయోజనము కవి తమ చమత్కారాతిశయమును తెలుపుటయే. ఇచట ధ్వనికలదా ? లేక ఉపమాలంకారమా ? శ్లేషయా ? ఏమని నిర్వహింపవలయును ?'' అని కొందరు పలుకవచ్చును. ఉపమాలంకారమును సూచించు ఇవాదిశబ్దప్రయోగము లేకుండటచే ఉపమ కాదు. మాఘకావ్యమున ద్వారకానగరవర్ణన సందర్భమున **''రమ్యా ఇతి ప్రాప్తవతీః పతాకాః రాగం వివిక్తా ఇతి వర్ధయంతీః, యస్యా మసేవంత సముద్వలీకాః సమం వధూభిః వలభీః యువానః''** అను శ్లోకమునందు వలెగూఢశ్లేషాలంకారమును చెప్పుటకును అవకాశములేదు. **''ఏతస్మిన్నధికపయః శ్రియం వహంత్యాః సంక్షోభం పవనభువా జవేన నీతాః, వాల్మీకే రరహితరామలక్ష్మణానాం సాధర్మ్యం దధతి గిరాం మహాసరస్య''** అనురైవతక వర్ణనశ్లోకములోవలె ఆక్షిప్తశ్లేషను చెప్పుటకును వీలులేదు. ఏల అన **'సమం, సాధర్మ్యమ్'** ఇత్యాది పదముల ప్రయోగము లేకుండుటచే. కావున ధ్వనియే అనవలెను- అని కొందఱు



పల్కుదురు. కాని, అట్లుకాదు. **''అయ మతిజరఠాః ప్రకామగుర్వీ రలఘు- విలంబిపయోధరోపరుద్ధాః, సతత మసుమతా మగమ్యరూపాః పరిణత దిక్కరికా స్తటీ బిభర్తి''** అనురైవతక శ్లోకములోవలె శ్లేషాంగకమైన సమాసోక్తి అలంకారము ప్రస్తుత శ్లోకమునంద కలదని చెప్పనగును. పూర్తిగా అప్రస్తుతమైన అర్థమును స్ఫురింపచేయుట చారుతాతిశయహేతువు అగును అను ఆలంకారిక సిద్ధాంత సంగ్రహమును ఇచట స్మరింపనగును.

''చక్రభర్తుః గావః సానుబంధామ్ ఋద్ధిం దదంతామ్''

## శ్రీసుదర్శన జ్వాల మీ జన్మజన్మల పాపాలను పోగొట్టాలి

**15.** సేనాం సేనాం మఘోనో మహతి రణముఖేఽలం భయం లంభయంతీః
ఉత్సేకోష్ణాలుదోష్ణాం ప్రథమదివిషదా మావలీ ర్యాఽవలీఢే ।
విశ్వం విశ్వంభరాద్యం రథపదధిపతే ర్లీలయా పాలయంతీ
వృద్ధి స్సా దీధితీనాం వృజిన మనుజను ర్మార్జయత్వార్జితం వః ॥

మహతి రణముఖే = గొప్పరణరంగమున, సేనామ్ = నాయకునితో కూడిన, మఘోనః = ఇంద్రుని యొక్క, సేనామ్ = సేనను, అలం భయం లంభయంతీ = మిక్కిలి భయమును పొందునట్టి, ఉత్సేక + ఉష్ణాలుదోష్ణామ్ = గర్వముచే శత్రువుల ప్రతాపమును సహింపలేక పోరాడుటకు తుళ్లిపడు బాహువులను కల్గిన, ప్రథమదివిషదామ్ = అసురుల, ఆవలీః = సమూహములను, యా అవలీఢే = ఏ సుదర్శనుని కిరణ సమృద్ధి కబళీకరించుచున్నదో, విశ్వంభరాద్యమ్ = భూమి మొదలగు, విశ్వమ్ = సమస్తలోకమును, లీలయా = విలాసముగా, పాలయంతీ = రక్షించునట్టి, సా = ఆ, రథపదధిపతేః = శ్రీసుదర్శనునియొక్క, దీధితీనాం వృద్ధిః = కిరణములసమృద్ధి, వః = మీయొక్క, అనుజనుః ఆర్జితం వృజినమ్ = అన్నిజన్మలలో కూడబెట్టిన పాపములను, మార్జయతు = పోగొట్టును గాక !

శ్రీసుదర్శన భగవానుని జ్వాలల సమృద్ధి మీ జన్మపరంపరలన్నిటి యందు పేరుకొని యున్న పాపములను పోగొట్టును గాక ! అనునది ఈ శ్లోకములోని సారాంశము. మొదటి రెండుపాదములలో అనిష్టనివృత్తిని చేయువిధమును, మూడవపాదమున ఇష్ట ప్రాపణమును నిర్వహించు విధానమును తెలుపబడినవి. సమర్థులైన నాయకులతో కూడిన ఇంద్రుని సేనను రణరంగమున భయమును పొందునట్లు చేసి, తిరుగు అసురులను కబళీకరించుచు, భూమిమొదలగు లోకములన్నిటిని అవలీలగా పాలించుచు శ్రీసుదర్శన భగవానుని జ్యోతి స్సమృద్ధి ప్రకాశించుచున్నది. అట్టి సమృద్ధి మీజన్మజన్మల పాపములను పోగొట్టునుగాక! అని తాత్పర్యము.

**''సేనా''** అనుటకు **''ఇనేన సహ వర్తత ఇతి సేనా''** అను విగ్రహమును చెప్పనగును. అనగా నాయకునితో కూడినదని అర్థము. **''ఇన స్సూర్యే ప్రభౌ''** అను అమరకోశవచనమును బట్టి ఇనుడనగా నాయకుడు. **''ఉత్సేకోష్ణాలు దోష్ణామ్''** – **''శీతోష్ణతృప్రేభ్యస్తదసహనే''** అను వార్తికమువలన **''ఆలు''** ప్రత్యయము వచ్చి **''ఉష్ణం న సహతే ఇతి ఉష్ణాలుః''** అని అగును. ఉత్సేకమనగా గర్వము. దాని వలన శత్రువుల ప్రతాపమును సహింపలేక, పోరాడుటకు తుళ్లిపడు బాహువులను అసురులు కల్గిన వారయ్యిరి. **''ప్రథమదివిషదామ్''** అనునది **''పూర్వదేవాః''** అను పదముయొక్క రూపాంతరము. **''పూర్వదేవా స్సురద్విషః''** అను నిఘంటువచనము చొప్పున ఈ పదము అమరవాచకముగుటచే ప్రస్తుత రూపమును అట్టిదే. ముందు దేవతలై యున్నను, పిమ్మట పాపాచరణమువలన భ్రష్టులై, అసురులయ్యిరని భావము. **''అవలీఢే''** అనుపదము **''అవ''** అను ఉపసర్గతోకూడిన **''లిహ–ఆస్వాదనే''** అను ధాతువునుండి పుట్టిన లట్‌రూపము. సంస్కృత వ్యాఖ్యలో **''విశ్వంభరాఢ్యం విశ్వమ్''** అను పాఠాంతరము ఆదరింపబడి, **''విశ్వంభరా ఆఢ్యా యస్య, విశ్వస్య తత్, విశ్వమ్ పృథివ్యాది భూతపంచాత్మకం జగత్కర్మ''** అని వ్యాఖ్యానింపబడినది. మఱియు ఆ శ్లోకవ్యాఖ్యచివరలో శ్లోకార్థ సంగ్రహమున- **''పంచభూతాత్మకమ్ విశ్వమ్''** అనియు ఈ అర్థము అనుసంధింపబడినది.

శ్రీసుదర్శన భగవానుని తేజము పాపములను పోగొట్టునను ప్రస్తుతశ్లోకార్థమునకు అనుగుణముగా తిరువాయ్‌మొళ్ళి లోని **''ఎన్‌శెయ్యతామరైక్కణ్''** (1-4-2) అను సూక్తిని వ్యాఖ్యానించుచు నమ్పిళ్లై - **''ఒరు ముళ్ళుక్కాలుమ్ ఇరణ్డుముళ్ళుక్కాలుమ్ పోకాదు కాణ్. తెళ్కాళ్వార్ కైయిల్ తిరువాళ్ యాలే విసైయైయెఱిత్తు క్కొణ్డుపోకిల్ అత్తనై యొళ్ళియ ఒన్ఱిరణ్డుముళ్ళుక్కాల్ పోకాదు కాణ్ నాన్ పణ్ణినపాపమ్ ఎన్ను''** అను ఐతిహ్యమును ఉట్టంకించుట అనుసంధేయము.

**''రథపదధిపతేః దీధితీనామ్ బుద్ధిః వః అనుజను ఆర్జితం వృజినం మార్జయతు''**

---

## శ్రీసుదర్శనజ్వాల మీకు మనోరథసిద్ధిని కల్గించాలి.

**16.** తప్తా స్వేనోష్మణేవ ప్రతిభటవపుషా మస్రధారా ధయంతీ
ప్రాప్తేవ క్షీబభావం ప్రతిదిశ మసకృత్ తన్వతీ ఘూర్ణితాని ।
వంశాస్థిస్ఫోటశబ్దం ప్రకటయతి పటూన్ యా౽౽వహంత్యట్టహాసాన్
భా సా వః స్యందనాంగప్రభుసముదయినీ స్పందతాం చింతితాయ ॥



స్యందనాంగప్రభుసముదయినీ = శ్రీసుదర్శనభగవానునివలనఉద్భవించిన, యా = ఏ, భాః = ప్రకాశము, స్వేన = తనయొక్క, ఊష్మణా = వేడిమిచే, తప్తా + ఇవ = తపింపబడిన దానివలె, ప్రతిభటవపుషామ్ = శత్రుభటుల శరీరములయొక్క, అస్రధారాః = రక్తధారలను, ధయంతీ = పానముచేయుచున్నదై, క్షీబభావం ప్రాప్తా ఇవ = (అందువలననే) మదమును పొందినదివలె, ప్రతిదిశమ్ = అన్ని దిక్కులలో, అసకృత్ = మాటిమాటికి, ఘూర్ణితాని = భ్రమణములను, తన్వతీ = విస్తరించునదియై (చేయునదియై), వంశ+అస్థి = (పృష్ఠభాగమునందలి) వెదుళ్లవంటి ఎముకలయొక్క, స్ఫోటశబ్దమ్ = పగులుటవలన కలుగు పటపటమను శబ్దమును, ఆవహంతీ (సతీ) = కల్గినదై, పటూన్ = గొప్ప, (కటువైన), అట్టహాసాన్ = అట్టహాసములను, ప్రకటయతి = ప్రకటించుచున్నదో, సా = ఆ, సుదర్శనుని ప్రకాశము, వః = మీయొక్క, చింతితాయ = కోరిన కార్యసిద్ధికొఱకు, స్పందతామ్ = స్పందించును గాక !

శ్రీసుదర్శనభగవానుని ప్రకాశము అసురరాక్షసులను ధ్వంసము చేయుచు, దిక్కులన్నిటియందు పెద్దశబ్దమును చేయుచు, భ్రమించుచు తిరుగుటను చమత్కారపూర్వకముగా ఉత్ప్రేక్షించుచు, వర్ణించుట ఇందలి విషయము.

లోకమున తీవ్రతాపముచే తపింపబడినవాడు చన్నీటి ధారను త్రాగుట సహజము. సుదర్శనభగవానుని ప్రకాశము అసురుల, రాక్షసుల శరీరములలోని రక్తమును పానీయధారను త్రాగుటకు కవి ఒకహేతువును శ్లోకమున **''తప్తా స్వేనోష్మణేవ''** అనుచు ఉత్ప్రేక్షించుచున్నారు. తనకు తాపమును కల్గింపగల్గిన వేరొక వస్తువు లోకమున లేదు. కావున తన ఔష్ణ్యము వలననే సుదర్శనుని తాపము తపింపబడినది కాబోలు. అది జలపానము వలన తీర్పగల్గిన తాపము కాకపోవుటచే, దానిని ఉపశమింపచేయుటకు రక్తపానముచేసి, ఉపశమింపచేయవలసి వచ్చినది.

**(ప్రాప్తేవ క్షీబభావం ప్రతిదిశ మసకృత్ తన్వతీ ఘూర్ణితాని)** - శ్రీసుదర్శనుని ప్రభ దిక్కు లన్నిటియందు భ్రమించుచు, తిరుగుటకు హేతువు ఈసూక్తి యందు ఉత్ప్రేక్షింపబడినది. రక్తధారను పానముచేసినవాడు ఊరకనే ఉండజాలడు కదా ! దానివలన కల్గిన మదాతిరేకముచే కనపడిన చోట అంతట తిరుగుచుండును. అట్లే ఈ సుదర్శన చక్రప్రకాశమును ప్రత్యర్థుల శరీరములనుండి స్రవించు రక్తధారలను పానము చేయుటచే మదమును పొందినది కాబోలు అనునట్లున్నది. లేనిచో ఇట్లు అన్నిదిక్కులలో భ్రమించుచు, తిరుగుటకు ప్రసక్తి ఏమున్నది ?

**(వంశాస్థిస్ఫోటశబ్దం ప్రకటయతి పటూన్ ఆవహంతీ అట్టహాసాన్)** - మధుపానా దులవలన మదమును పొందినవాడు అంతట తిరుగుచు, అకారణముగా అతడు పెద్దగా

అట్టహాసములను చేయుట సహజము. రక్తపానముచే మత్తెక్కిన సుదర్శనుని ప్రకాశమును అట్లే, భ్రమించుచు శత్రువుల శరీరములలోని ఎముకలను విరుగునట్లుచేసి, దానివలన పుట్టు పటపట ధ్వనుల రూపమున మాటిమాటికి అట్టహాసమును చేయుచున్నది. అనగా ఎముకలు విరుగునపుడు పుట్టుధ్వని అట్టహాస ధ్వనివలె ఉన్నది. ఇట్టి విధమున శత్రునిబర్హణకర్మపరికర్మిత మగు సుదర్శనప్రకాశము మీరు కోరిన మనోరథముల సిద్ధికి అనుకూలముగా స్పందించునుగాక!

**''చింతితాయ''** అనగా చింతించిన కార్యసిద్ధికొఱకు అని భావము. **''అస్రమస్రశ్రూణి శోణితే''** అను మేదినీవచనము ప్రకారము అస్రమనగా రక్తము. క్షీబభావమనగా మత్తెక్కిన వాని స్వభావము. **''వంశాస్థి''** అనునపుడు **''వంశవత్స్థితత్వాత్ వంశాస్థీత్యుచ్యతే''** అని సంస్కృత వ్యాఖ్య. వెదుళ్లవంటి (వెన్నెముకలోని) ఎముకలు అని దీనిభావము. **''వంశే వేణౌ కులే వర్గే పృష్ఠాద్యవయవేఽపి చ''** అను విశ్వనిఘంటువును బట్టి, వంశమనుటకు పృష్ఠాద్యవయవమను అర్థమును గ్రహించి, శరీరాధారభూతమైన పృష్ఠ భాగములోని ఎముకలను అను అర్థమును చెప్పనగును. **''పటు స్తీక్ష్ణే స్ఫుటే దక్షే నిష్ఠురే నిర్దయేఽపి చ''** అను రుద్రనిఘంటువువలన **''పటు''** అనుటకు నిష్ఠురమైన అని అర్థము. **''స్పందతామ్''** అను క్రియా ప్రయోగము మిగుల రమణీయము **''స్పది– కించిచ్చలనే''** అనుధాతువునుండి పుట్టిన ఈ క్రియ చక్రప్రభ కొంచెము కదలినను మీ కార్యసిద్ధి అగునను అర్థవిశేషమును తెలుపును.

**''స్యందనాంగప్రభుసముదయినీ భాః వః చింతితాయ స్పందతామ్''**

## శ్రీసుదర్శన జ్వాల మీ పాపాలనే దావాగ్నిని ఆర్పివేయాలి.

**17.** **దేవై రాసేవ్యమానో దనుజభటభుజాదండదర్పోష్మతప్తైః**
**ఆశారోధోఽతిలంఘీ లుఠదుడుపటలీలక్ష్యడిండీరపిండః ।**
**రింగజ్జ్వాలాతరంగత్రుటితరిపుతరువ్రాతపాతోగ్రమార్గః**
**చాక్రో వః శోచిరోఘః శ్శమయతు దురితాపహ్నవం దావవహ్నిమ్ ॥**

దనుజభటభుజాదండ = అసురవీరుల భుజదండములయొక్క, దర్ప+ ఊష్మతప్తైః = మదము అను ఉష్ణముచే తపింపబడిన, దేవైః = దేవతలచే, ఆసేవ్యమానః = అవగాహింపబడుచున్నదియు, ఆశారోధః+ అతిలంఘీ = దిక్కులను తీరములను అతిక్రమించునదియు, లుఠత్ + ఉడుపటలీ = పొర్లునట్టి నక్షత్రసమూహములు అను, లక్ష్య = వ్యాజముతో, డిండీరపిండః = నుఱుగు సమూహమును కల్గినదియు, రింగత్+ జ్వాలాతరంగ = మెఱయునట్టి జ్వాలలు అను తరంగములచే, త్రుటిత = త్రుంచబడిన, రిపుతరువ్రాత = శత్రువులనెడి వృక్షముల సమూహముల,



పాత = పతనముచే, ఉగ్ర = భయంకరమైన, మార్గః = మార్గమును (దారిని) కల్గినదియు, చాక్రః = సుదర్శనచక్రమునకు సంబంధించినదియు అగు, శోచిరోఘః = జ్వాలాప్రవాహము, వః = మీయొక్క, దురిత+ అపహ్నవమ్ = పాపవ్యాజమును పొందిన, (పాపములను), దావవహ్నిమ్ = దావాగ్నిని, శమయతు = ఆర్పునుగాక!

శ్రీసుదర్శన భగవానుని జ్వాలా ప్రవాహమును ఒక గొప్ప జలప్రవాహముగా కవి ఇందు రూపించుచున్నారు. జలప్రవాహమునకుగల స్వభావములను సుదర్శనుని కిరణసమూహము అందును అన్వయించునట్లు నాల్గు విశేషణములు ప్రయోగింపబడినవి.

**(దనుజభటభుజాదండదర్పోష్మతప్తైః దేవై రాసేవ్యమానః)** - ఔష్ణ్యముచే తపింపబడిన జనులు జలప్రవాహమునందు స్నానమాడుదురు కదా! అట్లే, అసురభటులయొక్క దండములవంటి భుజముల మదముచే తాపమును పొందిన దేవతలచే సుదర్శనుని జ్వాలాప్రవాహము అవగాహింపబడుచున్నది. అసురులు భుజములను చఱచుకొనుచు, మదముతో వారి మీదకు వచ్చినపుడు దేవతలకు సుదర్శనుని కిరణములను శరణుజొచ్చుట కంటె వేరుగతి లేదుకదా!

**(ఆశారోధోఽతిలంఘీ)** - మహా ప్రవాహము తీరమును అతిక్రమించి ప్రవహించును. సుదర్శనజ్వాలాప్రవాహముకూడ దిగంతములను తీరములను దాటి, సర్వదిక్కులపై వ్యాపించుచున్నది.

**(లుఠదుడుపటలీలక్ష్యడిండీరపిండః)** - మహా ప్రవాహమునందు నుఱుగుల సమూహము దట్టముగా నుండును. దిగంతములను దాటి ప్రవహించు సుదర్శనజ్వాలా ప్రవాహమునందు నక్షత్రసమూహములు వేగముగా పొర్లునపుడు అవి నుఱుగు సమూహముగా కన్పట్టుచున్నది.

**(రింగజ్జ్వాలాతరంగత్రుటితరిపుతరువ్రాతపాతోగ్రమార్గః)** -గొప్ప ప్రవాహము తన అలల వృద్ధిచే తీరముననున్న పలు వృక్షములను కూలద్రోసి, దారిని అంతటిని భీకరముగా చేయును. అట్లే, సుదర్శనజ్వాలాప్రవాహమును తళతళమని మెఱయు తన జ్వాలలు అను అలలచే శత్రు సమూహముల శరీరములను వృక్షములను కూలగొట్టి, దారిని అంతటిని భయంకరముగా చేసినది. కావున ఇట్టి సమానధర్మయోగముచే మహాజలప్రవాహము అని భావింపతగిన సుదర్శనకిరణ సమూహము తాను చేయతగిన పనిచేయునుగాక! అని భావము. అది ఏమనగా -

**(దురితాపహ్నవం దావవహ్నిం శమయతు)** - మహాప్రవాహము అరణ్యములో జ్వలించు దావాగ్నిని శమింపచేయును. మీ పాపములను అట్టి దావాగ్నిగా తలంపుడు. అగ్ని

వస్తువుల రూపమును నశింపచేయునట్లే పాపములు మిమ్ములను నశింపచేయును. కావున పాపమను పేరును మాత్రముకల్గి, నిజమునకు దావాగ్ని అనదగిన మీ దురితములు ఉపశమింపవలెను. ఆపనిని సుదర్శనజ్వాలా ప్రవాహముచేయును గాక! అని భావము.

**''దురితాపహ్నవమ్''** అనుటకు పాపమనుపేరుతో మఱుగుపఱచి చెప్పబడినదని అర్థము. **''లురదుడుపటలీ''** అనుపుడు లక్ష్య శబ్దము వ్యాజార్థకము. **''వ్యాజోఽపదేశో లక్ష్యం చ''** అని అమరకోశవచనము. **''రింగత్''** అనుపదము **''రిగి-గతౌ''** అను ధాతువునుండి పుట్టినది. **''శోచిరోఘః''** అనునపుడు ఓఘమనగా ప్రవాహము. **''ఓఘో బృందేఽంభసామ్ రయే''** అని అమరము. ఇచట వేరొక అర్థమగు సమూహమును గ్రహింపతగినదే. సంస్కృత వ్యాఖ్యాత **''తేజస్సమూహః''** అనుచు ఈ అర్థమును చూపెను. ఇట్లు రెండర్థములు అన్వయించునట్లు ప్రయోగించుట సంస్కృతభాషలో కూడ కలదు. అపహ్నవమనగా ఆవరణము, అనగా అడ్డు అనియు చెప్పనగును.

**''చాక్రః శోచిరోఘః వః దురితాపహ్నవం శమయతు''**

## శ్రీసుదర్శన జ్వాల మీకు గొప్ప మంగళాన్ని కల్గించాలి.

**18.** భ్రామ్యంతీ సంశ్రితానాం భ్రమశమనకరీ చ్ఛన్నసూర్యప్రకాశా
సూర్యాలోకానురూపా రిపుహృదయతమస్కారిణీ నిస్తమస్కా ।
ధారాసంపాతినీ చ ప్రకటితదహనా దీప్తి రస్త్రేశితు ర్వః
చిత్రా భద్రాయ విద్రావితవిమతజనా జాయతా మాయతాయ ॥

భ్రామ్యంతీ (అపి) = తాను భ్రమించుచున్నను (తాను గిరగిరతిరుగుచున్నను), సంశ్రితానామ్ = ఆశ్రితులయొక్క, భ్రమ = భ్రమను, శమనకరీ = శమింపచేయునది, చ్ఛన్నసూర్యప్రకాశా (అపి) = సూర్యుని వెలుతురును మఱుగుపఱచుచున్నదైనను, సూర్యాలోకానురూపా = సూర్యప్రకాశమునకు అనుకూలమైనది (సూరిజనుల అనగా విద్వాంసుల ప్రకాశమునకు అనుకూలమైనది), నిస్తమస్కా (అపి) = తన యందు తమస్సులేనిదైనను, రిపుహృదయ = శత్రువుల హృదయములందు, తమస్కారిణీ = తమస్సును కల్గించునది (అజ్ఞానమును కల్గించునది), ధారాసంపాతినీ (అపి) = గొప్పవర్షమును కల్గినదైనను, (తన అగ్రభాగముతో వ్యాపించు స్వభావమును కల్గినదైనను), ప్రకటితదహనా = అగ్నిని వెలువరించునదియు, (అత ఏవ = కావుననే, ఇట్టి విపరీతస్వభావములను కల్గియుండుటచే), చిత్రా = విచిత్రమైనదై, విద్రావితవిమతజనా = శత్రుజనులను వెన్నుచూపునట్లు చేయునదియగు, అస్త్ర+ ఈశితుః = ఆయుధప్రభువగు సుదర్శనునియొక్క, దీప్తిః = కాంతి, వః = మీకు, ఆయతాయ భద్రాయ =



గొప్ప మంచికొఱకు, జాయతామ్ = అగుగాక!

విరోధాభాసాలంకార ప్రక్రియలో రచింపబడిన ఈ శ్లోకములోని ఉక్తి చమత్కారము అనితరసాధారణము.

**(భ్రామ్యంతీ సంశ్రితానాం భ్రమశమనకరీ)** - లోకమున భ్రమలేని వాడై, ప్రమాత్మక జ్ఞానమును కలవాడే ఇతరుల భ్రమను పోగొట్టి, స్వచ్ఛమైన జ్ఞానమును కల్గింపకలడు. తాను భ్రమించువాడు తన శిష్యుల భ్రమను పోగొట్టగల్గుట అరుదైన విషయము. కావున తాను భ్రమను కల్గియుండుట (స్వస్య భ్రమవైశిష్ట్యము), తన శిష్యుల భ్రమనివర్తకత్వమును (స్వశిష్యభ్రమనివర్తకత్వము) అను రెండును సమానాధికరణ ధర్మములై యుండనేరవు. అనగా, ఒకే వ్యక్తియందు ఉండుటకు అవకాశములేదు. సుదర్శన ప్రకాశము అట్లుకాక, అట్టి వ్యధికరణ ధర్మములకు స్వయముగా అధికరణమైయుండుట విశేషము. నిజమునకు అది అట్టిదా ? అనినచో, కానేకాదు. **''భ్రామ్యంతీ''** అను పదమునకు ఒకవస్తువును వేరొక వస్తువుగా గ్రహించుట అను బుద్ధిభ్రమ అను అర్థము వివక్షితము కాదు. భ్రమణమనగా గుండ్రముగా తిరుగుట. శత్రువులున్న ప్రదేశములందు అంతట చుట్టి, తిరుగునని దీనియొక్క భావము. ఈ అర్థమును గ్రహించినచో, **''సంశ్రితానాం భ్రమశమనకరీ''** అను ప్రయోగము విరుద్ధముగా భాసింపదుకదా! ఇచట అర్థశ్లేషకలదు. **''శుఴలిన్ శక్కరమ్'', ''కలఙ్గియ శక్కరమ్'', '' ఎప్పోదుమ్ కైకళలా నేమి''** ఇత్యాదిగా దివ్యసూరులు సుదర్శనముయొక్క పరిభ్రమణ స్వభావమును కీర్తించిరి కదా!

**(చ్ఛన్నసూర్యప్రకాశా సూర్యాలోకానురూపా)** - సూర్యప్రకాశమును మఱుగు పఱచునట్టి వస్తువును సూర్యప్రకాశమునకు అనుకూలముగా నున్నదని పల్కుట అర్థమున విరుద్ధము. ఇచట విరోధపరిహారము ఎట్లనగా - **''సూర్యాలోకానురూపా – సూర్యస్య ఆలోకః సూర్యాలోకః, తస్య అనురూపా''** అని గ్రహించిన కదా అర్థమున విరోధము స్ఫురించుట. అట్లు కాక, **''సూరీణామ్ ఆలోకః సూర్యాలోకః, తస్య అనురూపా''** అను విగ్రహమును గ్రహించినచో, పండితులకు గొప్ప జ్ఞానమును కల్గింపగల్గిన అని అర్థము ఏర్పడును. ఇట్టి అర్థమును గ్రహించినపిమ్మట **''చ్ఛన్నసూర్యప్రకాశా''** అనునది, **''సూర్యాలోకానురూపా''** అనునదియు పరస్పర విరుద్ధముగా స్ఫురింపవుకదా! ఇచట సభంగ శబ్దశ్లేష.

ఇక, సుదర్శన ప్రకాశము సూర్యప్రకాశమును మఱుగుపఱచిన వృత్తాంతము ఏది ? అనగా - మహాభారత యుద్ధములో 13వ దినమున అర్జునుని కుమారుడగు అభిమన్యుని దుర్యోధనుని సోదరికి భర్తయగు సైంధవుడు సంహరించెను. అట్లు తన కుమారుని చంపిన జయద్రథుని మరునాడు సూర్యాస్తమయము అగుటకుముందు తాను చంపలేకపోయినచో అగ్నిలోదూకి, ప్రాణత్యాగమును చేయుదునని అర్జునుడు, భీషణ శపథమును చేసెను. దానిని

వినిన శత్రువులు పదునాల్గవదినమున పగటిసమయమున జయద్రథుని బయటకు రానీయక సేనమధ్యలో మఱుగు పఱచి కాపాడుచుండిరి. అర్జునుని శపథము నిష్ఫలమగును కదా ! అని చింతించిన శ్రీకృష్ణభగవానుడు సూర్యుని అతడు అస్తమించుటకు కొన్నిగడియలకు ముందు తన సుదర్శనచక్రముతో మఱుగుపఱచెను. అపుడు అంతట చీకటి అలముకొనగా, అర్జునుడు అగ్నిప్రవేశమును చేయుటను సంతోషముతో చూచుటకై దుర్యోధనాదులతో సైంధవుడు వచ్చి నిలచెను. అంత శ్రీకృష్ణుడు సుదర్శనచక్రమును ఉపసంహరింపగా, ఇంకను పగటికాలమగుటచే వెంటనే అర్జునుడు జయద్రథుని తలను ఖండించెను- అను కథ ఇచట అనుసంధేయము. **''నాళ్గికైకూఱిట్టుక్కొత్తునిన్ఱ అరశర్కళ్ తమ్ ముకప్పే, నాళ్గికైపోకప్పడై పొరుదవన్ తేవకితన్ శిఱువన్''** అని పెరియాళ్వార్లు ఈకథను అనుసంధించిరి.

**( నిస్తమస్కా రిపుహృదయతమస్కారిణీ )** - స్వయముగా తమశ్శూన్యుడగు వాడు ఇతరులకు తమస్సును కల్గించెననుట విరుద్ధముకదా ! ఇచట తమస్సు అనగా అజ్ఞానము. విరోధపరిహారమెట్లు అనిన - **''నిస్తమస్కా''** సుదర్శనము స్వయముగా దీప్తిస్వరూపమగుటచే చీకటిలేనిది. **''రిపుహృదయతమస్కారిణీ''** శత్రువుల మనస్సులలో భయమను అంధకారమును కల్గించుటచే, భయము ఇచట తమశ్శబ్దముచే చెప్పబడినది. ఇట్లు అర్థమును గ్రహించినచో నిస్తమస్కత్వము, రిపుహృదయ తమస్కారిత్వమును విరుద్ధర్మములు కావు కదా ! కావున **''రిపు హృదయ తమస్కారిణీ అపి నిస్తమస్కా''** అని యథాతథముగా అన్వయించుటలో ఎట్టి విరోధము లేదు.

**( ధారాసంపాతినీ చ ప్రకటితదహనా )** - **''ధారాసంపాత ఆసార''** అను అమరకోశవచనము చొప్పున ధారాసంపాతమనగా గొప్ప వర్షము. దానిని కల్గియున్నప్పుడు దహనప్రకటనము అనగా అగ్నిని వెలువరించుట విరుద్ధము. ధారాసంపాతిత్వము, ప్రకటితదహనత్వమును విరుద్ధధర్మములు కదా ! వానిని ఇచట సమానాధికరణములుగా పల్కుట విరుద్ధము. ఇక విరోధపరిహారము ఎట్లనగా - **''ధారాసంపాతినీ- ధారయా సంపతితుమ్ శీలమస్యా అస్తీతి ధారాసంపాతినీ''** - ధార అనగా అంచు. దానితో శత్రువుల పైపడు స్వభావమును కల్గినదని అర్థము. లేక, **''ధారా సైన్యాగ్రమస్కంధే తురంగగతిపంచకే''** అను మేదినీకోశ ప్రమాణానుసారము ధార అనగా సేనాముఖము అను అర్థమును గ్రహింపవచ్చును. అపుడు సేనాముఖమున ప్రవేశించి, దానిపైపడి, అగ్నిని వర్షించునది అని అర్థము. ఇందుచే అర్థమున విరోధము తొలగినది.

**( చిత్రా )** - అపాతప్రతీతి యందు విరుద్ధధర్మములకు అధికరణమై తోచుటవలన భాసించు వైచిత్రి దీనిచే సూచింపబడినది.

**( విద్రావితవిమతజనా )** - ఇట్టి అతిశయములను కల్గిన దగుటచే శత్రుజనము భయపడి, వెనుకంజవేయుచు, వెన్నుచూపుచు, పరుగెత్తునట్లుండును. కావున ఈశ్లోకము ద్వారా



చెప్పబడినదేమనగా - శత్రువులున్నచోట్లలో ఎల్లెడల భ్రమించుచు, సంచరించునది, తనను ఉపాసించువారి అన్యథాజ్ఞానమును పోగొట్టునది, జయద్రథ సంహారసందర్భమున సూర్యప్రకాశమును మఱుగు పడునట్లుచేసినది, పండితులకు గొప్ప జ్ఞానమును కల్గింపగల్గినది, శత్రువుల హృదయములలో ఎల్లప్పుడు భయజ్వరమును నెలకొల్పగల్గినది, స్వయముగా జ్యోతిరూపమైనది, తన అగ్రభాగముతో ( అంచుతో ) శత్రువులపైపడు స్వభావమును కల్గినది, అగ్నినివర్షించునదియు, విచిత్రశక్తిని కల్గినది, శత్రువులను పాఱిపోవునట్లు చేయునదియు అగు శ్రీసుదర్శన ప్రకాశము మీకు దీర్ఘకాలస్థాయి అగు మంగళము కల్గించుగాక - అని. ఇట్టి విరోధాభాసాలంకార రీతిలోనే 94వ శ్లోకము **''కోణే క్వాఽపి స్థితోఽపి త్రిభువనవితతః''** ఇత్యాదిగా రచింపబడి యుండుటను గమనింపవచ్చును.

**''అస్త్రేశితుః దీప్తిః వః భద్రాయ జాయతామ్''**

## శ్రీ సుదర్శనజ్వాల మీకు ఉన్నతమైన శుభాన్ని ఇవ్వాలి.

**19.** నిన్యే వన్యేవ కాశీ దవశిఖిజటిలజ్యోతిషా యేన దాహమ్
కృత్యా వృత్త్యా విలిల్యే శలభసులభయా యత్ర చిత్రప్రభావే ।
రుద్రేఽప్యద్రే ర్దుహిత్రా సహ గహనగుహాం యద్భయా దభ్యయాసీత్
దిశ్యా ద్విశ్వార్చితో వ స్స శుభ మనిభృతం శౌరిహేతిప్రతాపః ॥

దవశిఖిజటిలజ్యోతిషా = దావాగ్ని వలె దీర్ఘములైన ( జడలవంటి ) జ్యోతిస్సును కల్గిన, యేన = ఏసుదర్శనుని ప్రతాపముచే, కాశీ = కాశీనగరము, వన్యా+ ఇవ = వన సమూహామువలె, దాహమ్ = దహనమును, నిన్యే = పొందెనో, చిత్రప్రభావే = ఆశ్చర్యకరమైన వైభవమును కల్గిన, యత్ర = ఏ సుదర్శనుని ప్రతాపమునందు, కృత్యా = ( కాశీరాజపుత్రునియొక్క, లేక, దుర్వాసమునియొక్క ), కృత్య, శలభసులభయా = మిడుతలకు సులభమైన, వృత్త్యా = వృత్తిచే, విలిల్యే = నశించిపోయెనో, యద్భయాత్ = ఏసుదర్శనుని ప్రతాపము వలన ఏర్పడినభయముచే, రుద్రః + అపి = శివుడును, అద్రేః దుహిత్రా సహ = హిమవంతుని కుమార్తె అగు పార్వతితోపాటు, గహనగుహామ్ = లోపలకుపోవుటకు వీలుకాని పర్వతగుహలోనికి, అభ్యయాసీత్ = పరుగెత్తిపోయెనో, సః = అట్టి, విశ్వార్చితః = అందఱిచే అర్చింపబడిన, శౌరిహేతిప్రతాపః = భగవానుని ఆయుధమగు సుదర్శనుని ప్రతాపము, వః = మీకు, అనిభృతమ్ = ఉత్తుంగమైన, ( లేక ), శాశ్వతమైన, శుభమ్ = మంగళమును, దిశ్యాత్ = ఇచ్చునుగాక !

శ్రీసుదర్శనుని విక్రమాతిశయమును ప్రపంచించు పౌరాణిక కథలను ప్రస్తుతించుట ద్వారా తత్ప్రభావమును కవి తెలుపుట ఇందలి విషయము.

**(నిన్యే వన్యేవ. . . .దాహమ్)** - కాశీనగరము దహింపబడిన వృత్తాంతము క్లుప్తముగా ఇట్లున్నది. ఒక పర్యాయము పౌండ్రకవాసుదేవుడను ఒక ప్రభువుతో మూఢులైన రాజులు కొందఱు - ''నీవే నిజమైన వాసుదేవుడవు. శ్రీకృష్ణుడు కాదు'' అని పొగడిరి. వారి మాటలకు భ్రమించి, తానే వాసుదేవుడని నమ్మిన పౌండ్రకుడు, తన వక్షమున శ్రీవత్సమువంటిగుర్తు ఏర్పడుటకై కాల్చుకొనెను. శంఖచక్రములు కిరీటము మొదలగు వానిని కృత్రిమముగా నిర్మింపచేసి, వానిని ధరించి, తన సేవకులలో ఒకనిని పిలచి ఇట్లనెను - ''నీవు శ్రీకృష్ణుని వద్దకుపోయి ''నేను వాసుదేవుడనై యుండగా నీవు నావలె శంఖచక్రములను ధరింపరాదు. ఈనాటినుండి వానిని విడువుము. లేనిచో నాతో యుద్ధముచేసిగెలువుము. అపుడు ధరింపవచ్చును అని నామాటగా అతనికి వినిపింపుము.'' - పౌండ్రకునిమాటలను అతని సేవకుడు శ్రీకృష్ణునకు తెలియజేసెను. అంత కోపించిన శ్రీకృష్ణభగవానుడు గరుడుని అధిరోహించి, పౌండ్రకుని ఎదిర్చి, సుదర్శనచక్రముతో అతని శిరస్సును ఖండించెను. ఇట్లు పౌండ్రకుడు హతుడగుటను చూచిన అతని సహచరుడగు కాశీరాజు శ్రీకృష్ణుని చంపవలెనని ప్రయత్నించి, పోరాడెను. శ్రీకృష్ణుడు తన శార్ఙ్గముతో ప్రయోగించిన బాణములద్వారా కాశీరాజు తలను నఱికి, అది కాశీపట్టణములో పడునట్లుచేసెను. దానిని చూచిన కాశీరాజపుత్రుడు తన తండ్రితలను శ్రీకృష్ణుడు ఖండించినట్లు తెలిసికొని, పరమశివుని ఆరాధించి, అతని అనుగ్రహమును బడసి -**''స వవ్రే భగవన్ కృత్యా పితృహంతు ర్వధాయ మే, సముత్తిష్ఠతు కృష్ణస్య త్వత్ప్రసాదాత్ మహేశ్వర''** (వి.పు. 5-54-31) అనునట్లు తన తండ్రిని వధించిన శ్రీకృష్ణుని చంపునట్టి కృత్యను శివుని అనుగ్రహముతో పొందవలెనను వరమును వేడెను. శివుడును అతనికి అట్టి వరమును ఇచ్చెను. తత్ఫలితముగా కృత్యను పొందిన కాశీరాజపుత్రుడు దానిని శ్రీకృష్ణునిపై ప్రయోగించెను. ఆకృత్య ద్వారకను చేరి, జనులను బాధింపసాగెను. దాని ఆగడములను వినిన శ్రీకృష్ణుడు తాను జూదమాడుచునే తన ఆయుధరాజమగు సుదర్శనమును ఓరకంటితో సాభిప్రాయముగ చూచెను. భగవానుని మనస్సును గ్రహించిన సుదర్శనము ఆ పిశాచిని తఱిమికొట్టి, కాశి వరకుపోయి, ఆకృత్యను, దానిని అనుసరించివచ్చిన గణములను, కాశీపట్టణమును ఒక క్షణకాలములో దహించెను. పిమ్మట శ్రీకృష్ణునివద్దకు తిరిగివచ్చెను. శ్లోకములోని రెండవపాదమున ప్రస్తుతింపబడిన **''కృత్యా వృత్త్యా విలిల్యే శలభసులభయా యత్ర చిత్రప్రభావే''** అను వృత్తాంతముకూడ పై ఉపాఖ్యానమున అంతర్భవించియున్నది. కృత్య అనగా అభిచారహోమమువలన పుట్టినదేవతావిశేషము. పిశాచాదిరూపము.

ద్వితీయ పాదమున ప్రస్తుతమైన కృత్యవృత్తాంతము అంబరీషోపాఖ్యానమున దుర్వాసమునిచే ప్రయోగింపబడిన కృత్యను గూర్చి తెలుపుచున్నదనియు చెప్పవచ్చును అని



కొందఱు అందురు. అదియు ఇచట సంగతమే అయినను అపుడు ప్రకృతశ్లోకమున ఒకే కథ ప్రస్తుతమైనదిగా చెప్పవీలులేదు. అభిజ్ఞులగు పెద్దలు ప్రకృతశ్లోకమును ఏకకథాశరీరకముగానే భావించిరి. కాని, **''స్మృతస్య ఉపేక్షానర్హత్వాత్''** అనున్యాయమున ఈ సందర్భమున స్మరణకు వచ్చు అంబరీషోపాఖ్యానములోని కృత్యవృత్తాంతము ఇట్లున్నది. సూర్యవంశమున జన్మించిన అంబరీషచక్రవర్తి శ్రీకులశేఖరసూరి వలె రాజ్యభోగములందు పరమవిరక్తుడై, భగవద్భాగవత ప్రవణశిఖామణియై యుండెను. అతని భక్తికి మిక్కిలి ప్రీతుడైన భగవానుడు తన సుదర్శనమును అతని గృహమున నుండి, అతనికి వలసిన రక్షణమును చేయుమని నియమించెను. ఇట్లుండగా, ఆరాజు ఒక పర్యాయ ము ఒక సంవత్సరకాలము ద్వాదశీ వ్రతమును అనుష్ఠించి, సంవత్సరాంతమున ద్వాదశీతిథియందు అసంఖ్యాకులైన బ్రాహ్మణులకు దక్షిణను ఇచ్చి, వారి అనుమతిని పొంది, పారణను చేయబోవుసమయమున దుర్వాసుడను ముని అతిథిగా వచ్చెను. మహర్షి అతిథియై వచ్చెనను గొప్ప సంతోషముతో అంబరీషుడు ఆమునిని ఆహ్వానించి, పారణను చేయుటకు రావలసినదిగా ఆహ్వానించెను. ఆముని 'అట్లే' అని అంగీకరించి, మాధ్యాహ్నిక అనుష్ఠానమును ముగించుకొని త్వరగా వచ్చెదనని పల్కి, యమునా నదీతీరమునకు పోయెను. ఎంతసమయమైనను మహర్షి తిరిగిరాకపోవుటచే, ద్వాదశీతిథి పూర్తి అగుటకు ముందు పారణను చేయవలసియున్న అంబరీషుడు కాలాతీతము అగునని, అట్లు కాలాతీతమైనచో సంవత్సరకాలముగా అనుష్ఠించిన ద్వాదశీవ్రతము నిష్ఫలమగునని భయపడి, ఏమి చేయవలెనో తెలియని వాడయ్యెను. అతడు తన ధర్మసంకటస్థితిని ధర్మశాస్త్రకోవిదులగు పెద్దలకు నివేదించి, తన కర్తవ్యమును గూర్చి అడుగగా, వారు - **''అపోశ్నాంతి తన్నైవాశితం నైవానశితం న క్షోధుకో భవతి''** అను వేదవాక్యమును అనుసరించి జలపారణమును చేయుట ద్వారా వ్రతమును పరిసమాప్తి చేయుమని పల్కిరి. అంబరీషుడును అదేవిధముగా జలమును పారణచేసి, వ్రతమును ముగించి, దుర్వాసమహర్షి రాక కొఱకు నిరీక్షించుచుండెను. చిరకాలము ధ్యానమున మునిగియున్న దుర్వాసుడు సావకాశముగ అనుష్ఠానమును ముగించుకొని వచ్చెను. అంబరీషుడు జలపారణమును చేసి, వ్రతపరిసమాప్తిని కావించెనని గుర్తించి అతడు మిక్కిలిగా కోపించి, తన జటలలో ఒక జటను తీసి, దానితో కాలాగ్ని సదృశయైన ఒక కృత్యను సృష్టించి అంబరీషునిపై ప్రయోగించెను. తనను చంపుటకు పైపైకి వచ్చుకృత్యను చూచినను ఏమాత్రము భయమును పొందక, అతడు భగవానుని ధ్యానించుచుండెను. ఆ ప్రభువును రక్షించుటకై ముందుగా భగవానునిచే ఆదేశింపబడిన సుదర్శనము క్షణకాలములో ఆకృత్యను దహించి, అంతటితో ఆగక, దుర్వాసమునిని కూడ బాధించుటకై అతనిపైకి వచ్చెను. దుర్వాసుడు భయపడి పరుగెత్తెను. సుదర్శనము అతనిని వెన్నంటి తఱిమెను. అతడు ఎచటికి పోయినను అతనిని విడువక సుదర్శనము వెంటాడసాగెను. భగవానుని శరణము పొందినను ఫలితములేకుండెను.

చివరకు అంబరీషుని పాదములందు పడిన తప్ప తనకు రక్షణ కలుగదని గుర్తించిన దుర్వాసుడు ఆప్రభువు పాదములపై పడి, తనను క్షమింప ప్రార్థించెను. అంతటితో సుదర్శనము అతనిని విడచి, వెనుదిరిగి పోయెను.

**(రుద్రోఽప్యద్రేః దుహిత్రా . . . . . అభ్యయాసీత్)** – ఈ ప్రయోగముద్వారా అనుసంధింపబడిన వృత్తాంత వివరమును గూర్చి స్పష్టముగా తెలియుటలేదు. ఇతిహాస పురాణములను పరిశీలించినను ఎట్టి వివరమును లభింపలేదు. ప్రాజ్ఞులైన పెద్దల నడిగి తెలియదగిన అంశములలో ఇదియొకటి. అయినను కూరేశవిజయ గ్రంథములోని 14వ శ్లోకమున - **''చక్రత్రాసాత్ ద్రుతత్వా దపి న పశుపతి ర్విష్ణు రేవ ప్రకృష్టః''** అను సూక్తిని వ్యాఖ్యానించుపెద్దలు ఒకరు **''సుదర్శన మమోఘం చ జానన్ మతిమతాం వరః, తత్ప్రతాపాభి సంతప్తః పలాయన పరాయణః, నిర్జగామ పురా ద్రాజన్ దేవ్యా సార్థ ముమాపతిః, స నందీశగణేశాద్యైః సఖిభూతైః సమావృతః, యోజనానాం శతోద్దేశే బహుతాళవనే శుభే, తదాఽస్తే భగవాన్ శంభుః శతం సంవత్సరం నృప''** ఇత్యాది హరివంశశ్లోకములను ఉట్టంకించుచు, రుద్రుడు సుదర్శనమునకు భయపడి కాశీనగరమునుండి పారిపోయెనని వివరించుటనుబట్టి, ప్రకృతశ్లోకమునందలి కాశీదహనకథా సమభివ్యాహార బలమును బట్టి **''రుద్రోఽప్యద్రేః దుహిత్రా''** ఇత్యాదిగా ప్రస్తుతింపబడిన కథను కొంతవరకు ఊహింపవీలున్నది. కాశీరాజ పుత్రునిచే ప్రయోగింపబడిన కృత్య రుద్రుని అనుగ్రహమువలన జనించినదిగా శ్రీవిష్ణుపురాణాదులలో చెప్పబడియుండుటచే, తన అనుగ్రహమున పుట్టిన ఆకృత్య ఏవిధముగా జయమును పొందునో చూడవలెనను ఉద్దేశ్యముతో రుద్రుడు వచ్చి చూచుచుండెను. ద్వారకనుండి సుదర్శనచక్రము ఆకృత్యను తఱుముకొని వచ్చుచుండుటను గమనించిన అతడు తనకును ఉపద్రవమేర్పడునని శంకించి, అచట నిలువక పరుగెత్తి పోయి, పర్వతగుహలో దాగికొనెను -అని ఈ విధముగా ప్రస్తుతవృత్తాంతమును ఊహింపనగును. ఇది పురాణరత్నములో తెలుపబడకపోయినను, పురాణాంతరములలో ప్రసక్తమై యుండియుండవచ్చును. లేక, ఆకాలమున శివుడు పరుగెత్తి, తన ప్రాణమును కాపాడుకొని యుండునని కవియొక్క అభిప్రాయమని చెప్పినను తప్పులేదు. పురాణాంతరములలో ఎక్కడో ఒకచోట ఈకథ తెలుపబడియుండవచ్చునేమో ?

**(అనిభృతం శుభం దిశ్యాత్)** - శాశ్వతమైన శుభమును ఇచ్చుగాక అని భావము. నిభృతమనగా అస్తమయాసన్నమని అర్థము. రఘువంశములోని 8వ సర్గలో **''నభసా నిభృతేందునా తులా ముదితాఽర్కేణ సమారురోహ తత్''** (15శ్లో) అనుచోట నిభృత శబ్దమిట్లే వ్యాఖ్యానింపబడినది. అనిభృతమనగా చిరస్థాయి అని అర్థము. అనిభృతమనుపదమును



క్రియావిశేషణముగాకూడ అన్వయింపవచ్చును. సంస్కృతవ్యాఖ్యాతయు అట్లే అన్వయించెను.

''శౌరిహేతిప్రతాపః వః అనిభృతం శుభం దిశ్యాత్''

---

## శ్రీసుదర్శనుని జ్వాల మీకు దిగంత విశ్రాంతకీర్తిని ఇవ్వాలి.

**20.** ఉద్యన్ బింబా దుదారా న్నయనజలహిమం మార్జయన్ నిర్జరీణామ్
అజ్ఞానధ్వాంతమూర్చాకరజనిరజనీభంజనవ్యంజితాధ్వా ।
న్యక్కుర్వాణో గ్రహాణాం స్ఫురణ మపహర న్నర్చిషః పావకీయాః
చక్రేశార్కప్రకాశో దిశతు దశ దిశో వ్యశ్నువానం యశో వః ॥

ఉదారాత్ బింబాత్ = గొప్ప బింబమునుండి, ఉద్యన్ = ఉదయించునట్టిది, నిర్జరీణామ్ = దేవతాస్త్రీల, నయనజలహిమమ్ = కన్నీరు అను మంచును, మార్జయన్ = తుడుచునది, అజ్ఞానధ్వాంత = అజ్ఞానమను చీకటిని, మూర్చాకర = వృద్ధినొందించు, జనిరజనీ = జన్మ (సంసార) మను రాత్రిని, భంజన = భగ్నముచేయుటచే, వ్యంజిత+ అధ్వా = వ్యక్తము చేయబడిన మార్గమును కల్గినది, గ్రహాణామ్ = గ్రహములయొక్క, స్ఫురణమ్ = ప్రకాశమును, న్యక్కుర్వాణః = తిరస్కరించునది, పావకీయాః = అగ్నికి సంబంధించిన, అర్చిషః =కాంతులను, అపహరన్ = అపహరించునదియు అగు, చక్ర+ ఈశ+ అర్క ప్రకాశః = శ్రీసుదర్శనుడను సూర్యుని ప్రకాశము, వః = మీకు, దశదిశః = పదిదిక్కులయందు, వ్యశ్నువానం యశః = వ్యాపింపగల్గిన కీర్తిని, దిశతు = ఇచ్చునుగాక !

ఇందు **''చక్రేశార్కప్రకాశః''** అని శ్రీసుదర్శన భగవానుని సూర్యునిగా రూపణమును చేయుచు కవి తదనుగుణముగా అయిదువిశేషణములను ప్రయోగించిరి. సూర్యప్రకాశమునకు, సుదర్శన ప్రకాశమునకును మధ్య ఉపమానోపమేయభావము వానివలన నిరూపింపబడుచున్నది.

**(ఉద్యన్ బింబాత్ ఉదారాత్)** - సూర్యుని ప్రకాశము గొప్ప సూర్యబింబము నుండి ఉద్భవించునట్లే, శ్రీసుదర్శనుని ప్రకాశము సుదర్శనబింబమునుండి పుట్టును. కావున బింబాత్ ఉదయము ఈరెండింటికిని సమానము. **''ఉదారో దాతృ మహతోః''** అను అమరకోశవచనము ప్రకారము ఇచటి ఉదారశబ్దము గొప్పదైన అను అర్థమును తెలుపును.

**(నిర్జరీణాం నయనజలహిమం మార్జయన్)** - సూర్యప్రకాశము ఉదయింపగానే మంచునీరు ఆవిరిఅగును. చక్రప్రకాశము దేవతాస్త్రీల కన్నీరు అను మంచు నీటిని ఆవిరిచేయును. అనగా, రాక్షసులను, అసురులను సంహరించి, దేవతలకు విజయమును కల్గించును. **''నయన**

**హిమజలమ్''** అను వేరొక పాఠము అసంబద్ధము.

**(అజ్ఞానధ్వాంతమూర్ఛాకరజనిరజనీభంజనవ్యంజితాధ్వా)** - సూర్యప్రకాశము ఉదయించుటకు ముందు అంధకారముతో కూడిన రాత్రియొక్క క్రూరత వలన **''ఇదిదారి''** అని తెలియలేకుండునట్లుండును. సూర్యప్రకాశము ఉదయింపగానే ఆ రాత్రి పోయి దారి సుస్పష్టముగా గోచరించను. అట్లే, చక్రప్రకాశము అజ్ఞానమను చీకటిని వృద్ధినొందించు సంసారమనురాత్రిని భగ్నముచేయుటచేత అర్చిరాది మార్గము ప్రకాశించునట్లు చేయును. **''సుదర్శన! మహాజ్వాల! కోటిసూర్యసమప్రభ! అజ్ఞానాంధస్య మే దేవ విష్ణోర్మార్గం ప్రదర్శయ''** అని సుదర్శన భగవానుడు ప్రపన్నులచే స్తుతింపబడు చున్నాడు కదా! ఇచట **''అజ్ఞానధ్వాంత. . .''** ఇత్యాది సమాసమునకు అవివేకమను చీకటిచే ఏర్పడు మోహమునుకల్గించు సంసారమను రాత్రిని ఇత్యాదిగా అర్థమును వ్యాఖ్యాతలందఱును తెలిపిరి. కాని, శ్రీ రఘునాథాచార్యస్వామివారు ''మోహమను అర్థము మూర్ఛాపదమునకు ఉన్నను, మోహముగూడ పూర్వోక్తమగు అజ్ఞానములోని ఒక విశేషమేకనుక, మఱల మోహార్థగ్రహణములో ఔచిత్యములేదు. కావున **''మూర్ఛా- మోహ, సముచ్ఛ్రాయయోః''** ఇత్యాది ధాతుపాఠానుసారము **''మూర్ఛాకర''** అను శబ్దమునకు వృద్ధినొందించు అను అర్థము పరిగ్రాహ్యము'' అని చక్కని పరిష్కారమును చూపుటచే ఆ అర్థమే ఇచట కృతజ్ఞతాపూర్వకముగా స్వీకరింపబడినది. **''అజ్ఞానం చ ధ్వాంతంచ అజ్ఞానధ్వాంతే, తాభ్యాం జాతా మూర్ఛా వైముహ్యం, తస్యాః కరో జనకః, స చా సౌ జనిః జన్మచ, సైవ రాత్రిః, తస్యాః భంజనం నాశనం, తేన వ్యంజితః వ్యక్తీకృతః అధ్వా మార్గః యేన సః''** అని సంస్కృతవ్యాఖ్య.

**(గ్రహాణాం స్ఫురణం న్యక్కుర్వాణః)** - సూర్యప్రకాశమునకు ఎదురుగా వేరు ఏ గ్రహము అయినను వెలుగలేదు. అనగా, శ్రీసుదర్శన స్వామి ప్రకాశమునకు ఎదురుగా అవి ప్రకాశింపలేవు అనుట **కింపునః న్యాయసిద్ధము.** న్యక్కారమనగా తిరస్కారము.

**(పావకీయాః అర్చిషః అపహరన్) – ''దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః'** అనురీతిలో అగ్ని రాత్రిసమయమున సూర్యుని తేజస్సును చేరి వర్ధిల్లును. పిమ్మట సూర్యుడు ఉదయింపగానే పావకనిహితమైన ఆ అర్చిస్సు (కాంతి) అపహృతమగును. అగ్ని సహజముగా అర్చిస్సును కలవాడైనను సూర్యప్రకాశమునకు ముందు ఆ అర్చిస్సు అసత్కల్పముగా, అనగా ఉన్నను లేనట్లుగా నుండుటచే పావకుని తేజస్సు సూర్యుని తేజము అపహరించునట్లు తెలుపబడినదనదగును. ఇది సుదర్శనుని ప్రకాశమునకు ఒప్పును. పావకునకు చెందినది **''పావకీయా''** అనుటకు **''పావకస్య ఇమాః''** అని విగ్రహము. **''అర్చిస్''** శబ్దము



నపుంసకస్త్రీలింగములలో కలదు.

ఈవిధముగా అర్కప్రకాశముతో తులతూగు సుదర్శన ప్రకాశము మీకు లోకమంతయు విస్తరించు గొప్పకీర్తిని కల్గించుగాక!

**(దశదిశః)** - పూర్వాపర దక్షిణోత్తరములు. అను నాల్గు దిశల మాత్రము వివక్షించిన **''చతస్రో దిశః''** అగును. దిక్కులను, దిక్కుల కోణములను నాల్గింటిని ఉద్దేశించిన **''అష్టౌ దిశః''** అగును. ఊర్ధ్వ, అథోదిశలను కలిపిన పదిదిక్కులు అగును. శ్రీసుదర్శనుని సూర్యునిగా వర్ణించు ఈసందర్భమునకు అనుగుణముగా తిరువిరుత్తమున నమ్మాళ్వార్లు సాయించిన **''తిరువాలురు వొక్కుమ్ వేరు, అవ్వేరువిల్ శెఞ్జుడరోన్ తిరువాల్ తిరుక్కై తిరుచ్చక్కరమొక్కుమ్''** అనుసూక్తి ఇచట స్మరణీయము.

''చక్రేశార్కప్రకాశః వః వ్యశ్నువానం యశః దిశతు''

---

## శ్రీసుదర్శనజ్వాల మీ అజ్ఞానాన్ని పోగొట్టాలి.

**21.** వర్గస్య స్వర్గధామ్నా మపి దనుజనుషాం విగ్రహం నిగ్రహీతుం
దాతుం సద్యోబలానాం శ్రియ మతిశయినీం పత్రభంగానువృత్త్యా ।
యోక్తుం దేదీప్యతే యా యుగపదపి పురో భూతిమయ్యా ప్రకృత్యా
సా వో నుద్యా దవిద్యాం ద్యుతి రమృతరసస్యందినీ స్యాందనాంగీ ॥

అమృతరసస్యందినీ = మోక్షరసమును స్రవించునది, స్యాందనాంగీ = సుదర్శనునకు సంబంధించినదియు అగు, యా = ఏ, ద్యుతిః =కాంతి, యుగపత్ = ఒకే పర్యాయము (ఏకకాలమున), స్వర్గధామ్నామ్ = దేవతలయొక్క, వర్గస్య = సమూహముయొక్క, విగ్రహమ్ = విరోధమును, దనుజనుషాం వర్గస్య = అసురుల సమూహముల, విగ్రహమ్ అపి = శరీరములనుకూడ, నిగ్రహీతుమ్ = నశింపచేయుటకును, సద్యః = ఒకే సమయముననే, స్వర్గధామ్నాం వర్గస్య అబలానామ్ = దేవసమూహముల స్త్రీలకు, పత్రభంగానువృత్త్యా = మకరికా పత్రరచనానువృత్తిచే, అతిశయినీమ్ = అతిశయించిన, శ్రియమ్ = సంపదను, దాతుమ్ = ఇచ్చుటకును, దనుజనుషాం వర్గస్య బలానామ్ = అసురసమూహసైన్యముల, అతిశయినీమ్ = గొప్పసంపదను, పత్రభంగానువృత్త్యా = రథగజతురగాది వాహనములను నశింపచేయు విధానమున, దాతుమ్ అపి = ఖండించుటకును (పోగొట్టుటకును), స్వర్గధామ్నాం వర్గస్య = దేవసమూహముల, పురః = పట్టణములను, భూతిమయ్యా ప్రకృత్యా యోక్తుమ్ = సంపదతో కూడినవిగా చేయుటకును, దనుజనుషాం వర్గస్య పురః అపి = అసుర వర్గముయొక్క

పట్టణములను, భూతిమయ్యా ప్రకృత్యా యోక్తుమ్ = భస్మమయమైన రూపముతో చేర్చుటకు (భస్మము చేయుటకు), దేదీప్యతే = మిక్కిలిగా వెలుగుచున్నదో, సా = అట్టి సుదర్శనుని ద్యుతి, వః = మీయొక్క, అవిద్యామ్ = అజ్ఞానమును, నుద్యాత్ = పోగొట్టును గాక !

ఈ శ్లోకములోని కవినిబద్ధచమత్కార చాతుర్యము అత్యంతము విస్మయనీయము, అనుభవైకవేద్యమును. శ్రీసుదర్శనుని ద్యుతి దేవతలకు, అసురులకు ఏకకాలమున ఏక రూపమైన క్రియను చేయుచున్నదనుట తెలుపబడుచున్నది. సంస్కృత భాషా మర్మజ్ఞులు మాత్రమే ఈ సూక్తి విన్యాసములోని భోగ్యతను అనుభవించి, ఆనందింప గల్గుదురనుట పరమ సత్యము.

**(స్వర్గధామ్నాం వర్గస్య దనుజనుషాం వర్గస్య విగ్రహ మపి యుగపత్ నిగ్రహీతుమ్)** - ఇచట విగ్రహశబ్దము శ్లిష్టము. దేవతల పక్షమున విరోధమని, అసురుల పక్షమున శరీరమనియు అర్థము. అసురుల శరీరములను ఖండించి, దేవతల విరోధమును ఉపశమింపచేసినదని తాత్పర్యము. అసురులు నశింపగా దేవతలు విరోధులు లేనివారు అగుదురు కదా ! విరోధులు నశించిన విరోధము నశించినట్లే.

**(దాతుం సద్యో బలానాం శ్రియ మతిశయినీం పత్రభంగానువృత్త్యా)** - **''వర్గస్య స్వర్గధామ్నా మపి దనుజనుషామ్''** అనునది ఇచట ఆవృత్తమైనది. ఇచట **''దాతుమ్''**, **''పత్రభంగానువృత్త్యా''** అను పదములు రెండును అభంగశ్లిష్టములు. **''సద్యోబలానామ్''** అనునది సభంగశ్లిష్టము. దేవతల పక్షమున **''సద్యః అబలానామ్''** అని, అసురులపక్షమున **''సద్యః బలానామ్''** అనియు పదవిభాగమును చేయవలయును. కావున అర్థభేదము కలదు. ఇందుచే ఈపదము నందున సభంగశ్లేషకలదు. **''స్వర్గధామ్నాం వర్గస్య అబలానామ్, దనుజనుషాం వర్గస్య బలానాం శ్రియ మపి సద్యో దాతుమ్''** - దేవతల పక్షమున అసురుల పక్షముననను ఏకరూపక్రియాకరణము శబ్దతః కన్పించినను అర్థమున భిన్నక్రియలే. **''దాతుమ్''** అనుతుమున్ ప్రత్యయాంతమైన అవ్యయము భిన్నార్థకములైన రెండు ధాతువులనుండి నిష్పన్నమగుటకు అవకాశముకలదు. **''డు దాఞ్ - దానే''** అనుధాతువునుండి నిష్పన్నమైన **''దాతుమ్''** అనురూపమునకు దానముచేయుటకు అనిఅర్థము. **''దోః - అవఖండనే''** అనుధాతువు నుండి పుట్టిన **''దాతుమ్''** అనురూపమునకు ఖండించుటకు అనిఅర్థము. కావున ఈ పదము శ్లిష్టము. దేవతలస్త్రీలకు సంపదను ఇచ్చుటకు, అసురవర్గము సేనయొక్క సంపదను నశింపచేయుటకును అని తాత్పర్యము. సంపత్తుయొక్క ఈ దానప్రకారమును **''పత్రభంగానువృత్త్యా''** అను ప్రయోగము విశేషించుచున్నది. దీని అర్థమేమనగా - దేవతాస్త్రీల సంపద బలిష్ఠమైనది. దేనివలన అనగా పత్రభంగానువృత్తిచే. పత్రభంగమనగా మకరికాపత్రరచన. ఇది స్త్రీలు మంగళాలంకరణముగా చేసికొను భోగవిలాసములలో ముఖ్యమైనది. దీనియొక్క అనువృత్తి



అనగా అవిచ్ఛేదము. అనగా ఎల్లప్పుడును దానిని కల్గియుండుట. వైధవ్యము కల్గినను, ఏమైన దుఃఖము కల్గినను ఈ పత్రభంగము విచ్ఛిన్నమగును. అట్లు విచ్ఛేదము కాకుండ పత్రభంగానువృత్తిచే అతిశయించిన సంపద ఏదనగా సౌమంగల్యలక్ష్మియే. అట్టి సంపదను అనుగ్రహించుట కొఱకు అని సారము. ఇక, అసురుల పక్షమున వివరణమును ఇట్లు చేయనగును. **''పత్రభంగానువృత్త్యా అతిశయినీం శ్రియం దాతుమ్''** అని దేవతల పక్షమున సమన్వయింపబడినది. కాని, అసురుల పక్షమున ఇట్లుకాదు. **''దనుజనుషామ్ వర్గస్య బలానామ్ అతిశయినీం శ్రియమ్ పత్రభంగానువృత్త్యా దాతుమ్''** అని యోజనచేయవలయును. ఇచట పత్రశబ్దము వాహనార్థకము. అసురుల సైన్యమునకు వాహనములగు రథగజతురగాదుల యొక్క భంగము- అనగా ధ్వంసము, దానిని అవిచ్ఛిన్నముగా చేయుటచే వారి గొప్పసంపద ఖండింపబడినట్లగును.

**(యోక్తుమ్ యుగపదపి భూతిమయ్యా ప్రకృత్యా)** – **''వర్గస్య స్వర్గధామ్నా మపి దనుజనుషామ్''** అనునది ఇచట అనుసంధేయము. **''స్వర్గధామ్నామ్ వర్గస్య దనుజనుషామ్ వర్గస్యాపి పురః భూతిమయ్యా ప్రకృత్యా యుగపత్ యోక్తుమ్''** ఈప్రయోగమున భూతిపదము ఒకటే శ్లిష్టము. దేవతల పక్షమున ఐశ్వర్యమని, అసురులపక్షమున భస్మమని ఈపదము తెలుపును. దేవతల పట్టణములను సంపదతో నిండునట్లు చేయుట, అసురుల పట్టణములను భస్మసాత్కృతమును చేయుటయు తెలుపబడినవి. దేవతల దుఃఖముతీరునట్లు, అసురులకు హానికల్గునట్లు చేయుటను తెలుపుటయే ఈశ్లోకములోని పరమార్థము.

ఇచట ఒక సందేహము కలుగుటకు అవకాశముకలదు. **''యుగపత్''** అని పల్కుట ఎట్లు పొసగును ? అనునదియే ఆ సందేహము. అసురులు నశించిన పిమ్మటనే కదా దేవతలకు అభివృద్ధికల్గుట. అసురధ్వంసము, దేవతల ఉజ్జీవనమును ఏక కాలమున సంభవింప వీలులేదు కదా ! సత్యమే. కాని, ఇచట అలంకార శాస్త్రమున ప్రసిద్ధమగు శతపత్రపత్రసూచీ భేదన్యాయమును వర్తింపచేయనగును. అనగా పద్మముయొక్క నూరు దళములందు సూదిగ్రుచ్చినపుడు అన్నిదళములలో ఒకేక్షణమున సూదిలోనికి గ్రుచ్చుకొన్నట్లు తోచును. కాని, అది సరికాదు. మొదటి రేకులో గ్రుచ్చుకొనిన పిమ్మటనే రెండవరేకులో, ఆపిమ్మట మూడవరేకులో, చివరగా చివరిరేకులో గ్రుచ్చుకొనును. ఇట్లు కాలభేదమున్నను శీఘ్రతవలన భేదము లేనట్లు తోచునట్లే ఇచటను అసురధ్వంసమైన పిమ్మటనే దేవతల అభివృద్ధి అనుక్రమము నిజమునకు ఉన్నను అత్యంతవేగముగా అవిరెండును ఒకదానివెంట ఒకటి సంభవించుటచే ఏక కాలముననే అవి రెండును జరిగినట్లు తోచును. కావున శైఘ్ర్యాతిశయమునుబట్టి **''యుగపత్''** అని పల్కుటలో ఎట్టి అనుపపత్తియు లేదనదగును.

ఇట్టి సుదర్శన ద్యుతి మీకు మోక్షానందమును అనుగ్రహించి, అవిద్యా నివృత్తిని చేయునుగాక! అని తాత్పర్యము. **''స్యందస్య అంగమ్''** - రథముయొక్క అవయవము చక్రము. **''తస్య ఇయమ్ స్యాందనాంగీ''** అని తద్ధితవృత్తి. పత్రభంగశబ్దార్థమునకు **''పత్రం వాహన పక్షయోః''** అను అమరకోశవచనము స్మరణీయము.

''స్యాందనాంగీ ద్యుతిః వః అవిద్యాం నుద్యాత్''

## శ్రీసుదర్శనుని కిరణం మీకు సద్యఃఫలాన్ని ఇవ్వాలి.

**22.** దాహం దాహం సపత్నాన్ సమరభువి లసద్భస్మనా వర్త్మనా యాన్
క్రవ్యాదప్రేతభూతాద్యభిలషితపుషా ప్రీతకాపాలికేన ।
కంకాలైః కాలధౌతం గిరి మివ కురుతే యః స్వకీర్తే ర్విహర్తుం
ఘృష్టి స్సాందృష్టికం వ స్సకల ముపనయత్వాయుధాగ్రేసరస్య ॥

సమరభువి = యుద్ధభూమిలో, సపత్నాన్ = శత్రువులను, దాహందాహమ్ = మిక్కిలి దహించి, లసత్ భస్మనా = ప్రకాశించు భస్మమును కల్గినది, క్రవ్యాద = మాంసమును తిను, ప్రేతభూతాది+ అభిలషితపుషా = ప్రేతభూతాదుల అభిలాషను నెఱవేర్చునదియు, ప్రీతకాపాలికేన = కాపాలురకు తృప్తిని కల్గించునది అగు, వర్త్మనా = మార్గముతో, యాన్ = పోవుచున్న, ఆయుధ+ అగ్రేసరస్య = శ్రీసుదర్శనునియొక్క, యః ఘృష్టిః = ఏ కిరణము, స్వకీర్తేః = తనకీర్తి అనుస్త్రీయొక్క, విహర్తుమ్ = విహారార్థము, కంకాలైః = ఎముకలతో (అస్థిపంజరములతో), కాలధౌతం గిరిమ్ = తెల్లని పర్వతమును, కురుతే ఇవ = చేయుచున్నది వలె ఉన్న, సః = ఆ, (అట్టిసుదర్శన కిరణము), వః = మీకు, సకలం = సమస్తమగు, సాంద్రుష్టికమ్ = తత్క్షణముననే కలుగు అభీష్టఫలమును, ఉపనయతు = పొందించును గాక !

శ్రీసుదర్శనభగవానుని శత్రుసంహారవైశద్యమును విలక్షణమైన ప్రక్రియలో కవి ఈ శ్లోకమున ప్రతి పాదించుచున్నారు. అసుర, రాక్షసుల దేహములను భస్మమగునట్లు దహించి, వానిలో నున్న మాంసము, అస్రుక్, పూయాదులను భూతప్రేతపిశాచాదులకు ఆహారముగా ఇచ్చి, కనపడిన ప్రదేశము నంతటిని భస్మమయము చేసి, ఆశరీరములలోని తెల్లని అస్థిసమూహమును పర్వతమువలె పేరుకొనియుండునట్లుచేయుటకు కవి ఒక అద్భుతమైన ఉత్ప్రేక్షను ప్రయోగించుచున్నారు.

**(స్వకీర్తేః విహర్తుం కాలధౌతం గిరిం కురుత ఇవ)** – **''స్వయశసః''** అని పలుకక, **''స్వకీర్తేః''** అని స్త్రీలింగపదనిర్దేశమును చేయుటవలన సుదర్శనకిరణమును పురుషునకు తత్కీర్తి



ఒక పత్నిగా కవి ఉల్లేఖించుచున్నారు. లోకమున రసికుడు, సమర్థుడైన భర్త తన ప్రేయసి సవిలాసముగా విహరించుట కొఱకు ఒక భవనమునో, లేక తోటనో, పర్వతమునో ఏర్పచుట అలవాటు. అట్లే, సుదర్శనకిరణమను పురుషుడు (భర్త) తన ప్రేయసి అను కీర్తియొక్క విహారార్థము అసురుల అస్థిపుంజమను ఒక పెద్ద తెల్లని పర్వతమును ఏర్పాటుచేసెను కాబోలు ! అని ఉత్ప్రేక్షించువిధమున నున్నది. ఇందుచే సుదర్శనకిరణములు అసురులను, రాక్షసులను అస్థిమాత్రావశిష్టులు అగునట్లు సమూలనాశనము చేసి, గొప్పకీర్తిని పొందెనని తెలుపబడినట్లయినది. **''దాహం దాహమ్''** అనుటకు **''దగ్ధ్వా దగ్ధ్వా''** అని విగ్రహము. ఇది ణముల్ ప్రత్యయాంత రూపము.

**(క్రవ్యాదప్రేత భూతాద్యభిలషితపుషా ప్రీతకాపాలికేన లసత్భస్మనా చ వర్త్మనా)** – మాంసాశనులగు ప్రేతభూతపిశాచాదులు సుదర్శనుని అనుగ్రహమువలన కడుపార భుజించి, మదించియుండుటచే దారిలో భస్మము మాత్రమే మిగిలియున్నది. మాంసము, రక్తము మొదలగునవి లేవు అని భావము **''యాన్''** అనుపదము **''యా – ప్రాపణే''** అను ధాతువునుండి నిష్పన్నమైన శతృప్రత్యయాంతరూపము. **''యాన్– యాంతౌ – యాంతః''** ఇత్యాదిగా దీని విభక్తిరూపములుండును. **''సాంద్రుష్టికం ఫలం సద్యః''** అను అమరకోశ ప్రమాణానుసారము **''సాంద్రుష్టిక''** మనగా సద్యఃఫలము అని అర్థముచెప్పనగునని శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారి పరిష్కారము.

''ఆయుధాగ్రేసరస్య ఘృష్టిః వః సకలం సాంద్రుష్టికమ్ ఉపనయతు''

## శ్రీసుదర్శనుని తేజస్సు మీ ప్రారబ్ధాన్ని శమింపజేయాలి.

**23.** దగ్ధానాం దానవానాం సభసితనిచయై రస్థిభి స్సర్వశుభ్రాం
పృథ్వీం కృత్వా ऽపి భూయో నవరుధిరఝరీకౌతుకం కౌణపేభ్యః ।
కుర్వాణం బాష్పపూరైః కుచతటఘుసృణక్షాళనై స్తద్వధూనాం
పాపం పాపచ్యమానం శమయతు భవతాం శస్త్రరాజస్య తేజః ॥

దగ్ధానామ్ = దహింపబడిన, దానవానామ్ = అసురులయొక్క, సభసితనిచయైః = భస్మసమూహములతో, అస్థిభిః = (కూడిన) ఎముకలతో, పృథ్వీమ్ = భూమిని, సర్వశుభ్రామ్ = మొత్తము తెల్లనిదిగా, కృత్వా+ అపి = చేసినపిమ్మట కూడ, భూయః = తిరిగి, తద్వధూనామ్ = ఆ అసురుల స్త్రీలయొక్క, కుచతటఘుసృణ = స్తనతటములందున్న కుంకుమరసమును, క్షాళనైః = కడుగుచున్న, బాష్పపూరైః = కన్నీటి ప్రవాహములచే, కౌణపేభ్యః = పిశాచాదులకు,

నవరుధిరఝరీకౌతుకమ్ = నూతనమైన రక్త ప్రవాహమునందు ఆసక్తిని, కుర్వాణమ్ = చేయుచున్న, శస్త్రరాజస్య = ఆయుధరాజమగు సుదర్శనుని యొక్క, తేజః = తేజస్సు, భవతామ్ = మీయొక్క, పాపచ్యమానమ్ = ఫలమును ఇచ్చుటకు మిక్కిలి పరిపక్వమైయున్న, పాపమ్ = పాపమును, శమయతు = పోగొట్టునుగాక !

శ్రీసుదర్శన భగవానుని తేజఃప్రవాహముచే అసురులు నశించినపిమ్మట వారిస్త్రీలు కన్నీరు విడుచుచు, రోదించిన తీరును విలక్షణమైన పద్ధతిలో కవి ఇందు వర్ణించుచున్నారు.

అసురులు సుదర్శన తేజస్సుచే దగ్ధులు కాగా, వారి మాంసాదులను భూతప్రేతపిశాదులు నిశ్శేషముగా భుజింపగా, భస్మము, ఎముకలు మాత్రమే మిగిలియున్నవి. ఆ స్థితిని చూచిన మాంసాశనులు '' ఇక మనకు ఆహారము లభించుదారి లేదు కదా ! ఏమి చేయుదుము ? ఇక ఎన్ని దినములు మనము ఉపవాసము ఉండగలము ?'' అని విచారించి, బాధపడుసమయమున ''కొత్తదైన రక్తప్రవాహము మనకు లభించినది. దాహము తీరునట్లు త్రాగెదము'' అని వారు ఆశపడునట్లు మరల ఎచటినుండి రక్తప్రవాహమును సుదర్శన తేజము స్రవింపచేయుచున్నది. అది ఎట్లనగా -

**(బాష్పపూరైః కుచతటఘుసృణక్షాళనైః తద్వధూనామ్)** - తమ భర్తలు మరణించిరని వినిన అసురస్త్రీలు కన్నీరు విడుచుచు రోదించిరి. అపుడు వారి స్తనతటములలో అలంకారముగా అలదబడిన కుంకుమరసము కన్నీటితో కలసి ఎఱ్ఱనిరంగులో ప్రవహించినది. దానిని చూడగా నూతన రక్తప్రవాహమువలె ఉన్నది - అనునది ఇచటి ఉత్ప్రేక్షాస్వరూపము.

**(పాపం పాపచ్యమానమ్)** - **''అత్యంతం పచ్యమానమ్ పాపచ్యమానమ్''** అని విగ్రహము. మిక్కిలి పరిణామమును పొందినదని అర్థము. ఉత్తరక్షణమున ఫలించుటకు సిద్ధమైయున్నదని అర్థము. ఘోరనరకయాతనారూప ఫలములను ఇచ్చుటకు సన్నద్ధములైన పాపములను పోగొట్టునుగాక ! అని శ్లోకతాత్పర్యము. **''కుచతటఘుసృణ క్షాళనైః''** అను సమాసమునకు **''కుచతటఘుసృణం క్షాళయంతీతి కుచతట ఘుసృణ క్షాళనా, తైః''** అను విగ్రహమును చెప్పనగును.

''శస్త్రరాజస్య తేజః వః పాపచ్యమానం పాపం శమయతు''

---

## శ్రీసుదర్శనుని జ్యోతిస్సు మీ వందలాది పాపాలను పోగొట్టాలి.

**24.** మాగా న్మోషం లలాటానల ఇతి మదనద్వేషిణాధ్యాయతేవ



**స్రష్టా ప్రోన్నిద్రవాసాంబుజదళపటలప్లోష ముత్పశ్యతేవ ।**
**వజ్రాగ్ని ర్మాస్మ నాశం వ్రజ దితి చకితేనేవ శక్రేణ బద్ధైః**
**స్తోత్రై రస్త్రేశ్వరస్య ద్యతు దురితశతం ద్యోతమానా ద్యుతి ర్వః ॥**

లలాట+ అనలః = (తన) లలాటమునందలి అగ్ని, మోషమ్ = నాశనమును, మా+ అగాత్ = పొందకుండును గాక !, ఇతి = అని, ధ్యాయతా ఇవ (స్థితేన) = ధ్యానముచేయుచున్న వానివలెనున్న, మదనద్వేషిణా = మన్మథునకు శత్రువగు శివునిచే, ప్రోన్నిద్రవాసాంబుజ = తన నివాస స్థానమగు కమలపుష్పముయొక్క, దలపటల = దళసమూహములు, ప్లోషమ్ = దాహమును, ఉత్పశ్యతా+ ఇవ (స్థితేన) = చింతించుచున్న వానివలెనున్న, స్రష్టా = చతుర్ముఖునిచే, వజ్రాగ్నిః = (తన) వజ్రాయుధముయొక్క అగ్ని, నాశమ్ = నాశనమును, మా స్మ వ్రజత్ ఇతి = పొందకుండునుగాక అని, చకితేన + ఇవ (స్థితేన) = భయపడినవానివలె ఉన్న, శక్రేణ = ఇంద్రునిచే, బద్ధైః = కూర్పబడిన, స్తోత్రైః = స్తోత్రములచే, ద్యోతమానా = వెలుగుచున్న, అస్త్ర+ ఈశ్వరస్య = సుదర్శనుని యొక్క, ద్యుతిః = కాంతి, వః = మీయొక్క, దురితశతమ్ = వందలాది పాపములను, ద్యతు = తొలగించునుగాక ( ఖండించును గాక ! )

**''స బ్రహ్మా స శివ స్సేంద్రః''** అని తెలుపబడిన ముగ్గురు మూర్తులును శ్రీసుదర్శనుని దీప్తిని సర్వథా స్తుతించుచున్నారని పల్కుచు, వారి స్తుతికి ఒక్కొక్క ప్రయోజనమును ఉత్ప్రేక్షించుట ఇందలి విషయము.

**(మాగా న్మోషమ్ . . . . .)** – **''ధ్యాయతేవ, ఉత్పశ్యతేవ, చకితే నేవ''** అనుచు ఉత్ప్రేక్షను సూచించు వాచకమగు **'ఇవ'** శబ్దము ప్రయోగింపబడుటచే, వస్తుతః రుద్రాదులు స్వరూపప్రాప్తి కొఱకుచేయు స్తుతులలో యత్కించిత్ ఫలాభిసంధినిబంధనత్వమును కవి ఉత్ప్రేక్షించుచున్నారని ఏర్పడుచున్నది. ఈ ఆరోపము సుదర్శన తేజస్సుయొక్క పరాభిభవన ప్రావీణ్యాతిశయప్రకాశనము నందు పర్యవసించుననుట గుర్తింపతగినది. రుద్రలలాటాగ్న్యాదులకు నాశనమునుకల్గింప కల్గిన సుదర్శనుని ప్రభావము అర్థాత్ ఆక్షిప్తమైయున్నది. **'ఇవ'** అనుశబ్దమును ఉత్ప్రేక్షాసూచకములుగా గ్రహింపక, వాక్యాలంకారముగా గ్రహించి, వస్తుస్థితి కీర్తన ప్రక్రియలో అన్వయించుటయు తగినదే. ''శ్రీసుదర్శనుని తేజః ప్రసరము నా లలాటాగ్నిని మాత్రము నిలిపి, మిగిలిన తేజఃపదార్థములన్నిటిని తిరస్కరించును గాక !'' అని రుద్రుడు తలంచుచుండెనట. ''అన్నిటిని దహించునట్టి రీతిలో సుదర్శన తేజము నానివాసస్థానమగు పద్మమును దగ్ధముచేసి పోవునో ? ఏమో ! అది అట్లు చేయకుండనుండవలెను.'' అని బ్రహ్మయొక్క తలపు అట. గొప్పగొప్ప తేజః

పదార్థములన్నియు **''వానో ! మఱికడలో ? మారుతమో ?''** అనునట్లు చెల్లాచెదురు అగుచుండగా, ''నావజ్రాగ్ని శ్రీసుదర్శనుని తేజస్సు ముందు నిలువగల్గునా ? దీనికిని నాశనము సంభవించునేమో కదా ! అట్లు జరుగకుండనుండిన బాగుండును !'' అని ఇంద్రుని అభిప్రాయమట. ఇట్లు భయపడిన దేవతలు చేయు స్తోత్రములచే ఔన్నత్యమును పొంది వెల్గునట్టి శ్రీసుదర్శనుని దీప్తి నిండుగానున్న మీ పాపసంచయములను అన్నిటిని దహించివేయును గాక ! అని తాత్పర్యము.

**''ద్యతు''** అనురూపము **''దోః- అవఖండనే''** అను ధాతువునుండి నిష్పన్నమైన లోట్ రూపము. మొదటి శ్లోకము నుండి ఈశ్లోకమువరకు, అనగా 24 శ్లోకములతో కవి శ్రీసుదర్శన భగవానుని తేజస్సుయొక్క వైభవమును మిక్కిలి విస్తృతముగా నిరూపించిరి. ఇకపై నేమి వర్ణనము ప్రారంభమగును. ఇది 14 శ్లోకములతో చేయబడుచున్నది.

''అస్త్రేశ్వరస్య ద్యుతిః వః దురితశతం ద్యతు''

నేమివర్ణనము

## శ్రీసుదర్శననేమి మీకు గొప్పసంపదను ఇవ్వాలి.

**25.** శస్త్రాస్త్రం శాత్రవాణాం శలభకుల మివ జ్వాలయా లేలిహానా
ఘోషైః స్వైః క్షోభయంతీ విఘటితభగవద్యోగనిద్రాన్ సముద్రాన్ ।
వ్యూఢోరఃప్రౌఢచారత్రుటితపటురటత్కీకసక్షుణ్ణదైత్యా
నేమి స్సౌదర్శనీ వః శ్రియ మతిశయినీం దాశతా దాశతాబ్దమ్ ॥

శాత్రవాణామ్ = శత్రువులగు అసురులయొక్క, రాక్షసులయొక్క, శస్త్ర+అస్త్రమ్ = శస్త్రములను, అస్త్రములను, శలభకులమ్ ఇవ = మిడుతలసమూహమువలె, జ్వాలయా = (తననుచుట్టియున్న) జ్వాలచే, లేలిహానా = కబళీకరించుచున్నవి, స్వైః ఘోషైః = తనయొక్క ఘోషలతో, విఘటిత = పోగొట్టబడిన, భగవత్ = భగవానుని యొక్క, యోగనిద్రాన్ = యోగనిద్రను కల్గినది అగు, సముద్రాన్ = సముద్రములను, క్షోభయంతీ = క్షోభిల్లచేయునది, వ్యూఢ+ ఉరః = బలిష్ఠమైన విశాలమైన వక్షః స్థలమందు, ప్రౌఢచార = కఠినముగా సంచరించుటచే, త్రుటిత = చూర్ణముచేయబడినను (త్రెంచబడినను), పటురటత్ = బాగుగా శబ్దించుచున్న, కీకస = ఎముకలను కల్గినవారు, క్షుణ్ణదైత్యా = చూర్ణము చేయబడిన వారగు అసురులను కల్గినది అగు, సౌదర్శనీ = సుదర్శనునకు సంబంధించిన, నేమిః = నేమి అను అవయవము, వః =



మీకు, ఆశతాబ్దమ్ = నూఱుసంవత్సరములకాలము, అతిశయినీమ్ = గొప్పదైన, శ్రియమ్ = సంపదను, దాశతాత్ = ఇచ్చునుగాక !

ఈశ్లోకమునుండి 14శ్లోకములలో సుదర్శనుని నేమివర్ణనము ప్రస్తుతము. నేమి అనగా చక్రముయొక్క అంతర్భాగమున చుట్టును ఉండు ప్రదేశము **''చక్రం రథాంగమ్ తస్యాంతే నేమిః స్త్రీ స్యాత్ ప్రధిః పుమాన్''** అని అమరకోశమున తెలుపబడినది. ఇట్లు నేమిని గూర్చి, నాభినిగూర్చి, అరలను (లోపలి ఆకులను) గూర్చియు, అక్షమును గూర్చియు, జ్వాలలనుగూర్చియు, వేర్వేరుగా కొన్ని శ్లోకములు రచింపబడినను, అవయవములకు చెప్పబడినదంతయు అవయవికే చెందును కావున, ఈ వర్ణనలలోని గొప్పతనమంతయు సుదర్శనభగవానునకే చేరునని తెలియనగును. ఒకేవ్యక్తిని గూర్చి, లేక ఒకే వస్తువును గూర్చి పలువిధములుగా అతిశయముగా పల్కిన దృష్టిదోషము సంభవింపవచ్చునను తలంపుతో, దానిని పలు అవయవమములుగా విభజించి, వానిని వేర్వేరుగా కీర్తింతురను చాటూక్తిని పల్కువారును కలరు. ఒక మహావీరుడు చేసిన గొప్పకార్యమును వర్ణింపగోరువాడు ''కాలుచేసిన కార్యమిది, చేయిచేసిన గొప్పపని ఇది, నోరుచేసిన మహత్కార్యమిది'' అని తన బుద్ధిచమత్కారమునకు తగినట్లు పల్కుట వంటిదే ప్రస్తుతమున కవి సుదర్శన భగవానుని పలు అవయవముల గొప్పతనమును కీర్తించుట.

**(శస్త్రాస్త్రమ్. . . )** - అసురులు, రాక్షసులు అను శత్రువులు ప్రయోగించు శస్త్రములను, అస్త్రములను అవలీలగా శ్రీసుదర్శనుని నేమి తిరస్కరించుచున్నది. మంత్రసిద్ధములైన ఆయుధములు అస్త్రములు అనబడును. అమంత్రకములైనవి శస్త్రములు. **''సర్వో ద్వంద్వో విభాషయైకవత్ భవతి''** అను పరిభాషవలన **''శస్త్రాస్త్రమ్''** అను ఏకవద్భావము వచ్చినది. **''శస్త్రాణి చ అస్త్రాణి చ, తేషామ్ సమాహారః శస్త్రాస్త్రమ్''** అని దీని విగ్రహవాక్యము. **''మద మివ మధుకైటభస్య''** అను శ్రీరంగరాజస్తవీయ ప్రయోగ మిచట స్మరణీయము.

**(ఘోషైః)** - **''స్వైః ఘోషైః''** అనునది ప్రాసాద ప్రదీపన్యాయమున **''క్షోభయంతీ''** అను దానియందు, **''విఘటితభగవద్యోగనిద్రాన్''** అను దానియందు అన్వయించుటలో స్వారస్యము కలదు. **''స్వైః ఘోషైః విఘటితభగవద్యోగనిద్రాన్ సముద్రాన్, స్వైః ఘోషైః క్షోభయంతీ''** అని యోజన చేయుట మిక్కిలి ఉచితము. సముద్రములు తమ యందు పరుండి నిద్రించువానివలె యోగసమాధిలో నున్న భగవానుని యోగనిద్రకు భంగము కల్గునట్లు ఎల్లప్పుడు ఘోషించుచున్నదట. దానిని గ్రహించిన సుదర్శననేమి ఇట్లు సముద్రములు చేయు భగవదపచారమును సహింపలేక, కోపావేశముతో తాను ఘోషించుచు, ఆసముద్రమును

కలతచెందునట్లు చేయుచున్నది.

**(వ్యూఢోరః . . . . . . .)** మొదటి పాదమున తెలుపబడిన విధమున శత్రువుల అస్త్రశస్త్రములను నిర్వీర్యము చేయుటయే కాక, వారి విశాలమైన వక్షఃస్థలములలో ప్రవేశించి, ధ్వంసముచేసి, ఎముకలను చూర్ణముచేసి, వారిని రూపుమాప గల్గినది సుదర్శననేమి అని భావము. **''వ్యూఢోరః ప్రౌఢచారత్రుటిత పటురటత్ కీకసా శ్చ తే క్షుణ్ణా శ్చ వ్యూఢోరః ప్రౌఢ చారత్రుటిత పటురటత్ కీకసక్షుణ్ణాః''** అని విశేషణోభయ పదకర్మధారయమును చేసి, పిమ్మట బహువ్రీహి చెప్పనగును. లేక, **''వ్యూఢోరః . . . .కీకసం యథాతథా క్షుణ్ణాః దైత్యాః యయా సా''** అనియు చెప్పవచ్చును. ఇట్టి శ్రీసుదర్శననేమి మీకు గొప్పసంపదను చిఱకాలము అనుగ్రహించును గాక ! అని తాత్పర్యము. **''దాశతాత్''** అను క్రియ **''దాశృ – దానే''** అనుధాతువునుండి పుట్టిన లోట్ రూపము. **''ఆశతాబ్దమ్''** అనుటకు **''యావత్ బ్రహ్మస్వరూపమ్ ''** అనగా బ్రహ్మ స్వరూపము వరకు అను అర్థము సంస్కృతవ్యాఖ్యలో చూపబడినది. అందులకు ప్రమాణముగా **''సర్వం విజ్ఞానమయానంద మనంతం పర మద్భుతమ్, శతాబ్దసంజ్ఞకం నామ హృది స్ఫురతు మామకే''** అను వార్తికము ఉట్టంకింపబడినది.

''సౌదర్శనీ నేమిః వః ఆశతాబ్దమ్ అతిశయినీం శ్రియమ్ దాశతాత్''

## శ్రీసుదర్శననేమి మీ ఆత్మకు అనుగుణం అయిన మార్గాన్ని చూపాలి.

**26.** ధారా చక్రస్య తారాగణకణవితతిద్యోతితద్యుప్రచారా
పారావారాంబుపూరక్వథనపిశునితోత్తాలపాతాలయాత్రా ।
గోత్రాద్రిస్ఫోటశబ్దప్రకటితవసుధామండలీచండయానా
పంథానం వః ప్రదిశ్యాత్ ప్రశమనకుశలా పాప్మనా మాత్మనీనమ్ ॥

తారాగణ = నక్షత్రసమూహములవంటి, కణవితతి = అగ్నికణములయొక్క వ్యాప్తిచే, ద్యోతిత = ప్రకాశింపచేయబడిన, ద్యుప్రచారా = ఆకాశమునందలి సంచారములను కల్గినది, పారావార + అంబుపూర = సముద్రజల ప్రవాహముయొక్క, క్వథన = కాచుటద్వారా, పిశునిత = సూచింపబడిన, ఉత్తాల = అడ్డులేని, పాతాలయాత్రా = పాతాళలోకములోని సంచారములను కల్గినది, గోత్రాద్రి = కులపర్వతములయొక్క, స్ఫోట = పగులుటవలన పుట్టిన, శబ్ద = పటపటమను శబ్దములచే, ప్రకటిత = తెలుపబడిన, వసుధామండలీ = భూమండలమునందలి, చండయానా = కఠినములైన సంచారములును కల్గినది, పాప్మనామ్ = పాపములయొక్క, ప్రశమన = ఉపశమనములో, కుశలా = సామర్థ్యమును కల్గినది అగు, చక్రస్య = శ్రీసుదర్శనము యొక్క,



ధారా = నేమి (అంచు), వః = మీకు, ఆత్మనీనమ్ = స్వరూపానురూపమైన, పంథానమ్ = మార్గమును, ప్రదిశ్యాత్ = ఇచ్చునుగాక !

శ్రీసుదర్శనచక్రధారయొక్క ప్రకాశము ముల్లోకములందు అడ్డులేకుండ వ్యాపించుటను కవి రమణీయమైన ఫణితిలో తెలుపుచున్నారు. నక్షత్రసమూహమువంటి చక్రనేమి కిరణములు ఊర్ధ్వలోకమునందు అంతట వ్యాపించియుండుటచే అవి దేవలోకమున ప్రకాశించుట సూచింపబడినది. సముద్రములోని నీరు కాచబడి యుండుటచే వాని పాతాళలోక ప్రచారములు అప్రతిహతములని తెలుపబడినవి. దేనికిని చలింపని కులపర్వతములు సైతము బద్దలై, పటపటమను గొప్ప శబ్దము పుట్టుటచే భూమండలములో ఆకిరణముల ప్రచారములు సూచింపబడినవి. ఈ విధముగా మూడు లోకములలో అంతట అడ్డులేక వ్యాపించి యుండుట శ్రీసుదర్శననేమి ప్రకాశము మీకు ఆత్మహితమైన మార్గమును చూపునుగాక ! అనగా, అర్చిరాది మార్గమును, లేక ఆమార్గమున పోవుటకు తగిన మంచిమార్గమునో సూచించునుగాక ! అని తాత్పర్యము.

ప్రథమపాదమున **''తారాగణా ఇవ యే కణాః, తేషామ్ వితత్యా ద్యోతితః ద్యుప్రచారః యస్యాః సా''** అను విగ్రహమును చెప్పనగును. **''తారాగణకపిశఘృణి ద్యోతితద్యు ప్రచారా''** అను వేరొక పాఠమును కలదు. అదియు అర్థవంతమే. దానికి **''తారగణస్యేవ యే కపిశఘృణయః (స్వకీయాః), తైః ద్యోతితద్యుప్రచారా''** అను వివరణమును చెప్పనగును. అనగా నక్షత్రసమూహముయొక్క పచ్చనైన కిరణములచే ప్రకాశింపచేయబడిన ఆకాశమునందలి యానమును కల్గినదని అర్థము. ఈ పాఠమును సంస్కృత వ్యాఖ్యాత గ్రహించెను. **''అథవా, తారాణాం గణాః ఏవ కణాః లేశాః, తేషాం వితతయః సమూహాః''** అని వేరొకయోజనను కూడ సంస్కృతవ్యాఖ్యాత చూపెను. అనగా వెలవెలపోయిన ప్రకాశమును కల్గినవగు తారాకణములవలె అని అర్థము.

**''కీళ్ఉలకిలశురర్కళై కిళ్ఉక్కిరున్ద్ర కిళరావే, ఆళ్ఇ విడుత్తవరుడైయ కరువళ్ఇ త్తవళ్ఇప్పన్''** అనుచు పెరియాళ్వార్లు శ్రీసుదర్శనము పాతాళవాసులగు అసురులను ధ్వంసముచేయుటకు సముద్రమార్గము ద్వారా పాతాళలోకమునందు ప్రవేశించునపుడు సముద్రజలము మఱగకాచబడినట్లు అగుటను తెలిపిరి. **''యత్రామిత్రాన్ దిధక్షా''** అను 28వ శ్లోకము నందుకూడ కవి శ్రీసుదర్శనము సముద్రమార్గము ద్వారా పాతాళలోకమునకు పోవునపుడు సముద్రజలము నిశ్శేషముగా ఆవిరియగుటను తెలిపిన రీతిని ఇచట స్మరింపనగును. **''ఉత్తాల పాతాలయాత్రా''** అనుపుడు **''ఉత్తాల''** అనుటకు ఉచ్ఛృంఖలమని అర్థము. తాలమనగా రక్షణార్థమై ఉపయోగించు తాళమే. **''తాలాత్ ఉద్గతా ఉత్తాలా''** అని విగ్రహము,

అనగా తాళము లేనిది అని అర్థము. అనగా, ఎట్టి అడ్డు అదుపు లేకుండ యుండుట. **''ఆత్మనే హితమ్ ఆత్మనీనమ్''** అని విగ్రహము. అనగా స్వరూపానురూపమైనదని భావము.

''చక్రస్య ధారా వః ఆత్మనీనం పంథానం ప్రదిశ్యాత్''

**శ్రీసుదర్శన నేమి మీకు సుఖాన్ని ఇవ్వాలి.**

**27.** **యాత్రా యా త్రాతలోకా ప్రకటితవరుణత్రాసముద్రే సముద్రే**
**సత్త్వాసత్త్వాసహోష్మా కృతసగరుదగస్పందదానాఽదదానా ।**
**హానిం హా నిందితానాం జగతి పరిషదాం దానవీనాం నవీనాం**
**చక్రే చక్రేశనేమి శ్శ ముపహరతు సా సప్రభావప్రభా వః ॥**

త్రాతలోకా = తనచే రక్షింపబడిన లోకములనుకల్గినది, ప్రకటిత = ప్రకటింపబడిన, వరుణత్రాస = వరుణుని భయముయొక్క, ముద్రే =గుర్తును కల్గిన, సముద్రే = సముద్రమందు, యాత్రాః = సంచారములను, ఆదదానా = స్వీకరించునది, సత్త్వ+ అసత్త్వ = చేతనాచేతనములకు, అసహ + ఊష్మా = భరింపరాని వేడిమిని కల్గినది, కృతసగరుదగస్పందదానా = ఱెక్కలతో కూడిన పర్వతముల సంచారములను ఖండనము చేయునదియును అగు, యా = ఏ, చక్రనేమిః = సుదర్శనచక్రముయొక్క నేమి, జగతి = లోకమునందు, నిందితానామ్ = నిందింపబడిన, దానవీనాం పరిషదామ్ = అసురసమూహములయొక్క, నవీనామ్ = కొత్తదైన, హానిమ్ = నాశనమును, హా = అయ్యో !, చక్రే = చేసినదో, స ప్రభావప్రభా = మహిమతో కూడిన ప్రకాశమును కల్గియున్న, సా = ఆచక్రనేమి, వః = మీకు, శమ్ = సుఖమును, ఉపహరతు = అనుగ్రహించును గాక !

ప్రథమపాదములోని **''త్రాతలోకా''** అను మొదటి విశేషణమును మిగిలిన విశేషణము లన్నియు వివరించుచున్నవి. శ్రీసుదర్శనము సముద్రమార్గముద్వారా పయనింపబోవుచున్నదను వార్త తెలిసినవెంటనే సముద్రాధీశుడగు వరుణుడు ''నాకేమి ఆపద మూడునో ? ఏమో !'' అని భయపడి, వినమ్రుడగుటను స్పష్టముగా తెలుపుచున్న సముద్రమునందు మాటిమాటికి సంచారము చేయుచున్నదనుటకు- వరుణుడు భయమును పొందునట్లు సముద్రమార్గమున సుదర్శనము పయనించు చున్నదని భావము. **''యాత్రాః''** అనునది ద్వితీయాబహువచన రూపము.

**(సత్త్వాసత్త్వాసహోష్మా)** - సత్త్వమనగా చేతనవస్తువు, అసత్త్వము అచేతన వస్తువు. చేతనాచేతనవస్తువు లన్నిటిలో ఏదియు సహింపలేని ఊష్మను కల్గియున్నది అనగా చేతనాచేతనములకు అసహ్యమైన వేడిమిని కల్గియున్నదని పర్యవసితార్థము. చేతనా చేతనములకు దఱి చేరుటకు వీలు కాకుండుటయే **''సత్త్వాసత్త్వాసహోష్మత్వ''**ము.



**(కృతసగరుదగస్పందదానా)** – **''గరుద్భిః సహ వర్తంత ఇతి సగరుతః, సగరుత శ్చ తే అగా శ్చ, తేషామ్ స్పందః చలనమ్, తస్య దానమ్ ఖండనమ్''** అను విగ్రహ మిచట వివక్షితము. ఇచటి దాన శబ్దము **''దోః- అవఖండనే''** అను ధాతువునుండి పుట్టిన రూపము. **''కృతమ్ సగరుదగస్పందదానమ్ యయా సా కృతసగరుదగ స్పందదానా''** అనివిగ్రహము. **''సగరుతః సపక్షాశ్చ తే అగాః పర్వతాశ్చ, తేషాం స్పందః చరణం, తస్య దానం వితరణం కృతం సగరుదగ స్పందదానం యయా సా''** అని సంస్కృతవ్యాఖ్య. అనగా ఱెక్కలను కల పర్వతములకు తన వేగముతో చలనములను కలుగచేసినది అని భావము. ఈ అన్వయమున దానశబ్దమునకు వితరణమని అర్థము. మఱియు చివరలో - **''సగరుద్వసుంధరాధరప్రకంపనప్రదానకర్త్రీ''** అనియు తెలుపబడినది. దీనినిబట్టి ఱెక్కలనుకల్గిన పర్వతములను సుదర్శనుని నేమి స్పందింపచేయుచున్నదని అర్థము ఏర్పడుచున్నది. సుదర్శనుడు పర్వతముల ఱెక్కలను ఖండించిన వృత్తాంతము పురాణాదులలో ఎచటను కానరాకుండుటచే సంస్కృతవ్యాఖ్యాత ఇట్లు వ్యాఖ్యానించి ఉండవచ్చును. ఈరెండుఅన్వయములలోను **''అదదానా''** అనుపదమునకు దూరాన్వయము చేయబడినదని తలచిన వేరొక వ్యాఖ్యాత **''సగరుదగస్పందదానాదదానా''** అని ఏకపదముగా గ్రహించి పర్వతములకు చలనము దానముచేయుటను స్వీకరించినది అని అర్థమును చెప్పెను. ఈ అర్థము సంస్కృతవ్యాఖ్యాతచే చూపబడిన అర్థముకంటే వేరుకాకున్నను దూరాన్వయదోషము పరిహరింపబడినదని ఆ వ్యాఖ్యాత భావమై నుండవచ్చును. కాని ఈ మూడు అన్వయములలో శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి అన్వయమే సరసతరమనుటను సహృదయులు గ్రహింపగలరు.

పూర్వము ఒకానొక సమయమున పర్వతములు ఱెక్కలను కల్గి, వాని సహాయముతో ఎగురుచుండెడివి. దానివలన జనులకు పలు విధములైన బాధలు కల్గుచుండెను. సుదర్శనము భగవానుని ఆజ్ఞచొప్పున పర్వత సంచారములను నిరోధించుటకై వాని ఱెక్కలను ఖండించెను అను పౌరాణిక వృత్తాంత మిచట స్మరణీయము. **''ఉడమ్బినాల్ కుఱైవిల్లా ఉయిర్ పిరిన్ద మలైత్తుణ్డమ్ కిడన్దనపోల్ తుణిపలవా అశురర్ కుళామ్ తుణిత్తుకన్ద''** (తిరువాయ్‌మొళి 4-8-10) అను ఆళ్వార్ల సూక్తి యొక్క వ్యాఖ్యలో ఈకార్యము ఇంద్రునిచే చేయబడినట్లు తెలుపబడినను, అట్లే ప్రసిద్ధిప్రాచుర్యములును ఉన్నను, ఇచట కవి ఈ విధముగా అనుసంధించుటలో అనుపపత్తి ఏమియులేదు. సమయభేదాదులను బట్టి దీనిని నిర్వహింపవచ్చును. అనగా ఒక్కొక్కకల్పముననో, యుగముననో ఇది సంభవించి యుండవచ్చునని తాత్పర్యము. ఈ శతకములోని 76వ శ్లోకమున పురుషవర్ణనలో **''శక్తి ర్యస్యైషు దంష్ట్రానఖపరశుముఖవ్యాపినీ తద్విభూత్యామ్''** అని తెలుపబడుటచే ప్రస్తుతమున తెలుపబడిన

వృత్తాంతము సుసంగతమే అగును. చక్రాయుధముయొక్క శక్తియే వజ్రాయుధమున వ్యాపించి, పర్వతముల ఱెక్కలను ఖండించునట్లు చేసిన రహస్యమును చక్కగా గ్రహించిన కవి ఇట్లుపల్కిరి అనవచ్చును- అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామి రస్యముగ వివరించిరి.

ఇట్లు కవి సాయించుటకు దివ్యసూరుల సూక్తియు కారణమైయుండవచ్చునని తోచుచున్నది. తిరుమఙ్గైయాళ్వార్ల పెరియతిరుమొళిలోని **''పొరువరై మున్నీర్ తులైత్త పొన్నాళి''** (8-1-2) అను ప్రయోగములోని **''వరై''** అను పదమునకు పర్వతమని అర్థము చెప్పవీలుండుటచే, పరమ కారుణికులగు పెరియవాచ్చాన్‌పిళ్లై తమ వ్యాఖ్యలో **''శిఱకెళ్లున్దు పొరుతుకొడు తిరికిఱమలైకళై ప్పణ్డు యుద్ధత్తిలే ముడిత్త అళకియ తిరువాళియన్నో మఱ్ఱైక్కైయిల్ ఎడుత్తు త్తిరికిఱదు . . . . .''** అని ఇత్యాదిగా వ్యాఖ్యానించిరి. కావున ఈ వృత్తాంతము పరమార్థవిదులగు ఆళ్వార్లచే కూడ అనుసంధింపబడినదని తలచినకవి ప్రస్తుత శ్లోకమున నిబంధించి యుండనగును.

**(దానవీనామ్)** – **''దానవానామ్ ఇమాః దానవ్యః, తాసామ్''** అను తద్ధితవృత్తిని ఇచట చెప్పనగును. **''సముపహరతు''** అనుటకు బదులుగా **''శమ ముపహరతాత్''** అను వేరొక పాఠము సంస్కృతవ్యాఖ్యలో కలదు. అపుడు శాంతిని కల్గించును గాక ! అని అర్థము.

శ్లోకములోని **''హో''** అనుపదము ఆశ్చర్యార్థకము. వధ్యులగు అసురుల వధలో ఆశ్చర్యములేకున్నను వారినికూడ అట్టి చిత్రవధను చేయుటయా ! అని ఇచటి ఆశ్చర్యము. **''హో ఖేదే చాద్భుతే చ. వధ్యస్య వధేఽపి విచిత్రతాదర్శనేన ఖేదో జాయతే. విచిత్రతాదర్శనమేవ ఆశ్చర్యనిమిత్తమ్''** అని సంస్కృతవ్యాఖ్య. **''శమముపహరతు, సప్రభావ ప్రభా వః''** అనుపాఠాంతరము సంస్కృతవ్యాఖ్యలో చూపబడినది ఇచటి సమశబ్దము ఆత్మగుణములకు ఉపలక్షకమనియు అచట తెలుపబడినది.

''చక్రనేమిః వః శమ్ ఉపహరతు''

---

## శ్రీసుదర్శననేమి మీ పాపాలను నశింపజేయాలి.

**28.** యత్రామిత్రాన్దిధక్షౌ ప్రవిశతి బలినో ధామ నిస్సీమధామ్ని
గ్రస్తాపస్తాపశీర్ణైః ప్రగుణితసికతో మౌక్తికైః శాక్తికేయైః ।
రాశి ర్వారామపారాం ప్రకటయతి పున ర్వైరిదారాశ్రుపూరైః
వృద్ధిం నిర్యాతి నిర్యాపయతు స దురితాన్యస్త్రరాజప్రధి ర్వః ॥



నిస్సీమధామ్ని = అంతులేని తేజస్సును కల్గినదగు, యత్ర = ఏ సుదర్శనుని నేమి, అమిత్రాన్ దిధక్షౌ = శత్రువులను దహింపకోరినదియై, బలినః = బలిచక్రవర్తియొక్క, ధామ = గృహమును, ప్రవిశతి (సతి) - ప్రవేశించినది కాగా, గ్రస్తాపః = (తనచే) గ్రహింపబడిన నీటిని కల్గినది, తాపశీర్ణైః = (తన శిఖలయొక్క అగ్నిచే కల్గిన) తాపముచే చెదఱి కిందపడిన చూర్ణములైన, శాక్తికేయైః మౌక్తికైః = ముత్యపుచిప్పలకు చెందిన ముత్యములచే, ప్రగుణితసికతః = అధికముగా చేయబడిన ఇసుకను కల్గినది అగు, వారాంరాశిః = సముద్రము, నిర్యాతి(సతి) = (ఆ చక్రనేమి శత్రువులను దహించి) తిరిగి వచ్చినదికాగా, వైరిదారా + అశ్రుపూరైః = శత్రువుల భార్యల కన్నీటి ప్రవాహములచే, పునః = మరల, అపారాం వృద్ధిమ్ = అంతులేని వృద్ధిని, ప్రకటయతి= ప్రదర్శించుచున్నదో, సః = అట్టి, అస్త్రరాజప్రధిః = ఆయుధరాజమగు సుదర్శనుని నేమి, వః = మీయొక్క, దురితాని =పాపములను, నిర్యాపయతు = నశింపచేయునుగాక !

శ్రీసుదర్శనభగవానుడు సముద్రమార్గముద్వారా పాతాళలోకమున ప్రవేశించి, అచటనున్న రాక్షసులను నిర్మూలించి, తిరిగివచ్చిన రీతిని చమత్కారముగా కవి ఇందు వర్ణించుచున్నారు. శత్రువులను అందఱిని నిశ్శేషముగా దహింపవలయునను ఉద్దేశ్యముతో శ్రీసుదర్శనుని నేమి సముద్రమార్గమున పాతాళలోకమున ప్రవేశించునపుడు సముద్రములోని నీరు మొత్తము ఆవిరి అయ్యెను. **''ఇరుమ్బుణ్డ నీర్‌పోల్''** ( ఇనుము గ్రసించిన నీరువలె) అనునట్లు బాగుగా కాచబడిన ఇనుమును నీటిలో ముంచిన ఆనీటిని అంతటిని ఇనుము ఆకర్షించి, గ్రసించును. అట్లే, అపరిమితమైన తాపమును కల్గినది, **''నిజవిభవపరిచ్ఛిన్నభూమేశ్చ నేమేః''** అనునట్లు అంతులేనిదైయున్న చక్రనేమియందు సముద్రజలము ఆవిరి యగుట ఆశ్చర్యమేమున్నది ? అందుచే, పూర్తిగా నీరు లేకుండ ఎండిపోయిన సముద్రమందున్న ముత్యపు చిప్పలనుండి సుదర్శనునినేమియొక్క తాపమువలన చెదఱిన ముత్యములు అంతటను పడి, చూర్ణములై ఇసుకను మరింత వృద్ధి చేయుచున్నవి. శ్రీసుదర్శనము తిరిగివచ్చు సరికి ఏమయ్యెను ? అన్నచో, మరణించిన అసురుల స్త్రీలు కన్నీరు మున్నీరుగా విలపించుటచే, వారి కన్నీటి ప్రవాహము అచటనే ఇముడలేక, అచటినుండి ప్రవహించి, సముద్రమును నిండించినది. అందుచే సముద్రము పూర్వము కంటె అధికముగా జలసమృద్ధిని కల్గినదయ్యెను. ఇట్లగుటకు కారణమగు సుదర్శననేమి మీ పాపములు పోవునట్లు అనుగ్రహించును గాక !

అసురస్త్రీల కన్నీరు సముద్రమును నిండించినదను ఈ అతిశయోక్తి సుదర్శనునిచే సంహరింపబడిన అసురులు అసంఖ్యాకు లనుటను తెలుపుచున్నవి. **''దగ్ధు మిచ్ఛుః దిధక్షుః''** దహింపకోరువాడని అర్థము. **''బలినో ధామ''** మహాబలి నివసించు చోటు పాతాళము కదా ! **''అధోభువన పాతాళబలిసద్మ రసాతలమ్''** అని అమరకోశవచనము. **''గ్రస్తాపః''**

అనుటకు–**''అపామ్ సమూహః ఆపమ్, గ్రస్తం ఆపమ్ యస్య సః''** అనికాని, **''గ్రస్తా ఆపః యస్య సః''** అని కాని విగ్రహమును చెప్పనగును. **''శాక్తికేయ''** అనుటకు **''శుక్తికాభ్యో జాతాని''** అను తద్ధిత వృత్తిని చెప్పనగును.

''అస్త్రరాజప్రధిః వః దురితాని నిర్యాపయతు''

## శ్రీసుదర్శననేమి మీపాపాల ప్రభావాన్ని దహించాలి.

**29.** కక్ష్యా తౌల్యేన కద్రూతనయఫణమణీన్ కల్యదీపస్య యుంజన్
పాతాళాంతఃప్రపాతీ నిఖిల మపి తమః స్వేన ధామ్నా నిగీర్య ।
దైతేయప్రేయసీనాం వమతి హృది హృతప్రేయసాం భూయసా యః
చక్రాగ్రీయాగ్రదేశో దహతు విలసితం బహ్వసా వంహసాం వః ॥

యః = ఏ, చక్ర+అగ్రీయ+అగ్రదేశః = సుదర్శనుని నేమి, పాతాళాంతః ప్రపాతీ = పాతాళలోకమునందు ప్రవేశించినదై, కద్రూతనయ = కద్రువు కుమారులగు సర్పములయొక్క, ఫణ = పడగలలోని, మణీన్ = రత్నములను, కల్యదీపస్య = పగటి దీపముల, కక్ష్యా తౌల్యేన = వరుసతో సమానత్వమును, యుంజన్ = పొందించుచు, స్వేన ధామ్నా = తనయొక్క ప్రకాశముతో, నిఖిలమ్ = సమస్తమైన, తమః అపి = చీకటిని కూడ, నిగీర్య = గ్రసించి, భూయసా = మరల (లేక, అధికముగా), ( ఆచీకటిని), హృతప్రేయసామ్ = హరింపబడిన (చంపబడిన) భర్తలను కల్గిన, దైతేయప్రేయసీనామ్ = అసురుల భార్యలయొక్క, హృది = హృదయమందు, వమతి = వమనము చేయుచున్నదో (కక్కుచున్నదో), అసౌ = అట్టి, సుదర్శనుని ఈ నేమి, వః = మీయొక్క, అంహసామ్ = పాపములయొక్క, బహు విలసితమ్ = గొప్ప బలిమిని, దహతు = దహించునుగాక !

**(కక్ష్యా తౌల్యేన . . . .)** శ్రీసుదర్శనుని నేమి పాతాళలోకమున ప్రవేశించి, అచటి చీకటి నంతటిని తన ప్రకాశముచే కబళీకరించి, తిరిగివచ్చి ఆ చీకటిని విధవలైన అసురస్త్రీల హృదయములలో ప్రవేశింపచేయుచున్నదనుట ఇందలి సారాంశము. పాతాళమున అసంఖ్యాకములైన సర్పములుండుటచే వాని పడగలలలోని మణులు అచట నున్న చీకటిని అంతటిని పోగొట్టలేదా ? - అను ప్రశ్నకు సమాధానముగా మొదటి పాదము కూర్పబడినది. శ్రీసుదర్శనుని నేమి పాతాళలోకములోనున్న సర్పముల పడగలలో నున్న మణులను పగటి దీపముల తుల్యకక్ష్యలో చేర్చుచున్నవట. అనగా, ఒకే వరుసలో నుండునట్లు చేయుట, అనగా, వానిని అసత్కల్పముగా, వెలవెలపోవునట్ల చేయుచున్నవని సారము. **'కక్ష్యా'** అని



సంస్కృతవ్యాఖ్యాన పాఠము.

మూడవ పాదము చివర **''భూయసామ్ యః''** అని కొందఱు పఠింతురు. అపుడు **''అంహసామ్''** అనుపదమునకు దానిని విశేషణముగా అన్వయింపవలెను. ఇట్టి వ్యవహితాన్వయము కవికి వివక్షిత మనుట యుక్తము కాదు. కావున **''భూయసా''** అనుపాఠమే యుక్తము అనితోచును. మాటి మాటికి అనికాని, అధికముగా అనికాని అర్థము. భర్తలను పోగొట్టుకొనిన అసుర స్త్రీల హృదయములలో చీకట్లను వమనము చేయుట అనగా - ''అయ్యో ! ఇక మనకు ఏది గతి ? మనలను గమనించు వారెవ్వరు ? అను శోకసాగరమున మునిగి, ఆసముద్రము యొక్క దఱి తెలియక అలమటించునట్లు చేయుటయే. **''చక్రాగ్రీయాగ్రదేశః''** - అనునపుడు అగ్రీయ శబ్దము శ్రేష్ఠవాచకము. చక్రరాజమని అర్థము. **''పరార్ధ్యాగ్ర్యప్రాగ్రహర ప్రాగ్ర్యాగ్ర్యాగ్రీయమగ్రియమ్''** అను అమరకోశప్రమాణ మిచట స్మరణీయము. దాని అగ్రదేశమనగా నేమియే. సంస్కృతవ్యాఖ్యలో నాల్గవపాదము చివఱ **''భూయసా మంహసామ్''** అను పాఠము చూపబడినది.

''చక్రాగ్రీయాగ్రదేశః వః అంహసాం బహువిలసితం దహతు''

## శ్రీసుదర్శన నేమి మీకీర్తిని ప్రకాశింపజేయాలి.

**30.** కృష్ణాంభోదస్య భూషా కృతనయననయవ్యాహతిః భార్గవస్య
ప్రాప్తా మావేదయంతీ ప్రతిభటసుదృశా ముద్భటాం బాష్పవృష్టిమ్ ।
నిష్టప్తాష్టాపదశ్రీః సమ మమరచమూగర్జితై రుజ్జిహానా
కీర్తిం వః కేతకీభిః ప్రథయతు సదృశీం చంచలా చక్రధారా ॥

కృష్ణాంభోదస్య = భగవానుడను మేఘమునకు (నల్లని మేఘమునకు), భూషా = అలంకారము, భార్గవస్య = శుక్రునియొక్క, కృతనయననయవ్యాహతిః = చేయబడిన నేత్రహానిని కల్గినది, ప్రతిభటసుదృశామ్ = శత్రుభటుల స్త్రీలయొక్క, ఉద్భటామ్ = అధికమైన , బాష్పవృష్టిమ్ = కన్నీటి వర్షమును, ప్రాప్తామ్ = పొందినదిగా, ఆవేదయంతీ = తెలుపుచున్నది, నిష్టప్త = బాగుగా కాచబడిన, అష్టాపద = బంగారముయొక్క, శ్రీః = శోభను కల్గినది, అమరచమూ = దేవసేనలయొక్క, గర్జితైః సమమ్ = విజయ గర్జనలతో కూడ, ఉజ్జిహానా = ప్రకాశించునది, చంచలా = చంచలమైనదియు (మెఱుపువలె నున్నదియు) అగు, చక్రధారా = సుదర్శనుని నేమి, వః = మీకు, కేతకీభిః సదృశీమ్ = మొగలి పూలతో సమానమైన, కీర్తిమ్ = కీర్తిని, ప్రథయతు = ప్రకాశింపచేయుగాక !

శ్రీ సుదర్శనుని నేమికి, మెఱుపుకును సామ్యము తోచువిధమున ఇందు కవి పద ప్రయోగము చేయుట గమనింప తగినది. **''చంచలా చక్రధారా''** అనుచోట కవి హృదయము గుప్తముగా నున్నది. **''తటిత్‌సౌదామనీ విద్యుత్ చంచలా చపలా పి చ''** అను అమరకోశవచనమును బట్టి **''చంచలా''** అనుటకు మెఱుపు అను అర్థముతోపాటు, చలించునది అను వేరొక అర్థమును ఉండుటచే ఈరెండు అర్థములను కవి ఇందు వివక్షించి పల్కుచున్నారు. దానికి తగిన విధమున విశేషణములను అత్యంత చమత్కారముగా ప్రయోగించుచున్నారు.

**(కృష్ణాంభోదస్య భూషా)** - నీటిని గ్రహించిన మేఘమునకు మెఱుపు భూషణము. అట్లే, శ్రీ సుదర్శనుని నేమి శ్రీ కృష్ణుడు అను మేఘమునకు భూషణము.

**(కృతనయననయవ్యాహతిః భార్గవస్య)** - మెఱుపు మెఱయునపుడు కంటికి అడ్డు కల్గుట ప్రత్యక్షముగా అనుభవములోనున్న విషయము. నేమి శుక్రుని కంటికి వ్యాఘాతమును అనగా అడ్డును కల్గించెననుట ఇతిహాస పురాణప్రసిద్ధము. అది ఎట్లనగా - శ్రీ వామన మూర్తి యొక్క దివ్యరూప సౌందర్యమునకు, ముద్దుమాటలకు మిక్కిలి ఆకర్షితుడైన బలిచక్రవర్తి మూడడుగుల నేలను దానమిచ్చుటకు సిద్ధమైన సమయమున అతని గురువగు శుక్రుడు భగవానుని రూపమును, అతడు వచ్చిన తీరును, మాటను బాగుగా గమనించి, ''ఇతడు సాక్షాత్తు భగవానుడు, దేవకార్యము కొఱకు నీ సంపదను అంతటిని అపహరింప వచ్చెను. కావున నీవు ఇతనికి ఏమియు ఇచ్చుట తగదు'' అనుచు అతడిచ్చు దానమునకు అడ్డువచ్చెను. కాని, బలి అతని మాటలను పెడచెవినపెట్టి, జలధారతో దానము చేయ ప్రయత్నించెను. అపుడు శుక్రుడు కీటకరూపములో కలశమునుండి నీరు పడు తూములో అడ్డుగా నిలచెను. వామన మూర్తి తన చేతిలోని దర్భమొనతో ఆతూములోని అడ్డును తొలగించు రీతిలో శుక్రుని కంటిని పొడిచెను. అంత శుక్రుడు గుడ్డివాడై, అచటి నుండి బయటకు వచ్చెను. పిమ్మట బలి దాన మివ్వగా వామనుడు ఆదానమును గ్రహించెనునది భాగవతాదిపురాణప్రసిద్ధము. పెరియాళ్వార్లు **''శుక్కిరన్ కణ్ణై త్తురుమ్బాల్ కిళరియ శక్కరక్కైయన్''** అని సాయించుటచే భగవానుని చేతిలో నున్న దర్భలో సుదర్శనమూర్తి ఆవేశించియుండెనని, తద్ద్వారానే భగవానుడు శుక్రుని కంటిని పొడిచి, గుడ్డి వానిని చేసెనని తెలియుచున్నది. **''అస్త ద్వారశోధనమ్ పణ్ణువాఱైప్పోలే తిరుక్కైయిల్ తిరుప్పవిత్రత్తినుడైయ అగ్రత్తాలే, అవన్ కణ్ణై క్కలక్కిన తిరువాళ్ళియై కైయిలే ఉడైయవనే – తురుమ్బాల్ కిళరియ శక్కరక్కైయన్ – ఎజ్జైయాలే అస్త పవిత్రాగ్రమాయ్ ప్పుకున్దు అవన్‌కణ్ణై కలక్కి్రాం''** అను శ్రీవరవరమునుల వ్యాఖ్యానసూక్తి ఇచట అనుసంధేయము. ఇట్లు భగవానుడు తలచిన చోట అంతట **''కరుదుమిడమ్ పొరుదుపునల్''** అనురీతిలో స్వామి ఆశించిన రూపములను పొంది, కార్యమును సిద్ధింపచేయు స్వభావమును కల సుదర్శనుడు



బలిదానము చేయు సమయమున దర్భరూపములో నుండెననుట సిద్ధము. విద్యుత్ పరమైన అర్థములో **''భార్గవస్య''** అనుపదము అవివక్షితమనదగును. **''కృతనయనయనవ్యాహతిః''** అనుపాఠము సంస్కృతవ్యాఖ్యలో ఆదరింపబడినది. **''నయో నీతిః, నయనం నేత్రం, తయోః వ్యాహతిః, వ్యాఘాతః, కృతా నయనయన వ్యాహతిః యయాస''** అని అందు వివరింపబడినది. అనగా బలిచక్రవర్తి శుక్రుని మాటను వినకుండునట్లు చేసి, ఆ శుక్రుని నేత్రమును పోగొట్టెనని భావము. భార్గవశబ్దమునకు పరశురాముడను అర్థముండుటచే పరశురాముని నీతిని, శుక్రుని నేత్రమును హరించెనని వేరొక వ్యాఖ్యాత వివరణము.

**(ప్రాప్తా మావేదయంతీ)** - మెఱుపు వెను వెంటనే వర్షము కుఱియుటను సూచించును. చక్రనేమియు శత్రుస్త్రీలు విశేషముగా కన్నీరు విడుచుటకు సూచకమగును. ఇచట కూడ మెఱు పు పక్షమున **''ప్రతిభటసుదృశామ్'', ''బాష్ప''** అను పదములు అవివక్షితములు.

**(నిష్టప్తాష్టాపదశ్రీః)** - చక్కగా తప్తమైన బంగారము యొక్క కాంతివంటి కాంతిని కల్గియుండుట మెఱుపుకు, చక్రనేమికిని సమానము.

**(అమరచమూగర్జితైః సమ ముజ్జిహానా)** - మెఱుపు మేఘ గర్జనలతో ప్రకాశించును. నేమియు దేవసైన్యముల విజయగర్జనలతో కూడియుండును. అమరులచే, రాక్షసులచే పీడింపబడిన దేవతలు వారిని **''ద్రోహి ! ద్రోహి!''** అని పెద్దగా అఱచి సహాయమునకై ఎలుగెత్తి పిలచినపుడు వెంటనే సుదర్శనము అచట ప్రత్యక్షమగును. ఇచట కూడ మెఱుపు పక్షమున **''అమరచమూః''** శబ్దము అవివక్షితము.

ఇట్టి సామ్యములను కల్గియుండుటచే **''చంచలా''** (మెఱుపు) అనునట్లున్న చక్రనేమి మీ కీర్తిని వృద్ధిచేయవలయును. అని తాత్పర్యము. **''కీర్తిమ్''** అను పదమునకు **''కేతకీభిః సదృశీమ్''** అను విశేషణమును ప్రయోగించుటలోని అందము వర్ణింపనలవికానిది. ఇందలి స్వారస్యమును పూర్తిగా తెలియగల్గినవారు కలరా ! అనునది సందేహాస్పదము. మెఱుపు మెఱసినచో మొగలి పూచునను అనుభవసాక్షికమైన విషయ మిచట అవధేయము. మెఱుపుకు, చక్రనేమికిని కల సాధర్మ్యమును తెలుపు శ్లోకమగుటచే క్రియయందును ఐక్యము తోచుటకై **''కేతకీభిః సదృశీమ్''** అనుచు కీర్తికి విశేషణమును కవి ప్రయోగించిరి కాబోలు ! కీర్తియందు కవిసమయముచే సిద్ధమైన ధావళ్య (అనగా తెల్లనిదనము) నిబంధనమైన కేతకీసాదృశ్యమున్నను ప్రస్తుతమున ఐక్యమే ప్రధానముగా వివక్షిత మనదగును. **''చంచలా కేతకీ యథా ప్రథయతి తథా చక్రధారా వః కీర్తిం ప్రథయతు''** – అనగా మెఱుపు మొగలిపూలను వికసింపచేయునట్లే చక్రధార

మీ కీర్తిని వికసింపచేయును గాక !'' అని ఈ సూక్తి తాత్పర్యము. విద్యుత్ స్వరూపమైన చక్రనేమి కేతకీస్వరూపమైన కీర్తిని వికసింపచేయును గాక అని సారము. మొదటి పాదమున **''కృతనయన నయన''** అను పాఠాంతరము ఆదరణీయము కాదు అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి సూక్తి. చక్రనేమిని కవి విద్యుల్లతగా రూపించుటకు అనుగుణముగా **''మిన్ వట్టచ్చుడరాళి''** అను కులశేఖర సూక్తి, **''మిన్నుమ్ ఆళి'', ''మిన్ ఆళిప్పడైయాన్''** అను శఠకోపసూరి సూక్తి, ఇంకను ఇట్టి పలుదివ్యసూరుల సూక్తులు స్మరణీయములు.

''చంచలా చక్రధారా కేతకీభిః సదృశీం కీర్తిం ప్రథయతు''

## శ్రీసుదర్శన నేమి మీకు ఇంద్రియ నిగ్రహాన్ని కల్గించాలి.

**31.** వప్రాణాం భేదనీం యః పరిణతి మఖిలశ్లాఘనీయాం దధానః
క్షుణ్ణాం నక్షత్రమాలాం దిశిదిశి వికిరన్ విద్యుతా తుల్యకక్ష్యః ।
నిర్యాణేనోత్కటేన ప్రకటయతి నవం దానవారిప్రకర్షం
చక్రాధీశస్య భద్రో వశయతు భవతాం స ప్రధి శ్చిత్తవృత్తిమ్ ॥

యః = ఏ సుదర్శనుని నేమి, వప్రాణాం భేదనీమ్ = (శత్రువుల పట్టణములలో నున్న) ప్రాకారములను భేదింపగల్గినది, (తీరములను శిథిలముచేసి కూలగొట్టకల్గినది), అఖిల శ్లాఘనీయామ్ = అందఱిచే పొగడబడతగినదియు, అగు, పరిణతిమ్ = పరిపాకమును, దధానః = కల్గినది, క్షుణ్ణామ్ = చూర్ణము చేయబడిన, నక్షత్రమాలామ్ = నక్షత్రసమూహమును (నక్షత్రమాల అను గజాలంకరణమును), దిశిదిశి = అన్ని దిక్కులయందు, వికిరన్ = వెదజల్లునది, విద్యుతా తుల్యకక్ష్యః = మెఱుపుతో సాటియగునది (మెఱుపు వంటి నడుమునకు కట్టబడిన దారమును కల్గినది), ఉత్కటేన నిర్యాణేన = భయంకరమైన బాహ్యప్రకటనముచే (పెద్దదైన అపాంగ(గండ) ప్రదేశముచే), నవమ్ = క్రొత్తదైన, దానవారిప్రకర్షమ్ = భగవానుని యొక్క గొప్పతనమును (మదజల ప్రవాహమును), ప్రకటయతి = ప్రకాశింపచేయుచున్నదో, సః = అట్టి, భద్రః = మంగళకరమైన (భద్రమను గజవిశేషము వంటి), చక్రాధీశస్య ప్రధిః = సుదర్శనముయొక్క నేమి, భవతామ్ = మీయొక్క, చిత్తవృత్తిమ్ = మనోవృత్తిని, వశయతు = (ఇష్టము వచ్చినట్లు ప్రవర్తింపకుండ) అణచునుగాక ! (వశీకరింప చేసుకొనుగాక !)

**''చక్రాధీశస్య భద్రః ప్రధిః భవతామ్ చిత్తవృత్తిం వశయతు''** అను సూక్తి విన్యాసమున అర్థద్వయము భాసించుచున్నది. **''భద్ర శ్శివే ఖంజరీటే వృషభే తు కదంబకే, కరిజాతివిశేషే వా . . . త్రిషు శ్రేష్ఠే చ సాధౌ చ''** అను మేదినీ కోశప్రమాణమునుబట్టి మంగళకరమైన అను అర్థము, గజజాతి విశేషమును అర్థమును ఇచట వివక్షితములు. గజజాతిలో భద్రమను ఒక



జాతివిశేషము కలదు. ఆ జాతికి చెందిన గజమునకు, చక్రనేమికిని సాధర్మ్యము ప్రతిపాదించునట్టి చమత్కార విశేషము ప్రకాశించునట్లు విశేషణములను ప్రయోగించు వైచిత్రి ఇచట గమనార్హము.

**(వప్రాణాం భేదనీమ్ అఖిలశ్లాఘనీయామ్‌పరిణతిం దధానః) – ''వప్రః ప్రాకారరోధసోః''** అను నిఘంటువచనము చొప్పున తీరములను శిథిలము చేసి కూలగొట్టు పరిణతిని గజము కల్గియుండును. (ఇట్టి క్రియకు తిర్యక్ దంత ప్రహారమని పేరు) ఉద్ఘాతకేళిని చేయునని తాత్పర్యము. **''వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయమ్''** అని మేఘసందేశమున మహాకవియు పల్కెను. **''తిర్యక్ దంతప్రహారీ తు గజః పరిణతో మతః''** అను కోశవచనమునకు ప్రత్యభిజ్ఞాపకముగా ఇచట **''పరిణతిం దధానః''** అని కవి ప్రయోగించిరి. సుదర్శననేమి శత్రునగర ప్రాకారములను నశింపచేయునట్టి పరిపాకమును కల్గినది. **''భేదినీమ్''** అని సంస్కృతవ్యాఖ్యాన పాఠము. **''ప్రాంశుప్రాకార ప్రాతికూల్యప్రభేదనపటీయసీమ్''** అని అచటి వివరణము. సుదర్శనుని పక్షమున **''వప్రాణామ్''** అనుటకు **''ప్రాకారాణాం వప్రఘటిత శరీరాణాం ప్రత్యాగవ్య స్థితానాం శత్రూణాం ఇత్యర్థః''** అని సంస్కృతవ్యాఖ్యాత వివరించెను. అంగరక్షకులతోకూడి యుద్ధమునకు వచ్చిన శత్రువుల శరీరములయొక్క అని దీనిభావము. వప్రశబ్దమునకు అంగరక్షకుడను అర్థము తెలుగు వ్యాఖ్యానమున ఎట్లు తెలుపబడినదో తెలియకున్నది. ప్రాకారమువలె అంగరక్షకులను రక్షింతురను భావమున చెప్పబడినదేమో ! **''అఖిలజన శ్లాఘనీయాం పరిణతిం దధానః''** అను ప్రయోగమును సంస్కృతవ్యాఖ్యానమున **''సమస్త జనస్తుత్యాం పరిణతిం పరమపురుషరూపతాం విహాయ ఆచ్ఛాద్య, చక్రరూపతా వ్యాప్తిః పరిణతిః, తాం దధానః, అథవా అఖిల శ్లాఘ్యా ముద్ధతానా మౌద్ధ్యత్య భేదినీం పరితో నమ్రతాం దధానః, చక్రప్రధిః పరితో నమ్ర ఏవస్థితః . లోకే తావత్ మహానేవ నమ్రశ్చేత్ శ్లాఘ్యతరో భవతి , అనమ్రాన్ నమ్రయతిచ''** అని వివరించెను. అనగా పరమపురుష రూపమును వీడి , సుదర్శనుడు సమస్తజనులచే స్తుతింపబడు చక్రరూప పరిణతిని పొంది అని , లేక - అందరిచే పొగడబడునట్టి, ఉద్ధతుల గర్వమును అణచునట్టి, అంతట నమ్రతను ధరించునట్టిదై అని అర్థము. లోకమున వినమ్రుడై ఉన్న గొప్పవాడే మిక్కిలి పొగడబడును. మరియు ఇతరులను నమ్రులుగా చేయును. అనగా, తమ వశమును గావించుగొనును అని భావము. ఇందులకు **''నమ్రత్వేన ఉన్నమంతః ''** ఇత్యాది సూక్తులు ఉదాహరణీయములు.

**(క్షుణ్ణాం నక్షత్రమాలాం దిశిదిశి వికిరన్) – ''సైవ నక్షత్ర మాలా స్యాత్ సప్త వింశతి మౌక్తికైః''** అను అమరకోశవచనము ప్రకారము ఇరువది ఏడు ముత్యములను కూర్చిన హారమునకు నక్షత్రమాల అనిపేరు. **''సప్తవింశతి ముక్తాఫలవిరచితో హారవిశేషో నక్షత్రమాలే త్యుచ్యతే''** అని

సంస్కృతవ్యాఖ్యాన వివరణము. దీనికి గజమునకు అలంకారముగా ఉపయోగింతురు. భద్రగజము దానిని పొడిపొడిగా చేసి, వెదజల్లును. సుదర్శననేమి అన్నచో, **''తారాగణకణవితతిద్యోతితద్యుప్రచారా''** (26) అని, **''నక్షత్రక్షోదభూతిప్రకరవికిరణ శ్వేతితాశావకాశాన్''** (35) అనియు ముందు, వెనుకను గలశ్లోకములలో తెలుపబడిన విధమున నక్షత్రసమూహములను అంతట చిందునట్లు చేయును. సుదర్శననేమి ప్రతాపమున నక్షత్రగణములన్నియు కణములు కణములై, చూర్ణితములగుచున్నవని తాత్పర్యము.

**(విద్యుతా తుల్యకక్ష్యః)** – **''దూష్యా కక్ష్యా పరత్రా చ''** అని, **''కక్ష్యా మత్తేభబంధనీ''** అనియు గల నిఘంటువచనముల ప్రకారము కక్ష్య అనగా గజమును కట్టు బంధనము. అది మెఱుపువలె తళతళమని గజమునకు మెఱయుచుండును. నేమి పక్షమున, విద్యుత్తుతో సమానస్కంధమని అర్థము. **''అథవా తడితా తుల్యా కక్ష్యా నేమ్యంచలప్రదేశో యస్య సః''** అని సంస్కృతవ్యాఖ్యానములోని వేరొక యోజనము.

**(ఉత్కటేన నిర్యాణేన నవం దానవారి ప్రకర్షం ప్రకటయతి)** – **''అపాంగదేశో నిర్యాణమ్''** అను అమరకోశవచనమువలన నిర్యాణశబ్దము గజముయొక్క అపాంగదేశమును తెలుపును. **''దానం గజమదే త్యాగే''** అను కోశవచనము వలన దానమనుటకు ఏనుగు మదమని, త్యాగమనియు అర్థములు. ఈ రెండును ఇచట వివక్షితములు. భద్రగజపక్షమున దానవారి అనగా మదజలము. భద్రగజము తనగొప్పదైన అపాంగప్రదేశమునుండి మదజలమును స్రవింపచేయును. నేమి పక్షమున నిర్యాణమనగా నిస్సరణము. అనగా వెలువరించుట. సుదర్శనము బయటకు రాగానే భగవానునకు అపూర్వమైన ఒక ఉత్కర్ష కలుగును. ఈ ప్రకర్ష శత్రువిజయ రూపమైనది. ఈ అర్థమున **''దానవానామ్ అసురాణామ్, అరిః శత్రుః''** అని భగవానుని సూచించినట్లయినది. **''దానవారి ప్రకర్షమ్''** అనుప్రయోగము సంస్కృతవ్యాఖ్యలో **''దానవారయోః దేవాః, తేషాం ప్రకర్షమ్ అతిశయమ్''** అని ప్రకారాంతమున వ్యాఖ్యానింపబడినది.

**(భద్రః ప్రధిః భవతామ్ చిత్త వృత్తిం వశయతు)** - ఫలశ్రుతియందును చమత్కారము ప్రకాశించునట్లు కవి చేయుశబ్దప్రయోగము గమనింపతగినది. **''వశాం కరోతి వశయతి''** అని అగును. **''వశా స్త్రీ కరిణీ చ స్యాత్''** అను అమరకోశవచనము ప్రకారము **'వశా'** అనుటకు ఆడ ఏనుగు అని అర్థము. మగ ఏనుగు తన చిత్తవృత్తిని తన ఆడ ఏనుగుకు అధీనము చేయునట్లు, చక్రనేమి ఇంద్రియాశ్వములు మిమ్ములను విషయవీథిలో ఈడ్చుకొనిపోకుండ, మీ చిత్తవృత్తిని మీకు స్వాధీనముచేసి, రక్షించును గాక ! అని తాత్పర్యము. **''వశాం కరోతి''** అని అన్నచో కరిణికి అధీనముచేయునను అర్థము స్ఫురించునా ? అనినచో **''స్వచిత్తవృత్తిం కరిణీం కరోతి''** అన్నచో **''కరిణీమయీామ్ కరోతి''** అను అర్థము నిచ్చునదియై, **''కరిణ్యామ్ అధీనామ్ కరోతి''**



అని పిండితార్థము అగుటలో ఎట్టి విప్రతిపత్తి లేదుకదా **!''చక్రాధీశస్య''** అనుటకు **''మహారాజస్య''** అను అర్థము సంస్కృతవ్యాఖ్యలో కలదు.

''చక్రాధీశస్య ప్రధిః భవతాం చిత్తవృత్తిం వశయతు''

---

## శ్రీసుదర్శన నేమి మీకు విజయాన్ని ఇవ్వాలి.

**32.** నాకౌకశ్శత్రుజత్రుత్రుటనవిఘటితస్కంధనీరంధ్రనిర్యత్ –
నవ్యక్రవ్యాస్రహవ్యగ్రసనరసలసజ్జ్వాలజిహ్వాలవహ్నిమ్ ।
యం దృష్ట్వా సాంయుగీనం పున రపి విదధత్యాశిషో వీర్యవృద్ధ్యై
గీర్వాణా నిర్వృణానా వితరతు స జయం విష్ణుహేతిప్రధి ర్వః ॥

నాకౌకస్ = దేవతల, శత్రు = శత్రువులగు, జత్రు = స్కంధములను, త్రుటన = తుంచుటచే, విఘటిత = వేరుచేయబడిన, స్కంధ = స్కంధభాగములనుండి, నీరంధ్ర = నిరంతరము, నిర్యత్ = స్రవించు, నవ్య = కొత్తదైన, క్రవ్య = మాంసము, అస్ర = రక్తము అను, హవ్య= హవ్యములను, గ్రసన = మింగుటలో (కల్గిన), రస = ఆశతో, లసత్ = ప్రకాశించు, జ్వాల = జ్వాలఅను, జిహ్వాల = నాలుకను కల్గియున్న, వహ్నిమ్ = అగ్నిని కల్గినది, సాంయుగీనమ్ = యుద్ధమును చేయుటలో సమర్థమైన, యమ్ = ఏ సుదర్శననేమిని, దృష్ట్వా = చూచి, నిర్వృణానాః = సంతోషించుచున్న, గీర్వాణాః = దేవతలు, పునః+అపి = తిరిగి, వీర్యవృద్ధ్యై = (సుదర్శనమునకు) అధికాధికముగా పరాక్రమము వృద్ధిఅగుటకొఱకు, ఆశిషః విదధతి = మంగళాశాసనములను చేయుచున్నారో, సః = అట్టి, విష్ణుహేతిప్రధిః = సుదర్శనముయొక్కనేమి, వః = మీకు, విజయమ్ = విజయమును, వితరతు = ఇచ్చునుగాక !

పూర్వార్థమంతయూ ఒకే సమస్తపదము. **''నాకః ఓకః యేషాం తే నాకౌకసః''** - అనగా స్వర్గమును వాసస్థానముగా కలవారు దేవతలు. వారికి శత్రువులు అసురులు, రాక్షసులను. వారియొక్క జత్రువులు- అనగా బాహుసంధి ప్రదేశములు. వాటిని ఖండించుటచే తెగిపడిన భుజములనుండి నిరంతరము స్రవించుచున్న నూతనమైన మాంసము, రక్తములు అను హవిస్సును భక్షించుటలోని ఆతురతచే అహమహమికతో నర్తనముచేయు జ్వాలలు అను నాలుకలను కలవాడు అగు అగ్నిని కల్గినది, యుద్ధమున సమర్థమైనదియు సుదర్శన చక్రముయొక్కనేమి. దానిని దేవతలుచూచి, సంతోషించి దానికి మరింత వీర్యవృద్ధి కలుగవలెనను ఉద్దేశ్యముతో మంగళాశాసనములను చేయుచున్నారు. అట్టి చక్రనేమి మీకు జయమును కల్గించును గాక !

క్రవ్యమనగా మాంసము. అస్రము అనగా రక్తము. ఈ రెండింటిని హవిస్సుగా

రూపించుటకు కారణము అవి చక్రాగ్నికి భోగ్యములగుటయే. అగ్నియొక్క జ్వాలలను జిహ్వాలుగా చెప్పుటకలదు. **''సప్తజిహ్వాః''** అనుపేరు అగ్నికి కలదుకదా ! చక్రాగ్నిజ్వాల తళతళమని జ్వలించుటను చూడగా, అసురుల నవ్యక్రవ్యాస్రహవ్యములను గ్రహించుటకు చక్రాగ్నితన నాలుకను చాచుచున్నాడా ! అన్నట్లున్నది. **''రసలసత్''** అనునపుడు లసనమనగా నర్తనము. లాస్యమని నర్తనమును తెలుపుట కలదుకదా ! జ్వాలశబ్దమిచట పుంలింగము. **''వహ్నేర్ద్వయోః జ్వాలకీలౌ''** అను అమరకోశ వచనము ఇందులకు ప్రమాణము. **''సాంయుగీనమ్''** - సాంయుగమనగా యుద్ధము. అందు సమర్థుడు సాంయుగీనుడు. **''సాంయుగీనో రణే సాధుః''** అని అమరము. **''సంయుగే రణే సాధుః''** అని దీని వ్యుత్పత్తి. ''ప్రతిజనాదిభ్యః ఖఞ్'' **(4-4-99)** అను పాణిని సూత్ర మిచట స్మరణీయము.

''విష్ణుహేతిప్రధిః వః విజయం వితరతు''

## శ్రీసుదర్శననేమి మీ అవిద్యను తీర్చాలి.

**33.** ధన్వాధ్వన్యస్య ధారాసలిల మివ ధనం దుర్గతస్యేవ దృష్టిః
జాత్యంధస్యేవ పంగోః పదవిహృతి రివ ప్రీణనీ ప్రేమభాజామ్ ।
పత్యు ర్మాయాః క్రియాయాం ప్రకటపరిణతి ర్విశ్వరక్షాక్షమాయాం
మాయా మాయామినీం వ స్త్రుటయతు మహతీ నేమి రస్త్రేశ్వరస్య ॥

ధన్వాధ్వన్యస్య = ఎడారిలో ప్రయాణము చేయువానికి, ధారాసలిలమ్ ఇవ = ప్రవాహజలమువలె, దుర్గతస్య = దరిద్రునకు, ధనమ్ ఇవ = ధనమువలె, జాత్యంధస్య = పుట్టుగుడ్డివానికి, దృష్టిః ఇవ = కనుచూపువలె, పంగోః = కుంటివానికి, పదవిహృతిః ఇవ = పాదములతోసంచరించి, క్రీడించుట వలె, ప్రేమభాజామ్ = భక్తులకు, ప్రీణనీ = ప్రీతిని కల్గించునదియు, మాయాః పత్యుః = శ్రియః పతియొక్క, విశ్వరక్షాక్షమాయామ్ = లోకములను అన్నిటిని రక్షింపగల్గిన, క్రియాయామ్ = వ్యాపారమందు, ప్రకటపరిణతిః = ప్రకాశించిన పరిణతిని కల్గినదగు, అస్త్ర+ ఈశ్వరస్య = చక్రాయుధముయొక్క, మహతీ = గొప్పదైన, నేమిః = నేమి, వః = మీ యొక్క, ఆయామినీం మాయామ్ = అవిచ్ఛిన్నమైన అవిద్యను, త్రుటయతు = విచ్ఛిన్నముచేయునుగాక !

ఎడారి నేలలో పయనించుచు, దాహముతో నాలుక పిడుచకట్టుకొని పోవువానికి ప్రవాహపానీయము లభించునట్లు, గర్భదరిద్రునకు ధనలాభము కల్గునట్లుగా, పుట్టుగుడ్డికి నేత్రలాభము కల్గునట్లుగా, కుంటివానికి స్వేచ్ఛా సంచారయోగ్యత కల్గునట్లుగా, శ్రీసుదర్శనుని నేమి భక్తులకు ప్రీతి జనకమైయున్నది. దాహము గొన్నవాడు చల్లని నీటిని చూచి



సంతోషించునట్లు, దరిద్రుడు నిధినిచూచి సంతోషపడునట్లు, గుడ్డివాడు చూపును పొంది ఆనందపడునట్లు, కుంటివాడు నడకను పొంది ఆనందముపొందునట్లును భక్తులు శ్రీసుదర్శనుని నేమిని చూచి ఆనందింతురు అని తాత్పర్యము. తమ ఇష్టప్రాప్తికి, అనిష్టనివృత్తికిని నేమి సాధనమైయుండుటచే వారి కట్టి ఆనందము కల్గును.

లోకములను ఉజ్జీవింపచేయుటకై భగవానుడు చేయువ్యాపారము లన్నిటిని సుదర్శనుని సహాయకునిగా చేయునని పిండితార్థము. శ్రీసుదర్శనుని నేమియే భగవానుని లోకరక్షణక్షమమైన వ్యాపారమురూపమున పరిణమించుననుటకు విశ్వరక్షణము సుదర్శనాధీనమని తాత్పర్యము. **''విశ్వరక్షాక్షమాయాం క్రియాయాం విషయే మాయాః పత్యుః ప్రకటపరిణతిః''** అని అన్వయించి, చక్రనేమి భగవానునిగా పరిణమించుచున్నదని అర్థమును చెప్పువారును కొందఱు (సంస్కృతవ్యాఖ్యాత) కలరు. సుదర్శనుని విశ్వరక్షణవైభవము ఈ స్తుతిలోని చివరిశ్లోకమునందును ప్రపంచితము. **''పత్యు ర్మాయాః''** అనునదియే ప్రాచీన పాఠము. మా అనగాలక్ష్మి. ఆమె పతి **''మాయాః పతి''** అనగా సర్వేశ్వరుడు. **''మాయా క్రియాయామ్''** అనువేరొక పాఠమునందును బాధకమేమియులేదు. ఈ పాఠము సంస్కృతవ్యాఖ్యలో చూపబడినది. ఇచట మాయా శబ్దమునకు విచిత్రవ్యాపారము అని తాత్పర్యము. ఇట్టి చక్రనేమి మీయొక్క ఆయామిని యగు మాయను విచ్ఛిన్నముచేయుగాక ! **''దైర్ఘ్య మాయామ ఆనాహః''** అను అమరకోశవచనమును బట్టి **''ఆయామినీమ్''** అనగా దీర్ఘమైనది. అనగా అనాదియైనది, అవిచ్ఛిన్నమైనది అనిఅర్థము. మాయ అనగా అవిద్య. ధారాసలిలమనుటకు మేఘమునుండి ధారగా వర్షింపబడుజల మనియు అర్థమును చెప్పవచ్చును. **''సమానౌ మరుధన్వానౌ'', ''అధ్వనీనోఽధ్వగోఽధ్వన్యః''** అను అమరకోశప్రమాణములు ప్రస్తుత శ్లోకప్రథమపాదవ్యాఖ్యలో స్మరణీయములు. **''ధారసలిల''** మనుటకు సంస్కృతవ్యాఖ్యలో **''వర్షదంబుద్ధర నిరర్గలవినిర్గలత్సలిలపటలమివ''** అనివేరొక అర్థముకూడ చూపబడినది. అనగా ధారాపాతముగా వర్షించు మేఘజలము అని అర్థము.

''అస్త్రేశ్వరస్య మహతీ నేమిః వః ఆయామినీం మాయాం త్రుటయతు''

## శ్రీసుదర్శననేమి మీకు సంపదను ఇవ్వాలి.

**34.** త్రాణం యా విష్టపానాం వితరతి చ యయా కల్ప్యతే కామపూర్తిః
న స్థాతుం యత్పురస్తాత్ ప్రభవతి కలయాఽ ప్యోషధీనా మధీశః ।
ఉన్మేషో యాతి యస్యా న సమయనియతిం సా శ్రియం వః ప్రదేయాత్
న్యక్కృత్య ద్యోతమానా త్రిపురహరదృశం నేమి రస్త్రేశ్వరస్య ॥

యా = ఏ సుదర్శనునినేమి, విష్టపానామ్ = లోకములకు, త్రాణమ్ = రక్షణను, వితరతి = ఇచ్చుచున్నదో, యయా = ఏ నేమిచే, కామపూర్తిః = మన్మథునకు పూర్తి (కోరికలపూర్తి), కల్ప్యతే = చేయబడుచున్నదో, యత్పురస్తాత్ = ఏనేమియొక్క ఎదురుగా, ఓషధీనా మధీశః = చంద్రుడు, కలయా+ అపి = ఒక కళమాత్రముగానైనను, స్థాతుమ్ = నిలచుటకు, న ప్రభవతి = సమర్థుడు అగుటలేదో, యస్యాః = ఏ నేమియొక్క, ఉన్మేషః = ప్రకాశవిజృంభణము, సమయనియతిమ్ = కాలనియమమును, న యాతి = పొందుటలేదో, (కావుననే), త్రిపురహరదృశమ్ = త్రిపురములను దగ్ధము చేసిన శివుని కంటిని, న్యక్కృత్య = తిరస్కరించి, ద్యోతమానా = ప్రకాశించుచున్నదైయున్నదో, అస్త్ర+ ఈశ్వరస్య = సుదర్శనునియొక్క, సా = అట్టి, నేమిః = నేమి, వః = మీకు, శ్రియమ్ = సంపదను, ప్రదేయాత్ = ఇచ్చునుగాక !

త్రిపురములను దగ్ధముచేసిన శివుని ఫాలనేత్రమును తన స్వభావములతో తిరస్కరించి, ప్రకాశించునట్టిది శ్రీసుదర్శనభగవానుని నేమి. ఆ విషయమును కవి ప్రస్తావించిన తీరు అత్యద్భుతము.

**(యా విష్టపానాం త్రాణం వితరతి చ)** - శివుడు సంహారకర్త అగుటచే అతని నేత్రము లోకములకు నాశహేతువై యుండును. కాని, చక్రనేమి లోకరక్షణ దక్షిణమై యుండును. ఇచటి 'చ' కారము అనుక్తసముచ్చాయకముగా గ్రహించినచో, దానిచే జన్మ, సంహారములు రెండును చెప్పబడినవగును. అపుడు చక్రనేమి సృష్టిస్థితి సంహారములను చేయునని తాత్పర్యము. త్రిలోచనుని నేత్రము కేవలము సంహారాత్మకమే కదా ! **''చకారాత్ కామద్యరిషడ్వర్గ జన్మరక్షణ సంహారాః సమాకృష్టాః''** అని సంస్కృతవ్యాఖ్య.

**(యయా కామపూర్తిః కల్ప్యతే చ)** - శివుడు తపస్సుచేయునపుడు మన్మథుడు అతనికి సమాధిభంగమును చేయరాగా, శివుడు తన ఫాలనేత్రముతో అతనిని దహించి, శరీరములేనివానినిగా చేసెను. కావున త్రిపురహరుని నేత్రము కామనాశకల్పకము. కాని, చక్రనేమి అట్లుకాక, భక్తుల కామములను అనగా కోరికలను పూర్తిచేయగల్గినది. ఇచటకామ శబ్దము శ్లిష్టము. మన్మథుడు, కోఱిక అను రెండర్థములు వరుసగా వివక్షితములు. ఇచట కూడా **'చ'**కారము అనుక్తసముచ్చాయకమే. **''కామపూర్తి శ్చ''** అనునపుడు పూర్తిశబ్దమునకు అంతమను అర్థమును, **'చ'**కారమునకు కామాది అరిషడ్వర్గము అను అర్థమును గ్రహించినచో, అరిషడ్వర్గపూర్తిని- అనగా అంతమును నిర్వహించునని స్ఫురించును. **''త్రాణం యా విష్టపానామ్ వితరతి, కామపూర్తిః కల్ప్యతే''** అను రెండు వ్యాఖ్యానముల ద్వారా సుదర్శన- త్రినయననేత్రముల మధ్య సాధర్మ్యము, **''న స్థాతుం - - -'', '' ఉన్మేషో యాతి''** ఇత్యాది వాక్యద్వయముచే శివుని నేత్రముకంటే సుదర్శనమునకు కల వైలక్షణ్యమును ప్రతిపాదింపబడినవని



సంస్కృతవ్యాఖ్యాత పల్కెను. దీనివలన ఇచట ఉపమేయాధిక్యము స్ఫురించుటచే వ్యతిరేకాలంకార ధ్వనియు కలదని చెప్పనగును. **''త్రాణం యా విష్టపానాం వితరతి చేతి యయా కల్ప్యతే కామపూర్తి రితిచ, ప్రాథమికాభ్యాం ద్వాభ్యాం వాక్యాభ్యాం నేమేః త్రినయననయనసాధర్మ్యే ప్రతిపాదితే, విశిష్టాభ్యాం వాక్యాభ్యాం నేమేః త్ర్యంబకనయనాధిక్యాం ప్రత్యపాది. సంభూయ చతుర్భిః వాక్యైః త్రినయన తృతీయనయనాత్ వ్యావృత్తిః నిరూపితా''** అని సంస్కృతవ్యాఖ్యాన వివరణము.

**(న స్థాతుం యత్పురస్తాత్. . . అధీశః)** - దక్షప్రజాపతి శాపమువలన క్షయరోగమును పొంది, కళను పోగొట్టుకొని వచ్చి శరణువేడిన కళావశిష్టుడైన చంద్రుని శివుడు తన తలపై ధరించి, వరమొసగి, రక్షించిన వాడగుటచే ఓషధీశుడగు చంద్రుడు ముక్కంటియొక్క కంటిముందు కలామాత్రముగానైనను నిలుపగల్గిన వాడయ్యెను. కాని, చక్రనేమికి ఎదురుగా ఆచంద్రుడు కళామాత్రముగా కూడ నిలుపజాలడు. **''కుముదినీమిత్ర ! తే కుత్ర తేజః''** అని కవి ఇంతకుముందే చంద్రుని కాంతి సుదర్శనుని కాంతిముందు అసత్కల్పమయ్యెనని పల్కిరికదా ! కళాశబ్దమునకు గల 16వ భాగమను అర్థము, చంద్రకళ అను అర్థమును వివక్షితములు. అట్టి భాగవమనియు అర్థమును చెప్పవచ్చును.

**(యస్యాః ఉన్మేషః సమయనియతిం న యాతి)** - ముక్కంటియొక్క నేత్రము ఒక సమయ విశేషమునందే ఉన్మేషమును పొందును అనగా, సంహారకాలముననే దాని విజృంభణము సంభవించును. అందుచే దాని ఉన్మేషము కాలనియతిని కల్గినది. కాని, సుదర్శననేమి యొక్క ఉన్మేషము, అనగా ప్రకాశము సార్వకాలికమైనది. కాన, దానికంటె విపరీతమై యుండును. ఈ విధముగా పలురీతులలో శివుని ఫాలనేత్రముకంటె అధికమై, దానిని జయించి వెలుగొందు సుదర్శనుని నేమి మీకు సంపదను ఇచ్చును గాక ! అని తాత్పర్యము.

''అస్త్రేశ్వరస్య నేమిః వః శ్రియం ప్రదేయాత్''

## శ్రీసుదర్శననేమి మీ పాపసమూహాన్ని ఎగురగొట్టాలి.

**35.** నక్షత్రక్షోదభూతిప్రకరవికిరణశ్వేతితాశావకాశా
జీర్ణైః పర్ణై రివ ద్యాం జలధరపటలై శ్చూర్ణితై రూర్ణువానా ।
ఆజావాజానవాజానతరిపుజనతారణ్య మావర్తమానా
నేమి ర్వాత్యేవ చాక్రీ ప్రణుదతు భవతాం సంహతం పాపతూలమ్ ॥

నక్షత్ర = నక్షత్రముల, క్షోద = చూర్ణము అనెడి, భూతిప్రకర = భస్మ సమూహమును, వికిరణ

= వెదజల్లుటచే, శ్వేతిత = తెల్లగా చేయబడిన, ఆశా+ అవకాశా = దిగంతరాళములను కల్గినది, జీర్ణైః = జీర్ణములైన (పండిరాలిన), పర్ణైః = ఆకులు, ఇవ = వలె నున్నవై, చూర్ణితైః = చూర్ణము చేయబడినవగు, జలధరపటలైః = మేఘసమూహములచే, ద్యామ్ = ఆకాశమును, ఊర్ణువానా = ఆచ్ఛాదించునది, ఆజౌ = యుద్ధభూమియందు, ఆజాన = సహజసిద్ధమైన, వాజ = వేగముచే, ఆనత = నమస్కరించిన, రిపుజనతారణ్యమ్ = శత్రుజనసమూహములను అరణ్యములను, ఆవర్తమానా = పరిభ్రమింపచేయునది, (కావుననే), వాత్యా ఇవ = గొప్పగాలి వలెనున్నదిఅగు, చాక్రీ నేమిః = సుదర్శనుని నేమి, భవతామ్ = మీయొక్క, సంహతమ్ = పేరుకొనియున్న, పాపతూలమ్ = పాపసమూహము అను దూదిసమూహమును, ప్రణుదతు = రూపుమాపుగాక!

**(వాత్యేవ స్థితా చాక్రీ నేమిః భవతాం సంహతం పాపతూలమ్ ప్రణుదతు)** – వాయుసమూహము వాత్యా అనబడును. **(వాతానాం సమూహఃవాత్యా)** చక్రనేమికి, వాయుసమూహమునకును సాధర్మ్యము తోచునట్లు ప్రస్తుత శ్లోకము కూర్పబడుట గమనింపతగినది.

**(నక్షత్రక్షోద. . . .)** వాయువు భూమిలోనున్న భస్మమును గ్రహించి, పైకి ఎగురునట్లుచేసి, దిక్కుల నన్నిటిని తెల్లగా చేయును. చక్రనేమియు తన అంచుయొక్క ఘట్టనములచే పొడిపొడిగా చేయబడిన నక్షత్రసమూహములతో దిక్కుల నన్నిటిని తెల్లగా చేయును.

**(జీర్ణైః పర్ణై రివ ద్యామ్. . .)** - పండి రాలిన ఆకుల నన్నిటిని వాయువు ఎగురగొట్టి, అవి ఆకాశమును ఆచ్ఛాదించునట్లు చేయును. నేమి మేఘసమూహములను చూర్ణ మొనర్చి, వానితో ఆకాశము కప్పబడునట్లు చేయును.

**(ఆజావాజానవాజా. . . .)** వాయువు అరణ్యమున సుడులు తిరుగుచు వీచును. చక్రనేమియు అసురులు, రాక్షసులు మొదలగు దుష్టులు అను అరణ్యమున సుడులు తిరుగును. **''ఆజానవాజానత''** అను అరణ్యముయొక్క విశేషణములోని తాత్పర్యమేమనగా అరణ్యము వృక్షాదిసమూహము. వాయువు తన తరంగములతో వృక్షసమూహములను వేళ్ల పెళ్లగించుకొని పడునట్లుచేసి, వానిని తనవేగముతో పరిభ్రమించునట్లుచేయును. చక్రనేమియు రిపు జనసమూహములుఅను అరణ్యమును తన సహజసిద్ధమైన వేగముతో పడగొట్టి, గిరగిర తిరుగునట్లుచేయును. అని, కావున ఇట్టి రీతులలో వాయుసమూహమువంటిది అగు చక్రనేమి మీ విషయమున వాయువు చేయుకార్యమును చేయునుగాక. అనగా, గాలి దూదిపింజలను ఎగురగొట్టునట్లు నేమియు మీ పాపములను నశించునట్లు చేయును గాక! అని తాత్పర్యము. **''అవర్తయంతీ''** అను వేరొక పాఠము మూడవపాదము చివర కలదు. ఇది సంస్కృతవ్యాఖ్యలో



చూపబడినది. **''ఆజి''** అనగా యుద్ధము. **''చక్రస్యేయమ్ చాక్రీ''** - అనగా చక్రమునకు సంబంధించిన అని అర్థము.

**''చాక్రీ నేమిః భవతాం సంహతం పాపతూలం ప్రణుదతు''**

## శ్రీసుదర్శన నేమి మీ సుఖాన్ని విస్తృతం చేయాలి.

**36.** క్షిప్త్వా నేపథ్యశాటీ మివ జలదఘటాం జిష్ణుకోదండచిత్రాం
తారాపుంజం ప్రసూనాంజలి మివ విపులే వ్యోమరంగే వికీర్య ।
నిర్వేదగ్లానిచింతాప్రభృతిపరవశా నంతరా దానవేంద్రాన్
నృత్య న్నానాలయాఢ్యం నట ఇవ తనుతాం శర్మ చక్రప్రధి ర్వః ॥

జిష్ణుకోదండ = ఇంద్రధనుస్సుచే, చిత్రామ్ = నానావర్ణమయమైన, జలదఘటామ్ = మేఘపంక్తిని, నేపథ్యశాటీమ్ ఇవ = నాట్యరంగముయొక్క తెరనువలె, క్షిప్త్వా = తొలగించి, విపులే = విశాలమైన, వ్యోమరంగే = ఆకాశమగు రంగస్థలమునందు, తారాపుంజమ్ = నక్షత్రసమూహమును, ప్రసూనాంజలిమ్ ఇవ = పుష్పాంజలినివలె, వికీర్య = వెదజల్లి, నిర్వేదగ్లానిచింతాప్రభృతి = నిర్వేదము, గ్లాని, చింతా మొదలగు వ్యభిచారి భావములకు, పరవశాన్ = పరవశులగు, దానవ+ ఇంద్రాన్ అంతరా = అసురశ్రేష్ఠులమధ్యలో, నానాలయాఢ్యమ్ (యథాతథా) = పలు విధములైన లయములతో కూడియుండునట్లు, నృత్యన్ = నర్తించునదియై (కావుననే), నట ఇవ = నటునివలెనున్నది అగు, చక్రప్రధిః = సుదర్శననేమి, వః = మీకు, శర్మ = సుఖమును, తనుతాత్ = విస్తృతముచేయును గాక !

చక్రనేమికి, నటునకును సాధర్మ్యము భాసించునట్లు కవి పల్కుట ఇందలి ప్రధానాంశము. నటుడు రంగస్థలమునకు వచ్చునపుడు చిత్రవర్ణమును కల్గిన తెరను తొలగించి వచ్చి, పుష్పాంజలిని సమర్పించి, **''గీతివాద్యపాదాదిన్యాసానామ్ క్రియాకాలయోః సామ్యమ్ లయః''** అని నిర్వచింపబడిన లయమునకు అనుగుణముగా నర్తనముచేయును. ఇట్లే, సుదర్శననేమియు చేయుచున్నది. ఆకాశమను రంగస్థలమున అదిప్రవేశించునపుడు ఇంద్రధనుస్సుచే చిత్రవర్ణమును పొందిన మేఘమండలమును నిరసించుచు పోవుట నేపథ్యశాటీనిరసనము వంటిది. ముందుశ్లోకమున తెలుపబడినట్లే నక్షత్రసమూహములను ఎగురుగొట్టుట పుష్పాంజలిని వెదజల్లుట వంటిది.

**(నిర్వేదగ్లాని . . . .)** నటుడు నటించునపుడు సభ్యులకు శోకమోహాది రసములను మాటిమాటి కల్గునట్లు చేయును. అతడు అభినయించు విషయములకు తగునట్లు కొన్ని

సందర్భములలో నిర్విణ్ణులుగను, కొన్ని సమయములందు ముఖమున అలసట పొందినవారిగను, కొన్ని సమయములలో చింతాక్రాంతులుగను సభ్యులు అగుదురు. చక్రనేమియు తన నాట్యస్థలములో సభ్యులగు అసురులకు, రాక్షసులకును శోకమును, గ్లానిని, చింతను (ఇక మనకు గతి ఏది అనుచింతను) కల్గించును.

**(నానాలయాఢ్యం యథాతథా నృత్యన్)** – **''గీతివాద్యపాదాదిన్యాసానామ్ క్రియాకాలయోః సామ్యమ్ లయః''** అని భరతశాస్త్రజ్ఞులు పల్కుదురు. **''లయ స్తు ర్య త్రయీసామ్యే''** అని నిఘంటు కారులును పల్కిరి. గీతము, వాద్యధ్వని, పాదాది న్యాసములును వేర్వేరుగాకాక, అన్నియు సకాలమున సమముగా కలియునట్లు సమర్థుడైన నటుడు నటించును. నేమి పక్షమున లయమనగా ధ్వంసము. అసురులకు, రాక్షసులకు ''కాలు ఖండింపబడినది, చేయి ఖండింపబడినది, ప్రాణము పోయినది, శరీరము నశించినది'' అనునట్లు నానావిధములైన నాశనములు కలుగచేయుచు, వ్యాపించుపద్ధతి ఇచట తెలుపబడినది. **''శిరః కృంతన – మధ్యలుంఠన– బాహుఖండన– వక్షఃకుట్టన– చరణనిరసన – ప్రముఖానేక ప్రకారసంహారైః''** అని సంస్కృతవ్యాఖ్య. ఇట్లు నటునితో పోలిన చక్రనేమి మీకు సౌఖ్యమును అనుగ్రహించునుగాక! లయమనగా వినాశము, గీతవాద్యపదన్యాసముల సమకాలీనత అనుఅర్థములు క్రమముగా సుదర్శన, నటపక్షములలో గ్రహింపనగును.

''చక్రప్రధిః వః శర్మ తనుతామ్''

## శ్రీ సుదర్శననేమి మీకు రక్షణను కల్గించాలి.

**37.** దౌర్గత్యప్రౌఢతాపప్రతిభటవిభవా విత్తధారా స్సృజంతీ
గర్జంతీ ఛీత్క్రియాభిః జ్వలదనలశిఖోద్దామసౌదామనీకా ।
అవ్యాత్ క్రవ్యాద్వధూటీనయనజలభరై ర్దిక్షు నవ్యా ననావ్యాన్
పుష్యంతీ సింధుపూరాన్ రథచరణపతే ర్నేమికాదంబినీ వః ॥

దౌర్గత్య = దుర్గతివలన కల్గు, ప్రౌఢః = గొప్పదైన, తాప = తాపమునకు, ప్రతిభట = ప్రత్యర్థియైన (వినాశకరమైన), విభవాః = సమృద్ధిని కల్గినవి అగు, విత్తధారాః = ధనవర్షములను, సృజంతీ = సృష్టించునది, ఛీత్క్రియాభిః = ఛీత్కారమను ధ్వనివిశేషములతో, గర్జంతీ = గర్జించుచున్నది. జ్వలత్ = జ్వలించుచున్న, అనలశిఖా = అగ్నిశిఖలుఅను, ఉద్దామ = గొప్పదైన, సౌదామనీకా = మెఱుపులను కల్గినది, క్రవ్యాద్వధూటీ = రాక్షసులస్త్రీలయొక్క, నయన జలభరైః = కన్నీటి ప్రవాహములచే, దిక్షు = దిక్కులయందు (కనపడినచోట అంతట), నవ్యాన్+ అనావ్యాన్ చ



= నూతనమైనవి, ఓడలతో దాటసాధ్యము కానివి అగు, సింధుపూరాన్ = నదీ ప్రవాహములను, పుష్యంతీ = వృద్ధిచేయుచున్నది అగు, రథచరణపతేః = శ్రీసుదర్శనునియొక్క, నేమికాదంబినీ = నేమి అను మేఘమాల, వః = మిమ్ములను, అవ్యాత్ = రక్షించునుగాక!

**''రథచరణపతేః నేమి కాదంబినీ వః అవ్యాత్''** అనుచు చక్రనేమిని మేఘమాలగా రూపించుచు వర్ణించుట ఇందలి అంశము.

**(ప్రౌఢతాప ప్రతిభటవిభవాః ధారాః సృజంతీ)** - అసహ్యమైన తాపమును ఉపశమింప గల్గిన వర్షధారలను మేఘమాల సృష్టించును. చక్రనేమి దౌర్గత్యము - అనగా దారిద్ర్యముచే జనించిన ప్రౌఢమైన తాపమును నశింపచేయు ధనవర్షధారలను కురిపించును. **''దౌర్గత్యేన దారిద్ర్యేణ జనితో యః ప్రౌఢతాపః, తస్య ప్రతిభటవిభవాః విత్తధారాః సృజంతీ''** అను విగ్రహమును ఇచట చెప్పవచ్చును. అనగా ఐశ్వర్యప్రదమని తాత్పర్యము.

**(ఛీత్క్రియాభిః గర్జంతీ)** - ఛీత్కారములను ధ్వనివిశేషముల రూపమున గర్జించుచు వృద్ధిచెందుట ఉభయసాధారణము.

**(జ్వలదనలశిఖోద్దామసౌదామనీకా)– ''జ్వలంత్యః యాః అనలశిఖాః (అగ్నిజ్వాలాః), తా ఏవ ఉద్దామసౌదామనీ (ఉద్భటవిద్యుల్లతా) యస్యా స్సా''** అను విగ్రహమిచట వివక్షితము. మేఘమాల యందు భయంకరమైన మెఱపు మెఱయును. నేమి యందు అగ్నిజ్వాల మెఱయును.

**(క్రవ్యాద్వధూటీ . . . .పుష్యంతీ)**- మేఘమాల విషయమున **''జలభరైః నవ్యాన్ అనావ్యాన్ సింధూపూరాన్ దిక్షు పుష్యంతీ''** అని అన్వయము. అది అంతులేని మెఱుపులను, జ్వాలలను వర్షించి, అమితముగా నదీ ప్రవాహములను కనుపించిన చోట అంతట ప్రవహించునట్లు చేయును. చక్రనేమియు అసురస్త్రీల కన్నీటి ప్రవాహములతో అట్లే చేయును. అసురులను వధించి, వారి పత్నులను రోదించునట్లుచేయునని తాత్పర్యము. **''క్రవ్యం మాంసం అదంతీతి క్రవ్యాదాః, అసురాః, తేషాం వధూట్యః స్త్రియః''** అని ఇచటి వివరణము. **''నావా తార్యాః నావ్యాః''** నావలతో దాటుటకు వీలైనవి. **''న నావ్యాః అనావ్యాః''** - నావలతో దాట వీలులేనివి. దీనివలన ప్రవాహాతిశయము తెలుపబడినది. **''నావ్యం త్రిలింగమ్ నౌ తార్యే''** అని అమరకోశ వచనమునుబట్టి నావ్యశబ్దము మూడు లింగములలో కలదు.

**(సింధుపూరాన్)** - సింధు అను శబ్దమునకు నది అని, సముద్రమనియు అర్థము. నదీవాచకమగు నపుడు స్త్రీలింగము. ఇచట నదీ వాచకము. ఇట్లు పలు రీతులలో మేఘమాలతో పోలియున్ననేమి మిమ్ములను రక్షించునుగాక! అని భావము. మేఘమాలయు జగద్రక్షణమే కదా చేయును. ఇట్లు ఈ రెండింటికిని క్రియా సామ్యమును కలదు. **''కాదంబినీ మేఘమాలా''**

అని అమరము.

''రథచరణపతేః నేమికాదంబినీ వః అవ్యాత్''

## శ్రీసుదర్శననేమి మీ అపేక్షితాలను ఇవ్వాలి.

**38.** సందోహం దానవానా మజసమజ మివాఽఽలభ్య జాజ్జ్వల్యమానే
వహ్నౌ వహ్నాయ జుహ్వా త్రిదశపరిషదే స్వస్వభాగప్రదాయీ ।
స్తోత్రైః బ్రహ్మాదిగీతై ర్ముఖరపరిసరం శ్లాఘ్యశస్త్రప్రయోగం
ప్రాప్త స్సంగ్రామసత్రం ప్రధి రసురరిపోః ప్రార్థితం ప్రస్నుతాం వః ॥

బ్రహ్మాదిగీతైః = బ్రహ్మాది దేవతలచేగానముచేయబడిన, స్తోత్రైః = స్తోత్రములచే, ముఖరపరిసరమ్ = శబ్దితమైన ప్రాంతదేశమును కల్గినది, (బ్రహ్మ, ఉద్గాత మొదలగు యాగ నిర్వాహకులచే ఉచ్చరింపబడిన స్తుతులచే శబ్దితమైన ప్రాంత ప్రదేశమును కల్గినది), శ్లాఘ్యశస్త్రప్రయోగమ్ = గొప్పదైన ఖడ్గ ప్రయోగములను కల్గినది (శస్త్రమను వైదిక మంత్రముల ప్రయోగమును కల్గినది), అగు, సంగ్రామ సత్రమ్ = యుద్ధరంగమును యజ్ఞవాటికను, ప్రాప్త స్సన్ = పొందినదై, దానవానామ్ = అసురుల, సందోహమ్ = సమూహమును, అజసమజ మివ = మేకల సమూహమునువలె, ఆలభ్య = వధించి, జాజ్జ్వల్యమానే = మిక్కిలిగా జ్వలించుచున్న, వహ్నౌ = అగ్నియందు, అహ్నాయ = వెంటనే, జుహ్వాత్ = హోమముచేయుచున్నది, త్రిదశపరిషదే = దేవవర్గమునందు, స్వస్వభాగప్రదాయీ = వారివారి భాగములను ఇచ్చునదియు అగు, అసురరిపోః = అసురులకు శత్రువగు సుదర్శనునియొక్క, ప్రధిః = నేమి, వః = మీయొక్క, ప్రార్థితమ్ = అపేక్షితమును, ప్రస్నుతామ్ = ప్రసవించును గాక ! (ఇచ్చును గాక !)

**''సంగ్రామసత్రం ప్రాప్తః అసురరిపోః ప్రధిః వః ప్రార్థితం ప్రస్నుతామ్''** - యుద్ధభూమిని ఒక యజ్ఞవాటికగా, అందు వ్యాపించు చక్రనేమిని యజ్వగా రూపించుట ఇందలి ప్రధానాంశము. యజ్ఞమునందు ఈయజమానుడు చేయునదేమన -

**(జాజ్జ్వల్యమానే వహ్నౌ అజసమజమ్ జుహ్వాత్)** - **''పశూన్ ఆలభేత''** అనువిశేషవైదిక విధి యుండుటచే ఛాగములను (మేకలను) వధించి, అగ్నియందు ఆహుతిని యజమానుడు చేయును. ఇక చక్రనేమి అను యజమానుడు అన్నచో **(దానవానామ్ సందోహమ్)** – ఛాగముల స్థానమున అసురవర్గమును వధించి, శ్రీసుదర్శనాగ్నియందు ఆహుతి చేయును.

**(త్రిదశపరిషదే స్వస్వభాగప్రదాయీ)** – యజ్ఞమున **''ఇంద్రాయ స్వాహా, సోమాయ స్వాహా, వరుణాయస్వాహా''** అనుచు పల్కి, ఆయా దేవతలకు తగిన హవిర్భాగములను



యజమానుడు అర్పించును. చక్రనేమియు అట్లే చేయును. దేవతలు పూర్వము తమతమ హవిర్భాగములను పొంది, ఉజ్జీవింపలేక అసురులవలన బాధలను పొంది, దుఃఖించుచుండిరి. ఇపుడు వారు (అసురులు) ఛాగము పొందిన స్థితిని పొందినవగుటచే తమ తమ హవిర్భాగములను దేవతలు వెంటనే పొందుచున్నారు. ఇట్లు వారికి హవిర్భాగములను పొందించునది చక్రనేమి అగుటచే **''త్రిదశపరిషదే స్వస్వభాగప్రదాయీ''** అయినది.

మూడవ పాదమంతయు సంగ్రామసత్ర విశేషణము. యజ్ఞము ఎట్లుండుననగా -

**(బ్రహ్మాదిగీతైః స్తోత్రైః ముఖరపరిసరమ్ శ్లాఘ్యశస్త్రప్రయోగం చ)** - యుద్ధభూమి పక్షమున అర్థము స్పష్టము. ఇక, యజ్ఞవాటిక పక్షమున అర్థమేమనగా వేదార్థసంగ్రహములో - **''కరణమంత్రాః క్రియమాణానువాదినః స్తోత్రశస్త్రరూపాః''** అనుచోట తాత్పర్యదీపికలో - **''స్తోత్రమ్ గానవిశిష్టమంత్రోచ్చారణమ్''** అని వ్యాఖ్యానింపబడుట గమనార్హము. తిరువాయ్‌మొழி లో **''కాదల్ మెన్‌పెడైయాడు''** (6-1-2) అను పాశురవ్యాఖ్యలలో (ఈడులో, ఇరుపత్తు నాలాయిరప్పడిలో) **''వేదఘోషముమ్, యాగత్తిల్ శస్త్రాదిఘోషముమ్ సముద్రఘోషమ్ పోలే యిరుక్కిఱ శ్రమహరమాన ఊర్''** అని తెలుపబడుటయు గమనింపతగినది. **''స్తుతశస్త్రే ఏవైతేన దుహే''** అని వేదమును పల్కినది. యాగమున **''బ్రహ్మాణం త్వాం వృణీమహే''** అని వరింపబడిన బ్రహ్మమొదలగు వారిచే స్తోత్ర-శస్త్ర సమాఖ్యవైదికమంత్ర విశేషములు ఉచ్చరింపబడుననుట తెలియతగినది.

ఇట్లు ఈ శ్లోకమున పూర్వార్ధములో రెండు విశేషణములు చక్రనేమికి యజమానత్వ రూపణములో ఉపయుక్తములుగా, ఉత్తరార్ధమున రెండు విశేషణములు సంగ్రామమునకు సత్రముగా రూపణములో ఉపయుక్తములుగను ప్రయోగింపబడినవి. **''అజసమజ మివ''– ''పశూనాం సమజోఽన్యేషామ్ సమాజః''** అను అమరకోశవచనమును బట్టి పశువుల సమూహము సమజము. అనబడును. **''ప్రస్నుతామ్''** అనుక్రియ **''ష్ణు– ప్రస్రవణే''** అనుధాతువునుండి నిష్పన్నమైనదై యుండవలెను. కాని, ఇచటి ఆత్మనే పదము చింత్యము. **''ప్రార్థితం ప్రస్నుతాత్ వః''** అను పాఠము ఉండియుండవచ్చునేమో ! అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామివారి పరిష్కారము. వేణీసంహారనాటకములోని **''చత్వారో వయ మృత్విజ''** ఇత్యాది శ్లోకభావమిచట భావనీయము.

''అసురరిపోః ప్రధిః వః ప్రార్థితం ప్రస్నుతాం''

అరవర్ణనము

## శ్రీసుదర్శనుని అరాలు మిమ్ములను మీ అంతిమయాత్రలో రక్షించాలి.

**39.** **ఉత్పాతాలాతకల్పాన్యసురపరిషదా మాహవప్రార్థినీనామ్**
**అధ్వానధ్వావబోధక్షపణచణతమఃక్షేపదీపోపమాని ।**
**త్రైలోక్యాగారభారోద్వహనసహమణిస్తంభసంపత్సఖాని**
**త్రాయంతా మంతిమాయాం విపది సపది వో౽రాణి సౌదర్శనాని ॥**

ఆహవప్రార్థినీనామ్ = యుద్ధమును ప్రార్థించునట్టి, అసురపరిషదామ్ = అసువర్గములకు, ఉత్పాత+ అలాతకల్పాని = కష్టకాలమున కనుపించు (అశుభములను ముందుగా సూచించు), కొఱివికట్టెలవంటివి (తోకచుక్కల వంటివి), అధ్వ+ అనధ్వ = సన్మార్గము, దుర్మార్గముల, అవబోధ = తెలిసికొనుటను (జ్ఞానమును), క్షపణ= పాడుచేయుగల, తమః = అజ్ఞానము (చీకటిని)ను, క్షేప = చెల్లాచెదఱు చేయుటలో, దీప+ ఉపమాని = (చేతి) దీపములవంటి, త్రైలోక్య+ అగార = ముల్లోకములను భవనముయొక్క, భార = బరువును, వహనసహ = మోయగల్గిన, మణిస్తంభ = రత్నస్తంభముల, సంపత్ సఖాని = సంపదను స్నేహితులు (రత్నస్తంభములవంటివి) అగు, సౌదర్శనాని = సుదర్శనమునకు సంబంధించిన, అరాణి = అరములు, వః = మీకు, అంతిమాయామ్ = చిట్టచివరి (మరణసమయములోని), విపది = ఆపదయందు, సపది = వెంటనే, త్రాయంతామ్ = రక్షించునుగాక !

ఈ శ్లోకము మొదలు 50వ శ్లోకమువరకు - అనగా 12 శ్లోకములలో సుదర్శనుని అరవర్ణనము చేయబడుచున్నది. శ్రీసుదర్శనుని అవయవములలో అరము అనునది ఒకటి. బుట్టలో కమ్మలవలె చక్రమున కనుపించు భాగములే ఇవి. వీనిని వర్ణించుట పూర్వము వివరించిన రీతిలో అవయవి యగు శ్రీసుదర్శనమును స్తుతించుటయే యగును.

**(ఉత్పాతాలాతకల్పాని)** - ఉత్పాతమనగా అకస్మాత్తుగా సంభవించు అశుభసూచకము. యుద్ధోత్సుకులగు దైత్యుల వినాశమును సూచించుచు తోచిన కొఱివికట్టెల వలె శ్రీసుదర్శనుని అరములు తోచుచున్నవి.

**(అధ్వానధ్వావబోధ. . .)** సన్మార్గము, చెడ్డమార్గము ఏవియో తెలియకమోహమును పొందియున్న వారికి ఆ మోహమును తీర్చి, సరి అయిన దారిని చూపునట్టి దివిటీల వలె అవి తోచుచున్నవి. లోకమున గొప్పచీకటిలో తిరుగువారికి చీకటిని పోగొట్టి, దారిని చూపునవి దీపములే కదా ! ఇచట తమశ్శబ్దము శ్లిష్టము. దీపపక్షమున బాహ్యాంధకారమని, అరములపక్షమున ఆంతరమైన తమస్సు - అనగా అజ్ఞానమనియు అర్థము. త్రైలోక్య భవనములలో వాని బరువును మోయు మణిమయస్తంభములా ఇవి ! అనునట్లు అరములున్నవి. త్రైలోక్యమను భవనముయొక్క రక్షణ భారమునంతటిని నిర్వహించునవి కదా సుదర్శనుని అరములు ! ఇట్టి అరములు శరీరము కాష్ఠపాషాణసన్నిభమై, కఫవాతపిత్తములతో కంఠము అడ్డగింపబడి, తల్లడిల్లు అంతిమ కాలమున



మీకు రక్షణను కల్గించునుగాక ! **''తమఃక్షేపదోషోపమాని''** అని వేరొక పాఠమునకు చీకటిని పారద్రోలు ఉషఃకాలమును ఉపమానముగా కల్గినవి అను అర్థము సంస్కృతవ్యాఖ్యలో చూపబడినది.

**(అంతిమాయామ్ విపది)**- ఇంతకంటె అధికమైన ఆపద వేరొకటి ఉండబోదు అనునట్టి అత్యంతము గొప్పదైన ఆపదలో అనియు చెప్పవచ్చును. **''ఏతస్యాః ద్విపదః అధికా విపన్నాస్తీతి అంతిమ విపత్, నిరతిశయాపదితి యావత్. అథవా, మరణదశయామ్''** అని సంస్కృతవ్యాఖ్య.

**''సౌదర్శనాని అరాణి అంతిమాయాం విపది వః త్రాయంతామ్''**

---

## శ్రీసుదర్శనుని అరాలు మీకు సంతోషాన్ని కల్గించాలి.

**40.** **జ్వాలాజాలప్రవాళస్తబకితశిరసో నాభి మావాలయంత్యః**
**సిక్తా రక్తాంబుపూరై శ్శకలితవపుషాం శాత్రవానీకినీనామ్ ।**
**చక్రాక్రీడప్రరూఢాభుజగశయభుజోపఘ్ననిఘ్నప్రచారాః**
**పుష్యంత్యః కీర్తిపుష్పాణ్యరకనకలతాః ప్రీతయే వః ప్రథంతామ్ ॥**

చక్రాక్రీడప్రరూఢాః =సుదర్శనమను క్రీడోద్యానమునందు చక్కగా మొలచినవి, నాభిమ్ = నాభిని, ఆవాలయం త్యః = ఆలవాలముగా కల్గినది, శకలితవపుషామ్ = ఖండఖండములుగా చేయబడిన శరీరములను కల్గిన, శాత్రవ+ అనీకినీనామ్ = శత్రువుల సైన్యముల యొక్క, రక్తాంబుపూరైః = రక్తము అను నీటియొక్క ప్రవాహముచే, సిక్తాః = తడుపబడినవి, భుజగశయభుజ = ఆదిశేషునిపై పరుండియున్న భగవానుని భుజములు అనెడి, ఉపఘ్న = పట్టుకొమ్మకు, నిఘ్న = అధీనమైన, ప్రచారాః = సంచారములను కల్గినవి, జ్వాలాజాల = జ్వాలల సమూహము అను, ప్రవాల = చిగుళ్లు, స్తబకిత = గుత్తులు గుత్తులుగా చేయబడిన, శిరసః = అగ్రభాగములను కల్గినవి, కీర్తిపుష్పాణి = కీర్తి అను పుష్పములను, పుష్యంత్యః = విశేషముగా పూచునవి అగు, అరకనకలతాః = అరములను బంగారు తీగలు, వః = మీయొక్క, ప్రీతయే = సంతోషము కొఱకు, ప్రథంతామ్ = వృద్ధియగు గాక !

ఇందు సుదర్శన చక్రములోని అరములు కనకలతలుగా వర్ణింపబడుట ప్రధానాంశము. లతలలో పూలు గుత్తులుగుత్తులుగా నుండును. అరములలోని జ్వాలా సమూహములే పల్లవములు. వర్ణమునందు, కాంతియందును చిగుళ్లతో జ్వాలలు ఒప్పును కదా !

**(నాభి మావాలయంత్యః)** - ఆవాలమని, ఆలవాలమనియు లతల మూలదేశమున

కట్టబడు పాదులకు ( కుదుళ్లకు) పేర్లు. అరములను లతలకు శ్రీసుదర్శనుని నాభియే ఆలవాలము.

**(సిక్తా రక్తాంబుపూరైః)** - లతలు నీటి ప్రవాహముచే తడుపబడును. అరములు గాయపడిన అసురుల శరీరములనుండి స్రవించిన రక్తము అను నీటి ప్రవాహముచే తడుపబడును. **''ఉడమ్బినాల్ కుఱైవిల్లా ఉయిర్ పిరిన్ద మలైత్తుణ్డమ్ కిడన్దదన్ పోల్ తుణిపలవా అశురర్ కుళ్ళామ్ తుణిన్దుకన్ద''** అను నమ్మాళ్వార్ల సూక్తి స్మరణీయము. **'అనీకము అనీకే'** అనునవి సైన్యమును తెలుపును.

**(చక్రాక్రీడప్రరూఢాః)** - ఆక్రీడమనగా ఉద్యానవనము. లతలు ఉద్యానవనములలో మొలచును. అరలను లతలకు చక్రనేమి ఉద్యానవనము.

**(భుజగశయశభుజోపఘ్నునిఘ్నప్రచారాః) – ''కోల్తేడి యోడుమ్ కొళ్ళున్దు''** అనునట్లు ఒక పట్టుకొమ్మకు అధీనమైన ప్రచారములను కల్గినదై లతలు ఉండును.

**(పుష్యంత్యః కీర్తిపుష్పాణి)** - లతలు పుష్పములను ప్రసవించును. అరలు పుష్పములవంటి కీర్తులను వర్ధిల్లజేయును. శత్రుధ్వంసము వలన కల్గిన యశోరాశులను కల్గించునని తాత్పర్యము. **''పుష్ప్యంత్యః''** అను పాఠమునకు పుష్పింపచేయునవి **( వికాసయంత్యః)** అను ణిజంతార్థము గ్రహింపనగును. **''పుష్ప–వికసనే''** అనునది ఇచటి ధాతువు. వికసించుచు అను అర్థమిచ్చు **''పుష్పంత్యః''** అను వేరొక పాఠమును సంస్కృతవ్యాఖ్యలో కలదు. ఇట్లు పలువిధముల లతల వంటి అరములు మీ ప్రీతికొఱకు వృద్ధియగును గాక ! అని భావము. **''కనకలతాః''** అను ప్రయోగము కనకపదము ఉపచారార్థము. నిజమునకు కనక లతగా మాత్రము అర్థమును చెప్పిన పైన వివరించిన అంశము లేవియు అందు పొసగవుకదా !

''చక్రాక్రీడప్రరూఢాః అరకనకలతాః వః ప్రీతయే ప్రథంతామ్''

---

## శ్రీసుదర్శనుని అరాలు మీకు బుద్ధిబలాన్ని, వాక్సామర్థ్యాన్ని ఇవ్వాలి.

**41.** జ్వాలాజాలాబ్ధిముద్రం క్షితివలయమివాఽఽబిభ్రతీ నేమిచక్రం
నాగేంద్రస్యేవ నాభేః ఫణపరిష దివ ప్రౌఢరత్నప్రకాశా ।
దత్తాం వో దివ్యహేతేః మతి మరవితతిః ఖ్యాతసాహస్రసంఖ్యా
సంఖ్యావత్సంఘచిత్తశ్రవణహరగుణస్యందిసందర్భగర్భామ్ ॥

జ్వాలాజాల = జ్వాలాసమూహములను, అబ్ధి = సముద్రమును, ముద్రమ్ = అవధిగా కల్గినది, క్షితివలయమ్ ఇవ (స్థితమ్) = భూవలయము వలెనున్న, నేమిచక్రమ్ = నేమి మండలమును, ఆబిభ్రతీ = ధరించుయున్నది, నాగేంద్రస్య+ ఇవ = ( కుండలితుడగు) ఆదిశేషుని వలెనున్న,



నాభేః = నాభియొక్క, ఫణపరిషత్ ఇవ = పడగల వరుసలవలె, ప్రౌఢరత్నప్రకాశా = అధికమైన రత్నముల ప్రకాశమును కల్గినది, ( రత్నముల ప్రకాశము వంటి ప్రకాశమును కల్గినది), ఖ్యాత సాహస్రసంఖ్యా చ = ప్రసిద్ధమైన సహస్ర సంఖ్యను కల్గినదియు అగు, దివ్యహేతేః = దివ్యాయుధమగు సుదర్శనముయొక్క, అరవితతిః = అరల సమూహము, వః = మీకు, సంఖ్యావత్ సంఘ = పండితవర్గముల, చిత్త = మనస్సును, శ్రవణ = కర్ణములను, హర = ఆకర్షించు, గుణస్యంది = మాధుర్య గుణమును స్రవించు, సందర్భగర్భామ్ = శబ్దప్రయోగములను జనింపచేయగల్గిన, మతిమ్ = బుద్ధిని, దత్తామ్ = ఇచ్చునుగాక !

అరములను, ఆదిశేషుని పడగలసమూహమునకును సాధర్మ్యము ప్రకాశించురీతిలో ప్రస్తుతశ్లోకము నిబద్ధమైనది. శేషుని పడగలు సముద్రముచే పరివేష్టింపబడిన భూమిని ధరించును. **'నిజవిభవపరిచ్ఛిన్నభూమేశ్చ నేమేః''** అనియు, **''నేమిమ్ పర్యాయభూమిమ్''** అనియు పూర్వము కవి నేమిని భూమిగా వర్ణించిరి కదా ! భూమండలము సముద్రముచే పరివృతమైనట్లే, నేమి మండలము జ్వాలాజాల పరివృతము.

**(నాగేంద్రస్యేవ నాభేః)** - అరములు పడగలైనచో, ఫణి ఏది ? అనినచో, సుదర్శనుని నాభియే చుట్టచుట్టుకొనియున్న ఆదిశేషుడు. చక్రనాభినుండి అరములు అనేకములై విస్తరించుటను చూడగా అవి కుండలితమైన సర్పము పడగలు విస్తరించి యున్నట్లున్నవి.

**(ప్రౌఢరత్నప్రకాశా)** - పడగలలో రత్నములుండుటచే ప్రౌఢమైన రత్నప్రకాశమును పడగల సమూహము ( ఫణపరిషత్తు) కల్గియుండును. అరములును రత్నప్రకాశతుల్యమైన ప్రకాశమును కల్గినవైయుండును. ఖ్యాతసాహస్రసంఖ్యావత్త్వము రెండింటికిని ఒప్పును. **''ఆయిరమ్ పైన్దలైయ అనన్దశయనమ్''** అని, **''ఆరా దారాత్ సహస్రాత్''** అనియు ఈరెండును స్తుతింపబడుచున్నవి కదా ! సాహస్రమనగా సహస్రమే. **''సహస్ర మేవ సాహస్రమ్''**. ఇచట **''స్వార్థేఽణ్ ప్రత్యయః''** అని సంస్కృతవ్యాఖ్య.

**(సంఖ్యావత్సంఘచిత్తశ్రవణ హరగుణస్యందిసందర్భగర్భామ్) – ''సంఖ్యావాన్ పండితః కవిః''** అని అమరము తెలుపుచున్నది. సంఖ్యావచ్ఛబ్దము విచారశీలురైన పండితులను తెలపును. **''సాహిత్యసుధామాధురీధురీణస్వాంతోల్లాసానామ్''** అని సంస్కృతవ్యాఖ్య. అట్టివారి మనస్సును, చెవులను హరించు శబ్దగుణములు, అర్థగుణములు నిండిన గ్రంథములను నిర్మించుటకు తగిన ప్రతిభావిశేషమును మీకు అరములు ఇచ్చుగాక ! అని భావము. **''అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహి మనసో దుహానం సౌహార్దం పరిచిత మివాథాఽపి గహనమ్, పదానాం సౌభ్రాత్రాత్ అనిమిషనిషేవ్యం శ్రవణయోః త్వమేవ శ్రీః ! మహ్యం**

**బహుముఖయ వాణీవిలసితమ్''** (శ్రీగుణరత్నకోశము) అని శ్రీపరాశరభట్టరు పార్థించిన గొప్ప వాగ్విలాసములను బహుగుణీకృతముచేయ గల్గిన బుద్ధివిశేషమును అనుగ్రహించునుగాక ! అని సారము. **''సంఖ్యావత్‌చేతనాక్షి శ్రవణహరగుణస్యందిసంధోహ గర్భామ్''** అని వేరొక పాఠము సంస్కృతవ్యాఖ్యలో కలదు. దీనిని ఆ వ్యాఖ్యానకారుడు **''జ్ఞానవచ్చేతన నేత్రశ్రోత్రమహోత్సవకృద్గుణనిష్యందబృందగర్భామ్''** అనుచు వివరించెను.

**''దివ్యహేతేః అరవితతిః వః సందర్భగర్భాం మతిం దత్తామ్''**

## శ్రీసుదర్శనుని అరాలు మీకు అధికమైన గొప్పతనాన్ని ఇవ్వాలి.

**42.** **బ్రహ్మేశోపక్రమాణాం బహువిధవిమతక్షోదసమ్మోదితానాం**
**సేవాయై దేవతానాం దనుజకులరిపోః పిండికాద్యంగభాజామ్ ।**
**తత్తద్ధామాంతసీమావిభజనవిధయే మానదండాయమానా**
**భూమానం భూయసా వో దిశతు దశశతీ భాస్వరాణా మరాణామ్ ॥**

బహువిధ = పలువిధములుగా, విమత = శత్రువులను, క్షోద = క్షోభిల్లచేయుటచే, సమ్మోదితానామ్ = సంతోషింపచేయబడినవారై, దనుజకులరిపోః = అసురులకులమునకు శత్రువగు సుదర్శనునియొక్క, సేవాయై = సేవకొఱకు, పిండికాది+ అంగభాజామ్ = నాభిమొదలగు అవయవములను భజించువారగు, బ్రహ్మ+ ఈశ +ఉపక్రమాణామ్ = బ్రహ్మరుద్రాదిదేవతలకు, తత్తత్ = వారివారియొక్క, ధామ+ అంతసీమా = స్థానముల ఎల్లలను, విభజనవిధయే = విభాగించుటకొఱకు, మానదండాయమాన = కొలదండము వలె అగుచున్న, భాస్వరాణామ్ = జ్వలించుచున్న, అరాణామ్ దశశతీ = వేలాది అరములు, వః = మీకు, భూమానమ్ = గొప్పతనమును, భూయాసా = ఎక్కువగా, దిశతు = ఇచ్చును గాక !

బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలగు దేవతలు తమ తమ శత్రువులను శ్రీసుదర్శనము భంగపఱచెనను కృతజ్ఞతాభావముతో ఆసుదర్శనమును ఎల్లప్పుడు సేవించుచుండుటకు నాభిమొదలగు చక్రాయుధావయవములను భజించుచుందురట. అట్టిదేవతలకు - '' ఇంతవరకు ఇతనియొక్క (చోటు) నివాసము, దీనివరకు ఇతనియొక్కచోటు'' అని వారివారి స్థానవివరములను విభజించి నిర్ణయించుటకు ఉపయోగపడు మానదండములా ! ఇవి అనునట్లు ఉన్న అరములు మీకు గొప్పతనమును అధికముగా ఇచ్చును గాక ! అని తాత్పర్యము. **''బ్రహ్మేశోపక్రమాణామ్''** అనునది **''బ్రహ్మరుద్రాదీనామ్''** అను అర్థము నిచ్చును . **''పిండికాద్యంగభాజామ్'' – బాహాశాఖావరుద్ధ క్షితిగగనదివశ్చక్రరాజద్రుమస్య''** (3) అను



పూర్వోక్తశ్లోకమున తెలుపబడినట్లు శ్రీసుదర్శనము త్రైలోక్యవ్యాపివిభువిగ్రహవిశిష్టుడుగా వర్ణింపబడుటచే బ్రహ్మేశాదిదేవతలు నాభిమెదలగు అవయవములను భజించుచున్నారనుటలో విప్రతిపత్తిలేదు. వారి స్థానములకును పైన వ్యాపించియున్నదికదా సుదర్శనుని రూపము ! **''కుఝుమిత్తేవర్ కుఝాజ్గళ్ కైతొఝ''** అనునట్లు దేవతల సంఘములు నమస్కరింప వచ్చి, సేవించునపుడు పరస్పర సమర్దము కలుగుకుండుటకై,'' ఇచట బ్రహ్మ ఉండవలయును, ఇచట శివుడు నివసింవతగును'' అనునట్లు ఒక్కొక్కరికి నియమమును విధించి, స్థలవిభాగమును నిర్ణయించి చెప్పవలసిరాగా, అందులకు మానదండములుగా అయినవి అరములు, అనునది కవి యొక్క అద్భుతమైన ఉల్లేఖము.

శ్రీసుదర్శనుని నాభి మొదలగు అవయవములలో బ్రహ్మేశాదిదేవతలను ఆవాహనము చేయునట్లు పాంచరాత్రమున ( అహిర్బుధ్న్య సంహితలో) తెలుపబడి యుండుటచే, దానిని గొని కవి **''పిండికాద్యంగభాజామ్''** అని పల్కిరి అని పెద్దలు అందురు. **''భూమానం భూయాసా దిశతు''** - అనగా మహిమను మాటి మాటికి ఇచ్చును గాక । అని అర్థము . **''అరాణామ్ సహస్రమ్''** అనగా వేయి అరలని అర్థము.

**''అరాణాం దశశతీ వః భూమానం భూయసా దిశతు''**

## శ్రీసుదర్శనుని అరాలు మీకు మంగళాన్ని కల్గించాలి.

**43.** **జ్వాలాకల్లోలమాలావిబిడపరిసరాం నేమివేలాం దధానే**
**పూర్వేణాక్రాంతమధ్యే భువనమయహవిర్భోజినా పూరుషేణ ।**
**ప్రస్ఫూర్జత్‌ప్రాజ్యరత్నే రథపదజలధావేధమానైః స్ఫులింగైః**
**భద్రం వో విద్రుమాణాం శ్రియ మరవితతి ర్విస్తృణానా విధత్తామ్ ॥**

జ్వాలా = జ్వాలలు అను, కల్లోలమాలా = అలల వరుసలచే, నిబిడ = దట్టమైన, పరిసరామ్ = సమీపప్రదేశమును కల్గినదిఅగు, నేమివేలామ్ = నేమి అను ఒడ్డును, దధానే = కల్గియున్నది. భువనమయ = లోకముల రూపములోని ( నీటిరూపములోని) హవిర్భోజినా = హవిస్సును భుజించు, పూర్వేణ పూరుషేణ = పురాణ పురుషుడగు సుదర్శనపురుషునిచే, ఆక్రాంతమధ్యే = ఆక్రమించియున్న మధ్య ప్రదేశమును కల్గినది, ప్రస్ఫూర్జత్ = మిక్కిలి ప్రకాశించు, ప్రాజ్య = గొప్పవైనపలు, రత్నే = రత్నములను కల్గినది, రథపదజలధౌ = సుదర్శనము అను సముద్రమునందు, ఏధమానైః = వృద్ధిచెందు, స్ఫులింగైః = అగ్నికణములచే, విద్రుమాణాం శ్రియమ్ = పగడముల శోభను, విస్తృణానా = వ్యాపింపచేయున్నది అగు, అరవితతిః = అరముల సమూహము, వః

= మీకు, భద్రమ్ = మంగళమును, విధత్తామ్ = కలుగచేయు గాక !

శ్రీసుదర్శన భగవానుని ఇందు ఒక సముద్రముగా రూపించి, అరములనుండి వెలువడు విస్ఫులింగములను పగడములుగా వర్ణించుట ఇందలి అంశము. సముద్రము అలలసమూహముచే నిబిడమైన పరిసరమును కల్గిన తీరప్రదేశమునుకల్గినదైయుండును. సుదర్శనము జ్వాలలు అను అలలు ప్రవహించు నేమి అను తీరమును కల్గినది.

**(పూర్వేణాక్రాంతమధ్యే . . . . . పూరుషేణ)** - భువనమని జలమునకు, లోకమునకు పేరు. జలరూపమైన హవిస్సును భుజించు పూర్వపురుషునిచే అధిష్ఠితమైన మధ్యప్రదేశమును కల్గినది సముద్రము. **''అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః, ప్రాణపానాసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్''** ( భ. గీ. 15-14) అనురీతిలో భగవానుడే సముద్రమధ్యమున నుండి భువనమయ హవిస్సును ఆరగించుచున్నాడు. ఇక దార్ష్టాంతికమును గమనించిన, లోకముల నన్నిటిని భుజించుచున్న పురుషునిచే అధిష్ఠితమైన మధ్యప్రదేశమును సుదర్శనము కల్గినదైయుండును. **''భూయాత్సౌదర్శనో వః ప్రతిభటవపుషః పూరుషః పౌరుషాయ''** (శ్లో 75) అనుచు వర్ణింప బడిన పురుషుడు ఇచట స్మరణీయుడు. **''భువన మయ హవిర్భోజినా''** అనుచోట **''అత్తా చరాచరగ్రహణాత్''** అను బ్రహ్మసూత్రముయొక్క భాష్యము అనుసంధేయము. భగవానుని గూర్చికదా ఆసూత్రము తెల్పుచున్నది అనుశంక ఇచట కలుగవచ్చును. అయినను దీనిని సుదర్శనపరముగా అన్వయించి, అనుసంధించుటలో ఎట్టి కొఱతయు లేదు. **''వాణీ పౌరాణికీయం ప్రథయతి మహితం ప్రేక్షణం కైటభారేః, శక్తి ర్యస్యైషు దంష్ట్రానఖపరశుముఖవ్యాపినీ తద్విభూత్యామ్''** (శ్లో 76) అని ఈస్తుతిలోనే నుడువబడినది కదా ! అంగవైభవము అంగి యందే పర్యవసించును.

**(ప్రస్ఫూర్జత్ప్రాజ్యరత్నే)** – ప్రాజ్యమనగా అనేకము అని అర్థము. **''ప్రభూతం ప్రచురం ప్రాజ్య మదభ్రం బహుళం బహు''** అని అమరము. సముద్రమున పలురత్నము లుండును. చక్రాయుధమునను రత్నములుండుటలో కొఱతలేదు. కావున ఈ విధముగా సముద్రమనదగిన రథపదము కలదు. అది చక్రాయుధము. అందు -

**( ఏధమానైః స్ఫులింగైః విద్రుమాణాం శ్రియం విస్తృణానా అరవితతిః)** - అరములలో అంతటా పుట్టు విస్ఫులింగములు పగడములు అనదగినట్లు ఉండును. పగడములు సముద్రమున నుండునుకదా ! స్ఫులింగములతో కూడిన అరసమూహము పగడమాలను పోలియున్నదని భావము. లేక, **''ఏధమానైః స్ఫులింగైః ప్రస్ఫూర్జత్ప్రాజ్యరత్నే''** అని అన్వయించి, తృతీయకు అభేదార్థమును గ్రహించి స్ఫులింగములను రత్నములను కల్గినదను అర్థమును చెప్పుటయు



పొసగును. సంస్కృత వ్యాఖ్యాత మొదటి వివరణమును చూపెను. రెండవ వివరణమును శ్రీ అణ్ణాస్వామివారు తెలిపిరి. **''విద్రుమాణాం శ్రియమ్ విస్తృణానా అరవితతిః''** స్వాభావిక శోభచే అరములు పగడమాలతో పోలియున్నట్లున్నవి.

''అరవితతిః వః భద్రం విధత్తామ్''

---

## శ్రీసుదర్శనుని అరాలు మీకు క్షేమాన్ని నిరాటంకంగా ఇవ్వాలి.

**44.** నాసీరస్వైరభగ్నప్రతిభటరుధిరాసారధారావసేకాన్
ఏకాంతస్మేరపద్మప్రకరసహచరచ్ఛాయయా ప్రాప్య నాభ్యా ।
ముక్తానీవాంకురాణి స్ఫురదనలశిఖాదర్శితప్రాక్ప్రవాళాని
అవ్యాఘాతేన భవ్యం ప్రదదతు భవతాం దివ్యహేతే రరాణి ॥

నాసీర = సేనాముఖమున, స్వైర = యథేష్టముగా, భగ్న = చెదఱిపోయిన, ప్రతిభట = శత్రువుల, రుధిర = రక్తముయొక్క, ఆసార = ప్రవాహములను, ధారా+ అవసేకాన్ = నీటిప్రవాహముచే తడుపబడుటను, ప్రాప్య = పొంది, ఏకాంతస్మేర = బాగుగా వికసించిన, పద్మ = తామరపూవుల, ప్రకర = సమూహములకు, సహచరచ్ఛాయయా = సదృశమైన శోభనుకల, నాభ్యా = నాభిచే, ముక్తాని = వెలువరింపబడిన, అంకురాణి ఇవ(స్థితాని) = అంకురముల వలెనున్నవి, స్ఫురత్ = ప్రకాశించు, అనలశిఖా = అగ్నిజ్వాలలచే, దర్శిత = చూపబడిన, ప్రాక్ ప్రవాళాని = ప్రథమ పల్లవములను కల్గినవి అగు, దివ్యహేతేః = శ్రీసుదర్శనముయొక్క, అరాణి = అరములు, భవతామ్ = మీకు, భవ్యమ్ = క్షేమమును, అవ్యాఘాతేన = అడ్డులేకుండ, ప్రదదతు = ఇచ్చునుగాక !

నాభిని ఒక పద్మముగా భావించి, ఆపద్మమునుండి వెలువడిన అంకురమువలె అరములు ఉన్నవి అనుట ఇందలి విషయము. **''నాభ్యా ముక్తాని ( సృష్టాని) అంకురాణీవ స్థితాని అరాణి భవతాం భవ్యం ప్రదదతు''** అని అన్వయము. నాభి ఎట్టిది అనగా **''ఏకాంత స్మేరపద్మప్రకర సహచరచ్ఛాయయా''** - బాగుగా వికసించిన పెక్కు తామరపూవుల శోభవంటి శోభను కల్గియున్నది. నాభియే ఒక అపూర్వమైన తామరపూవు అని తాత్పర్యము. దీనిని బీజస్థానమున భావించి, అరములను అంకురములుగా పల్కుచున్నారు. నీరు పోయకుండ బీజము నుండి అంకురములు ఉద్భవించవు కదా ! ఇచట నీరు ప్రవహింపచేయుట కలదా ? అనినచో, అందులకు ఏకొఱతయు లేదనుచున్నారు.

**(నాసీరస్వైరభగ్నప్రతిభటరుధిరాసారధారావసేకాన్)** - యుద్ధరంగమునందు

సుదర్శనముచే దెబ్బతిని వికలాంగులై, మరణించిన అసురుల, రాక్షసుల నీటిప్రవాహము రక్తధారలచే తడుపబడిన, నాభినుండి అరములను అంకురములుపుట్టినవట. అంకురములు పుట్టునపుడు వాని మొనలలో పల్లవములు (చిగుళ్లు) ఉండును. ఇచటను అట్టి చిగుళ్లు కలవు. అవి ఏమనగా - **(స్ఫురదనలశిఖాదర్శిత ప్రాక్ ప్రవాళాని)** - జ్వలించు అగ్నిజ్వాలలచే ప్రకాశింప చేయబడినవి ఆ చిగుళ్లు. అనగా ఆ అగ్నిజ్వాలలే చిగుళ్లు అని తాత్పర్యము.

**''దివ్యహేతేః అరాణి భవతాం భవ్యం ప్రదిశతు''**

## శ్రీసుదర్శనుని అరాలు మీకు ఉన్నతపదవిని ఇవ్వాలి.

**45.** **దావోల్కామండలీవ ద్రుమగణగహనే బాడబస్యేవ వహ్నేః**
**జ్వాలావృద్ధి ర్మహోబ్ధౌ ప్రవయసి తమసి ప్రాత రర్కప్రభేవ ।**
**చక్రే యా దానవానాం హయకరటిఘటాసంకటే జాఘటీతి**
**ప్రాజ్యం సా వః ప్రదేయాత్ పద మరపరిషత్ పద్మనాభాయుధస్య ॥**

ద్రుమగణగహనే = వృక్షసమూహములచే దట్టమైన అడవిలో, దావ+ ఉల్కామండలీవ = దావాగ్నినుండి పుట్టిన ఉల్కల సమూహమువలె, మహోబ్ధౌ = గొప్పసముద్రమునందు, బాడబస్య వహ్నేః = బడబాగ్నియొక్క, జ్వాలావృద్ధిః ఇవ = జ్వాలల వృద్ధివలె, ప్రవయసి తమసి = గొప్పచీకటిలో, ప్రాతః+ అర్కప్రభేవ = ప్రాతఃకాలములోని సూర్యకాంతివలె, పద్మనాభాయుధస్య = భగవానుని ఆయుధమగు శ్రీసుదర్శనముయొక్క, యా అరపరిషత్ = ఏ అరముల సమూహము, హయకరటిఘటాసంకటే = అశ్వసమూహములతో, గజసమూహములతో కూడిన, దానవానాం చక్రే = అసురులసైన్యమునందు, జాఘటీతి = ప్రవేశించి వ్యాపించుచున్నదో, సా = అట్టి అరలపంక్తి, వః = మీకు, ప్రాజ్యం పదమ్ = ఉన్నతమైన పదవిని, ప్రదేయాత్ = ఇచ్చుగాక !

వృక్షములు దట్టముగా నున్న అడవిలో దావాగ్ని పుట్టి, ఆ అడవిని దహించునట్లు, సముద్రమున బడబాగ్నిజ్వలించి, అందలి నీటి ప్రవాహములను తపింపచేయునట్లు, కటికచీకటిలో సూర్యుడు ఉదయించి, ఆచీకటిని అపహరించునట్లు శ్రీసుదర్శన భగవానుని అరసమూహము గజతురగాది సంకులమైన అసురమండలమునందు వ్యాపించి ఆ అసురులను కబళీకరించుచున్నది. అట్టి గొప్పతనమును కల అరలపంక్తి మీకు ఉత్తుంగస్థానాధికారములను అనుగ్రహించును గాక ! అని తాత్పర్యము.

**''జాఘటీతి''** అనునది **''ఘటతే''** అను క్రియయొక్క యఙ్‌లు గంతప్రయోగము.



బాగుగా ఘటించుచున్నదని అర్థము. **''ఆరటీతి''** అని వేరొక పాఠము.

**''పద్మనాభాయుధస్య అరపరిషత్ వః ప్రాజ్యం పదం ప్రదేయాత్''**

## శ్రీసుదర్శనుని అరాలు మీకు కీర్తిని కల్గించాలి.

**46.** **తాపా ద్దైత్యప్రతాపాతపసముపచితాత్ త్రాయమాణం త్రిలోకీమ్**
**లోలై ర్జ్వాలాకలాపైః ప్రకటయదభిత శ్చీనపట్టాంచలాని ।**
**ఛత్రాకారం శలాకా ఇవ కనకకృతా శ్శౌరిదోర్దండలగ్నం**
**భూయాసు ర్భూషయంత్యో రథచరణ మరస్ఫూర్తయః కీర్తయే వః ॥**

దైత్యప్రతాప = అసురుల ప్రతాపము అను, ఆతప = ఎండచే, సముపచితాత్ = అభివృద్ధిచెందిన, తాపాత్ = తాపమునుండి, త్రిలోకీమ్ = ముల్లోకములను, త్రాయమాణమ్ = రక్షించునది, లోలైః = చుట్టును తిరుగుచున్న, జ్వాలాకలాపైః = జ్వాలాసమూహములచే, అభితః = చుట్టును, చీనపట్టాంచలాని = చీనాదేశపు పట్టువస్త్రములను, ప్రకటయత్ = ప్రకాశింపచేయు చున్నది, శౌరిదోర్దండలగ్నమ్ = భగవానుని బాహుదండమందు అమరియున్నది, (కావుననే), ఛత్రాకారమ్ = గొడుగువంటిది అగు, రథచరణమ్ = చక్రమును, భూషయంత్యః = అలంకరించుచున్న, కనకలతాః ఇవ = బంగారు లతల వలెనున్నవి అగు, అరస్ఫూర్తయః = అరముల ఉద్భవములు, వః = మీయొక్క, కీర్తయే = కీర్తికొఱకు, భూయాసుః = అగునుగాక !

శ్రీసుదర్శనమును గొడుగుగా, అరములను ఆగొడుగు కమ్ములుగా చమత్కరించుచు వర్ణించుట ఇందలి అంశము. **''ఛత్రాకారం రథచరణం భూషయంత్యః అరస్ఫూర్తయః వః కీర్తయే భూయాసుః''** అని అన్వయము. గొడుగు ఎండవలన కల్గు తాపమునుండి తప్పించి, కాపాడును. కావున ఆతపత్రమని దానికి పేరు. సుదర్శనచక్రము **(దైత్యప్రతాపాతపసముచితాత్ తాపాత్ త్రిలోకీం త్రాయమాణమ్)** – **''వాసుదేవతరుచ్ఛాయా నాతిశీతా న ఘర్మదా''** అనునట్లు సుఖమయమైన, **''తన్నొప్పారిల్లప్పున్ తనతాళ్ నిழலిల్''** అనునట్లు తనకు సాటిలేని వాడగు స్వామియొక్క పాదముల ఛాయలో ఒదిగి ఉజ్జీవింపలేక, అసురుల, రాక్షసుల ప్రతాపమను ఆతపమువలన వర్ధిల్లిన తాపమునందు చిక్కుకొని, బాధపడు లోకములను ఉజ్జీవింపచేయును. అనగా, దైత్యధ్వంసమును చేయునని భావము.

**(లోలైః జ్వాలాకలాపైః. . . .)** చీనాదేశపు పట్టువస్త్రములచే గొడుగుకు జాలరులు వ్రేలాడదీయబడియుండును. సుదర్శనచక్రమున జ్వాలాకలాపములు చుట్టును తళతళమని జ్వలించుట అట్లే తోచుచున్నది. **''చీనపట్టు''** అనుచోట **''ఛిన్నపట్టు''** అని కొందరు

పఠింతురు. చైనాదేశమని ప్రస్తుతమున వ్యవహరింపబడు చీనాదేశమును ప్రాచీనులగు ఈ స్తోత్రకర్త ప్రస్తావించి యుండరని వారు వాదింతురు. ఈ స్తోత్రకర్తకంటె ప్రాచీనుడైన కాళిదాసు రచించిన శాకుంతలమున **''చీనాంశుక మివ కేతోః ప్రతివాతం నీయమానస్య''** అను ప్రయోగమును వీరు గమనింపలేదు కాబోలు అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి సూక్తి. **''చైన పట్టాంచలాని''** అను పాఠమును కలదు.

**(శౌరిదోర్దండలగ్నమ్)** - గొడుగు ఒక దండమునకు లగ్నమైయుండును. సుదర్శనము భగవానుని బాహువు అను దండమునందు లగ్నమై యుండును. **''వానెన్నుమ్ కేడిలా వాన్ కుడైక్కు-త్తార్ మణి క్కామ్పుపోల్ నిమిర్న్దు''** అని ఆకాశమనును గొడుగుకు భగవానుడే ఆలంబన దండము అని నమ్మాళ్వార్లు పల్కి-రికదా ! ఈ కవి భగవానుని బాహువును దండముగా రూపించిరి. ఇట్లు ఈ విధముగా ఛత్రమనదగినట్లున్న శ్రీసుదర్శనమునందు తళతళమని మెఱయుచున్న అరములు బంగారు కమ్మిలవలె నున్నవి. అవి మీకు కీర్తిని కల్గించును గాక !

''అరస్ఫూర్తయః వః కీర్తయే భూయాసుః''

---

## శ్రీసుదర్శనుని అరాలు మీ శత్రువులను తఱిమి కొట్టాలి.

**47.** **నాభీశాలానిఖాతాం సహనసముచితాం వైరిలక్ష్మీవశానాం**
**సంయద్వారీహృతానాం సమనువిదధతీ కాంచనాలపంక్తిమ్ ।**
**రాజ్యా చ ప్రాజ్యదైత్యవ్రజవిజయమహోత్తంభితానాం భుజానాం**
**తుల్యా చక్రారమాలా తులయతు భవతాం తూలవ చ్ఛత్రులోకమ్ ॥**

సంయద్వారీహృతానామ్ = యుద్ధరంగమను ఏనుగులను బంధించు గోతిచే గ్రహింపబడిన, వైరిలక్ష్మీవశానామ్ = శత్రువుల సంపదలను ఆడ ఏనుగుల యొక్క-, సహన సముచితామ్ = బంధించుటకు అనువైనది, నాభీశాలానిఖాతామ్ = నాభి అను శాలయందు నాటబడినది అగు, కాంచన+ ఆలానపంక్తిమ్ = స్వర్ణమయమైన కట్టుస్తంభముల వరుసను, సమనువిదధతీ = అనుకరించుచున్నదై, ప్రాజ్యదైత్య = గొప్పవారైన దైత్యుల, వ్రజ = సమూహమును, విజయి = జయించు, మహ+ ఉత్తంభితానామ్ = మహోత్సవసమయమున ఉన్నతముగా ఎత్తబడిన, భుజానామ్ = భుజములయొక్క-, రాజ్యా =వరుసతో, తుల్యా చ = సమానమైనదైయున్న, చక్ర+ అరమాలా = సుదర్శన చక్రముయొక్క- అరలపంక్తి, భవతామ్ = మీయొక్క-, శత్రులోకమ్ = శత్రువర్గమును, తూలవత్ = దూదిపింజవలె, తులయతు = ఎగురగొట్టును గాక !

స్వర్ణమయమైన గజబంధనస్తంభములవలె అరములు భాసించుచున్నవనుట



పూర్వార్ధములోని అంశము. అయినచో గజము ఏది ? ఎచటినుండి వచ్చినది ? అనుమొదలగు ప్రశ్నలకు క్రమేణ కవి సమాధానమును తెలుపుచున్నారు.

**(నాభీశాలానిఖాతాం. . . .వైరిలక్ష్మీ వశానామ్)** **''వశా''** అనునది ఆడ ఏనుగును తెలుపును. **''వశా స్త్రీ కరిణీ వంధ్యా''** అని అమరము. శత్రువులగు అసురుల, రాక్షసుల సంపదలను గజస్త్రీగా స్త్రీలింగస్వారస్యమును బట్టి కవి రూపించిరి. ఆ ఆడ ఏనుగులు ఎచటినుండి వచ్చినవి - అన్నచో

**(సంయద్వారీహృతానామ్)** - **''సంయత్''** అనగా యుద్ధము. ఆ యుద్ధమే వారి. **''వారీ తు గజబంధనీ''** అను అమరకోశవచనమును బట్టి ఏనుగును కట్టియుంచు చోటు అను అర్థముకాదు, ఏనుగును బంధించుటకు ఉపయోగపడు గోయి అని అర్థము. ఆ వారినుండి ఆడుగజములు తీసికొని రాబడినవి. వానిని బంధించుటకు తగిన స్తంభముల వరుసలుగా అరములు తోచుచున్నవి. కట్టుస్తంభములు పెద్ద శాలలో నాటబడి యుండును. ఈ స్తంభములును అట్లే ఉన్నవి.

**(నాభీశాలానిఖాతామ్)** - నాభి అను శాలయందు ఈ స్తంభము నాటబడియున్నవి. ఇట్టి కాంచనమయమైన ఆలాన పంక్తిని, **(సమనువిదధతీ చక్రారమాలా)** - అనుకరించుచున్నది అరలపంక్తి. ఈ వర్ణనము వలన తెలుపబడినదేమనగా - యుద్ధరంగమున అసురులను, రాక్షసులను సర్వదా అరలపంక్తులు దరిద్రులను చేయుచున్నవి అని. వారి సంపదలను అరములు హరించుచున్నవనుటకు ఇదియే కదా తాత్పర్యము.

**(రాజ్యా చ ప్రాజ్యదైత్య . . . .)** **''ప్రాజ్యః యో దైత్యవ్రజవిజయిమహః, తస్మిన్ ఉత్తంభితానామ్''** గొప్ప దానవుల సమూహములను జయించిన మహోత్సవమున ఉన్నతముగా పైకి ఎత్తబడినవి. అనగా ఊర్ధ్వముఖముగా చాచబడిన అని భావము. అట్టిభావములు **''భుజానాం రాజ్యా (సమూహేన) చ తుల్యా''**- విజయకాలమున సంతోషాతిశయముచే బాహువులను ఎత్తి, విజయ నర్తనము చేయుట జయించినవారి అలవాటు. **''భుజ ముద్ధృత్య నృత్యతే''** అని చెప్పబడుచున్నది కదా ! ఇట్లు ఆలానపంక్తివలె ఉన్నది, భుజపంక్తివలె ఉన్నదియు అగు చక్రారమాల మీ శత్రుగణమును దూదినివలె అనాయాసముగా ఎగురగొట్టును గాక ! అనితాత్పర్యము.

''చక్రారమాలా భవతాం శత్రులోకం తూలవత్ తులయతు''

---

## శ్రీసుదర్శనుని అరాలు లోకాలను ఆనందింప జేయాలి.

**48.** **ఆనేమే శ్చక్రవాలాత్ త్విష ఇవ వితతాః పిండికాచండదీప్తేః**

**దీప్తా దీపా ఇవాఽఽరాత్ గహనరణతమీగాహినః పూరుషస్య ।**
**శాణే రోషాణితానాం రథచరణమయే శత్రుశౌండీర్యహేమ్నాం**
**రేఖాః ప్రత్యగ్రలగ్నా ఇవ భువన మరశ్రేణయః ప్రీణయంతు ॥**

ఆనేమేః చక్రవాలాత్ = నేమి అను లోకాలోకపర్వతమువరకు, వితతాః = వ్యాపించినవి, పిండికాచండదీప్తేః = నాభి అను సూర్యునియొక్క, త్విషః ఇవ (స్థితాః) = కిరణములవలె నున్నవి, గహనరణతమీగాహినః = ప్రవేశించుటకు వీలుకాని యుద్ధరంగమను కటికచీకటిలో ప్రవేశించు, పూరుషస్య = సుదర్శనపురుషుని, ఆరాత్ = సమీపమున, దీప్తాః = వెల్గు, దీపాః ఇవ = దీపములవలె, (ఉన్నవి), రథచరణమయే = సుదర్శనమను, శాణే = గీటురాయిలో, రోషాణితానామ్ = పదునుపెట్టబడిన, శత్రుశౌండీర్యహేమ్నామ్ = శత్రుపరాక్రమమను స్వర్ణముయొక్క, ప్రత్యగ్రలగ్నాః రేఖాః = అపుడే లగ్నమైన (గీయబడిన) రేఖలవలెనున్నవి అగు, అరశ్రేణయః = అరల పంక్తులు, భువనమ్ = లోకమును, ప్రీణయంతు = సంతోషింపచేయునుగాక !

అరల పంక్తులను ఒక్కొక్కపాదమున ఒక్కొక్కవిధముగా కవి ఉపమించుట ఇందలి విశేషము.

**(ఆనేమేః చక్రవాళాత్)** - చక్రవాళ మనగా లోకాలోకపర్వతము. అందు సూర్యకిరణ ప్రకాశము సోకని ప్రదేశము కలదు అని పురాణప్రసిద్ధము. ఈ కవియే తొమ్మిదవ శ్లోకమున **''దినకరకిరణాదృష్టసీమః చక్రవాలాచల ఇవ''** అని పల్కిరి కదా ! **''లోకశ్చ ఆలోకశ్చ అత్ర స్త ఇతి లోకాలోకః''** అని వివరణము. భూమిని చుట్టియున్న పర్వతమగుటచే చక్రవాళమను పేరు దీనికి కల్గినది. అట్లే, ఇచటను నేమి చక్రమును చుట్టియుండుటను బట్టి చక్రవాళముగా రూపింపబడినది. ఆ చక్రవాళపర్వతమువరకును వ్యాపించిన సూర్యకిరణములా ఇవి ! అనునట్లు అరములు ఉన్నవి. చక్రనాభి అను సూర్యుని కిరణములు నేమి అను చక్రవాళ పర్వతమువరకు వ్యాపించియున్నవి. **''ఆనేమేః''** అనుపుడు ఆఙ్ అభివిధిని తెలుపును. **'' ఆఙ్మర్యాదాభివిధ్యోః''** (2-1-13) అని కదా సూత్రము. అట్లుకాక, **'ఆఙ్'**కు మర్యాదార్థము గ్రహించినచో శ్లోకములోని అపూర్వవర్ణనకు అవకాశము లేకుండ పోవును.

**(దీప్తాః దీపా ఇవారాత్ . . . . .)** ప్రవేశించుటకు వీలుకాని యుద్ధరంగము అను గొప్పచీకటిలో ప్రవేశించుచున్న సుదర్శనపురుషునకు పట్టునట్టి కరదీపికలా ! అనునట్లు అరములున్నవి.

**(శాణే రోషాణితానామ్)** - సుదర్శనచక్రమను ఒరపిడిరాయిలో అసురుల, రాక్షసుల ప్రతాపమను బంగారు కడ్డీని సానబట్టి చూడగా ఆ శాణమునందు అంటుకొనియున్న స్వర్ణరేఖలా ఇవి ! అనునట్లు అరములు తోచుచున్నవి. ఇట్లు అనేకవిధముల ఉత్ప్రేక్షింప తగినట్లున్న అరల



పంక్తులు లోకమును సంతోషింపచేయును గాక ! అని తాత్పర్యము. **''రోషాయితానామ్''**, **''రేఖాయితానామ్''** అను వేరు పాఠములును కలవు. వీనిని సంస్కృత వ్యాఖ్యాత చూపెను. ఇందులో **''రేఖాయితానామ్''** అను పాఠము **''రేఖాః ప్రత్యగ్రలగ్నా ఇవ''** అను ప్రయోగమునకు అనురూపము. అర్థమున భేదములేదు. **''అరశ్రేణ్యాః తరణికిరణ సాదృశ్యకథనేన నిఖిలభువన వ్యాపిత్వ పరిశుద్ధత్వే ప్రత్యపాది, దీపసామ్యకథనేన తమోనివర్తకత్వం, మంగళాకరత్వంచ ప్రతిపాదితమ్, కాంచనరేఖాతుల్యతా కథనేన రామణీయకం, మార్దవంచ ప్రతిపాదితం భవతి''** అని సంస్కృతవ్యాఖ్యానము. అనగా అరశ్రేణులకు సూర్యకిరణసాదృశ్యమును చెప్పుటచే ఆఅరములు సమస్తభువనములందు వ్యాపించుట, దాని పరిశుద్ధత్వమును ప్రతిపాదింపబడినవి. దీపసామ్యమును పల్కుటచే వాని తమోనివర్తకత్వము, మంగళ మూలత్వమును ప్రకటింపబడినవి. కాంచనరేఖా సాదృశ్యముచే అరముల రమణీయత, మార్దవమును తెలుపబడినవి అని భావము.

''అరశ్రేణయః భువనం ప్రీణయంతు''

## శ్రీసుదర్శనుని అరాలు మీకు గొప్ప సంపదను ఇవ్వాలి.

**49.** **దీప్తై రర్చిః ప్రరోహైః దలవతి విధృతే బాహునాళేన విష్ణోః**
**ఉద్యత్ప్రద్యోతనాభం ప్రథయతి పురుషం కర్ణికావర్ణికాయామ్ ।**
**చూడాలం వేదమౌలిం కలయతి కమలే చక్రనామ్నోపలక్ష్యే**
**లక్ష్మీం స్ఫారా మరాణి ప్రతివిదధతు వః కేసరశ్రీకరాణి ॥**

దీప్తైః = ప్రకాశించు, అర్చిఃప్రరోహైః = జ్వాలామండలమను చిగుళ్లతో, దలవతి = రేకులను కల్గినది, విష్ణోః = భగవానునియొక్క, బాహునాళేన = బాహువు అను నాళముచే, విధృతే = ధరింపబడినది, ఉద్యత్ ప్రద్యోతన = సద్యోజాతుడైన సూర్యునితో, ఆభమ్ = సమానుడు (సమానముగా వెలుగువాడు) అగు, పురుషమ్ = సుదర్శనపురుషుని, కర్ణికావర్ణికాయామ్ = కర్ణికాస్థానమున, ప్రథయతి = ప్రకాశింపచేయునది, వేదమూలం చూడాలమ్ కలయతి = వేదశిరస్సును అలంకృతముగా చేయునది, చక్రనామ్నా = చక్రమను పేరుతో, ఉపలక్ష్యే = దర్శింపతగిన, కమలే = తామరపూవులో, కేసర శ్రీకరాణి = కేసరముల శోభను కలుగచేయుచున్న, అరాణి = అరములు, వః = మీకు, స్ఫారాం లక్ష్మీమ్ = గొప్పసంపదను, ప్రతివిదధతు = కలుగచేయునుగాక !

**(చక్రానామ్నోపలక్ష్యే కమలేకేసర శ్రీకరాణి అరాణి వః స్ఫారాం లక్ష్మీం ప్రతివిదధతు)** - సుదర్శనమును తామరపూవుగా, అరములను ఆ పూవులనుండి పుట్టిన కేసరములుగా

రూపించుట ఇందలిఅంశము. సుదర్శనమును కమలముగా రూపించుటకు తగిన సామ్యములను పూర్వార్ధమున ప్రతిపాదించుచున్నారు.

**(దీప్తై రర్చిః ప్రరోహై ర్దలవతి)** – **''ధాన్యేన ధనవాన్''** అను ప్రయోగములలోవలె తృతీయా విభక్తికి అభేదము అర్థము. వర్తులాకారముగా జ్వలించుచున్న జ్వాలాకలాపములనబడు చిగుళ్లను కల్గినది చక్రాయుధమను కమలము.

**(విష్ణోః బాహునాళేన విధృతే)**- కమలము నాలముచే ధరింపబడియుండును. సుదర్శనమును భగవానుని బాహునాళముచే ఎల్లప్పుడు ధరింపబడియుండును.

**(కర్ణికావర్ణికాయామ్ ఉద్యత్ప్రద్యోతనాభమ్)** - కమలము మధ్యలో కర్ణిక అను అంగము ఉండును కదా ! అది తళతళమని ప్రకాశించుచుండును. **''కర్ణికా తు సరోజస్య బీజకోశే ప్రకీర్తితా''** అని నిఘంటువు తెలుపుచున్నది. కర్ణికయొక్క వర్ణిక అనగా వర్ణమే వర్ణిక. ఆకారము అని అర్థము. కర్ణికాస్థానములో అని తాత్పర్యము. చక్రాఖ్యకమలమునందు కర్ణికారూపముగా నున్నది ఏది అనగా-

**(ఉద్యత్ ప్రద్యోతనాభమ్)** – **''ఉద్యతః యః ప్రద్యోతనః సూర్యః, తస్య ఆభేవ ఆభా యస్య, తమ్ (పురుషం) సుదర్శనపురుషమ్ ప్రథయతి ప్రకాశయతి''. ''ప్రథయతి''** అనునది సప్తమీ విభక్తి ఏకవచన రూపము. ఉదయకాలమునందలి సూర్యునివలె జాజ్జ్వల్యమానుడగు సుదర్శనపురుషుని కర్ణికగా చక్రాఖ్యకమలము దర్శింపచేయుచున్నది.

**(వేదమౌళిం చూడాలమ్ కలయతి)** – **''చూడా''** అని భూషణ సామాన్యమునకు పేరు. చూడాల మనగా భూషితమని అర్థము. కమలము శిరస్సును అలంకరించును. సుదర్శనము వేదశిరస్సును భూషితము చేయుచున్నది. మహోపనిషత్తు, శతపథము మొదలగు పలు వేదాంతభాగములు సుదర్శనముయొక్క మహిమను తెలుపుచుండుటచే వేదశిరస్సులు సుదర్శనముచే అలంకృతములు అని భావము. **''ఆమ్నాయై రేకకంఠైః స్తుతమహిమ మహో మాధవీయస్య హేతేః''** అని పూర్వము కవి వచించిరి కదా ! లేక **''ద్రావిడీం బ్రహ్మసంహితామ్''** ఇత్యాదిగా బ్రహ్మసంహితగా ప్రశంసింపబడు శఠకోపసూరి సూక్తులను అలంకరించునది - అనగా అందు ప్రతిపాదింపబడిన వైభవమును కల్గినది అనియు చెప్పనగును. ఆ ప్రబంధములోని పలు సందర్భములలో సుదర్శనుని వైభవము ప్రతిపాదింపబడుట సుప్రసిద్ధము. ఇట్లు పైసామ్యముతో కమలమువలెనున్న సుదర్శనమునందలి కేసరముల స్థానములోనున్న అరములు మీకు లక్ష్మిని కలుగచేయును గాక ! ఈస్తుతిలోని **''యా కమలం తిరోభావ్య భాతి''** 58వ శ్లోకమున సుదర్శనుని నాభి కమలమును అతిశయించి ప్రకాశించుట వర్ణింపబడినది.



తిరువాయ్‌మెుళ్ఝి ఈడు వ్యాఖ్యలో (8-4-1) **''ఇవళ్ కైయిల్ లీలారవిందమ్ అవనుక్కు భోగ్యమా యిరుక్కుమాప్పోలే యాయ్‌ఱు అవన్‌కైయిల్ దివ్యాయుధఙ్గళ్ ఇవళుక్కు ఇనితా యిరుక్కుమ్బడి''** అని వ్యాఖ్యానించుట, **''దివ్యాస్త్రపుష్పితమ్''** (68) అనుచు పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవమున భగవానుని ఆయుధములను వర్ణించుట - ఇత్యాది అర్థసామ్యములను ఇచట అనుసంధింపనగును. సుదర్శనుని కమలముతో రూపించుటను సంస్కృతవ్యాఖ్యాత వివరించుచు **''చక్రనామకమలస్య కుండలితజ్వాలాషణ్డ మేవ దళనికురుంబం, శ్రీరంగనాథదక్షిణభుజాదండ ఏవ నాళః చక్రమధ్యప్రదేశవర్తీ ప్రభాతప్రభాకరప్రకాశః సుదర్శనపురుషః, కర్ణికా వేదాంత పరిమళః, కర్ణికాత్వేన వర్ణితం సుదర్శనపురుషం పరీత్య ప్రకాశమానాన్యరాణ్యేవ కేసరాణి''** అని పల్కెను. శఠకోపసూరి తిరువిరుత్తప్రబంధములో **''తిరుమాలురు వొక్కుమ్ మేరు, అమ్మేరువిల్ శెఞ్జుడరోన్ తిరుమాల్ తిరుక్కై తిరుచ్చక్కరమొక్కుమ్''** (88) అను పాశురమున సుదర్శనుని సూర్యునితో పోల్చుట, ఈ స్తుతిలోనే **''చక్రేశార్క ప్రకాశః''** (20) అనియు కవిపల్కుట మొదలగు సంవాదములను కూడా **''ఉద్యత్ప్రద్యోతనాభమ్''** అను సూక్తికి అనుగుణముగా గమనింపనగును.

''అరాణి వః స్ఫారాం లక్ష్మీం ప్రతివిదధతు''

## శ్రీసుదర్శనుని అరాలు మీకు పుష్కలమైన ఐశ్వర్యాన్ని ఇవ్వాలి.

**50.** ధాతుస్యందై రమందైః కలుషితవపుషో నిర్ఝరాంభఃప్రపాతాన్
అర్చిష్మత్యా స్వమూర్త్యా రథచరణగిరేః నేమినాభీతటస్య ।
వ్యాకుర్వాణారపంక్తి ర్వితరతు విభుతా విస్తృతిం విత్తకోటీ
కోటీరచ్ఛత్రపీఠీకటకకరిఘటాచామరస్రగ్విణీం వః ॥

నేమినాభీతటస్య = నేమియు, నాభియు అను తటములను కల్గినది, రథచరణగిరేః = చక్రమను పర్వతమునుండి, అమందైః ధాతుస్యందైః = అంతులేని గైరికాది ధాతుప్రవాహములచే, కలుషిత వపుషః = కలతచెందిన రూపములకల, నిర్ఝరాంభః ప్రపాతాన్ = కొండవాగుల ప్రవాహములను, అర్చిష్మత్యా = కాంతిమయమైన, స్వమూర్త్యా = స్వస్వరూపముతో, వ్యాకుర్వాణా = వివరించునదియగు (విస్తృతపఱచునది అగు), అరపంక్తిః = అరలవరుస, వః = మీకు, విత్తకోటీః = ధనరాశులను, కోటీర = కిరీటమును, ఛత్ర = గొడుగులను, పీఠీ = సింహాసనమును, కటక = భుజభూషణములను, కరిఘటా = గజసమూహములను, చామరస్రగ్విణీమ్ = చామరములను, పూమాలెలను, విభుతా విస్తృతిమ్ = ఇవి పుష్కలముగానున్న సంపదను, వితరతు = ఇచ్చుగాక !

శ్రీసుదర్శనమును ఒక పర్వతముగా, నేమిని, నాభిని పర్వతతటములుగను, అరల

పంక్తినిగైరికాది ధాతువులచే కలుషితమైన, ఎఱ్ఱని కొండవాగుల ప్రవాహములుగను కవి ఇందు వర్ణించుచు ఇట్టి అరపంక్తి మీ సంపదను అభివృద్ధి చేయునుగాక ! అనుట విషయము. ఆ సంపదను **''విత్తకోటీ''** ఇత్యాదిగా విశేషించుచున్నారు. సమృద్ధమైన ధనరాశులు, కిరీటములు, బాహువలయములు మొదలగు ఆభరణములను ధరించి, దివ్యమైన పూమాలికలను అలంకరించుకొని ఒకే గొడుగునీడలో, రెండు ప్రక్కల చామరగ్రాహిణులు చామరములు వీచుచుండగా దివ్యమైన సింహాసనమున వేంచేసియుండు భాగ్యమును, పలు గజములను కల్గిన గజాంతమైన ఐశ్వర్యమును పొందుటకు తగిన వైభవవిస్తారమును మీకుఇచ్చునుగాక ! అని తాత్పర్యము. దేశికులు శ్రీస్తుతిలో -**''ఛత్రచ్ఛాయా సుభగశిరసశ్చామరస్మేరపార్శ్వాః శ్లాఘాశబ్ద శ్రవణ ముదితాః స్రగ్విణ స్సంచరంతి''** అనుచు పల్కిన సూక్త్యర్థ మిచట స్మరణీయము.

**''అరపంక్తిః విభుతావిస్తృతిం వః వితరతు''**

**నాభివర్ణనము**

---

## శ్రీసుదర్శనుని నాభి మీకు ఇంద్రైశ్వర్యంతో సాటివచ్చే ఐశ్వర్యాన్ని ఇవ్వాలి.

**51.** ఐక్యేన ద్వాదశానా మశిశిరమహసాం దర్శయంతీ వివృత్తిం
దత్తః స్వర్లోకలక్ష్మ్యా స్తిలక ఇవ ముఖే పద్మరాగద్రవేణ ।
దేయా ద్దైతేయదర్పక్షతికరణరణప్రీణితాంభోజనాభిః
నాభిః నాభిత్వ ముర్వ్యాః సురపతివిభవస్పర్శి సౌదర్శనీ వః ॥

ద్వాదశానామ్ అశిశిరమహసామ్ = ద్వాదశాదిత్యులయొక్క, ఐక్యేన = ఒకటిగాచేరుటచే, వివృత్తిమ్ = (నాభిగా) పరిణమించు రీతిని, దర్శయంతీ = చూపుచున్నది, స్వర్లోకలక్ష్మ్యాః ముఖే = స్వర్గలోక సామ్రాజ్యలక్ష్మియొక్క ముఖమందు, పద్మరాగద్రవేణ = పద్మరాగమణియొక్క ద్రవముతో, దత్తః = పెట్టబడిన, తిలక ఇవ = తిలకములె ఉన్నది, దైతేయదర్ప = అసురుల గర్వమును, క్షతికరణ = అణచగల్గిన, రణ = యుద్ధముచే, ప్రీణిత = సంతోషపెట్టబడిన, అంభోజనాభిః = భగవానుని కల్గినది, సౌదర్శనీ నాభిః = శ్రీసుదర్శనుని నాభి, సురపతివిభవస్పర్శి = దేవేంద్రుని విభవమునకు సమానమైన, ఉర్వ్యాః నాభిత్వమ్ = భూమియొక్క ప్రభుత్వమును, వః = మీకు, దేయాత్ = ఇవ్వవలెను.

ఈశ్లోకమునుండి 61వ శ్లోకము వరకు అనగా 11శ్లోకములలో శ్రీసుదర్శనుని నాభి వర్ణింపబడుచున్నది. అవయవిని వీడి అవయవము ప్రత్యేకముగా ఏకార్యమును చేయలేదు కావున అవయవములకు తెలుపు గొప్పతనము అంతయు అవయవియగు శ్రీసుదర్శన భగవానునికే



చెందును. అవయవములకు మాత్రము సంబంధించిన అసాధారణములైన వర్ణములును కొన్ని కలవు. ద్వాదశాదిత్యులు ఒకటిగా చేరి చక్రనాభిగా పరిణమించిరా ఏమి ! అను విధమున నాభియొక్క ప్రకాశము అతిశయించియున్నది. నాభి ఆకారములో సూర్యుని పోలియుండుటచే ఇట్లు వర్ణించుట తగినవే కదా ! **''దర్శయంతీ వివృత్తిమ్''** వివృత్తి అనగా పరిణామము. **''ప్రవృత్తిమ్''** అను వేరొక పాఠమును కలదు. దీనిని సంస్కృత వ్యాఖ్యాత ఆదరించెను.

**(దత్తః స్వర్లోకలక్ష్మ్యాః)** - నాభి ఆకారము వర్తులముగా నుండుటచే, ఎఱ్ఱనికాంతి అతిశయించి యుండుటచే, దానిని పద్మరాగద్రవముచే కల్పింపబడిన తిలకముగా వర్ణించుచున్నారు. తిలకమనగా నుదిటియందలి బొట్టు. **''తిల ఇవ తిలకః''** అనువ్యుత్పత్తిని బట్టి నుదుటిబొట్టు నూగుగింజ రూపములోనుండునదియైనను, నాభియొక్క కుండలిరూపమును అనుసరించి ఇచటి తిలకము వర్తులాకారకము అని చెప్పనగును. కావుననే సంస్కృతవ్యాఖ్యాత **''వర్తులతిలక ఇవ''** అని వివరించెను. ఎవరి నుదుటిలో అనగా -

**(స్వర్లోకలక్ష్మ్యాః ముఖే దత్తః)** - స్వర్గలోకమునకు పైనను సుదర్శనము వ్యాపించియుండుటచే ఇట్లు పల్కుటలో అనౌచిత్య మేమియు లేదు. తిలకము సౌమంగల్యలక్షణ మగుటచే, చక్రనాభి అసురుల, రాక్షసుల నాశనము ద్వారా స్వర్లోకలక్ష్మియొక్క ఉజ్జీవనమునకు హేతువగుటచే ఇట్లు వర్ణింపబడినది. **''సుదర్శనరాజకృతప్రత్యర్థిలక్ష్మీనిరసనసంజనిత-హర్షోత్కర్షేణ దేవతాలక్ష్మీ రలంకృతేతి వ్యజ్యతే''** అని సంస్కృతవ్యాఖ్య. ఇట్టి అప్రస్తుతవృత్తాంత స్ఫురణముచే సమాసోక్తి కలదని చెప్పనగును. **''పద్మరాగద్రవేణ''** అనుటకు పద్మరాగద్రవమువలె ఎఱ్ఱని ద్రవముచే అను అర్థమును వేరొకవ్యాఖ్యాత సూచించెను.

**(దైతేయదర్ప . . . .)** యుద్ధమున అసురుల మదమును అణచి, భగవానుని ఆనందింప చేసెనని తాత్పర్యము. **''అంభోజనాభిః''** అనగా భగవానుడు. నాభియందు అంభోజమును కలవాడు- పద్మ నాభుడని అర్థము. ఇట్టి సౌదర్శననాభి మీకు చక్రవర్తిత్వమును ఇచ్చును గాక !

**(సురపతివిభవస్పర్శి)**- సామాన్యమైన ప్రభుత్వము కాదు. దేవేంద్రుని సామ్రాజ్యముతో తులతూగు సామ్రాజ్యము కావలయును.

**(ఉర్వ్యాః నాభిత్వమ్) – ''నాభి ర్ముఖ్యనృపే చక్ర మధ్యక్ష క్రియయోః''** అని మేదినీ నిఘంటువు తెలుపుచున్నది.

**''సౌదర్శనీ నాభిః సురపతివిభవస్పర్శి ఉర్వ్యాః నాభిత్వం వః దేయాత్''**

---

## శ్రీసుదర్శననాభి మీకు శ్రేయస్సును ఇవ్వాలి.

**52.** **శస్త్రశ్యామే శతాంగక్షితిభృతి తరలై రుత్తరంగే తురంగైః**
**త్వంగన్మాతంగనక్రే కుపితభటముఖచ్ఛాయముగ్ధప్రవాళే ।**
**అస్తోకం ప్రస్నువానా ప్రతిభటజలధౌ పాటవం బాడబస్య**
**శ్రేయో వ స్సంవిధత్తాం శ్రితదురితహరా శ్రీధరాస్త్రస్య నాభిః ॥**

శస్త్రశ్యామే = ఖడ్గములతో నల్లనిది, శతాంగక్షితిభృతి = రథములనెడి, పర్వతములను కల్గినది, తరలైః తురంగైః = చంచలములగు అశ్వములు అను, ఉత్తరంగే = అలలను కల్గినది, త్వంగత్ = తడబడుచున్న, మాతంగనక్రే = ఏనుగులనెడి, మొసళ్లను కల్గినది, కుపితభట = కోపించిన యుద్ధవీరుల, ముఖచ్ఛాయ = ముఖకాంతి అను, ముగ్ధ = అందమైన, ప్రవాళే = పగడములను కల్గినది అగు, ప్రతిభటజలధౌ = శత్రుసైన్యమను సముద్రమునందు, బాడబస్య = బడబాగ్నియొక్క, అస్తోకమ్ = అధికమైన, పాటవమ్ = సామర్థ్యమును, ప్రస్నువానా = ప్రవహించుచున్నది, శ్రితదురితహరా = ఆశ్రితుల పాపములను హరించునది అగు, శ్రీధరాస్త్రస్య = శ్రీసుదర్శనముయొక్క, నాభిః = నాభి, వః = మీకు, శ్రేయః = శుభమును, సంవిధత్తామ్ = కల్గించునుగాక !

శత్రుసైన్యమును ఒక సముద్రముగా రూపించి, చక్రనాభిని ఆ సముద్రమునకు బడబాగ్నిగా నున్నదని పల్కుట ఇందలి అంశము. శత్రుసైన్యమును సముద్రముగా చెప్పుటకు తగినట్లు సామ్యములను పూర్వార్థమున అయిదు విశేషణములద్వారా కవి తెలుపుచున్నారు.

**(శస్త్రశ్యామే)** - సముద్రము నీలవర్ణములో నుండును. ప్రతిభటజలధియు శస్త్రములచే (ఖడ్గములచే) నల్లగానుండును. ఆయుధములు ఆయసములు కదా !

**(శతాంగక్షితిభృతి)** - శతాంగమనగా రథము, క్షితిభృత్ అనగా పర్వతము. సముద్రము మైనాకాది పర్వతములను కల్గియుండును. శత్రుసైన్యమున రథములే పర్వతములు.

**(తరలైః తురంగైః ఉత్తరంగే)** - సముద్రమున అలలు ఎగసిన వచ్చునట్లు అశ్వములు శత్రుసైన్యమున వచ్చును. అశ్వగమనములను అలల గమనములతో పోల్చుట కవి సమయము. **''వెణ్తిరై పురవియెన్నప్పుదమ్శెయ్దు వన్దున్దు పుల్లాణియే''** అని తిరుమఙ్గైయాళ్వార్లు పల్కిరికదా !

**(త్వంగన్మాతంగనక్రే)** - ఆకారమునగలస్థౌల్య సామ్యమునుబట్టి సముద్రములోని మొసళ్లుగా శత్రుసైన్యములోని గజములు వర్ణింపబడినవి.

**(కుపితభటముఖచ్ఛాయ ముగ్ధప్రవాలే)** - కోపముతో ఎఱ్ఱబడిన యుద్ధవీరుల ముఖములు ఎఱ్ఱని పగడములవలెనున్నవి. **''కుపితభటముఖానామ్ ఛాయా - కుపితభటముఖచ్ఛాయమ్''** అనివిగ్రహము. ఇచట **''ఛాయా బాహుళ్యే''** అను పాణిని



సూత్రముచే హ్రస్వమువచ్చినది. ఇట్లు ఈ ప్రకారములతో సముద్రము అనదగియున్నట్లున్న శత్రుసైన్యమునందు **(బాడవస్య పాటవమ్ అస్తోకం యథాతథా ప్రస్నువానా)** - సముద్రజలమును కబళీకరించుటయే కదా బడబాగ్నియొక్క సామర్థ్యము. అట్లే చక్రనాభి శత్రుభటులను కబళీకరించుచున్నది.

**(ప్రస్నువానా)** - **''ష్ణు - ప్రస్రవణే''** అను ధాతువు పరస్మైపది. కావున ఈ శానచ్ ప్రత్యయాంతరూపము పరిశీలనీయము. **''ప్రాశ్నువానా''** అని వేరొక పాఠము. నివర్తింపచేయునది అని దీని అర్థము.

**''శ్రీధరాస్త్రస్య నాభిః వః శ్రేయః సంవిధత్తామ్''**

## శ్రీసుదర్శననాభి మిమ్ములను రక్షించాలి.

**53.** **జ్వాలాచూడాలకాలానలచలనసమాడంబరా సాంపరాయం**
**యాసా వాసాద్య మాద్యత్సురసుభటభుజాస్ఫోటకోలాహలాఢ్యమ్ ।**
**దైత్యారణ్యం దహంతీ విరచయతి యశోభూతిశుభ్రాం ధరిత్రీం**
**సా వ శ్చక్రస్య నక్రస్యదమ్పృదితగజత్రాయిణీ నాభి రవ్యాత్ ॥**

యా నాభిః = ఏ నాభి, మాద్యత్ సురసుభట = (శత్రువులు నశించుటవలన కల్గిన హర్షముచే) మదించియున్న అమరవీరుల, భుజ+ ఆస్ఫోటకోలాహల+ ఆఢ్యమ్ = (భుజాస్ఫాలనములచే), కోలాహలములచే నిండినది అగు, సాంపరాయమ్ = యుద్ధరంగమును, ఆసాద్య = పొంది(చేరి), జ్వాలాచూడాల = జ్వాలలను కల, కాల+అనల = కాలాగ్ని, చలన = సంచరించునట్లు, సమాడంబరా (సతీ) = గొప్ప ఆడంబరమును కల్గినదై, దైత్య+ అరణ్యమ్ = దైత్యులు అను అరణ్యమును, దహంతీ చ (సతీ) = దహించునదియై, ధరిత్రీమ్ = భూమిని, యశోభూతి శుభ్రామ్ = కీర్తిఅను భస్మముచే తెల్లగానున్నదో, సా = అట్టి, నక్రస్యదమ్పృదిత = మొసలియొక్క వేగముచే బాధింపబడిన, గజత్రాయిణీ = గజేంద్రుని రక్షించిన, చక్రస్య నాభిః = సుదర్శనుని నాభి, వః అవ్యాత్ = మిమ్ములను రక్షించునుగాక !

దేవాసుర యుద్ధభూమిలో ప్రవేశించి, అసురరాక్షస సైన్యమను అరణ్యమును నిశ్శేషముగా దగ్ధముచేసి, శత్రుధ్వంసప్రతాపరూపమైన యశస్సు అను భస్మమును భూమండలము నందు అంతట వ్యాపింపచేసి, తెల్లగా చేసిన సుదర్శనముయొక్క నాభి మొసలినోటిలో చిక్కుకొని, బాధను పొందిన గజేంద్రుని రక్షించినట్లు మిమ్ములను రక్షించుగాక అని తాత్పర్యము.

దేవాసురయుద్ధభూమి ఎట్లున్నదనుటకు- **''మాద్యత్సురసుభటభుజాస్ఫోట**

**కోలాహలాఢ్యమ్''** అను ప్రయోగము తెలుపుచున్నది. శ్రీసుదర్శనుని సహాయము మనకు కలదు కదా ! అని గర్వించిన దేవతల వీరులు, ఆ గర్వము వ్యక్తమగు విధమున చేయు భుజాస్ఫాలనములు, కోలాహలములచే గర్వించువిధమున సుదర్శనము యుద్ధరంగమున ప్రవేశించెనని భావము. చక్రనాభి యుద్ధరంగమున ప్రవేశించునపుడు ఎట్లున్నదనగా - **''జ్వాలా చూడాలకాలానలచలనసమాడంబరా''** - జ్వలించు కాలాగ్ని నృత్యము చేసినట్లున్నది.

''చక్రస్య నాభిః వః అవ్యాత్''

## శ్రీసుదర్శననాభి మీకు క్షేమాన్ని కల్గించాలి.

**54.** విందంతీ సాంధ్య మర్చి ర్విదలితవపుషః ప్రత్యనీకస్య రక్తైః
స్ఫాయ న్నక్షత్రరాశి ర్దిశిదిశి కణశః కీకసైః కీర్యమాణైః ।
నాకౌకఃపక్ష్మలాక్షీనవమదహసితచ్ఛాయయా చంద్రపాదాన్
రాథాంగీ విస్తృణానా రచయతు కుశలం పిండికా యామినీ వః ॥

విదలితవపుషః = బ్రద్దలుచేయబడిన శరీరములను కల్గిన, ప్రత్యనీకస్య = శత్రుసైన్యముయొక్క, రక్తైః = రక్తములచే, సాంధ్యమ్ అర్చిః విందంతీ= సంధ్యాకాలములోని కాంతిని కల్గినదై, దిశిదిశి = అన్నిదిక్కులలో, కణశః కీర్యమాణైః = ఖండఖండములుగా వెదజల్లబడిన, కీకసైః = ఎముకలచే, స్ఫాయన్ నక్షత్రరాశిః = వృద్ధిచెందుచున్న నక్షత్రసమూహములను కల్గినది, నాకౌకః పక్ష్మలాక్షీ = దేవతాస్త్రీల, నవమద = నూతనమైన మదముచే కల్గిన, హసిత = హాసముయొక్క, ఛ్ఛాయయా = ప్రకాశముచే, చంద్రపాదాన్ = వెన్నెలను, విస్తృణానా = ప్రసరింపచేయుచున్నదై యున్న, రాథాంగీ పిండికా = సుదర్శనుని నాభి అను, యామినీ = రాత్రి, వః = మీకు, కుశలమ్ = క్షేమమును, రచయతు = చేయునుగాక !

ఇందు కవి చక్రనాభిని రాత్రిగా వర్ణించుచున్నారు. రాత్రి సాయంసంధ్యాపురస్కృతమై, తాదాత్వికమైన రక్తవర్ణమును పొందియుండును. చక్రనాభి అసురుల, రాక్షసుల శరీరములను బేధించి, వానినుండి స్రవించిన రక్తముచే సంధ్యాకాలికమైన కాంతిని పొందును. రాత్రి నక్షత్ర రాశిచే వ్యాప్తమైయుండును. నాభియు శత్రువుల ఎముకలను పొడిచేసి, అంతట వెదజల్లుటచే నక్షత్రవ్యాప్తమై యున్నట్లున్నది. రాత్రి చంద్రకిరణములచే వ్యాప్తమై యుండును. నాభియు శత్రుధ్వంసముచే సంతుష్టలైన దేవస్త్రీలు సంతోషములోపల ఇముడ్చుకొనలేక దానిని పైపైకి వ్యక్తముచేయుటకుచేయు హాసముయొక్క కాంతిచే వెన్నెల అంతట వ్యాపించియున్నట్లుండును. హాసమునకు వెన్నెలను ఉపమానముగా కవులు పల్కుట గమనింపతగినది. ఇట్లు రాత్రి



అనదగినట్లున్న చక్రనాభి మీకు క్షేమమును కల్గించును గాక ! అనితాత్పర్యము.

**''స్ఫాయన్నక్షత్రరాశిః''** అనుపుడు **''స్ఫాయన్''** అనురూపము నిష్పన్నమగు విధానము విచారింపతగినది. **''స్ఫాయీ– వృద్ధౌ''** అను ధాతువు ఆత్మనే పదిగా కన్పించుచున్నది. కావున శత్రంతమైన ఈ రూపము సిద్ధింపవీలు లేదు. కాని కవుల ప్రయోగములు కన్పడుచున్నవి. **''అంఘ్రీ పునర్గోమయస్ఫాయన్ నాట్యమలీమసౌ''** అనుచు అరశాణిపాలై వేంకటాధ్వరి ప్రయోగించెను. పక్ష్మలాక్షులనగా స్త్రీలు.

''రాథాంగీ పిండికా వః కుశలం రచయతు''

## శ్రీసుదర్శన నాభి మీకు కీర్తిని ఇవ్వాలి.

**55.** నిస్సీమం నిస్సృతాయా భుజధరణిధరాఘాటతః కైటభారేః
ఆశా కూలంకషర్ద్ధే రహితబలమహాంభోధి మాసాదయంత్యా ।
చక్రజ్వాలాపగాయా శ్చలదరలహరీమాలికా దంతురాయాః
బిభ్రత్యావర్తభావం భ్రమయతు భువనే పిండికా వః ప్రశస్తిమ్ ॥

కైటభారేః = భగవానునియొక్క, భుజధరణిధర+ ఆఘాటతః = భుజము అను పర్వతముయొక్క సీమాభూమినుండి, నిస్సీమం నిస్సృతాయాః = ఎడతెగకుండ స్రవించునది, ఆశాకులంకష+ ఋద్ధేః = దిగంతములందు వ్యాపించిన సమృద్ధిని కల్గినది, చలత్ అరలహరీ = చలించు అరలను కెఉటముల, మాలికా = వరుసలచే, దంతురాయాః = నిమ్నోన్నతముగా నున్నది, అహితబలమహాంభోధిమ్ = శత్రుసైన్యము అనుగొప్పసముద్రమును, ఆసాదయంత్యాః = పొందుచున్నదియైయున్న, చక్రజ్వాలా+ ఆపగాయాః = సుదర్శనచక్రముయొక్క జ్వాలలు అను నదియొక్క, ఆవర్తభావమ్ = సుడియైయుండు స్వభావమును, బిభ్రతీ = ధరించునదియైయున్న, పిండికా = నాభి, వః = మీకు, ప్రశస్తిమ్ = కీర్తిని, భువనే = లోకమునందు, భ్రమయతు = వ్యాపించునట్లు చేయునుగాక !

నాభివర్తులముగా నుండుటచే చక్రజ్వాలలు అను నదికి సుడివలె ఉన్నదని పల్కుట ఇందలి విషయము. నదిలో సుడి ఉండుట సహజముకదా ! చక్రజ్వాలాత్మకమైన నదిని పూర్వార్ధమున వర్ణించుచున్నారు.

**(కైటభారేః భుజధరణిధరాఘాటతః నిస్సీమం నిస్సృతాయాః)** - ప్రాయికముగా పెద్దపెద్ద నదులన్నియు పర్వతములనుండియేకదా ప్రవహించును ! భగవానుని పర్వతమువంటి భుజమునుండి ఈ చక్రజ్వాలా నది ప్రవహించుచున్నది. **''ఊరిరణ్ణు మాల్ వరైత్తోళ్''** అనుచు

గోదాదేవి భగవానుని భుజములు పర్వత సదృశములని వర్ణించెను. **'ఆఘాటః'** అనగా సీమ. (అవధి) వైశాల్యమనియు అర్థము.

**(ఆశాకూలంకషర్ద్ధేః)** - తీరమును దాటి ప్రవహించు నీటిసమృద్ధిని కల్గినవి మహానదులు. చక్రజ్వాలయు దిగంతకూలంకషమైన సమృద్ధిని కల్గినది. **''మహో మాధవీయస్య హేతేః తద్వో దిక్ష్వేధమానం చతుష్షు చతురః పుష్యతాత్ పూరుషార్థాన్''** అని ముందు తెలిపిరికదా!

**(అహితబలమహాంభోధి మాస్వాదయంత్యాః) – ''నదీనాం సాగరోగతిః''** అనునట్లు నదులు సముద్రమున చేయునవియై యుండును. ఇదియు దేవాసురసైన్యమను సముద్రమునందు చేరి, వ్యాపించును.

**(చలదరలహరీమాలికాదంతురాయాః)** - నదులు అలలవరుసల చలనమును కల్గియుండును. ఇచటను అరల వరుసలే అలల వరుసలు. దంతురమనగా నిమ్నోన్నతమైన విషమస్థానము. ఎగుడుదిగుడుగా నున్నచోటు. ఇట్లు పలు విధముల మహానది అనదగినట్లున్న శ్రీసుదర్శనుని జ్వాలలో ఏర్పడిన సుడియా ఇది! అన్నట్లు చక్రనాభి తోచుచున్నది. అది మీ గొప్పతనము భువనమంతయు వ్యాపించునట్లు చేయునుగాక! మీ పేరును సర్వలోకప్రసిద్ధము గావించునుగాక! అని తాత్పర్యము. భువనము పదము ఇచట జలమను అర్థమును ఇచ్చును. జలమందు భ్రమణము ఆవర్తమునకు (సుడికి) సహజమే! నాభిని కుడితో పోల్చుట కవి సమయము. భగవానుని నాభిని వర్ణించుచు కూరేశులు వరదరాజస్తవములో **''సౌందర్యామృత రసవాహ వేగజ స్స్యాత్ ఆవర్త స్తవ కిల పద్మనాభ! నాభిః'' (50)** అని పల్కుట, పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవమున **''జగదంతః మజ్జద్భ్రమ్యా వాంఛతి సామ్యం నను నాభిః'' (117)** అని పల్కుటయు స్మరణీయములు.

''పిండికా వః ప్రశస్తిం భువనే భ్రమయతు''

## శ్రీసుదర్శననాభి మీకు అడ్డులేని సుఖాన్ని ఇవ్వాలి.

**56.** పాణౌ కృత్వాఽఽహవాగ్రే ప్రతిభటవిజయోపార్జితాం వీరలక్ష్మీమ్
ఆనీతాయా స్తతోఽస్యాః స్వసవిధ మసురద్వేషిణా పూరుషేణ ।
ప్రాసాదం వాసహేతోః విరచిత మరుణై రశ్మిభిః సూచయంతీ
నాభి ర్వో నిర్మిమీతాం రథచరణపతేః నిర్వృతిం నిర్వ్యఘాతామ్ ॥

ప్రతిభటవిజయ+ ఉపార్జితామ్ = శత్రువులను జయించి, సంపాదింపబడిన, వీరలక్ష్మీమ్ = 



వీరశ్రీని, ఆహవ+అగ్రే = యుద్ధరంగమునందు, పాణౌ కృత్వా = పాణిగ్రహణమును చేసికొని, తతః = ఆయుద్ధభూమినుండి, స్వసవిధమ్ = తనసమీపమునకు, ఆనీతాయాః = తీసికొనిరాబడిన, అస్యాః = ఈ వీరలక్ష్మియొక్క, వాసహేతోః = నిత్యవాసముకొఱకు, అసురద్వేషిణా పూరుషేణ = శ్రీసుదర్శననిత్యవాసము కొఱకు, అరుణైః రశ్మిభిః = ఎఱ్ఱని కిరణములచే, విరచితమ్ = నిర్మింపబడిన, ప్రాసాదమ్ = భవనమును, సూచయంతీ = సూచించుచున్న, రథచరణపతేః = సుదర్శనచక్రముయొక, నాభిః =నాభి, వః = మీకు, నిర్వ్యఘాతామ్ = అడ్డులేని, నిర్వృతిమ్ = సుఖమును, నిర్మిమీతామ్ = కలుగచేయునుగాక!

నాభియొక్క ఉన్నతమైన సన్నివేశమును చూచి కవి దానిని ఒక ప్రాసాదముగా ఇందు వర్ణించుచున్నారు. సుదర్శనుని మధ్యలో ప్రాసాదము ఉండవలసిన అవసరమేమి? అనుటకు హేతువును అత్యంత చమత్కారముగా తెలుపుచున్నారు.

**(పాణౌ కృత్వాహవాగ్రే. . . )** శ్రీసుదర్శన పురుషుడు యుద్ధరంగమును ప్రవేశించి ప్రత్యర్థులను వధించి, జయించి, వీరలక్ష్మిఅను వనితను పాణిగ్రహణముచేసి కొనెను. పిమ్మట అచటినుండి తీసికొని రాబడిన ఆమెకు నిత్యవాసస్థానముగా ఒక భవనమును నిర్మింపవలసి వచ్చెను. ఆ ప్రాసాదమే సుదర్శనుని నాభి.

**(అరుణైః రశ్మిభి ర్విరచితమ్)– '' ఏకదేశవికృత మనన్యవత్ భవతి''** అని వైయాకరణులు పల్కువిధమును అనుసరించి ఇచట ఒక అర్థమును చెప్పవచ్చును. అది ఏమనగా - లోకమున ప్రాసాదము **అరుణై రశ్మిభిః** విరచితమై యుండును. ఈ నాభిఅను ప్రాసాదమును అరుణరశ్మలచే విరచితము. అనగా - **''అరుణైః అశ్మభిః''** అని ప్రాసాదపక్షమున, **''అరుణైః రశ్మిభిః''** అని నాభీ ప్రాసాదపక్షమున పదచ్ఛేదమును చేయనగును. ఈ ప్రయోగములలోని రూపములలో గల స్వల్పభేదమును ఉపేక్షించి అర్థమును చెప్పనగును. ప్రాసాదము ఎఱ్ఱని అశ్మములచే, అనగా రాళ్లచే నిర్మింపబడియుండును. ఈ నాభి అరుణములైన రశ్మలచే కిరణములచే నిర్మితము. ఇట్టి వీర శ్రీతో వెలుగు సుదర్శనుని నాభి మీకు నిర్వికల్పమైన సౌఖ్యమును కల్గించుగాక! అని తాత్పర్యము. ఇట్టి యోజనను శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి చూపిరి. సంస్కృత వ్యాఖ్యలో మాత్రము **''అరుణైః రశ్మిభిః శోణైః కిరణైః విరచితం నిర్మితం ప్రాసాదమ్''** అని మాత్రమే వివరింపబడినది.

''రథచరణపతేః నాభిః వః నిర్వ్యఘాతాం నిర్వృతిం నిర్మిమీతామ్''

## శ్రీసుదర్శన నాభి మీ కర్మలను నశింపజేయాలి.

**57.** **డిండీరాపాండుగండై రరియువతిముఖైః పిండికా కృష్ణహేతేః**
**ఉచ్చండాశ్రుప్రవర్షై రుపరతతిలకై రుక్తశౌండీరచర్యా ।**
**ద్విత్రగ్రామాధిపత్యద్రుహిణమదమషీదూషితాక్షక్షమాభృత్-**
**సేవాహేవాకపాకం శమయతు భవతాం కర్మ శర్మప్రతీపమ్ ॥**

డిండీర = నురుగువలె, ఆపాండు = అంతటతెల్లనైన, గండైః = చెక్కిళ్లను కల్గినవి, ఉచ్చండ = అధికమైన, అశ్రుప్రవర్షైః = కన్నీటి వర్షములను కల్గినవి, ఉపరతతిలకైః = తిలకశూన్యములై యున్నవి అగు, అరియువతిముఖైః = శత్రుస్త్రీల ముఖములచే, ఉక్తశౌండీరచర్యా = చెప్పబడిన వీరచరితములను కల్గినది అగు, కృష్ణహేతేః = భగవానుని ఆయుధముగు చక్రముయొక్క, పిండికా = నాభి, ద్విత్రగ్రామ = రెండు, మూడు గ్రామములకు, ఆధిపత్య = అధిపతియై యుండుటచేతనే, ద్రుహిణ = బ్రహ్మయొక్క, మద = మదము వంటి మదము, మషీ = మసిచే, దూషిత = దూషితములైన, అక్ష = ఇంద్రియములను కల, క్షమాభృత్ = ప్రభువుల, సేవా = సేవను చేయుటలో, హేవాకపాకమ్ = ఆశపడుటను బలముగా కల్గినది, శర్మప్రతీపమ్ = సుఖమునకు ప్రత్యర్థియైనది అగు, భవతామ్ = మీ యొక్క, కర్మ = కర్మమును, శమయతు = ఉపశమింపచేయునుగాక !

శత్రుస్త్రీల ముఖసన్నివేశమును చూచియే చక్రనాభియొక్క గొప్పతనమును గుర్తింపవచ్చును. తమ భర్తల అత్యంత విరహముచే తెల్లబడిన గండస్థలములను (చెక్కిళ్లను) కల్గినవారై, వైధవ్యమును సూచించునట్టి తిలక రాహిత్యమును కలవారై నున్న అసురుల, రాక్షసుల వనితల స్థితిని చూచి నిశ్చయింపతగిన బలమును కల చక్రనాభి మీకు శ్వవృత్తిని పోగొట్టునుగాక ! అని భావము.

**(ద్విత్రగ్రామాధిపత్య. . . . .)** **''క్షోణీకోణశతాంశపాలనకలాదుర్వారగర్వానల క్షుభ్యత్క్షుద్రనరేంద్ర. . . .''** ఇత్యాదిగా వేదాంత దేశికులు వైరాగ్య పంచకమున సాయించిన విధమున చిన్నదేశమునకు పాలకునిగానున్న మాత్రముననే బ్రహ్మాండనాయకునిగా తనను తలచి అహంకరించు వారై, ఆ అహంకారముతో కళ్లున్న అంధులై, చెవులున్న చెవిటివారై, నోరున్న మూగవారై- ఇట్లు సకలేంద్రియములు దూషితములుకాగా, నశించు దుష్టప్రభువులకు దాసులై యుండవలెనను ఆశపడునట్టి దుర్బుద్ధిని కల్గించు దుష్కర్మమును పోగొట్టునుగాక ! అని భావము. ఇచట సంస్కృతవ్యాఖ్యాత **''కతిపయ జనపదాధిపత్యమాత్రేణాహం బ్రహ్మేతి మన్వానః, యః కశ్చిద్దురాత్మా సమీపగతమపి పూజ్యం న పశ్యతి, న శృణోతి శ్రోతవ్యం, న జిఘ్రత్యాఘ్రాణీయం, నాస్వాదయత్యాస్వాద్యం, న స్పృశతి సంస్పృశ్యమ్, ఏవం ప్రకారేణ మదాంధస్య''** అనుచు మదమును గూర్చివివరించెను. **''ద్రుహిణమద''** అనునపుడు బ్రహ్మయొక్క గర్వమువంటి గర్వము అని అర్థము.

**(సేవాహేవాకపాకం కర్మ)**- సేవించుటలోని హేవాకము అనగా ఆశ. దానిని ఫలముగా కల్గిన కర్మ, అనగా సేవాహేవాకమును కల్గింపచేయు దుష్కర్మ అని భావము. **''శర్మప్రతీపమ్''** శ్వవృత్తిఫలమైన కర్మము దుఃఖరూపమైయుండును.

**''కృష్ణహేతేః పిండికా వః శర్మప్రతీపం కర్మ శమయతు''**

## శ్రీసుదర్శన నాభి మీకు కుబేరసంపదకు మించిన సంపదను ఇవ్వాలి.

**58.** **పర్యాప్తా మున్నతిం యా ప్రథయతి కమలం యా తిరోభావ్య భాతి**
**స్రష్టుః సృష్టే ర్దవీయః కువలయమహితం యా బిభర్తి స్వరూపమ్ ।**
**భూమ్నా స్వేనాంతరిక్షం కబలయతి చ యా విచిత్రా విధత్తాం**
**దైతేయారాతినాభిద్రవిణపతిపదద్వేషిణీం సంపదం వః ॥**

యా = ఏ చక్రనాభి, పర్యాప్తామ్ = పరిపూర్ణమైన, ఉన్నతిమ్ = ఔన్నత్యమును, ప్రథయతి = ప్రకాశింపచేయుచున్నదో, యా = ఏ చక్రనాభి, కమలం తిరోభావ్య = తామరపూవును తిరస్కరించి, భాతి = వెలుగుచున్నదో, యా = ఏ నాభి, స్రష్టుః = బ్రహ్మయొక్క, సృష్టేః = సృష్టికి, దవీయః = దూరముగానున్నదో, కువలయమహితం = భూమండలమున పూజితమైన, స్వరూపమ్ చ = స్వరూపమును, బిభర్తి = ధరించుచున్నదో, యా = ఏ చక్రనాభి, స్వేన భూమ్నా = తన గొప్పతనముచే, అంతరిక్షమ్ = అంతరిక్షలోకమును, కబళయతి చ = కబళీకరించుచున్నదో, సా = అట్టి, విచిత్రా = విచిత్రమైన, దైతేయ+ అరాతినాభిః = చక్రనాభి, వః = మీకు, ద్రవిణపతిపద = కుబేరుని పదవికి, ద్వేషిణీమ్ = ప్రత్యర్థియైన, సంపదమ్ = సంపదను, విధత్తామ్ = కల్గించును గాక !

**(దైతేయారాతినాభి. . . . . .)** భగవానునకు, సుదర్శన చక్రమునకును **''దైతేయారాతి''** అను నామముకలదు కదా ! దైత్యనాశనమునకు ప్రయోజకకర్త భగవానుడు; ప్రయోజ్యకర్త సుదర్శనము. కావున ఇచట **''దైతేయారాతి''** అను పదము ఇద్దఱిని లక్షించుచున్నది. అత్యద్భుతమైన రీతిలో రచింపబడిన శ్లోక మిది.

**(విచిత్రా దైతేయారాతినాభిః)** - విలక్షణమైన దైత్యారినాభియొక్క సన్నివేశమును గమనింపుడు - అనుచున్నారు కవి. అట్టి వైచిత్రి ఏమనగా -

**(యా పర్యాప్తామ్ ఉన్నతిం ప్రథయతి)** – **'' ఉదారగభీరనాభిమ్''** అనునట్లు లోతైనది కదా భగవానుని నాభి ! చక్రనాభి అట్లుకాక ఉన్నతిని ప్రకటించుచున్నది. చక్రనాభి ఉన్నతమైనదై చూపట్టుచున్నది కదా !

**(యా కమలం తిరోభావ్య భాతి)** – **''మాలున్దివాయ్ ఓఙ్గుకమలత్తి నొణ్బోదు''** అనునట్లు భగవానుని నాభి కమలమును పైదిశగాకల్గి ప్రకాశించుచున్నది. కాని, చక్రనాభి కమలమును అధఃకరించి వెల్గుచున్నది. అనగా తన సౌందర్యముతో కమలమును తిరస్కరించుచున్నది. తిరోభావమనగా అంతర్ధానము, తిరస్కారమును.

**(స్రష్టుః సృష్టేర్దవీయః కువలయమహితం చ స్వరూపం యా బిభర్తి)**- భగవానుని నాభి బ్రహ్మను ఉత్పత్తిచేయుటకు తగిన స్వరూపమును కల్గినది. చక్రనాభి చతుర్ముఖుని సృష్టికి దూరమైయున్నది. భగవానుని నాభి కువలయ ప్రతిద్వంద్వియగు కమలముచేగొప్పదైన స్వరూపమును కల్గినది. చక్రనాభి కమల ప్రతిద్వంద్వియైన కువలయముచే గొప్పదైన స్వరూపమును కల్గినది. కువలయమనగా నల్లకలువకు, భూమండలమునకును పేరు. **''స్రష్టుః''**అను షష్ఠీవిభక్తికి భగవానుని నాభిపక్షమున కర్మత్వము, చక్రనాభిపక్షమున కర్తృత్వము అర్థములుగా చెప్పనగును. **''కర్తృకర్మణోః కృతిః''** అను అనుశాసనమును ఇచట స్మరింపనగును. భగవానుని నాభి చతుర్ముఖ కర్మకసృష్టికి అధికరణమగుటచే **(స్రష్టుః సృష్టేః)** బ్రహ్మ సృష్టికి సన్నిహితమైన స్వరూపమును కల్గినది. చక్రనాభి చతుర్ముఖకర్తృక సృష్టికి అవిషయమగుటచే - అనగా స్వతః సిద్ధమగుటచే **(స్రష్టు సృష్టేః)** బ్రహ్మసృష్టికి దూరతరమైన స్వరూపమును కల్గినది - అని సూక్ష్మపరిశీలన ద్వారా గ్రహింపనగును.

**(యా స్వేన భూమ్నా అంతరిక్షం కలయతి చ)** – **''నాభ్యా ఆసీ దంతరిక్షమ్''** అనునట్లు భగవానుని నాభి అంతరిక్షమును జనింపచేసినది. చక్రనాభి తన గొప్పతనముచే అంతరిక్షమును కబళీకరించుచున్నది. **''పృథివ్యంతరిక్షం ద్యౌర్దిశోఽవాంతరదిశాః''** అను స్థానములనన్నిటిని వ్యాపించి విభువైయున్నదని కదా సుదర్శనమును వీరు వర్ణించిరి ! అట్టి స్వరూప మిచట స్మరణీయము. ఇట్లు విచిత్రమైన దైత్యారి నాభి కుబేరుని సంపదతో స్పర్ధించు అతిశయితమైన సంపదను మీకు కల్గించుగాక ! **''ద్వేషిణీమ్''** అనుటకు బదులు **''ద్రోహిణీమ్''** అను పాఠాంతరము సంస్కృత వ్యాఖ్యలో కలదు. ఈ శ్లోకమున చక్రనాభియొక్క ఔన్నత్యము రమణీయత, ఆద్యత్వము, వర్తులత్వము, మహత్త్వవత్త్వమును వరుసగా ప్రతిపాదింపబడినవి సంస్కృతవ్యాఖ్యాత వివరణము. **''అనేన శ్లోకేన పిండికాయాః ఉన్నతత్వ– రమణీయత్వ– ఆద్యత్వ– వర్తులత్వ– మహత్వవత్వం ప్రతిపాదితం భవతి''** అని అచటి వాక్యము.



**''దైతేయారాతినాభిః వః ద్రవిణపతిపదద్వేషిణీం సంపదం విధత్తామ్''**

## శ్రీసుదర్శన నాభి మీ భగవచ్ఛేషత్వాన్ని రక్షించాలి.

**59.** వాణీ వాంగై శ్చతుర్భి స్సదసి సుమనసాం ద్యోతమానస్వరూపా
బాహ్వాంతస్థా మురారే రభిమత మఖిలం శ్రీ రివ స్పర్శయంతీ ।
దుర్గేవోగ్రాకృతి ర్యా త్రిభువనజననస్థేమసంహారధుర్యా
మర్యాదాలంఘనం వః క్షపయతు మహతీ హేతివర్యస్య నాభిః ॥

యా = ఏ నాభి, వాణీ+ ఇవ = సరస్వతివలె, చతుర్భిః అంగైః = నాల్గు అంగములతో, సుమనసామ్ సదసి = దేవతల సదస్సులో, (పండితసభలో), ద్యోతమానస్వరూపా = ప్రకాశించు స్వరూపమును కల్గినదో, శ్రీః ఇవ = లక్ష్మీదేవివలె, మురారేః = భగవానుని, బాహు + అంతస్థా (సతీ) = బాహువుల మధ్య భాగమున నున్నదై (బాహువుల అగ్రభాగమున నున్నదై), అఖిలమ్ = సమస్తమైన, అభిమతమ్ = కోరికను, స్పర్శయంతీ = ఇచ్చుచున్నదో, దుర్గా+ ఇవ = దుర్గాదేవి వలె, ఉగ్రాకృతిః = భయంకరమైన ఆకారమును కల్గినదో, త్రిభువన = ముల్లోకములయొక్క, జనన = పుట్టుక, స్థేమ = రక్షణ, సంహార = సంహారములను చేయుటలో, ధుర్యా = సమర్థయై యున్నదో, సా = అట్టి, హేతివర్యస్య = చక్రాయుధముయొక్క, మహతీ = గొప్పదైన, నాభిః = నాభి, వః = మీకు, మర్యాదాలంఘనమ్ = శేషత్వాది నియమ లంఘన దోషమును, క్షపయతు = పోగొట్టునుగాక !

బ్రహ్మవిష్ణురుద్రులను త్రిమూర్తుల పత్నులయొక్క సాధర్మ్యము చక్రనాభికి కలదనుచు చమత్కరించుట ఇందలి అంశము.

**(వాణీ ఇవ చతుర్భి రంగైః సుమనసాం సదసి ద్యోతమానస్వరూపా)** - తైత్తిరీయ యజుర్వేద బ్రాహ్మణమునందు ద్వితీయాష్టక- అష్టమ ప్రశ్నలో **''యా మృషయో మంత్రకృతో మనీషిణః అన్వైచ్ఛన్ దేవా స్తపసా శ్రమేణ, తా దేవీం వాచగ్ం హవిషా యజామహే. సా నో దదాతు సుకృతస్య లోకే''** అనిన పిమ్మటగల **''చత్వారి వాక్ పరిమితా పదాని, తాని విదుః బ్రాహ్మణా యే మనీషిణః''** అనుసూక్తికి విద్యారణ్యభాష్యము ఇట్లున్నది. **''యేయం వాక్ సా పరిమితా ఇయత్తయా పరిచ్ఛిన్నాని, చత్వారి పదాని చతురోఽవయవాన్ ప్రాప్య వర్తతే, పరా పశ్యంతీ మధ్యమా వైఖరీత్యేతే చత్వారి పదాని, తాని చత్వార్యపి పదాని యే బ్రాహ్మణా మనీషిణః తే విదుః, నత్వితరే మూఢాః''.** వాగ్దేవత పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అను నాల్గు

అవయవములను కల్గినదై, సదస్సులో ద్యోతమానస్వరూపయై యుండును. చక్రనాభియు జ్వాల, నేమి, అరము, అక్షము అను మిగిలిన చక్రావయవములతో కలసి దేవసదస్సులో వెల్గుచుండును అని దీనివలన ఏర్పడుచున్నది. సంస్కృతవ్యాఖ్యాత **''చతుర్భి రంగైః నేమ్యరనాభ్యక్షైః. జ్వాలా తు నేమ్యాద్యంతః పాతిత్వాత్ పృథగ్భూత మంగం న భవతి. పురుషస్తు అంగినా మంగం, తస్మిన్ సుదర్శనాంగాని నేమ్యాదీని చత్వార్యేవ''** అని వివరించెను. ప్రస్తుత స్తోత్రములోని **''ఆరా దారాత్''** (4) ను శ్లోకములో కూడ సుదర్శనాంగములు ఈవిధముగానే తెలుపబడుట గమనార్హము. కావున ఈ వివరణమే మిక్కిలి యుక్తమని తోచును.

**(శ్రీ రివ మురారేః బాహ్యాంతస్థా అభిమత మఖిలం స్పర్శయంతీ)** - లక్ష్మీదేవి **''అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్మఙ్గైయుఱైమార్బా''** అనునట్లు భగవానుని వక్షఃస్థలమున (బాహ్యాంతరమున) నిత్యవాసముచేయుచు, భక్తులకు సర్వాపేక్షితములను ఇచ్చును. చక్రనాభి మురారి బాహ్వాగ్రవర్తినియై, సర్వాభిమత సాధనమైయుండును. అంతమను శబ్దమునకు అగ్రమని, ప్రాంతమనియు అర్థములు కలవు. ఆ రెండును ప్రస్తుతమున చక్రనాభి- లక్ష్మి పక్షములలో వివక్షితములు.

**(దుర్గేవ ఉగ్రాకృతిః. . . . )** ఉగ్రాకారత్వము దుర్గకు, సుదర్శన నాభికిని సమానము. ఇట్లు ఇంతవరకు వేర్వేరు విశేషణములతో త్రిమూర్తిపత్నీ సామ్యమును ప్రతిపాదించిన కవి ఇకపై ఒక్క విశేషణముతో దానిని దృఢీకరించుచున్నారు.

**(త్రిభువనజనన-క్షేమ- సంహారధుర్యా)** - భర్త అధికరించిన కార్యములందు భార్యయు అన్వయించుట సహజము. కావున యథాక్రమముగా త్రిమూర్తుల కార్యములగు సృష్టి, స్థితి- సంహారములలో వారి పత్నులకును అన్వయము, అధికారమును కలదు. వారు వేర్వేరుగా చేయు కార్యములను చక్రనాభితానే ఒక్కటియే నిర్వహించుచున్నది. ఇది విశేషము. భగవత్ తాదాత్మ్య భావనా ప్రకర్షమే ఇందులకు కారణము. ఇచట సంస్కృతవ్యాఖ్యాత **''అయమర్థః. అంగైః ద్యోతమానస్వరూపేత్యనేన వాణీ ఉత్పత్తిశక్తిరిత్యవగంతవ్యా. అభిమతార్థాన్ ప్రదాయ రక్షతీత్యనేన శ్రీః స్థితిశక్తి రిత్యవగంతవ్యా. ఉగ్రాకృతి రిత్యనేన దుర్గాసంహృతిశక్తిరిత్యవగంతవ్యా. ఏవం ప్రకారేణ ప్రతినియతవ్యాపారవచ్ఛక్తియోగాదేవ వాణీరమణస్య సృష్టికర్తృత్వమేవ. రక్షణైకనియతలక్ష్మీయోగాత్ లక్ష్మీనాయకస్య స్థితికర్తృత్వమేవ. విలయనైకస్వభావదుర్గానాయకత్వేన హరస్య సంహృతికర్తృత్వమేవ. తస్మాత్ ఉత్పత్తిమాత్రకారణాత్ బ్రహ్మణోఽపి, స్థిత్యైకకర్తుః విష్ణోరపి, సంహారైకహేతోః మహేశ్వరాదపి త్రిభువనజనన క్షేమ సంహారధుర్యేతి సమధిగతజనిస్థితిసంహారరూపవ్యాపారత్రయకర్తుత్వేన సుదర్శననాభిరేవ అధికేత్యవగంతవ్యా''** అనుచు వివరించెను.



ఇట్టి చక్రనాభి మీ శేషత్వమర్యాద నశింపకుండునట్లు కటాక్షించునుగాక ! అని తాత్పర్యము. మర్యాద అనగా శేషత్వసిద్ధి. దానిని లంఘించుట అనగా స్వాతంత్ర్యాభిమానమే. దానిని లేకుండచేయును గాక !

**''హేతివర్యస్య నాభిః వః మర్యాదాలంఘనం క్షపయతు''**

## శ్రీసుదర్శననాభి మీ అమంగళాలను తొలగించాలి.

**60.** స్రగ్భిః సంతానజాభిః మధురమధురసస్యందసందోహినీభిః
పాటీరైః ప్రౌఢచంద్రాతపచయసుషమాలోపనై ర్లేపనై శ్చ ।
ధూపైః కాలాగరూణా మపి సురసుదృశో విస్ర మర్చాసు యస్యాః
గంధం రుంధంతి సా వ శ్చిర మసురభిదో నాభి రవ్యా దభవ్యాత్ ॥

సురసుదృశః = దేవతాస్త్రీలు, అర్చాసు = ఆరాధనములలో, సంతానజాభిః = కల్పవృక్షములనుండి పుట్టిన, మధుర = తీయని, మధురసస్యంద = మధురరసముల ప్రవాహముల, సందోహినీభిః = సమృద్ధిని కల్గిన, స్రగ్భిః = మాలెలతో, ప్రౌఢచంద్ర + ఆతప = పూర్ణచంద్రుని వెన్నెలయందలి, సుషమా = శోభను, లోపనైః = లోపింపచేయు (వెన్నెల శోభను మించిన), పాటీరైః లేపనైః చ = చందనపు పూతలతో, కాల+ అగరూణాం ధూపైః = కాలాగరుధూపములతో, యస్యాః = ఏచక్రనాభియొక్క, విస్రం గంధమ్ = (శత్రుశరీరములలోని మాంసము, మొదలగు వాని వలన వచ్చు) దుర్గంధమును, రుంధంతి = పోగొట్టుచున్నవో, సా = అట్టి, అసురభిదః నాభిః = సుదర్శనుని నాభి, వః = మిమ్ములను, చిరమ్ = చిరకాలము, అభవ్యాత్ అవ్యాత్ = అశుభమునుండి కాపాడునుగాక !

దేవతాస్త్రీలు తేనెను స్రవించు పారిజాతపుష్పములతో, వెన్నెలవంటి చందనలేపనములతో, నల్ల అగరుధూపములతో చక్రాయుధమును ఆరాధించుటవలన అసురుల శరీరముల మాంస- అసృక్ - పూయాది సంపర్కముచే సుదర్శనుని నాభికి కల్గిన పూతి గంధము (దుర్గంధమును) పోయి, పరిమళ ప్రచురమైయున్నది. **''వివిధమాలాపరిష్కృత''** అని సుదర్శనాష్టకములో కూడ తెలుపబడినది.

**(సంతానజాభిః)** – **''పంచైతే దేవతరవో మందారః పారిజాతకః సంతానః కల్పవృక్ష శ్చ పుంసి వా హరిచందనమ్''** అని అమరము సంతానమనునది దేవవృక్షములలో ఒకటి అని తెలిపినది.

**(పాటీరైః)** - **''పటీరస్య ఇమాని, పాటీరాణి, తైః''** అని విగ్రహము. చందనమునకు సంబంధించిన అని అర్థము.

**(విస్రమ్)** - అపక్వమాంసాది గంధము విస్ర మనబడును. **''విస్రం స్యాదామగంధి యత్''** అని అమరము.

**''అసురభిదో నాభిః వః చిరమ్ అభవ్యాత్ అవ్యాత్''**

---

## శ్రీసుదర్శననాభి మీకు నేత్రానందాన్ని కల్గించాలి.

**61.** **అంహ స్సంహత్య దగ్ధ్వా ప్రతిజనిజనితం ప్రౌఢసంసారవన్యా –**
**దూరాధ్వన్యా నధన్యాన్ మహతి వినతిభి ర్ధామని స్థాపయంతీ ।**
**విశ్రాంతిం శాశ్వతీం యా నయతి రమయతాం చక్రరాజస్య నాభిః**
**సంయన్మోముహ్యమానత్రిదశరిపుదశాసాక్షిణీ సాఽక్షిణీ వః ॥**

యా = ఏ నాభి, ప్రౌఢసంసారవన్యా = ప్రబలమైన సంసారమను గొప్పవనసమూహమునందు, దూర+ అధ్వన్యాన్ = చాలాదూరము పయనించిన, అధన్యాన్ = పాపులను, వినతిభిః = (వారువారు చేసిన) ప్రపత్తులచే, ప్రతిజనిజనితమ్ = వారువారు ఆయా జన్మలలో అంతట చేసిన, అంహః సంహత్య= పాపములను మొత్తమును, దగ్ధ్వా = దహించి, మహతి = గొప్పదైన, ధామని = స్థానమునందు (పరమపదమునందు), స్థాపయంతీ (సతీ) = నిలుపుచున్నదై, శాశ్వతీం విశ్రాంతిమ్ = ఏనాటికిని చెడని సుఖమును, నయతి = పొందించుచున్నదో, సా = అట్టి, సంయత్ = యుద్ధరంగమున, మోముహ్యమాన = మిక్కిలి మోహమునుపొందు, త్రిదశరిపు = అసురుల శత్రువులగు అసురుల, దశా = దురవస్థయొక్క, సాక్షిణీ = సాక్షియైన, చక్రరాజస్య సా నాభిః = సుదర్శనముయొక్క ఆ నాభి, వః = మీయొక్క, అక్షిణీ = నేత్రములను, రమయతామ్ = ఆనందింపచేయును గాక !

సంసారమరుకాంతారమునందు చిరకాలము తిరిగి అలసినవారి నానాజన్మ సంచితమైన పాపసమూహములను మొత్తము దహించి, అట్లు నశించిన పాపమును కల వారిని పరమప్రాప్యమగు పరమ పదమునకు కొనిపోయి, బ్రహ్మానందానుభవమునుకల్గించు చక్రనాభి మీ కన్నులకు ఆనందమును కల్గించుగాక !

**''వినతిభిః''** అను బహువచనము **''అధన్యాన్''** అను బహువచనమును అనుసరించి ప్రయోగింపబడినది. కావున **''సకృత్ ప్రణతరూప''** ప్రమాణమునకు ఎట్టి విరోధములేదు.



**''నంత్రుబాహుళ్యాధీనము నతిబాహుళ్యము''** అని భావము అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామివారి వివరణము. ఈ ప్రణామముకూడ **''యాదృచ్ఛికప్రణమేన''**అనుచు యాదృచ్ఛికమే అని సంస్కృతవ్యాఖ్యాత పల్కెను. దీనివలన చక్రభగవానుని కృపావైభవముతెలుపబడినది.

**(సంయన్మోముహ్యమాన త్రిదశ రిపుదశాసాక్షిణీ)** - చక్రనాభి కట్టెదుటనే అసురులను, రాక్షసులను సంహరించినది, కావున త్రిదశరిపులగు అసురులదశ మరణావస్థ. ఆదశకు చక్రనాభి సాక్షిగా నున్నది. ఇట్లు ఇష్ట ప్రాపణమునందు, అనిష్టనివారణమునందును సమర్థమైన చక్రనాభి మీ కన్నులను సంతోషింపచేయును గాక ! ఇంతటితో నాభివర్ణనము ముగిసినది. ఇకపై అక్షవర్ణనము చేయబడుచున్నది.

**''చక్రరాజస్య నాభిః వః అక్షిణీ రమయతామ్''**

అక్షవర్ణనము

---

## శ్రీసుదర్శనాక్షం మీ ధనాశను పోగొట్టాలి.

**62.** **శ్రుత్వా యన్నామశబ్దం శ్రుతిపథకటుకం దేవనక్రీడనేషు**
**స్వర్వైరిస్వైరవత్యో భయవివశధియః కాతరన్యస్తశారాః ।**
**మందాక్షం యాంత్యమందం ప్రతియువతిముఖైః దర్శితోత్ప్రాసదర్పైః**
**అక్షం సౌదర్శనం తత్ క్షపయతు భవతా మేధమానాం ధనాయామ్ ॥**

స్వర్వైరి స్వైరవత్యః = అసురవిధవలు (భర్త చనిపోయిన అసురస్త్రీలు), దేవనక్రీడనేషు = ద్యూత క్రీడలలో, శ్రుతి పథకటుకమ్ = కర్ణకఠోరముగా, యత్ నామశబ్దమ్ = ఏ అక్షముయొక్క వాచకమగు శబ్దమును, శ్రుత్వా = విని, భయవివశధియః = మిక్కిలి భయపడిన వారై, కాతరం (యథాతథా) న్యస్తశారాః = భయముతో నిలిపిన (ఉంచిన) పాచికలను కలవారై, దర్శిత + ఉత్ప్రాసదర్పైః = అపుడు అసహసమును, దర్పమును చూపిన, ప్రతియువతిముఖైః = దేవస్త్రీల ముఖములచే, అమందం మందాక్షమ్ = అంతులేని సిగ్గును, యాంతి = పొందుచున్నారో, తత్ సౌదర్శనమ్ = ఆసుదర్శనునకు చెందిన, అక్షమ్ = అక్షము, భవతామ్ = మీయొక్క, ఏధమానామ్ = వృద్ధిచెందు, ధనాయామ్ = ధనమందలి ఆశను, క్షపయతు = నశింపచేయునుగాక !

ఈశ్లోకమునుండి 74వ శ్లోకమువరకు అనగా 13 శ్లోకములలో సుదర్శనావయవములలో ఒకటి అగు అక్షమును కవి వర్ణించుచున్నారు. చక్రము మధ్యలో సుడివలె ఉన్నస్థానవిశేషమే అక్షము. అక్షమను పదము ద్యూత క్రీడకు సాధనములగు పాచికలకును పేరు అగుటచే, ఆ అర్థమును గ్రహించి కవి చమత్కారముగా ఈ శ్లోకమును రచించిరి.

**(శ్రుత్వా యన్నామశబ్దం. . . . .)** అసురస్త్రీలు దేవకాంతలతో కలసి ద్యూత క్రీడ ఆడునపుడు ప్రత్యర్థులచే అక్షమను పదము పలుకబడెనట. నిజమునకు ఆ ఆట అక్షక్రీడ అగుటచే అక్షశబ్దప్రస్తావము అచట అవర్జనీయము కదా ! ఇట్లు ద్యూత క్రీడాసాధనములైన పాచికలు అను అర్థమున అక్షశబ్దము పలుకబడగానే దానిని వినిన అసురస్త్రీలు శ్రీసుదర్శనుని అవయవమగు అక్షముయొక్క ప్రస్తావము వచ్చినదని తలచి, ఆ అక్షముయొక్క కాఠిన్యమును పూర్వము పలుమార్లు అనుభవించి, అనర్థమును పొందినవారగుటచే, ఆ అక్షమే తమకు వైధవ్యమును కల్గించినదగుటచే, ''ఇంకను మనలను తీసికొని పోవుటకై సుదర్శనుని అక్షమే ఇచటకు వచ్చినది'' అనుభీతివలన శరీరము కంపింపగా, పాచికలను అచటనే పారవేసి, పాఱిపోయిరి. ఈ అస్థానే భయమును చూచిన దేవకాంతలు - ''ఆహా ! ఈ విధముగా కూడా భయముకలుగునా ? **రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ, రత్నాని చ రథాశ్చైవ త్రాసం సంజనయంతి మే''** అనుచు మారీచుడు పల్కిన విధముననే కదా వీరి భయము కన్పించుచున్నది !'' అనుచు గర్వముతో అవహేళనచేయగా, దానిని చూచి అసురస్త్రీలు సిగ్గుపడి తలను దించుకొని యుందురట. ఇట్లు అక్షమను పేరు చెవినవపడినచో శత్రువులు మట్టికఱచు విధమున మహిమనుకల శ్రీసుదర్శనుని అక్షము మీకు ధనవ్యామోహమును ఉపశమింపచేయును గాక ! అసురస్త్రీలకు భ్రమజనకమైనదియే మీకు భ్రమనాశకము కావలయుననుట చతురోక్తి. **''వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ''** అని చెప్పబడుచున్నది కదా !

అసురస్త్రీలు తమలోతాముకలసి ద్యూత క్రీడను ఆడునపుడు అక్షశ్శబ్దశ్రవణ జనితమైన అస్థానభయవిహ్వలత్వమును చూచి అచట కారాగారమున బంధింపబడిన దేవకాంతలు అపహసించిరని సంస్కృత వ్యాఖ్యాత వివరించెను. **''బందీకృతప్రతిపక్షరమణముఖైః''** అని అచటి వివరణము. **''స్వైర వత్యః''** అనుపదస్వారస్యము వలన దానిని అసురస్త్రీలను ఉద్దేశించి ప్రయోగించినదిగా పల్కుట మిక్కిలి యుక్తము. **''కాతరన్యస్తశారాః''** అనుపుడు **''కాతరం యథాతథా న్యస్తాః శారాః యాభి స్తాః''** అని విగ్రహము. శారమనగా పాచికలు. **''విశ్వాధీనప్రణయిని సదా విభ్రమద్యూతవృత్తౌ బ్రహ్మేశాద్యా దదతి యువయో రక్షశారప్రచారమ్''** అని శ్రీస్తుతిలో దేశికులు సాయించుటను గమనింపనగును. మందాక్షమనగా సిగ్గు.

**''ధనాయామ్''** ధనముయొక్క ఆశ అని అర్థము. **''సుప ఆత్మనః క్యచ్''** అను సూత్రముచే క్యచ్ ప్రత్యయము వచ్చినది. **''అశనాయో ధన్యా ధనాయాబుభు క్షాపిపాసాకర్తేషు''** అనుసూత్రముచే ఈత్వాభావము, **''అప్రత్యయాత్''** అనుసూత్రముచే **''అః''** అను ప్రత్యయము వచ్చినవి. **''సన్యాసినోఽపి దధతే మహతీ ధనాయామ్''** అని సంకల్ప సూర్యోదయమున దేశికుల ప్రయోగము.



ఇచట **''ధనాయామ్ క్షపయతు''** అనుటకు క్షుద్రమైన ధనము నందు పేరాశను పోగొట్టి, పరమపురుషార్థమైన భగవత్కైంకర్యమునందు రుచిని కల్గింపవలెనని భావము. కర్మ ఫలములను కోరిన వారికిని ఈ స్తోత్రము ఆదరణీయము అగుటచే, **''విభుతావిస్తృతిం విస్తృణీతామ్''** ఇత్యాది ఫలశ్రుతులును ఇందు కన్పించుచుండుటచే వీనిని కూడ కలుపుకొని ఇచట అర్థమును చెప్పవలయును కదా ! అనినచో, **''ధనాయామ్ క్షపయతు''** అనుటకు అంతులేని ధనసమృద్ధిని ఇచ్చునుగాక అను అర్థమును చెప్పవచ్చును. ఈ అర్థమును ఈపదము ఇచ్చుననుటలో ఎట్టి కొఱత లేదు. **''ఇచ్ఛాయా నాశో విషయసిద్ధ్యా''** అని శాస్త్రజ్ఞులు చెప్పుదురుకదా ! **''ఇచ్ఛామ్ నాశయతు''** అన్నచో ఇష్ట సిద్ధిని కల్గించును గాక అనియేకదా తాత్పర్యము. **''వహ్ని సిద్ధిః సిసాధయిషాం నాశయతి హి''.** వహ్నిసిద్ధి ఆ వహ్నిని సాధింవలెను కోఱికను తీర్చును అని కదా న్యాయము. కావున ధనమందు ఆశ లేకుండ చేయుట అనగా ఇక ఆశింపవలసిన అవసరము లేకుండునంతటి ధనమును ఇచ్చుటయే కదా !

**''సౌదర్శనమ్ అక్షం భవతామ్ ఏధమానాం ధనాయాం క్షపయతు''**

## శ్రీసుదర్శనాక్షం మీ శత్రువులను నశింపజేయాలి.

**63.** **వ్యస్తస్కంధం విశీర్ణప్రసవపరికరం ప్రత్తపత్రోపమర్దం**
**సంయద్వర్షాసు తర్షాతురఖగపరిషత్ పీతరక్తోదకాసు ।**
**అక్షం రక్షస్తరూణా మశనివ దశనై రాపతన్మూర్ధ్ని మూర్ధ్ని**
**స్తా దస్త్రాధీశితు ర్వః స్తబకితయశసో ద్వేషిణాం ప్లోషణాయ ॥**

తర్షాతుర = దాహముచే బాధింపబడిన, ఖగపరిషత్ = పక్షిసమూహములచే (దేవసమూహములచే), పీతరక్తోదకాసు =పానముచేయబడిన ఎఱ్ఱని నీటిని కల్గిన (పానముచేయబడిన రక్తమను నీటిని కల్గిన), సంయద్వర్షాసు = యుద్ధరంగమను వర్షాకాలమునందు, రక్షస్తరూణామ్ = రాక్షసులను వృక్షములయొక్క, మూర్ధ్ని మూర్ధ్ని = తలలు అన్నియందు, అశనివత్ = పిడుగుపాటువలె, వ్యస్తస్కంధమ్ = గెలలను బ్రద్దలుచేసి, (తోలు పట్టలను విడగొట్టి), విశీర్ణప్రసవపరికరమ్ = పుష్పసమూహములను చెల్లాచెదఱు అగునట్లుచేసి (శిశువులను చెల్లాచెదఱగునట్లుచేసి), ప్రత్త పత్రోపమర్దమ్ = ఆకుల నాశనమును పొందించి (వాహనముల నాశనమును చేసి), అశనైః = త్వరగా, ఆపతత్ = మీదపడునట్టి, స్తబకిత యశసః = మహాయశస్వియగు, అస్త్ర+ అధీశితుః = చక్రాయుధముయొక్క, అక్షమ్ = అక్షము, వః = మీయొక్క, ద్వేషిణామ్ = శత్రువులను, ప్లోషణాయ = దహనము కొఱకు,

స్తాత్ = అగుగాక !

ఇందు అక్షమును పిడుగుగా రూపించుచున్నారు. పిడుగు వర్షకాలమునందు వృక్షముల తలలపై పడి, వాని యందలిగెలలను బ్రద్దలు చేసి, పుష్పములను ఫలములను చెల్లాచెదఱగునట్లు చేసి, ఆకులకు నశింపచేసి, ఇట్లు పలు విధములుగా ధ్వంసము చేయును. చక్రరాజముయొక్క అక్షమును అట్లే చేయుచున్నదనుటను కవి శ్లేషాలంకార భంగిమలో ప్రతిపాదించుచున్నారు.

**(రక్షస్తరూణామ్ మూర్ధ్ని మూర్ధ్ని అశనైః ఆపతత్)** - రాక్షసులను మహావృక్షముల తలలపై వేగముగా వచ్చి ఈ సుదర్శనాక్షమును పిడుగుపడుచున్నది. ఇట్లు పడునపుడు సంభవించు అనర్థములను మొదటి పాదమునందు మూడు క్రియావిశేషణముల ద్వారా కవి తెలుపుచున్నారు.

**(వ్యస్తస్కంధం)** - స్కంధ మనుపదము తోలుపట్టకు, వృక్షకాండమునకు పేరు. పిడుగు వృక్షకాండములను బ్రద్దలు చేయుచు మీద పడును. చక్రాక్షము అసురవీరుల తోలుపట్టలను తెగగొట్టుచు మీద పడును.

**(విశీర్ణప్రసవపరికరమ్)** - **''స్యా దుత్పాతే ఫలే పుష్పే ప్రసవే గర్భమోచనే''** అని అమరము. **''ప్రసవ స్యా దపత్యేఽపి ఫలేఽపి కుసుమేఽపి చ''** అని మేదినీ నిఘంటువు. పరికర మనుటకు సమూహమని, పరివారమని అర్థము. **''భవేత్ పరికరో వ్రాతే పర్యంకపరివారయోః''** అని విశ్వనిఘంటువు. పిడుగు పుష్ప ఫలసమూహములు చెల్లాచెదఱుగా పడునట్లు వృక్షములపై పడును. అక్షము రాక్షసుల సంతతిని, పరిజనమును నశింపచేయుచు వారిపై పడును.

**(ప్రత్తపత్రోపమర్దమ్)** - పత్రమని వాహనమునకు, ఆకుకుపేరు. **''పత్రం తు వాహనే పర్ణే పక్షే చ శరపక్షిణోః''** అని విశ్వకోశము. ప్రత్తమనగా దత్తమని అర్థము. **'దాణ్'** ధాతువు వలన ఏర్పడు **'ప్రయచ్ఛతి'** అనురూపము యొక్క కర్మణి క్తాంతరూపమే ఇది. ఇందు **''అచ ఉపసర్గాత్తః''** (అష్టా- 7-4-47) అని సూత్రము స్మరింపనగును. పిడుగు వృక్షములోని పర్ణములకు ఉపమర్దనము నిచ్చును. అనగా పాడుచేయును. అక్షము రాక్షసుల రథగజతురగాది వాహనములకు ఉపమర్దనము నిచ్చును. అనగా నశింపచేయును.

**(సంయద్వర్షాసు)**- పిడుగు పడునది వర్షాకాలములోనే అగుటచే యుద్ధము వర్షాకాలమున రూపింపబడినది. ఈరెండింటిమధ్య సాధర్మ్య మేమనగా - **(తర్షాతురఖగపరిషత్ పీతరక్తోదకాసు)** - తర్షమనగా దాహమని అర్థము. దాహముగొన్న పక్షిసమూహములచే జలప్రదేశములలో పానము చేయబడిన ఎఱ్ఱని నీటిని కల్గినదై వర్షాకాలము ఉండును.



వర్షాకాలములోని నీరు కొత్తనీరు అగుటచే ఎఱ్ఱగా నుండునని తెలుపబడినది. యుద్ధమును అట్టిదే. ఇచటను శ్లేషాలంకారము ద్వారా అర్థమును నిర్వహింపవలెను. **''ఖగః సూర్యే గ్రహే దేవే మార్గణే చ విహంగమే''** అని మేదినీ కోశవచనము. ఖగశబ్దమునకు దేవీసమూహమనికాని, బాణసమూహమని కాని అర్థమును గ్రహింపవచ్చును. పక్షులను అర్థమును కూడ గ్రహింపవచ్చును. తర్షాతురఖగపరిషత్పీతమైన రక్తధారలను కల్గియుండుటచే యుద్ధరంగము వర్షాకాలముతో సాధర్మ్యమును కల్గినదైనది. **''స్త్రియామ్ ప్రావృట్ స్త్రియామ్ భూమ్ని వర్షాః''** అని వర్షాశబ్దము నిత్యబహువచనరూపము. **''అశనైః''- ''శనైః''** అనగా ఆలస్యముగా వర్తించుట. అశనైః అనుటకు శీఘ్రముగా వర్తించుట అనియు అర్థము. ఇట్లు యుద్ధరంగమున పిడుగుపడినట్లు రాక్షసుల తలలపై పడి అంగభంగమును చేయునది చక్రాయుధాక్షము.

**(వః ద్వేషిణాం ప్లోషణాయ స్తాత్)** - ప్లోషణ మనగా దాహము. శత్రువులను దహించును గాక అని అర్థము. అశనిపాతము దాహకము కదా ! **''స్తబకితయశసః''** అనునది షష్ఠ్యంత రూపమైనచో అది **''చక్రాధీశితుః''** అనుపదమునకు విశేషణము. **''సంజాతఃస్తబకః అస్య (యశసః) ఇతి స్తబకితమ్''** అనివిగ్రహము. ఇచట **''తదస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్''** (5-2-36) అను పాణినిసూత్రము స్మరణీయము. స్తబకమనగా పూలగుత్తి. యశస్సునకు స్తబకము పుట్టుట అనగా సమృద్ధమైయున్నదని చెప్పుటయే. **''స్తబకితయశసే''** అను చతుర్థీవిభక్త్యంత రూపము సంస్కృతవ్యాఖ్యలో కలదు. అపుడు అది ప్లోషణవిశేషణ మగును. లేక గుత్తులుగా చేయబడిన కీర్తికొఱకు- అనగా బాగుగా వ్యాపింపచేయబడిన కీర్తికొఱకు అని వేరొక ప్రయోజనమును కూడ ఇచట గ్రహింపవచ్చును. శత్రువులను వధించి, మీకు నిస్సపత్నమైన కీర్తిని కల్గింపవలెనని తాత్పర్యము.

''అస్త్రాధీశితుః అక్షం వః ద్వేషిణాం ప్లోషణాయ స్తాత్''

---

## శ్రీసుదర్శనాక్షం మీకు దేవలోక సంపదవంటి సంపదను ఇవ్వాలి.

**64.** దీక్షాం సంగ్రామసత్రే మహతి కృతవతో దీప్తిభి స్సంహతాభిః
జిహ్వాలే సప్తజిహ్వా దనుజకులహవి ర్జుహ్వతో నేమిజుహ్వా ।
వైంకుతాస్త్రస్య కుండం మహ దివ విలసత్పిండికావేదిమధ్యే
దిశ్యా ద్దివ్యర్ద్ధిదేశ్యం పద మిహ భవతా మక్షతోన్మేష మక్షమ్ ॥

మహతి = గొప్పదైన, సంగ్రామ సత్రే = యుద్ధమను యజ్ఞమునందు, దీక్షాం కృతవతః = దీక్షను గొన్నవాడు, సంహతాభిః దీప్తిభిః = ఒకటిగా కలసిన (చేరిన) జ్వాలలచే, జిహ్వాలే = నాలుకను కల్గిన, సప్తజిహ్వే = అగ్నియందు, దనుజకుల హవిః = అసురకులము అను హవిస్సును, నేమి

జుహ్వా = చక్రనేమి అను హోమపాత్రతో, జుహ్వతః = హోమమునుచేయుచున్నవాడు, వైకుంఠాస్త్రస్య = భగవానుని ఆయుధమగు సుదర్శనముయొక్క, పిండికా వేదిమధ్యే = నాభి అను వేదిమధ్యలో, మహత్ కుండమ్ ఇవ = గొప్ప హోమకుండమువలె, విలసత్ = ప్రకాశించుచున్న, అక్షత+ ఉన్మేషమ్ = ఎన్నటికిని తరగని కాంతిని కల్గిన, అక్షమ్ = అక్షమును, భవతామ్ = మీకు, ఇహ = ఈలోకమున, దివ్య + ఋద్ధిదేశ్యమ్ = దేవలోకసంపత్తుతో సమానమైన, పదమ్ = పదవిని, దిశ్యాత్ = ఇచ్చునుగాక !

శ్రీసుదర్శనుని యుద్ధమును ఒక యజ్ఞమునందు దీక్షితునిగా, చక్రనాభిని యాగవేదికగా, చక్రనేమిని హోమసాధనము అగు దర్విగా, అసురకులమును హవిస్సుగా, అక్షమును హోమకుండముగా వర్ణించుట ఇందలి ప్రధానాంశము. పూర్వము **''సందోహం దానవానామ్''** అను 38వ శ్లోకమున **''స్తోత్రైః బ్రహ్మాదిగీతైః ముఖరపరిసరం శ్లాఘ్యశస్త్రప్రయోగం, ప్రాప్త స్సంగ్రామసత్రమ్''** అనుచు పల్కుట ఇచట అనుసంధేయము. అచట తెలుపబడిన పద్ధతిలో మహాసత్ర మనదగినట్లున్న మహాయుద్ధమునందు సుదర్శనము దీక్షితుడట. దీక్షితుడు అగ్నియందు హవిస్సును సమర్పించునట్లు ఇతడును స్వనిష్ఠమైన అగ్నియందు అసురకులమను హవిస్సును హోమము చేయుచున్నాడు.

**(సంహతాభిః దీప్తిభిః జిహ్వాలే సప్తజిహ్వ ఇవ) – 'కాళీ, కరాళీ, మనోజవా, సులోహితా, సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ, విశ్వదాసా'** అను ఏడు జిహ్వలు అగ్నికి కలవు అని అమరసుధ టిప్పణిలోని వివరణము.

**(నేమిజుహ్వా) – ''ధ్రువోప భృజ్జుహూ ర్నాతు స్రువో భేదాః స్రుచః స్త్రియః''** అని అమరము. హోమసాధనమగు పాత్రవిశేషములందు ఒకపాత్రకు **''జుహూ''** అనిపేరు. **''జుహూ రర్ధచంద్రాకృతిః''** అని అమరసుధ వ్యాఖ్యాన టిప్పణిలో తెలుపబడుటచే ఈ పాత్ర అర్ధచంద్రాకృతిని కల్గియుండునని తెలియుచున్నది. చక్రనేమి రాక్షసులను, అసురులను కలిపిపట్టుకొని, వారిని చుట్టుముట్టుటచే దానిని **'జుహూ'** అనుట తగినది.

**(వైకుంఠాస్త్రస్య)** - చక్రాయుధమని అర్థము. ఇతడే దీక్షితుడు. **''వైకుంఠస్య విష్ణోః అస్త్రమ్''** అని విగ్రహము. దీక్షితునకు హోమ కుండము ఆవశ్యకము కదా ! అట్టి కుండము అక్షమే.

**( దివ్యర్ధిదేశ్యం పదం దిశ్యాత్) – ''దివ్యా చ సా ఋద్ధి శ్చ దివ్యర్ధిః''** అని విగ్రహము. ఇచట దేవలోకసమృద్ధి తెలుపబడుచున్నది. దేశ్యమనునది ఈషన్న్యూనార్థకము. **''ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్యదేశీయరః''** (5-3-67) అని పాణిని సూత్రము స్మరణీయము. కొంచము తక్కువగా దేవలోక విభవముతో సమానమైన విభవమునుకల పదవిని ఇచ్చునుగాక !



అని తాత్పర్యము.

**( అక్షతోన్మేషమ్)** - లోకములోనున్న యజ్ఞకుండము లన్నియు హోమము ముగిసిన పిదప ప్రకాశము తగ్గి మసిబారి ఉండును. కాని ఈకుండము అట్లుకాదు. అక్షతోన్మేషము. ఎన్నటికిని తఱుగని వెలుగును కల్గినదైయుండు వ్యావృత్తిని కల్గియున్నది. ఈ శ్లోకమును వ్యాఖ్యానించుచు సంస్కృతవ్యాఖ్యాత తెలిపిన రమ్యములైన శ్లోకములు రెండు ఇచట సహృదయానందము కొఱకు ఉట్టంకింపబడుచున్నవి.

**1.** మహత్సంయత్సత్రే సురస మితి సంతోషజనకే
మహాదీక్షాం సాక్షా ద్విరచితవత శ్చక్రనృపతేః ।
సమింధానే వహ్నౌ సముదితశిఖాభి ర్ద్వవి రిదమ్
సురారీణాం ప్రాణాభిధ మరధిజుహ్వా హుతవతః ॥

**2.** మహత్కుండ మివేంధానం మధ్యే నాభివితర్దికమ్ ।
దిశ్యా దిహాక్షం భవతాం పదం స్వర్గనిభం శుభమ్ ॥

''వైకుంఠాస్త్రస్య అక్షం భవతాం దివ్యర్ధిదేశ్యం పదం దిశ్యాత్''

## శ్రీసుదర్శనాక్షం మీ శత్రునాశనాన్ని చేయాలి.

**65.** తుంగా ద్దోరద్రిశృంగా ద్దనుజవిజయినః స్పష్టదానోద్యమానాం
శత్రుస్తంబేరమాణాం శిరసి నిపతతః స్రస్తముక్తాస్థిపుంజే ।
రక్తై రభ్యక్తమూర్తే ర్విదలనగలితై ర్వ్యక్తవీరాయితర్ద్ధేః
హర్యక్షాస్యారిభంగం జనయతు జగతా మీడితం క్రీడితం వః ॥

దనుజవిజయినః = భగవానునియొక్క, తుంగాత్ = ఉన్నతమైన, దోః+ అద్రిశృంగాత్ = బాహువు అను పర్వతశిఖరమునుండి, స్పష్టదాన+ ఉద్యమానామ్ = స్పష్టమైన మదజలోత్పత్తిని కల్గిన (స్పష్టమైన ఖండనోద్యోగమునుకల్గిన), శత్రుస్తంబేరమాణామ్ = శత్రువులు అనుగజముల యొక్క, స్రస్తముక్తాస్థిపుంజే = చెదఱిన ముత్యములవంటి ఎముకల సమూహమునుకల, శిరసి = తలయందు, నిపతతః = పడుచున్నదియై, విదళనగళితైః = (శత్రువుల కపోలము మొదలగు వానిని) ఖండించుటచే, (చెదఱిన) స్రవించిన, రక్తైః = రక్తములచే, అభ్యక్తమూర్తేః = పూయబడిన శరీరమును కల్గినదై, (కావుననే), వ్యక్తవీరాయిత + ఋద్ధేః = వ్యక్తమైన వీర్యసమృద్ధిని కల్గినదైయున్న, హర్యక్షస్య = సింహమనదగినట్లున్న శ్రీసుదర్శనము అక్షముయొక్క, జగతామ్ =

లోకములయొక్క, ఈడితమ్ - పొగడుట అనబడు, క్రీడితమ్ = క్రీడ, వః = మీకు, అరిభంగం = శత్రువినాశనమును, జనయతు = కల్గించునుగాక!

**(హర్యక్షస్య క్రీడితం వః అరిభంగం జనయతు)** - అను ఈ ప్రయోగము కవియొక్క అసాధారణ ప్రతిభా ప్రాభవమునకు, శబ్దప్రయోగపాటవమునకు మచ్చుతునక. ఇట్లు ప్రయోగించుట బృహస్పతికిని సాధ్యము కాదేమో! శ్రీసుదర్శనముయొక్క అక్షమును ఒక అర్థము, సింహమును వేరొక అర్థము భాసించునట్లు **''హర్యక్షస్య''** అని ప్రయోగించిరి. **''సింహోమృగేంద్రః పంచాస్యో హర్యక్షః కేసరీ హరిః''** అని అమరము. **''హరిణీ అక్షిణీ యస్యసః''** అని సింహపక్షమున వ్యుత్పత్తి. **''హరేః అక్షమ్''** అనినచో చక్రావయవమగు అక్షమునుకూడ తెలుపును. భగవదభేదాధ్యవసాయముచే సుదర్శనమును హరి అని అనుటతగును. **''శ్రీరంగనాథసంకల్పాకారకారిత్వాత్ హరి రిత్యుపచర్యతే''** అని సంస్కృతవ్యాఖ్య. సింహముయొక్క చేష్టవలె అక్షము యొక్క విన్యాసమును కలదనుటను కవి విస్తరించి, తెలుపుచున్నారు.

**(తుంగాత్ దోరద్రిశృంగాత్. . . . )** సింహము గొప్పగిరి శిఖరము నందుండి ఏనుగుల తలలపై దుమికి, వాని కుంభస్థలములనుండి ముత్యములను పడునట్లు చేసి, ఆ ఏనుగుల రక్తములలో తడసి - ఈ విధమైన కృత్యములతో తన పరాక్రమమును చూపును. చక్రాక్షమును అట్లే చేయుచున్నదనుట రూపకాలంకార ప్రక్రియలో తెలుపబడుచున్నది. భగవానుని భుజము పర్వతముగా వర్ణింపబడుచున్నది. **''ఈరిరణ్డు మాల్వరైత్తోళ్. . . . తిరుమాల్''** అని గోదాదేవి పల్కినది కదా! ఆ భుజముల అగ్రము నుండి దూకినది చక్రముయొక్క అక్షమను సింహము. ఈ సింహము ఏ గజములపై దూకినది? అనగా -

**(శత్రుస్తంబేరమాణామ్)** - అసురులు, రాక్షసులే ఆ ఏనుగులు. వారిని ఏనుగులు అనుట ఎట్లు తగును? అనినచో -

**(స్పష్టదానోద్యమానామ్)** - ఇచట శ్లేష కలదు. ఏనుగుల పక్షమున దానమనగా మదజలము. స్పష్టముగా మదజలము స్రవించుటను కల్గినవి గజములు. **''దానస్య మదజలస్య, ఉద్యమః ఉద్భవః, స్పష్టః యేషాం తే''** అని గజపక్షమున విగ్రహమును చెప్పనగును. **''పడుముమ్మదప్పునల్ శోర''** అనునట్లు మదజలస్రావమును మగఏనుగులు కల్గియుండును. అసురులు, రాక్షసులును స్పష్టదానోద్యములే. వీరి పక్షమున దానమనగా ఖండనము. ఈ దానశబ్దము **''దోః - అవఖండనే''** అను ధాతువునుండి పుట్టినది. ఉద్యమ మనగా ప్రయత్నము. సాధువులను ఖండింప వలయునను ప్రయత్నమును కలవారు కదా వారు!



**(ప్రస్తముక్తాస్థిపుంజే)** - సింహము ఏనుగు తలపైదుమికిన వెంటనే వాని కుంభస్థలములు పగిలి అందుండి ముత్యములు చిందును. ఇచటను అసురరాక్షసుల ఎముకలు చిందును. ముత్యములకు, ఎముకలకును వర్ణమును బట్టి సామ్యము.

**(రక్తై రభ్యక్తమూర్తేః)** – **''వీరవత్ ఆచరితం వీరాయితమ్ వీర్యమ్''** అని వీరాయితశబ్ద వివరణము. వీరుని చేష్ట అనగా వీర్యమే.

**(జగతా మీడితమ్)** - ఇచట ఈడిత పదము భూతార్థమున వచ్చిన క్తప్రత్యమును కల్గినది కాదు. అట్లయినచో **''జగద్భి రీడితమ్''** అని యుండవలెను. **''క్తస్యచ వర్తమానే''** (2-3-67) అను సూత్రముచే **''జగతామ్''** అని షష్ఠీవిభక్తి వచ్చినది. **''మతిబుద్ధిపూజార్థేభ్యశ్చ''** (3-2-188) అను సూత్రముచేవచ్చిన క్తప్రత్యయముగుటచే **''కీర్తింపబడిన''** అను భూతార్థమును కాక, **''కీర్తింపబడుచున్న''** అను వర్తమానార్థమును గ్రహించుట తగునని తెలియనగును.

**''హర్యక్షస్య ఈడితం వః అరిభంగం జనయతు''**

---

## శ్రీసుదర్శనాక్షం మీకు శాశ్వతమైన కీర్తిని కల్గించాలి.

**66.** **ఉన్మీలత్పద్మరాగం కటక మివ ధృతం బాహునా యన్మురారేః**
**దీప్తాన్ రశ్మీన్ దధానం నయన మివ యదుత్తారకం విష్టపస్య ।**
**చక్రేశార్కస్య యద్వా పరిధి రభిదధత్ దైత్యహత్యా మివ ద్రాక్**
**అక్షం పక్షే పతిత్వా పరిఘటయతు వ స్తద్ద్రఢిష్ఠాం ప్రతిష్ఠామ్ ॥**

దీప్తాన్ రశ్మీన్ = జ్వలించు కిరణములను, దధానమ్ = ధరించుచున్న (కల్గిన), యత్ + అక్షమ్ = ఏ చక్రాక్షము, మురారేః = భగవానుని యొక్క, బాహునా ధృతమ్ = బాహువుచే ధరింపబడిన, ఉన్మీలత్ పద్మరాగమ్ = పద్మరాగమణులతో పొదిగిన, కటకమ్ ఇవ = భుజభూషణమువలె నున్నదో, యత్ = ఏ చక్రాక్షము, విష్టపస్య = లోకముయొక్క, నయనమ్ ఇవ = నేత్రమువలె, ఉత్తారకమ్ = ఉద్భూతమైన కనీనికను (నల్లకనుగుడ్డును) కల్గినదైయున్నదో, (లోకమునకు ఉజ్జీవన హేతువైయున్నదో), యత్ వా = ఏచక్రాక్షము, దైత్యహత్యామ్ = అసురుల పోగాలమును, అభిదధత్ = తెలుపుచున్న, చక్రేశ+ అర్కస్య = చక్రాయుధమనుఅను సూర్యునియొక్క, పరిధిః + ఇవ = పరివేషమువలె నున్నదో, తత్ = అట్టి, వః = మీకు, పక్షే పతిత్వా = పక్షపాతియై, ద్రఢిష్ఠామ్ = శాశ్వతమైన, ప్రతిష్ఠామ్ = కీర్తిని, ద్రాక్ పరిఘటయతు = వెంటనే కల్గించును గాక!

ఇందు ఒక్కొక్క పాదమునందు ఒక్కొక్క విధమున అక్షము ఉత్ప్రేక్షింప బడుచున్నది. అక్షము భగవానుడు అలంకరించుకొనియున్న భుజవలయము అనునట్లున్నదనుట మొదటి పాదమున గల ఉత్ప్రేక్ష. అక్షముయొక్క ఆకారమును అట్టిదే. **''ఉన్మీలత్ పద్మరాగమ్''** అను విశేషణము శ్లిష్టము. భుజవలయము పద్మరాగమణులచే పొదగబడి యుండును. అట్లే, పద్మముయొక్క- అనగా తామరపూవుయొక్క రాగమువంటి రాగమును కల్గినది అక్షము. ఎఱ్ఱని కాంతులను అది విరజిమ్మును కదా ! రాగమనగా ఎఱుపు అని అర్థము. **''దీప్తాన్ రశ్మీన్ దధానమ్''** అనునది చక్రమునకు ప్రయోగింపబడిన ప్రత్యేక విశేషణము.

**(విష్టపస్య నయన మివ ఉత్తారకమ్)** - ఉత్తారకపద మిచట శ్లిష్టము. లోకమునకు అద్వితీయమైన నేత్రమా ఇది ! **''ఉద్గతే తారకే యస్మిన్ తత్ ఉత్తారకమ్''** అని నేత్రపక్షమున వ్యుత్పత్తి. తారకా అనునది నల్లకనుగుడ్డుకు పేరు. ఉద్గతమైన తారకను కల్గినది నేత్రము. అక్షము పక్షమున **''ఉత్తారయతీతి ఉత్తారకమ్''** అనగా ఆపదలనుండి తప్పించి, రక్షించునని భావము. **''విష్టపస్య''** అనుపదము సాభిప్రాయకము. వీరు వారు అనుభేదము లేదు. లోకములోని అందఱకు రక్షకము అని తాత్పర్యము. **''ఏకం లోకస్య చక్షుః''** అను పూర్వశ్లోకము స్మరణీయము.

**(చక్రేశార్కస్య. . . .)** - శ్రీసుదర్శనపురుషుడు అక్షము మధ్యలో సూర్యునివలె వెలుగుచుండుటచే అతని చుట్టియున్న అక్షము పరివేషము వలెనున్నది అని ఉత్ప్రేక్షింపబడుచున్నది. **''పరివేష స్తు పరిధి రుపసూర్యకమండలే''** అని అమరము. కొన్ని సమయములలో పరివేషము కనబడుట అశుభనిమిత్తముగా తలపబడుటచే దానికి తగినట్లు వేరొక ఉత్ప్రేక్ష ప్రయోగింపబడినది. ఇచట **''చక్రేశార్కస్య''** అనుచు సుదర్శనభగవానుడు సూర్యునిగారూపింపబడుటకు అనుగుణముగా **''తిరుమాలొరువొక్కుమ్ మేరు, అమ్మేరువిల్ శెఙ్జుడరోన్ తిరుమాల్ తిరుక్కై తిరుచ్చక్కరమొక్కుమ్''** ఇత్యాది దివ్యసూరి సూక్తులు అనుసంధేయములు. అట్లే ఈ స్తుతిలోని **''దినకరరుచిరోఽపి'' (94), ''చక్రేశార్కప్రకాశః'' (20)** ఇత్యాది ప్రయోగములును స్మరణీయములు.

**(దైత్యహత్యామ్ అభిదధత్)** - దైత్యుల చేటుకాలమును ఈ పరివేషము సూచించుచున్నదట. ఇట్లు ఈ ప్రకారములలో ఉత్ప్రేక్షింపతగిన చక్రాక్షము మీకు యావదాత్మభావియైన ఔన్నత్యమును అనుగ్రహించును గాక !

**''అత్యంతం దృఢా ద్రఢిష్ఠా''** అనునది ద్రఢిష్ఠాశబ్ద వ్యుత్పత్తి. **''అతిశాయనే తమబిష్ఠనౌ''** (5-3-55) అను సూత్రమిచట స్మరణీయము. **''పక్షే పతిత్వా''** అనుటకు



**''పక్షపాతిభూత్వా''**- అనగా పక్షపాతియై అని అర్థము.

''చక్రేశార్కస్య అక్షం వః ద్రఢిష్ఠాం ప్రతిష్ఠాం ద్రాక్ పరిఘటయతు''

---

## శ్రీసుదర్శనాక్షం మీకు గొప్పబుద్ధిని ఇవ్వాలి.

**67.** క్రీడత్ ప్రాక్క్రోడదంష్ట్రాహతిదలితహిరణ్యాక్షవక్షఃకవాట-
ప్రాదుర్భూతప్రభూతక్షతజ సముదితారుణ్యముద్రం సముద్రమ్ ।
ఉన్మీలత్కింశుకాభై రుపహస దమితై రంశుభి సంశయఘ్నమ్
అక్షం చక్రస్య దత్తా మఘశతశమనం దాశుషీం శేముషీం వః ॥

ఉన్మీలత్ కింశుక+ ఆభైః = వికసించిన కింశుక (మోదుగ) పూలశోభవంటి శోభనుకల్గిన, అమితైః = అంతులేని, అంశుభిః = కిరణములతో, క్రీడత్ = క్రీడించుచున్న, ప్రాక్ క్రోడ = ఆదివరాహమూర్తి యొక్క, దంష్ట్రా= కోఱపల్లయొక్క, హతి = దెబ్బలచే, దలిత = బ్రద్దలైన, హిరణ్యాక్ష వక్షః కవాట = కవాటము వంటి హిరణ్యాక్షుని వక్షః స్థలమునుండి, ప్రాదుర్భూత = పుట్టిన, ప్రభూత = అమితమైన, క్షతజ = రక్తముచే, సముదిత = పుట్టిన, ఆరుణ్యముద్రమ్ = ఎఱ్ఱదనముతో కూడిన, సముద్రమ్ = సముద్రమును, ఉపహసత్ = పరిహసించుచున్న, చక్రస్య అక్షమ్ = శ్రీసుదర్శనముయొక్క అక్షము, అఘశతశమనం = వందలకొలది పాపముల ఉపశమనమును, దాశుషీమ్ = ఇవ్వగల్గినది, సంశయఘ్నమ్ = సందేహములను పోగొట్టగల్గినదియు అగు, శేముషీమ్ = బుద్ధిని, దత్తామ్ = ఇచ్చునుగాక !

ఇందు అక్షము సముద్రముగా వర్ణింపడుచున్నది. హిరణ్యకశిపుని సోదరుడగు హిరణ్యాక్షుడను అసురుడు తనబలముతో భూమిని చాపగా చుట్టి, దానిని తీసికొని సముద్రమునందు మునిగెను. అపుడు దేవతలు, మునులును ప్రార్థింపగా భగవానుడు మహావరాహ రూపమును దాల్చి, అవతరించి, సముద్రమున ప్రవేశించి, ఆ అసురుని వెదకి వధించి, తన కోఱయొక్క అగ్రభాగముతో సముద్రములో అట్టడుగున నున్న భూమిని గుచ్చి, పైకెత్తెను. భూమిని పూర్వమువలె విస్తరింపచేసెను. ఈ కథ ఇతిహాస ప్రసిద్ధము. దీనిని దృష్టిలో నుంచుకొని శ్లోకములోని పూర్వార్ధము రచింపబడినది.

క్రోడ మనగా వరాహము. **''ప్రాక్ క్రోడ''** మనునది ఆదివరాహమూర్తిని తెలుపును. **''వానత్తెళ్గున్ద మళ్గైముకిల్పోల్ ఎఙ్గుఙ్గనత్తు మేయ్న్దు కళిత్తు విళైయాడి ఏనత్తురువాయ్''** అని దివ్యసూరుల సూక్తిని గొని **''క్రీడత్''** అను విశేషణము ప్రయోగింపబడినది. ''క్రీడతః

**ప్రాక్క్రోడస్య మహావరాహరూపి విష్ణోః, దంష్ట్రాహతిభిః దంష్ట్రాకృతకుట్టనైః, దలితాత్ ఖండితాత్, హిరణ్యాక్షస్య వక్షఃకవాటాత్ ప్రాదుర్భూతేన ప్రభూతక్షతజేన అనవధికరుధిరేణ, సముదితం సంజాతమ్ ఆరుణ్యమ్, రక్తవర్ణత్వం, తదేవ ముద్రా చిహ్నమ్ యస్య తమ్ సముద్రమ్''** - అని పూర్వార్ధమును వివరింపనగును. మహావరాహరూపియైన విష్ణువు హిరణ్యాక్షుని విశాలమైన వక్షః స్థలమును తన దంష్ట్రాగ్రముతో గుచ్చగా, రక్తప్రవాహము అమితముగా స్రవించినది. ఆ రక్తప్రవాహము సముద్రమునందు అంతట వ్యాపించినది. దాని వలన సముద్రము అంతయు ఎఱ్ఱగా అయినది. ఇట్లు సంజాతరక్తవర్ణమైన సముద్రమును -

**(ఉన్మీలత్ కింశుకాభైః అమితై రంశుభిః ఉపహసత్ అక్షమ్)** - వికసించిన మోదుగుపూల కాంతివంటి కాంతిని కల తన ఎఱ్ఱని కిరణములతో శ్రీసుదర్శనచక్రాక్షము పరిహసించు చున్నదట. ''నా వర్ణము ముందు నీరంగు గొప్పదికాదు సుమా !'' అనుచు మోదుగుపూలను వేళాకోళము చేయుచున్నట్లున్నదట. ఇట్టి చక్రాక్షము మీకు మంచి బుద్ధిని కల్గించునుగాక !

**''అఘశతశమనమ్ దాశుషీమ్''** అని, **''సంశయఘ్నీమ్''** అనియుకల బుద్ధివిశేషణములు భగవద్విషయము నందు అవగాహించి, పాపములను పోగొట్టతగినది. భగవత్ స్వరూపరూప గుణవిభూతులను విమర్శింపదొడగినచో శాస్త్రార్థములలో సంశయము కలుగకుండ, ఇదమిత్థమనుచు ఎట్టి విషయమునైనను నిశ్చయింపగల్గినదియు అగు బుద్ధిని అనుగ్రహించును అను అర్థమును ఇచ్చును. **''దాశ్వాన్, సాహ్వాన్ మీఢ్వాం శ్చ''** (6-1-12) అను పాణిని సూత్రము స్మరణీయము. **''ఏతే క్వస్వంతా నిపాత్యంతే''** అని వృత్తి. స్త్రీలింగమున ఈ పదము **''దాశుషీమ్''** అని అగును. పుంలింగ రూపము **''ద్రుహ్యాదోశ్శాలి''** (87) అను శ్లోకమున ప్రయోగింపబడినది. **''దాశుషీమ్''** అనుటకు – **''ప్రదాత్రీమ్''** ఇచ్చునది అని అర్థము. ఈ రూపము ఛాందసమైనను కవులు ప్రయోగించుటను కాననగును.

**''చక్రస్య అక్షం సంశయఘ్నీమ్ అఘశతశమనం దాశుషీం శేముషీం దత్తామ్''**

---

## శ్రీసుదర్శనాక్షం మిమ్ములను రక్షించాలి.

**68.** పద్మోల్లాసప్రదం య జ్జనయతి జగతీ మేధమానప్రబోధాం
యస్య చ్ఛాయాసమానా లసతి పరిసరే రోహిణీ తారకాగ్ర్యా ।
నానాహేత్యున్నతత్వం ప్రకటయతి చ యత్ప్రాప్తకృష్ణప్రయాణం
త్రేధా భిన్నస్య ధామ్నః సముదయ ఇవ తత్పాతు వ శ్చాక్ర మక్షమ్ ॥



యత్ = ఏ చక్రాక్షము, (ఏ సూర్యతేజస్సు), పద్మ(ద్మా) + ఉల్లాసప్రదమ్ = లక్ష్మీదేవికి ఆనందజనకమై (తామరపూలకు వికాసమును కల్గించునదియై), జగతీమ్ = లోకమును, ఏధమాన ప్రబోధామ్ = వృద్ధిచెందుచున్న జ్ఞానమును కల్గినదిగా, (వృద్ధిచెందుచున్న ప్రకాశమును కల్గినదిగా), జనయతి = చేయుచున్నదో, యస్య= ఏ చక్రాక్షము యొక్క (చంద్రతేజస్సుయొక్క), పరిసరే = సమీపమునందు, తారకాగ్ర్యా = ప్రణవముచే గొప్పదియై, రోహిణీ = ఎఱ్ఱనిదై, అసమానా = సాటిలేనిది అయిన, ఛాయా = కాంతి, లసతి = ప్రకాశించుచున్నదో, (తారకాగ్ర్యా = నక్షత్రములలో గొప్పదైన, రోహిణీ= రోహిణీ నక్షత్రము, ఛాయాసమానా= ఛాయాదేవితో సమానమై, లసతి = వెల్గుచున్నదో), యత్ = ఏ చక్రాక్షము (అగ్నితేజస్సు), ప్రాప్తకృష్ణప్రయాణమ్ = భగవానుడు పయనించు దారిని అనుసరించునో (ధూమనిర్గమనమును కల్గినదో), నానాహేతి+ ఉన్నతత్వమ్ = పలువిధములైన జ్వాలలచే వృద్ధిచెందిన స్థితిని), ప్రకటయతి = ప్రకాశింపచేయుచున్నదో, తత్ = అట్టి, త్రేధా భిన్నస్య = సూర్య, చంద్ర, అగ్నిభేదముతో మూడు విదములుగా నున్న, ధామ్నః = తేజస్సుయొక్క, సముదయ ఇవ = సమూహమువలె, (స్థితమ్ = ఉన్నదియగు), చాక్రమ్ అక్షమ్ = చక్రాయుధముయొక్క అక్షము, వః = మిమ్మలను, పాతు = రక్షించునుగాక !

ఇందు **''యత్ చాక్ర మక్షం త్రేధా భిన్నస్య ధామ్నం సముదయ ఇవ (భాతి) తత్ వః పాతు''** అనునది ముఖ్యమైన అంశము. **''సూర్యచంద్రాగ్నిరూపేణ తేజోవస్తు త్రిధా స్థితమ్''** అనునట్లు సూర్యుడని, చంద్రుడని, అగ్నిఅని మూడు విధములుగాతేజః పదార్థము లుండును. ఆ మూడు విధములైన తేజః పదార్థములు ఒకటిగా చేరి అక్షముగా రూపొందెనా ఏమి? అనునట్లు చక్రాక్షమున్నదనుచు పల్కుట అత్యంత చమత్కారోక్తి. శ్లోకములో ఒక్కొక్కపాదమున ఒక్కొక్క తేజః పదార్థముయొక్క సాధర్మ్యమును శ్లేషభంగిమలో ప్రతిపాదించు సొబగు అనుభవైక వేద్యము, సహృదయ శ్లాఘ్యమును. **''సోమసూర్యదహనప్రభోజ్జ్వలం చక్ర మేత దుదితమ్''** అను అహిర్బుధ్న్యసంహితావచనమిచట స్మరణీయము.

**(యత్ పద్మోల్లాస ప్రదం సత్ జగతీ మేధమాన ప్రబోధామ్ జనయతి)** – **''పద్మోల్లాసః''** అనుపుడు శబ్దశ్లేష, **''ప్రబోధ''** అనునపుడు అర్థశ్లేషయు కలవు. సూర్యుడనుతేజః పదార్థము పద్మములకు (తామరపూలకు) ఉల్లాసమును - అనగా వికాసమును కల్గించును. లోకములోనున్న చీకట్లను పోగొట్టి, అంతట ప్రకాశమును పెంచును. చక్రాక్షము **''పద్మా''** అను పేరును కల లక్ష్మీదేవికి ఉల్లాసమును అనగా, సంతోషమును కల్గించును. ఎట్లనగా - దుష్టులను శిక్షించి, సత్పురుషులను కాపాడుట ద్వారా. ఇచట ప్రబోధమనగా ప్రకృష్టమైన జ్ఞానము. దానిని వృద్ధిపొందించునని భావము.

**(యస్య చ్ఛాయాసమానా లసతి పరిసరే రోహిణీ తారకాగ్ర్యా)** - ఈ విశేషణము చంద్రుడను తేజః పదార్థము యొక్క రీతిని తెలుపుచున్నది. **''యస్య, చంద్రస్య, పరిసరే తారకాగ్ర్యా నక్షత్రశ్రేష్ఠా రోహిణీ చ్ఛాయాసమానా. చ్ఛాయాసత్ అవినాభూతా, లసతి''** అని దీని వివరణము. అనగా చంద్రుని నక్షత్రములలో అగ్రగణ్యయైన రోహిణీ నక్షత్రము ఎల్లప్పుడు నీడవలె అతని వెంటనుండును అని భావము.**''రోహిణీ నక్షత్రాగ్రప్రదేశవర్తినీ''** అని సంస్కృతవ్యాఖ్య. తైత్తిరీయ యజుస్సంహితలో ద్వితీయ కాండము, తృతీయ ప్రశ్నలో - **''ప్రజాపతే స్త్రయస్త్రింశత్ దుహితా ఆసన్, తా స్సోమాయ రాజ్ఞే ఉ దదాత్ తాసాం రోహిణీ ముపైత్''** అని ప్రారంభించి తెలుపబడిన ఉపాఖ్యాన మిచట అనుసంధేయము. **''రోహిణీ తారకాగ్ర్యా – అరుణ్యేన రోహిణీ నక్షత్రాత్ శ్రేష్ఠా''** - ఎఱ్ఱదనములో రోహిణికి మించినదని సంస్కృతవ్యాఖ్యలోని వేరొక యోజన. అట్లే **''చంద్రపక్షే తు తారకాగ్ర్యా నక్షత్రశ్రేష్ఠా రోహిణీ, ఛాయాసమానా సూర్యభార్యసదృశా, యద్వా, తారకాగ్ర్యా రోహిణీ నక్షత్రాగ్ర ప్రదేశ వర్తినీ, అసమానచ్ఛాయా నిరుపమ చంద్రికా''** అనియు ఆ వ్యాఖ్యలో తెలుపబడినది.

**''అంబా, తులా, నితత్నిః, అభ్రయంతీ, మేఘయంతీ, వర్షయంతీ, చుపుణీకా''** అను ఏడుకృత్తికా నక్షత్రములు మిగిలిన 26నక్షత్రములును అను 33 నక్షత్రములలో రోహిణి విషయమున చంద్రునకు గల ప్రేమాతిశయము ప్రసిద్ధము. అక్షము పక్షమున **''చ్ఛాయాసమానా''** అనునపుడు **''చ్ఛాయా, అసమానా''** అని పదచ్ఛేదమును చేయనగును. **''యస్య అక్షస్య పరిసరే అసమానా రోహిణీతారకాగ్ర్యా చ చ్ఛాయా లసతి''** అను వివరణ మిచట వివక్షితము. ఛాయ అనగా కాంతి. అది అసమానమనగా సాటిలేనిది. రోహిణీ అనగా ఎఱ్ఱనిది. (ఎఱ్ఱని రంగునుతెలుపు రోహిత శబ్దము యొక్క స్త్రీలింగరూపము **''రోహిణీ''** అని అగును). **''తారకాగ్ర్యా''** తారకశబ్దము ప్రణవమును తెలుపును. సుదర్శనయంత్రసన్నివేశ క్రమమున ప్రణవ స్థాపనము కలదనుట అహిర్బుధ్న్య సంహితలో తెలుపబడినది. ఆసంహితలో 26వ అధ్యాయమున గల **''చంద్రమండలమధ్యే తు తారం కుర్యాత్ సమాహితః, తస్య మధ్యే లిఖే ద్దేవం రక్తవర్ణం సుదర్శనమ్''** అను ప్రమాణశ్లోక మిచట అనుసంధేయము. అక్షముమధ్యలో ప్రణవము, ప్రణవము మధ్యలో దేవుడు అనునది సంక్షేపక్రమము. ప్రణవసంబంధముచే శ్రేష్ఠమై, ఎఱ్ఱనిదై, అసదృశమైన కాంతి అక్షముయొక్క పరిసరమున ప్రకాశించుచుండును. **''తారకాగ్ర్యా''** అనుటకు ఉత్తారకశ్రేష్ఠమైన అను అర్థమును కూడ గ్రహింపవచ్చును. **''నక్షత్రశ్రేష్ఠా''** అని సంస్కృతవ్యాఖ్య. మరియు, **''యద్వా, తారకాగ్ర్యా ప్రణవానంతర నమశ్శబ్ద వాచ్యా అహంకార మమకారాద్యనిష్టజాతం నిరస్య, ఇష్టం పారతంత్ర్యాదికం ప్రాపయతీత్యర్థః''** అని సంస్కృతవ్యాఖ్యలోని యోజనాంతరము. అనగా అష్టాక్షరిలోని ప్రణవము పిమ్మటగల



నమఃశబ్దవాచ్యమని అర్థము. ఇందుచే అహంకారము, మమకారము మొదలగు దోషములను నివారించి భగవత్ పారతంత్ర్యాది ఇష్ట ప్రాపణము కలుగజేయునది అని భావము. **''రోహిణీ వసుదేవస్య పత్న్యాం నక్షత్రశోణయోః''** అని, **''చ్ఛాయా సూర్యప్రియా కాంతిః ప్రతిబింబ మనాతపమ్''** అనియు గల అమరకోశవచనములు ఇచట ప్రమాణీకరణీయములు.

**(నానాహేత్యున్నతత్వం ప్రకటయతి యత్ ప్రాప్తకృష్ణ ప్రయాణమ్)** - అగ్నిరూపమైన తేజస్సు. **(నానాహేతిభిః జ్వాలాసమూహైః)** పలు జ్వాలలతో, **(ఉన్నతత్వం ప్రకటయతి)** ఉన్నతమైయుండును. **''రవే రర్చి శ్చ శస్త్రం చ వహ్నిజ్వాలా చ హేతయః''** అని అమరకోశవచనము. కావున హేతిశబ్దము ఇచట జ్వాలార్థకము. అక్షము పక్షమున అస్త్రార్థకము. నానాజ్వాలలతో అగ్ని ఉత్తుంగమై యుండును. అక్షము పలు అస్త్రములకంటె ఉన్నతమైనది. ఇచట అవయవమగు అక్షమును గూర్చి ఇట్లు చెప్పుటలో అవయవియగు సుదర్శన ప్రభావమును సూచించుటలో ఉద్దేశ్యము. **''అస్త్రగ్రామాగ్రేసరమ్''** అని భట్టరు శ్రీరంగరాజస్తవమున పల్కిరి కదా !

**(ప్రాప్తకృష్ణప్రయాణమ్)** - అగ్నికి కృష్ణవర్త్మ అని పేరు. కృష్ణమని ధూమమునకు పేరు. కావున ధూమమును మార్గముగా కల్గినది అగ్ని అని భావము. **''కృశాను ర్యస్మిన్ దేశే వర్తతే స ప్రదేశః ప్రదాహేన నీలో భవతి, తస్మా దేవ కృష్ణవర్త్మే త్యుచ్యతే''** అని సంస్కృతవ్యాఖ్య. దీనిని బట్టియే ఇచట **''ప్రాప్తకృష్ణప్రయాణమ్''** అని ప్రయోగింపబడినది. ప్రయాణపదము మార్గవాచకము. అక్షము పక్షమున కృష్ణుడనగా భగవానుడు. ఆ కృష్ణుని మార్గమును అనుసరించుచు అక్షము వెడలునని భావము. **''కరుతు మిడమ్ పొరుతు కైన్నిన్ఱశక్కరత్తన్''** అని నమ్మాళ్వార్లు పల్కిరికదా ! ఇట్లు పైరీతులలో త్రివిధతేజః పదార్థముల సమవాయమా ! అనునట్లున్న శ్రీసుదర్శన చక్రాక్షము మిమ్ములను రక్షించునుగాక !

సంస్కృత వ్యాఖ్యలో ఈ శ్లోకము 69వశ్లోకముగా అనగా **''మత్తానామింద్రియాణామ్''** అనుశ్లోకము పిమ్మట వ్యాఖ్యానింపబడినది. అనగా **''ఉన్మీలత్ పద్మరాగమ్'', ''మత్తానా మింద్రియాణామ్'', ''పద్మోల్లాసప్రదమ్''** అను క్రమము ఆవ్యాఖ్యలో అనుసరింపబడినది. ఈ శ్లోకార్థమును దృష్టిలోనుంచుకొనియే దేశికులు అభీతి స్తవములో **''దహన సోమసూర్యాత్మకమ్''** (23) అని పల్కిరి.

''చాక్ర మక్షం వః పాతు''

---

**శ్రీసుదర్శనాక్షం మిమ్ములను కాపాడాలి.**

**69.** **శోచిర్భిః పద్మరాగద్రవసమసుషమైః శోభమానావకాశం**
**ప్రత్యగ్రాశోకరాగప్రతిభటవపుషా భూషితం పూరుషేణ ।**
**అంతఃస్వచ్ఛందమగ్నోత్థితభృగుతనయం క్షత్రియాణాం హతానామ్**
**ఆరబ్ధం శోణితౌఘైః సర ఇవ భవతో దివ్యహేత్యక్ష మవ్యాత్ ॥**

పద్మరాగద్రవసమ = పద్మరాగద్రవముతో సమమైన, సుషమైః = కాంతిని కల్గిన, శోచిర్భిః = కిరణములచే, శోభమాన+ అవకాశమ్ = వెల్గునట్టి స్వస్థానమును కల్గినదై, ప్రత్యగ్ర = అభినవమైన, అశోక = అశోకపుష్పములయొక్క, రాగ = ఎఱ్ఱదనమునకు, ప్రతిభట = ప్రతిద్వంద్వియైన, వపుషా = రూపమునుకల్గిన, పూరుషేణ = సుదర్శనపురుషునిచే, భూషితమ్ = అలంకరింపబడినదై, హతానామ్ = చంపబడిన, క్షత్రియాణామ్ = క్షత్రియులయొక్క, శోణిత+ ఓఘైః = రక్తప్రవాహములచే, ఆరబ్ధమ్ = నిర్మింపబడినదై, అంతః = లోపల, స్వచ్ఛంద మగ్న +ఉత్థిత = యథేష్టముగా మునిగి, పైకిలేచిన, భృగుతనయమ్ = భార్గవరాముని కల్గినదగు, సర ఇవ = సరస్సువలె నున్నది అగు, దివ్యహేతి +అక్షమ్ = శ్రీసుదర్శన చక్రాక్షము, భవతః = మిమ్ములను, అవ్యాత్ = రక్షించునుగాక !

లోకమున ఎవరును సంహరించువారు లేకుండుటచే మదించి తిరుగుచు, క్రూరకార్యములను చేయు క్షత్రియ వంశ్యులను పలువురను నాశనముచేయుటకు భగవానుడు జమదగ్ని భార్యయగు రేణుకయందు రామునిగా అవతరించి, పరశువులను ఆయుధముతో క్షత్రియ సంహారమొనర్చెను. అందుచే ఆ రాముడు పరశురాముడయ్యెను. తన తండ్రి హోమధేనువును అపహరించి, ఆ తండ్రిని సంహరించిన కారణముచే కార్తవీర్యార్జునుని, అతని కుమారులను సంహరించి, అంతటితో ఆగక క్షత్రియ వంశముల నన్నిటిని రూపుమాపవలెనను కోపావేశముతో లోకములోని పలువురు క్షత్రియులతో 27మార్లు యుద్ధమొనర్చి, వారిని చంపెను. ఇట్లు సంహరింపబడిన క్షత్రియుల శరీరముల నుండి స్రవించిన రక్తము ఒక తటాకము అయ్యెను. అందు అతడు స్నానమొనర్చి, పితృదేవతలకు తర్పణము చేసెనని పురాణప్రసిద్ధము. ఆ రక్తతటాకముతో చక్రాక్షమును పోల్చుచు వర్ణించుట ప్రస్తుతాంశము.

(**శోచిర్భిః పద్మరాగ. . . . .**) పద్మరాగద్రవమువలె ఎఱ్ఱని కాంతులను పోలిన కాంతులతో వెలుగుచున్న పెద్దసుడివలె నున్న అక్షమును **''హతానాం క్షత్రియాణాం శోణితౌఘై రారబ్ధం సర ఇవ''** అనుచు రక్తమయ తటాకముగా చెప్పనగును కదా !

(**ప్రత్యగ్రాశోకరాగప్రతిభట. . . .**) అపుడే వికసించిన అశోక పుష్పముయొక్క శోభ వలె ఎఱ్ఱని కాంతిని కల శరీరమును కల్గిన శ్రీసుదర్శనపురుషుడు మధ్యలో ప్రకాశించుటను



చూడగా, ఆ రక్తతటాకమునందు మునిగి, పైకి లేచిన శ్రీపరశురాముడా ఇతడు ! అనునట్లున్నది. ఇట్లు ఈరీతులలో భార్గవరాముడు నిర్మించిన రక్తతటాకముతో పోలియున్నట్లు చెప్పతగినట్లున్న చక్రాక్షము మిమ్ములను రక్షింపవలయును.

''**రోచిర్భిః**'' (శోచిర్భిః అనుటకు బదులు) అనుపాఠము ఉన్నను, ''**శోచిర్భిః**'' అనుపాఠము అక్షరాను ప్రాసకు అనుకూలము. (శకార ప్రాచుర్యమునకు). పిమ్మట **''శోభమాన''** అని కలదు కదా ! **''క్షత్రియాణాం క్షతానామ్''** అను వేరొక పాఠమును కలదు. ఇదియు అనుప్రాసానుకూలము.

''దివ్యహేత్యక్షం భవతః అవ్యాత్''

---

## శ్రీసుదర్శనాక్షం మీకు నిశితమైన బుద్ధిని ఇవ్వాలి.

**70.** **మత్తానా మింద్రియాణాం కృతవిషయమహాకాననక్రీడనానామ్**
**సృష్టం చక్రేశ్వరేణ గ్రహణధిషణయా వారివ ద్వారణానామ్ ।**
**గంభీరం యంత్రగర్తం క మపి కృతధియో మన్వతే యత్ప్రదేయాత్**
**అస్థూలాం సంవిదం వః త్రిజగదభిమతస్థూలలక్షం తదక్షమ్ ॥**

యత్ = ఏ చక్రాక్షము, కృతవిషయమహాకానన క్రీడనానామ్ = విషయములను గొప్ప అరణ్యమునందు క్రీడించు, ఇంద్రియాణామ్ = ఇంద్రియములుఅను, మత్తానామ్ = మదించిన, వారణానామ్ = ఏనుగుల యొక్క, గ్రహణధిషణయా = పట్టుకొన వలెనను తలంపుతో, చక్ర+ ఈశ్వరేణ = చక్రాయుధముచే (చక్రవర్తిచే), వారివత్ = గజబంధనమువలె, సృష్టమ్ = సృష్టింపబడిన, గంభీరమ్ = లోతైన, కమ్ అపి = అద్వితీయమైన, యంత్రగర్తమ్ = యంత్రపు గోయిగా, కృతధియః = బుద్ధిశాలురు, మన్వతే = తలచుచున్నారో, తత్ = అట్టి, త్రిజగత్ + అభిమత = ముల్లోకములకు అభిమతమైనవానిని, స్థూలలక్షమ్ = బాగుగా అనుగ్రహింప గల్గిన (వదాన్యమైన), అక్షమ్ = శ్రీసుదర్శనాక్షము, వః = మీకు, అస్థూలామ్ = సూక్ష్మమైన, సంవిదమ్ = బుద్ధిని, ప్రదేయాత్ = ఇచ్చునుగాక !

గొప్ప అరణ్యములో మదించి పరిభ్రమించు గజములను బంధించుటకై చక్రవర్తులు అందమైన గోతిని త్రవ్వి యుంచుదురు. ఆ గోతికి **''వారీ''** అని పేరు. ఇట్టి గోతిని త్రవ్విన తప్పమదగజములను బంధించుట అసాధ్యమనుట అనుభవసాక్షికమైన విషయము. అట్టిగోయియే కదా సుదర్శనుని అక్షము ! అనుచు ధీశాలురు తలచుచున్నారు. ఈ గర్తము ఏ మదగజమును

బంధించుట కొఱకు ? ఎవరిచే త్రవ్వబడినది ? అను ప్రశ్నలకు కవి రూపక-శ్లేషాలంకారములతో మనోహరముగా క్రింద సమాధానమిచ్చుచున్నారు.

**(మత్తానా మింద్రియాణాం . . . .)** విషయాంతరములను అరణ్యములలో మదించి తిరుగు ఇంద్రియములనబడు మత్తగజములను పట్టుకొనుటకుగా ఈ గోయి త్రవ్వబడినదట.

**(చక్రేశ్వరేణ స్పష్టమ్)** - చక్రవర్తి గజమును బంధించుటకై గోతిని తవ్వునట్లే ఇచట అక్షమను గోతిని త్రవ్వినవాడు చక్రరాజము. చక్రశబ్దము. భూమండలమును, సుదర్శనమును తెలుపును. దీనిచే అందఱి ఇంద్రియములను ఆకర్షించి, అణచి, ఏల గల్గినది చక్రాక్షమని స్పష్టపడుచున్నది. ఇట్టి అక్షము మీకు సూక్ష్మమైన బుద్ధిని ఇచ్చును గాక !

**(త్రిజగదభిమత స్థూలలక్షమ్)** - **''స్యు ర్వదాన్యస్థూలలక్షదానశౌండా బహుప్రదే''** అని అమరము. ముల్లోకములు అభిలషించు కోరికలను చక్రాక్షము అధికముగా అనుగ్రహించును అని భావము.

**(వారివత్) – ''వారీ తు గజబంధనీ''** అన అమరము. కావున వారి శబ్దము ఈకారాంతము. అయినను **''ఈకారాంతాః శబ్దాః ప్రాయేణ ఇకారాంతా అపి భవంతి''** అను సూక్తి చొప్పున **''వారి''** అని హ్రస్వాంతముగా ప్రయోగింపబడినదని శ్రీప్ర. భ. అణ్ణాస్వామి వివరణము.

''అక్షం వః అస్థూలాం సంవిదం ప్రదేయాత్''

## శ్రీసుదర్శనాక్షం మీకు కామితార్థప్రదాయకం కావాలి.

**71.** ప్రాణాదీన్ సన్నియమ్య ప్రణిహితమనసాం యోగినా మంతరంగే
తుంగం సంకోచ్య రూపం విరచితదహరాకాశకృచ్ఛ్రాసికేన ।
ప్రాప్తం యత్పూరుషేణ స్వమహిమసదృశం ధామ కామప్రదం వః
భూయాత్ తద్భూర్భువ స్స్వ స్త్రయవరివసితం పుష్కరాక్షాయుధాక్షమ్ ॥

ప్రాణాదీన్ సన్నియమ్య = ( యోగతంత్రములందు తెలుపబడిన రీతిలో) ప్రాణముమొదలగువానిని అణచి, ప్రణిహితమనసామ్ = నియతచిత్తులైయున్న, యోగినామ్ = యోగులయొక్క, అంతరంగే = హృదయమునందు, తుంగమ్ = గొప్ప ఉన్నతమైన, రూపమ్ = రూపమును, సంకోచ్య = చిన్నదిగా చేసికొని, విరచిత = చేయబడిన, దహర+ ఆకాశకృచ్ఛ్రాసికేన = దహరాకాశమందు వాసమును కల్గిన, పురుషేణ = శ్రీసుదర్శనపురుషునిచే, స్వమహిమసదృశమ్ = తన



గొప్పతనమునకు తగిన, యత్ = ఏ, ధామ = నివాసము, ప్రాప్తమ్ = పొందబడినదో, తత్ = ఆ, భూర్భువస్స్వః త్రయవరివసితమ్ = భూలోక, భువర్లోక, సువర్లోకములను మూడు లోకములచే పూజింపబడిన, పుష్కరాక్ష+ ఆయుధ+ అక్షమ్ = భగవానుని ఆయుధమగు సుదర్శనముయొక్క అక్షము, వః = మీకు, కామప్రదమ్ = కామితప్రదమై, భూయాత్ = అగునుగాక !

ఇందు చక్రాక్షముయొక్క మహిమ వర్ణింపబడుచున్నది. ప్రాణాదివాయువులను అణచియుంచి, సమాధియందు చిత్తమును నిలిపిన యోగుల అంతఃకరణమునందు గల సూక్ష్మమైన దహరాకాశములో చక్రాయుధము వేంచేసియున్నపుడు తన విభువైన రూపముతోనే యుండుటకు వీలుకాదు కావున మహత్తమమైన తన రూపమును సంకోచింపచేసికొని, మిక్కిలి శ్రమతో ఆదహరాకాశమునందు వేంచేసియుండవలసియుండును. అచట అట్లు శ్రమపడి వేంచేసియున్న శ్రీసుదర్శనునకు తన గొప్ప తనమునకు తగినట్లు యథేచ్ఛముగా వేంచేసియుండుటకు అవసరమైన విశాలమైన అక్షమను గొప్ప స్థానము దొరికినదట. అట్టి, అత్యంతము గొప్పదైన చక్రాక్షము మీకు సర్వాభీష్టితములను ఇచ్చునది అగుగాక !

( విరచితదహరాకాశకృచ్ఛ్రాసికేన ) - ''అసికా'' అనగా అవస్థానము. ఛాందోగ్యోపనిషత్తులోని **''అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ''** ఇత్యాది వాక్యము లిచట స్మరణీయములు. శ్రీభాష్యములోని దహరాధికరణ ప్రమేయముకూడ అనుసంధేయము. దహరమనగా సూక్ష్మమని అర్థము. **''పోదిల్కమల మన్నైఙ్గమ్ పుకున్దు''** ఇత్యాది సూక్తులయందు తెలుపబడిన విధమున యోగుల దహరాకాశమునందుండునది భగవానుడు కదా ! శ్రీసుదర్శనమా ? - అనినచో, తాదాత్మ్యభావన పరిపక్వమైనచో ఇట్లు పల్కుటలో తప్పులేదు కదా ! అభేదోక్తిగా దీనిని గ్రహింపనగును. అనగా - భగవానునకు, సుదర్శనమునకు మధ్య అభేదభావనతో ఈసూక్తి ప్రయోగింపబడినదనదగును. **''స్వమహిమసదృశమ్''** అనునపుడు తెలుపబడిన మహిమ ఆకారమువలన కల్గిన మహిమ.

**''పుష్కరాక్షాయుధాక్షం వః కామప్రదం భూయాత్''**

## శ్రీసుదర్శనాక్షం మిమ్ములను రక్షించాలి

**72.** విద్వాన్ వీధ్రేణ ధామ్నా చరణనఖభువా బద్ధవాసస్య మధ్యే
చక్రాధ్యక్షస్య బిభ్రత్ పరిహసితజపాపుష్పకోశాన్ ప్రకాశాన్ ।
శుభ్రై రభ్రై రదభ్రై శ్శరది తత ఇతో వ్యోమ విభ్రాజమానం

**ప్రాత స్తాదిత్యరోచిస్తత మివ భవతః పాతు రాథాంగ మక్షమ్ ॥**

మధ్యే = మధ్యభాగమునందు, బద్ధవాసస్య = వేంచేసియున్న, చక్రాధ్యక్షస్య = సుదర్శనుని యొక్క, చరణనఖభువా = కాలిగోళ్లనుండిపుట్టిన, వీధ్రేణ ధామ్నా = నిర్మలమైన కాంతిచే, విద్ధాన్ = వ్యాప్తములైనవి, పరిహసిత = పరిహాసముచేయబడిన, జపాపుష్ప = జపాపుష్పముయొక్క, కోశాన్ = మధ్యభాగములను కల్గినవగు, ప్రకాశాన్ = కాంతులను, బిభ్రత్ = దాల్చుచు (కావుననే), శరది = శరత్కాలమందు, తత ఇతః = అక్కడ ఇక్కడ, శుభ్రైః = తెల్లని, అదభ్రైః = పలు, అభ్రైః = మేఘములచే, ప్రాతః= ప్రాతఃకాలమున, ఆదిత్యరోచిస్తతం చ = సూర్యుని కాంతులచే వ్యాప్తమైనదియు అగు, వ్యోమ ఇవ = ఆకాశమువలె, విభ్రాజమానమ్ = ప్రకాశించుచున్న, రాథాంగమ్ అక్షమ్ = శ్రీసుదర్శనుని అక్షము, భవతః = మిమ్ములను, పాతు = రక్షించుగాక !

అక్షమునకు, శరత్కాలికమై, సూర్యోదయసమయ సముల్లాసితమైన ఆకాశమునకు మధ్యగల సామ్యము ఇందు ప్రతిపాదింపబడుచున్నది. తెల్లని మేఘబృందముతో వెలుగుచు, కొన్నిచోట్ల శుభ్రమైన కాంతిని కల్గినదై, ఉదయకాలసూర్యుని ఎఱ్ఱని కాంతులు వ్యాపింపగా కొన్నిచోట్ల ఎఱ్ఱనిదై సంధ్యాసమయములోని ఆకాశము ఉండును. సుదర్శనాక్షమును అట్టిదే. ఎట్లనగా -

**(మధ్యే బద్ధవాస స్య చక్రాధ్యక్షస్య చరణనఖభువా వీధ్రేణ ధామ్నా విద్ధాన్ పరిహహాసిత జపాపుష్పకోశాన్ ప్రకాశాన్ బిభ్రత్)** - తనయందు వేంచేసియున్న సుదర్శనపురుషుని చరణముల నఖములనుండి ఎగసిన తెల్లని కాంతులు, జపాకుసుమమువంటి తన కాంతులును కలసి వెలుగు స్థితిని చూడగా సంధ్యాకాలమములోని ఆకాశమువలె సుదర్శనాక్షము గోచరించుటలో ఎట్టి కొఱతయులేదు కదా !

''**విద్ధాన్**'' అనగా ''**సంబద్ధాన్**'' అని అర్థము. ''**వీధ్రం తు విమలాత్మకమ్**'' అను అమరకోశవచనమును బట్టి వీధ్రమనగా విమలము అనిఅర్థము. చరణనఖ కాంతులను తెల్లగా వర్ణించుట కవి సమయము. ''**సూక్ష్మం దభ్రం కృశం తను**'' అని అమరము. కావున ''**అదభ్రైః**'' అనగా పెక్కింటిచే అని తాత్పర్యము.

''రాథాంగమ్ అక్షం భవతః పాతు''

---

## శ్రీసుదర్శనాక్షం మీకు గొప్ప ఆధిపత్యాన్ని ఇవ్వాలి.



**73. శ్రీవాణీవాఙ్మృడాన్యో విదధతి భజనం శక్తయో యస్య దిక్షు**
**ప్రాహ వ్యూహం యదాద్యం ప్రథమ మపి గుణం భారతీ పాంచరాత్రీ ।**
**ఘోరాం శాంతాం చ మూర్తిం ప్రథయతి పురుషః ప్రాక్తనః ప్రార్థనాభిః**
**భక్తానాం యస్య మధ్యే దిశతు తదనఘా మక్ష మధ్యక్షతాం వః ॥**

పాంచరాత్రీ భారతీ = పాంచరాత్ర వాఙ్మయము, యత్ = ఏ అక్షమును, ఆద్యమ్ = (వాసుదేవాది) మొట్టమొదటి, వ్యూహమ్ = వ్యూహముగా, ప్రథమం గుణమ్ అపి = జ్ఞానమును ప్రథమగుణముగా, ప్రాహ = పల్కినదో, శ్రీవాణీవాక్ మృడాన్యః శక్తయః = శ్రీ, వాణీ, వాక్, మృడానీ అను (వాసుదేవాదుల) శక్తులు, దిక్షు = దిక్కులలో, (తూర్పుమొదలగు నాల్గుదిక్కులలో), యస్య = ఏ చక్రాక్షముయొక్క, భజనమ్ = సేవను, విదధతి = చేయుచున్నవో, ప్రాక్తనః పురుషః = పురాణపురుషుడగు సుదర్శన పురుషుడు, యస్య మధ్యే = ఏ చక్రాక్షముయొక్క మధ్యలో, (నున్నవాడై) భక్తానామ్ = భక్తులయొక్క, ప్రార్థనాభిః = ప్రార్థనచే, ఘోరామ్ = భయంకరమైన, శాంతాం చ = సౌమ్యమైనదియు అగు, మూర్తిమ్ = రూపమును, ప్రథయతి = ప్రకటించుచున్నాడో, తత్ = అట్టి, అక్షమ్ = చక్రాక్షము, వః = మీకు, అనఘామ్ అధ్యక్షతామ్ = దోషములేని ఆధిరాజ్యమును, దిశతు = ఇచ్చునుగాక !

**(పాంచరాత్రీ భారతీ యత్ అక్షమ్ ఆద్యం వ్యూహం ప్రాహ)** - ఆద్యవ్యూహ మనగా ''**చతుర్విధస్య భగవాన్ ముముక్షూణాం హితాయవై, అన్యేషా మపి లోకానాం సృష్టిస్థిత్యంతసిద్ధయే**'' ఇత్యాది భగవచ్ఛాస్త్రవచనములచే చెప్పబడిన వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపములనుకల స్థితి. అహిర్బుధ్న్య సంహితాదులలో శ్రీసుదర్శనాత్మకములుగానే తెలుపబడినవి. ''**వాసుదేవాదికం చక్రం వ్యూహం ప్రాథమికం విదుః, ఉభయో రపి తాదాత్మ్యం బ్రహ్మసంకల్పభావతః**'' ఇత్యాది ఆగమ ప్రమాణములు ఇచట స్మరణీయములు. ప్రస్తుతశ్లోకమున యచ్ఛబ్దముచే చక్రాక్షము తెలుపబడినది కదా ! సుదర్శనముకాదు కదా ! అనినచో, అవయవ- అవయవిలకు మధ్య అభేదోపచారములతో (అక్షము సుదర్శనమను భావనతో) తెలుపబడినదనదగును.

**(యత్ ప్రథమ మపి గుణం ప్రాహ)** - ''**జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజ**''స్సులను ఆఱుగుణములలో జ్ఞానము మొదటిది. అదియే అక్షమని భగవచ్ఛాస్త్రము తెలుపుచున్నదని చెప్పినట్లయినది. వీనిలో జ్ఞానమును అంగిగా పల్కి, మిగిలిన గుణములను అయిదింటిని అంగములుగా తెల్పిన అహిర్బుధ్న్యసంహితలో ''**జ్ఞాన మేవ పరం రూపం బ్రహ్మణః పరమాత్మనః, తదా తు చక్ర మిత్యాహుః బ్రహ్మయాథాత్మ్యవేదినః**'' అని తెలుపబడుటచే ఇట్లు ఇచట కవి

పల్కుట యుక్తము కదా ! ఇచటను అవయవి- అవయవముల అభేదోపచారోక్తియే.

**(దిక్షు శ్రీవాణీ వాఙ్మృడాన్యః శక్తయో యస్య (అక్షస్య) భజనం విదధతి)** - పూర్వము తెలిపిన వాసుదేవాది చతుర్విధమూర్తుల శక్తులని భగవచ్ఛాస్త్రములలో ప్రతిపాదింపబడిన శ్రీ- వాణీ- వాక్- మృడానీ అనువానిని నాల్గు నాల్గు దిశలలో నిలిపి, వాసుదేవ- సంకర్షణ- ప్రద్యుమ్న- అనిరుద్ధాదిరూపియైన శ్రీసుదర్శనాక్షము భజించుచున్నవని భావము. ఇందులకు తగిన పాంచరాత్రప్రమాణములను అఱయనగును అని శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామివ్యాఖ్య.

**(యస్య మధ్యే స్థితః ప్రాక్తనః పురుషః భక్తానాం ప్రార్థనాభిః ఘోరాం శాంతాం చ మూర్తిం ప్రథయతి)** - భక్తులు మంగళాశాసనముకొఱకు శ్రీసుదర్శనుని రూపమును సేవింపగోరునపుడు వారి ప్రార్థనకు అనుగుణముగా శాంతమైన మూర్తితో ప్రత్యక్షమగును. **''అకాలకాలేరితభట వికటాటోపలోపాయ''** అనుచు రాబోవు శ్లోకములో (79) తెలిపిన విధముగా అనిష్టనివారణమునకై భక్తులు ప్రార్థించినపుడు **''ఉగ్రం పశ్యాక్ష ముద్యద్ భ్రుకుటి''** అనునట్లు భీకరమైన రూపముతో ప్రత్యక్షమగును అని తాత్పర్యము. ఇట్టి శ్రీసుదర్శనపురుషుని తనయందు ధరించియున్న అక్షము మీకు నిరపాయమైన ఆధిపత్యమును అనుగ్రహించును గాక! **''అధ్యక్ష''** మనగా పలువురకు ప్రభువైయుండుట. లోకమున దీనిని అభిలషించు వారును ఉందురు కదా!

**''అక్షం వః అనఘామ్ అధ్యక్షతాం దిశతు''**

---

## శ్రీసుదర్శనాక్షం మీ అశాంతిని పోగొట్టాలి.

**74.** **రక్షఃపక్షేణ రక్షత్ క్షత మమరగణం లక్ష్య వైలక్ష్య మాజౌ
లక్ష్మీ మక్షీయమాణాం వలమథనభుజే వజ్రశిక్షానపేక్షే ।
నిక్షిప్య క్షిప్ర మధ్యక్షయతి జగతి యద్దక్షతాం దివ్యహేతేః
అక్షామా మక్షమాం తత్ క్షపయతు భవతా మక్షజిల్లక్ష్య మక్షమ్ ॥**

ఆజౌ = యుద్ధరంగమునందు, రక్షః పక్షేణ = రాక్షసుల సమూహముచే, క్షతమ్ = బాధింపబడిన, లక్ష్యవైలక్ష్యమ్ = ప్రస్ఫుటమైన లజ్జను కల, అమరగణమ్ = దేవసమూహమును, రక్షత్ = రక్షించుచున్న, యత్ = ఏ చక్రాక్షము, వజ్రశిక్షానపేక్షే = వజ్రాయుధముయొక్క అభ్యాసమును కోరని, వలమథనభుజే = ఇంద్రుని భుజమునందు, అక్షీయమాణామ్ = తఱుగని, నిత్యము వృద్ధిచెందు, లక్ష్మీమ్ = సంపదను, క్షిప్రమ్ = వేగముగా, నిక్షిప్య = స్థాపించి, దక్షతామ్ = తన



సామర్థ్యమును, జగతి = లోకమునందు, అధ్యక్షయతి = స్పష్టముగా చూపుచున్నదో, తత్ = అట్టి, అక్షజిత్+ లక్ష్యమ్ = జితేంద్రియులకు దైవమగు, దివ్యహేతేః = దివ్యాయుధమగు చక్రాయుధముయొక్క, అక్షమ్ = అక్షము, భవతామ్ = మీకు, అక్షామామ్ = కొఱతలేక వృద్ధిచెందు, అక్షమామ్ = ఈర్ష్యను (అశాంతిని), క్షపయతు = పోగొట్టును గాక !

**(యత్ అక్షమ్ ఆజౌ రక్షః పక్షేణ క్షతం – అత ఏవ లక్ష్యవైలక్ష్య మమరగణం రక్షత్)** - యుద్ధరంగమునందు రాక్షససైన్యముచే బాధింపబడి, లజ్జతో తలవంచుకొని నిలచిన దేవగణమును చక్రాక్షము రక్షించుచున్నదట.

**(వజ్రశిక్షానపేక్షే వలమథనభుజే అక్షీయమాణామ్ లక్ష్మీం క్షిప్రం నిక్షిప్య (స్వకీయాం) దక్షతాం జగతి అధ్యక్షయతి)** - ''దేవేంద్రుడు వజ్రాయుధమును ప్రయోగింపవలసిన పద్ధతులు నేర్వపని లేదు.'' అనునట్లు వజ్రప్రయోక్తయగు దేవేంద్రుడు నిర్వహింపవలసిన కార్యములన్నిటిని ఇట్టి చక్రాక్షము నిర్వహించుచున్నది. అందుచే వజ్రాయుధాభ్యాసమును కోఱని ఆ ఇంద్రుని భుజమునందు ఎల్లప్పుడు తఱుగని, వృద్ధిచెందు విజయలక్ష్మిని వేగముగా కొనివచ్చి, నిలిపి, అట్లుచేయుట ద్వారా స్వసామర్థ్యాతిశయమును లోకమున స్పష్టము చేయుచున్నది చక్రాయుధాక్షము.

**(అక్షజిల్లక్ష్యమ్)** - అక్షమనుటకు ఇంద్రియమను అర్థము కలదు. **''అక్ష మింద్రియయకాయయోః''** అని అమరము. ఇంద్రియములను జయించి జితేంద్రియులుగా కీర్తింపబడు అహిర్బుధ్న్యాదులకు లక్షము. అనగా లక్ష్యమని అర్థము. దేశికులును సుదర్శనాష్టకములో **''భజదహిర్బుధ్న్యలక్షిత''** అని కీర్తించిరి కదా ! **''లక్షం లక్ష్యం శరవ్యం చ''** అని అమరము.

**(భవతామ్ అక్షామామ్ అక్షమాం క్షపయతు)** **''అక్షమా''** అనగా అసహిష్ణుత, (ఓర్వలేనితనము) - అనగా ఇతరుల వృద్ధిని చూచి ఓర్వలేకుండుట. ఇది ప్రతి ఒక్కరియందున్న ఔషధము లేని వ్యాధి. **''మయి దత్తావధానాయాం విశ్వదోషా పహారిణా, న శక్య మీశ్వరేణాపి నిరవద్యేన వర్తితుమ్''** అనుచు దేశికులు ఈగుణప్రభావమును సంకల్పసూర్యోదయ నాటకమున తెలిపిరి. **''ఆపాతశాంతిమధురాన్ విజహాత్వసూయా''** అని ప్రార్థించినను విడచిపోనట్టి వ్యాధికదా ఇది ! ఇట్టి అసూయ శ్రీసుదర్శనుని కటాక్షమువలన మీకు పోవలయును అని ఆశాసించినట్లయినది. **''అక్షామామ్''** – కృశమైయున్నచో క్షామమనబడును. కృశింపకయున్నచో **''అక్షామా''** అనబడును. అనగా - అధికమైన అని భావము.

అక్షవర్ణనపరములగు ఈ పదమూడుశ్లోకములలో అక్షశబ్దము అంతట నపుంసక

లింగముగానే ప్రయోగింపబడినది. పాణినీయ లింగాను శాసనమునందు నపుంసకాధికారములో **''అక్షమింద్రియే''** అని తెలుపబడినది. అచట **''ఇంద్రియే కిమ్ రథాంగాదౌ మాభూత్''** అనుచు వృత్తికారులు వివరించిరి. కావున ఇంద్రియ బిన్నమైన అర్థమునందు నపుంసలింగముగా ఇచట ప్రయోగించుట ఎట్లు తగును ? అని కొందఱు శంకింప వచ్చును. కొందఱు కోశకర్తలు ప్రకృతార్థము నందును నపుంసకలింగముగా అక్షశబ్దమును నిర్దేశించుట కనపడుచున్నది. **''లింగ మశిష్యమ్''** సూక్తియు కలదు కదా ! అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి వారి వివరణము. ఇంతటితో అక్షవర్ణనము ముగిసినది.

**''అక్షం భవతామ్ అక్షామామ్ అక్షమాం క్షపయతు''**

**పురుషవర్ణనము**

---

## శ్రీసుదర్శన పురుషుడు మీకు పరాక్రమాన్ని ప్రసాదించాలి.

**75.** **జ్యోతిశ్చూడాలమౌలి స్త్రినయనవదన ష్షోడశోత్తుంగబాహుః**
**ప్రత్యాలీఢేన తిష్ఠన్ ప్రణవశశధరాధారషట్కోణవర్తీ ।**
**నిస్సీమేన స్వధామ్నా నిఖిల మపి జగత్ క్షేమవ న్నిర్మిమాణో**
**భూయాత్ సౌదర్శనో వః ప్రతిభటపరుషః పూరుషః పౌరుషాయ ॥**

జ్యోతిశ్చూడాలవౌలిః = జ్యోతిస్సుచుట్టియున్న, (జ్యోతిస్సు ఆకారములలోనున్న) జటలతో కూడిన శిరస్సును లకవాడై, త్రినయనవదనః = మూడునేత్రములను కల ముఖమును కలవాడై, షోడశ+ ఉత్తుంగబాహుః = పదునాఱు, ఉన్నతములైన బాహువులను కలవాడై, ప్రత్యాలీఢేన = ఎడమకాలునుచాచి, కుడికాలును వంచి యుండుటఅను ప్రత్యాలీఢ-సన్నివేశముతో, తిష్ఠన్= ఉన్నవాడై, ప్రణవ = ఓంకారమును, శశధర+ ఆధార = చంద్రమండలము ఆధారముగా కల్గిన, షట్కోణవర్తీ = షట్కోణయంత్రమునందు వేంచేసియున్నవాడై, నిస్సీమేన = అంతులేని, స్వధామ్నా = తనతేజస్సుతో, నిఖిలమ్ జగత్ అపి = సమస్త లోకమును, క్షేమవత్ = క్షేమమునుకల్గినదిగా, నిర్మిమాణః = చేయుచున్నవాడై, ప్రతిభటపరుషః = శత్రువులకు కఠినుడైన, సౌదర్శనః పురుషః = సుదర్శనపురుషుడు, వః = మీకు, పౌరుషాయ భూయాత్ = పరాక్రమముకొఱకు అగుగాక !

ఇంతవరకు కవి శ్రీసుదర్శనుని అవయవములను కీర్తించిరి. ఈ శ్లోకమునుండి ఈ స్తోత్రముచివరివరకు 26 శ్లోకములలో అవయవి యగు శ్రీసుదర్శనపురుషుని వర్ణించుచున్నారు.



**(సౌదర్శనః పురుషః వః పౌరుషాయ భూయాత్)** - శ్రీసుదర్శనపురుషుని అనుగ్రహామువలన మీ పుంస్త్వము (పరాక్రమము) స్థిరముగా నిలచును గాక ! అని భావము. ఆసుదర్శనపురుషుడు ఎట్టివాడనగా -

**(జ్యోతిశ్చూడాలమౌలిః)** – **''జ్యోతిభిః చూడాలో మౌలిః యస్య సః''** అని విగ్రహాము. జ్యోతిః పుంజము అను ఊర్ధ్వాగ్రజటలను కల్గిన తలను కలవాడు.

**(త్రినయనవదనః)** - మూాడు నేత్రములను కల ముఖమును కలవాడు.

**(షోడశోత్తుంగ బాహుః)** - దీర్ఘములైన పదునాఱు బాహువులను కలవాడు.

**(ప్రత్యాలీఢేన తిష్ఠన్)** - ప్రత్యాలీఢమను విశిష్టమైన సన్నివేశముననున్నవాడు. ఎడమకాలును ముందుకు చాచియుంచి, కుడి కాలును వెనుకవైపుగా మడచియుంచునట్టి ఒకానొక స్థితివిశేషమునకు ప్రత్యాలీఢమనిపేరు. **''స్యాత్ ప్రత్యాలీఢ మాలీఢ మిత్యాది స్థానసంచకమ్''** అను అమరకోశవచనముయొక్క వ్యాఖ్యానమున - **''వామప్రసారేణ దక్షిణపదసంకోచతః స్థితిః ప్రత్యాలీఢమ్''** అని వివరింపబడినది. దేశికులు గోపాలవింశతిలో **''ప్రత్యాలీఢస్థితి ముపగతమ్''** అని పల్కుటయు ఈ అర్థముననే.

**(ప్రణవశశధరాధారషట్కోణవర్తీ)** – **''షడరచక్రప్రతిష్ఠిత''** అని సుదర్శనాష్టకములో దేశికులు పల్కిరి కదా ! ప్రణవమును, చంద్రుని ఆధారముగా కల షట్కోణమునందు వేంచేసియుండువాడు. ముందుగా చంద్రమండలమును లిఖించి, ఆ పిమ్మట అందు ప్రణవమును లిఖించి, దానిపై షట్కోణాకారముగా వ్రాసి, అందు శ్రీసుదర్శనపురుషుని ప్రతిష్ఠాపనమును చేయువిధానమును కల శ్రీసుదర్శనయంత్ర విన్యాసక్రమమును( అహిర్బుధ్న్యసంహితలోని 26వ అధ్యాయమువులో కలదు) దృష్టిలో నుంచుకొని కవి ఇట్లు పల్కరనదగును. **''చంద్రాధఃకారియంత్రే వపుషి చ దలనే మండలే చ స్వరాంకమ్''** అనుచు ఈ స్తుతిలోని 81వ శ్లోకమున కూడా ఈ అంశము తెలుపబడుచున్నది.

**(నిస్సీమేన స్వధామ్నా నిఖిల మపి జగత్ క్షేమవత్ నిర్మిమాణః)** - అనవధికమైన తన తేజస్సుతో జగత్తునంతటిని రక్షింప సమర్థుడు. **''స్వభూమ్నా''** అను వేరొక పాఠమునకు ''స్వవైభవముతో'' అని అర్థము.

**(ప్రతిభటపరుషః)** - ప్రత్యర్థులగు అసురులకు, రాక్షసులకు భయంకరుడు. ఇట్టి సుదర్శన పురుషుడు మీకు పౌరుషమును అనుగ్రహింపవలయును. **''పౌరుషం పురుషస్య స్యాత్ భావే కర్మణి తే జసి''** అను నిఘంటువచనము వలన తేజస్సును ఇచ్చునుగాక ! అనియు భావము.

**''సౌదర్శనః పురుషః వః పౌరుషాయ భూయాత్''**

## శ్రీసుదర్శనపురుషుడు మీ ఆపదలను అన్నిటినీ తీర్చాలి

**76.** **వాణీ పౌరాణికీయం ప్రథయతి మహితం ప్రేక్షణం కైటభారేః**
**శక్తి ర్యస్యేషు దంష్ట్రానఖపరశుముఖవ్యాపినీ తద్విభూత్యామ్ ।**
**కర్తుం యత్తత్త్వబోధో న నిశితమతిభి ర్నారదాద్యై శ్చ శక్యః**
**దైవీం వో మానుషీం చ క్షిపతు స విపదం దుస్తరా మస్త్రరాజః ॥**

పౌరాణికీ వాణీ = అనాది వాఙ్మయము (పాంచరాత్రము), యత్ = ఏ, సుదర్శనుని, కైటభారేః = పరవాసుదేవుని, మహితమ్ = గొప్పదైన, ప్రేక్షణమ్ = సంకల్పముగా, ప్రథయతి = తెలుపుచున్నదో, యస్య శక్తిః = ఏసుదర్శనుని శక్తి, తత్+ విభూత్యామ్ = ఆ భగవానుని విభూతియందు (లేక, ఆస్వామి విభవావతారములందు), ఇషు-దంష్ట్రా-నఖ- పరశు- ముఖవ్యాపినీ = బాణము, దంష్ట్ర, నఖము, పరశువు అను మొదలగు వానిని అనుప్రవేశించి యున్నదో, నిశితమతిభిః = తీక్ష్ణమైన బుద్ధినికల, నారద+ ఆద్యైః + చ= నారదమహర్షిమొదలగు వారిచే కూడ, యత్తత్త్వబోధః = ఏ సుదర్శనము యొక్క నిజమైన స్వరూపబోధ, కర్తుం = చేయుటకు (పొందుటకు), న శక్యః = సాధ్యమైనదికాదో, సః = అట్టి, అస్త్రరాజమ్ = చక్రాయుధము, వః = మీకు, దుస్తరామ్ = స్వప్రయత్నముచే పోగొట్టుకొనుటకు సాధ్యము కాని, దైవీమ్ = దైవాధీనమైన , మానుషీం చ = మనుష్యకృతమైన, విపదమ్ = ఆపదను, క్షిపతు = పోగొట్టును గాక !

**(సః అస్త్రరాజః వః దైవీం మానుషీం చ విపదం క్షిపతు)** - మీకు దైవమువలన, మానవుల వలన ఏర్పడు విపత్తులను శ్రీసుదర్శనము పోగొట్టి కాపాడునుగాక ! ఆసుదర్శనము ఎట్టివాడనగా -

**(యం పౌరాణికీ వాణీ కైటభారేః మహితం ప్రేక్షణం ప్రథయతి)** - **''తదైక్షత''** ఇత్యాదిగా చెప్పబడు భగవానుని సంకల్పమే సుదర్శనముగా రూపొందినదని శాస్త్రములు తెలుపుచున్నవి. **''సంకల్పాదేవ పూర్వస్మాత్ సుదర్శనమయా ద్ధరేః''** అను మొదలగుపలు ప్రమాణములు అహిర్బుధ్న్యసంహితలో కాననగును.

**(శక్తి ర్యస్యేషు దంష్ట్రా. . . . . తద్విభూత్యామ్)** - రామావతారములో బాణములు, వరాహావతారమున దంష్ట్ర (కోఱ), నరసింహావతారములో నఖములు, పరశురామావతారమున పరశువు- ఇంకను పలు అవతారములలో పలుపలు ఆయుధములు ఆయా కార్యములను నిర్వహించి నట్లున్నను, వానిలో అన్నిటియందు శ్రీసుదర్శనముయొక్క శక్తి వ్యాపించి



యుండువలననే అవి కార్యకరములయ్యెను అనిభావము. వామనావతారమునందు పవిత్రదర్భాగ్రముతో శుక్రుని కంటిని పొడిచినపుడు ఆదర్భాగ్రమునందు సుదర్శనము అను ప్రవేశించియుండి, తత్కార్యమును నిర్వహించెనని పెరియాళ్వార్లు అనుసంధించిరి కదా ! **''శుక్కిరన్ కణ్ణై తురుమ్బాల్ కిళఱియ శక్కరక్కైయన్''** అను పెరియాళ్వార్ల సూక్తిని వ్యాఖ్యానించుచు శ్రీమద్వరవరమునీంద్రులు చేసిన అద్భుతమైన వివరణ మిచట స్మరణీయము. ఇంద్రాదులకు వజ్రాద్యాయుధములచే కార్యము సమకూడుట కూడ ఈ సుదర్శనుని శక్తివానిలో వ్యాపించుటవలననే అనదగును. ఈ భావము స్ఫురించునట్లు **''తత్తద్విభూత్యామ్''** అని పల్కిరి అని శ్రీ అణ్ణాస్వామివారి వ్యాఖ్య. **''యద్యద్విభూతిమత్సత్త్వం. . .మమ తేజోఽంశ సంభవమ్''** అని గీతాచార్యుడును నుడివెను కదా ! సంస్కృతవ్యాఖ్యలో **''రఘునాయకాయుధభూతేషు ముఖం, వరాహభగవదంష్ట్రాముఖం, భార్గవపరశుముఖం వ్యాప్తుం శీలం అస్యాస్తీతి''** అని, **''యస్య శక్తిం తదాయుధముఖవ్యాపినీమ్''** అనియు తెలుపబడినది. ఈ వివరణములలో ముఖశబ్దమునకు పురోభాగమని అర్థము.

**(కర్తుం యత్తత్వబోధో. . . .)** శ్రీసుదర్శనుని స్వరూపమును యథాతథముగా తెలియుటకు కుశాగ్రబుద్ధులగు నారదాది మహర్షులును చాలరు. భగవత్తత్త్వమును తెలిసిన తెలియవచ్చును. కాని, శ్రీసుదర్శన తత్త్వమును తెలియలేము. **''పటుతర ప్రజ్ఞదుర్గ్రహ''** అని దేశికులు శ్రీసుదర్శనాష్టకములో పల్కిరికదా ! శ్రీసుదర్శనవైభవమును విస్తరముగా ప్రతిపాదించు అహిర్బుధ్న్యసంహిత పరమశివునిచే నారదమహర్షికి ఉపదేశింపబడినది. అట్లు శివుడు తెలిపినను, నారదుడు విన్నను, అందు ప్రతిపాదింపబడినవైభవము కేవలము ఏకదేశము మాత్రమే అనుభావమును ఇచట **''నారదాద్యైః''** అనుపద ప్రయోగముచే భాసించుచున్నది. **''కథయతి''** అను వేరొక పాఠాంతరము మొదటిపాదమున కలదు.

''అస్త్రరాజః వః దుస్తరాం దైవీం మానుషీం చ విపదం క్షిపతు''

## శ్రీసుదర్శనపురుషుడు మీ కోరికలను తీర్చాలి.

**77.** రూఢ స్తారాలవాలే రుచిరదలచయః శ్యామలైః శస్త్రజాలైః
జ్వాలాభిః సప్రవాలః ప్రకటితకుసుమో బద్ధసంఘైః స్ఫులింగైః ।
ప్రాప్తానాం పాదమూలం ప్రకృతిమధురయా చ్ఛాయయా తాపహృ ద్వః
దత్తా ముద్దోఃప్రకాండః ఫల మభిలషితం విష్ణుసంకల్పవృక్షః ॥

తార+ ఆలవాలే = ప్రణవమను ఆలవాలములో (పాదులో), రూఢః = మొలచినది, శ్యామలైః = నల్లని, శస్త్రజాలైః = ఆయుధసమూహములచే, రుచిరదలచయః = అందమైన ఆకుల సమూహమును కల్గినది, జ్వాలాభిః = జ్వాలలచే, సప్రవాలః = చిగుళ్లతోకూడినది, బద్ధసంఘైః = గుంపులు గుంపులుగా చేరి ఎగయుచున్న, స్ఫులింగైః = అగ్ని కణములచే, ప్రకటిత = తెలుపబడిన, కుసుమః = పూలను కల్గినది, పాదమూలమ్ = పాదముల సమీపమును, ప్రాప్తానామ్ = పొందినవారికి (వృక్షమూలమును చేరినవారికి), ప్రకృతిమధురయా = సహజముగానే మధురమైన, ఛాయయా = నీడతో (కాంతితో), తాపహృత్ = తాపమును హరించునది అనగా సూర్యునివలన కల్గిన తాపమును తీర్చునది (సంసారతాపమును పోగొట్టునది), ఉత్+ +దోః ప్రకాండః = ఉద్గతములైన బాహువులు అను స్కంధములను కల్గినదైయున్న, విష్ణుసంకల్పవృక్షః = భగవానుని సంకల్పము అను శ్రీసుదర్శన కల్పవృక్షము, వః = మీకు, అభిలషితమ్ = కోరిన, ఫలమ్ = ఫలమును, దత్తామ్ = ఇవ్వవలెను.

పూర్వశ్లోకమున సుదర్శనము భగవానుని సంకల్పరూపమనిరి. భగవానుని సంకల్పము సర్వాభీష్టప్రదమగుటచే దానిని ఒక కల్పవృక్షముగా సంభావింపవచ్చును కదా! ఆ విష్ణుసంకల్పము, శ్రీసుదర్శనమును ఒకరే అగుటచే శ్రీసుదర్శనమును కల్పవృక్షముగా రూపించుచు కవి కీర్తించుచున్నారు. దీనిని అనుసరించుచు దేశికులును సుదర్శనాష్టక స్తోత్రమున **''వివిధసంకల్పకల్పక''** అనిరి కదా!

**(రూఢః తారాలవాలే)** - వృక్షము ఆలవాలమున మొలచును. శ్రీ సుదర్శనమను కల్పవృక్షము ప్రణవమను ఆలవాలములో మొలచినది. **''ప్రణవశశధరాధారషట్కోణవర్తీ''** అని పూర్వోక్తమే.

**(శ్యామలైః శస్త్రజాలైః రుచిరదలచయః)** - కుంతము, కృపాణము మొదలగు నల్లని ఆయుధములు అందమైన ఆకుల వలెనున్నవి. నల్లని వర్ణము రెండింటికిని సామ్యము. బాగుగా ఏపుగా పెరిగిన వృక్షముల ఆకులు దట్టమైన, ఆకుపచ్చనిరంగును కల్గియుండును. ఆవర్ణము ఇంచు మించు నల్లగా యుండుట అనుభవసిద్ధము. ఖడ్గకుంతాదులు ఆయసములగుటచే- అనగా ఇనుముతో చేయబడినవగుటచే నల్లగా నుండును.

**(జ్వాలాభిః సప్రవాళః)** - ఎఱ్ఱనికాంతులు చిగుళ్లవలె నున్నవి. చిగురు ఎఱ్ఱగా నుండుటచే ఇచటకూడ వర్ణసామ్యము సిద్ధము.

**(బద్ధసంఘైః స్ఫులింగైః ప్రకటితకుసుమః)** - పుంఖానుపుంఖముగా వెలువడు అగ్నికణములు ఎఱ్ఱని పూలుగా తోచుచున్నది.

**(ప్రాప్తానాం పాదమూలం ప్రకృతిమధురచ్ఛాయయా తాపహృత్)** - వృక్షము తన



పాదమూలమును చేరినవారికి చల్లని నీడనిచ్చి, వారితాపమును తీర్చును. సుదర్శనమును తన పాదములను ఆశ్రయించిన వారికి సహజముగా ఆకర్షణీయమైన తనకాంతితో వారి సాంసారిక తాపములను హరించును.

**(ఉద్దోఃప్రకాండః)** - **''ప్రకాండో విటపే శస్త్రమూలస్కంధాంతరే తరోః''** అని విశ్వకోశము తెలుపుచున్నది. ఉద్గతములైన స్కంధములను కల్గినదై వృక్షము ఉండును. శ్రీసుదర్శనమును అట్టిదే. ఇచట స్కంధముల స్థానమున బాహువులు గ్రహింపబడినవి. అనగా ఉద్గతములైన బాహువులను స్కంధములను శ్రీసుదర్శన కల్పవృక్షము కల్గియున్నది.

ఈవిధముగా పలురీతులలో వృక్షమునదగినట్లున్న, అందుననూ సకలఫలప్రదత్వహేతువుచే కల్పవృక్షమునునట్లున్న శ్రీసుదర్శనము మీకు కోరినఫలమును ఇచ్చునుగాక! కల్పవృక్షము చేయు కార్యమును చేయును గాక! అని తాత్పర్యము.

**''విష్ణుసంకల్పవృక్షః వః అభిలషితం ఫలం దత్తామ్''**

## శ్రీసుదర్శన పురుషుడు మీకు తేజస్సును అనుగ్రహించాలి.

**78.** ధామ్నా మైరమ్మదానాం నిచయ మివ చిరస్థాయినాం ద్వాదశానాం
మార్తాండానాం సమూఢం మహ ఇవ బహులాం రత్నభాసా మివర్ధిమ్ ।
అర్చిఃస్సంఘాత మేకీకృత మివ శిఖినాం బాడబాగ్రేసరాణాం
శంకంతే యస్య రూపం స భవతు భవతాం తేజసే చక్రరాజః ॥

యస్య = ఏసుదర్శనపురుషుని యొక్క, రూపమ్ = రూపము, చిరస్థాయినామ్ = చిరకాలము నిలచియుండు, ఐరమ్మదానామ్ = మెఱపుల, ధామ్నామ్ = వెలుగుల, నిచయమ్ ఇవ = సమమూహమువలె, ద్వాదశానామ్ = పన్నెండుమంది, మార్తాండానామ్ = ఆదిత్యుల, సమూఢమ్ మహః ఇవ = ఒకటిగాచేరిన తేజస్సువలె, రత్నభాసామ్ = రత్నముల కాంతులయొక్క, బహులామ్ = అనేకమైన (అంతులేని), ఋద్ధిమ్ ఇవ = సమృద్ధివలె, బాడబ+ అగ్రేసరాణామ్ = బడబాగ్నులకంటె గొప్పవైన, శిఖినామ్ = అగ్నుల, ఏకీకృతమ్ = ఒకటిగా చేయబడిన, అర్చిస్సంఘాతమ్ ఇవ = తేజోరాశిగా, శంకంతే = (బుద్ధిశాలురు) శంకించుచున్నారో, (ఉల్లేఖించుచున్నారో), సః = అట్టి, చక్రరాజః = సుదర్శనపురుషుడు, భవతామ్ = మీకు, తేజసే భవతు = తేజస్సును ఇచ్చువాడు కావలయును.

శ్రీసుదర్శనముయొక్క దివ్యరూపమును సేవించిన బుద్ధిశాలురు ఒక్కొక్కరు

ఒక్కొక్క విధమున తమ బుద్ధివైశద్యమును అనుసరించి ఉల్లేఖించుచున్నారు. అది ఎట్లనగా-

**(చిరస్థాయినామ్ ఐరమ్మదానాం ధామ్నాం నిచయమ్ ఇవ) – ''మేఘజ్యోతి రిరమ్మదః''** అని అమరము. **''ఇరమ్మదస్య సంబంధీని ఐరమ్మదాని''** అను ఈ రూపము తద్ధితవృత్తి. వజ్రాగ్ని యొక్క జ్యోతిఃపుంజములు ఇట్లు సమూహమై యున్నవా ఏమి ! అనిభావము. మెఱపుల కాంతులు క్షణమాత్రస్థాయినులు కదా ! అన్నచో అందులకు సమాధానముగా **''చిరస్థాయినామ్''** అను చున్నారు. క్షణకాలము మెఱసి అంతర్ధానమగుటకాక నిలచి ప్రకాశింపగల్గిన అపూర్వములైన మెఱపుల కాంతి పుంజములు ఏకమైనట్లున్నదట. ఇది లోకానుభవ విదూరము. కావుననే ఇచట అభూతోపమ కలదనియు చెప్పనగును.

**(ద్వాదశానాం మార్తండానాం సమూఢం మహ ఇవ)** - ద్వాదశాదిత్యుల తేజః పుంజము ఇట్లు ఏకమైయున్నదా ఏమి ! అనునట్లున్నది.

**(రత్నభాసాం బహుళామ్ ఋద్ధి మివ)**- పద్మరాగమణుల కాంతిసమూహమా ఇది

!

**(అర్చిఃసంఘాత మేకీకృతశిఖినాం బాడబాగ్రేసరాణామ్)** - బడబాగ్నుల తేజః సమూహము ఇట్లు ఒక సమూహమై, పుంజీభూతమైనదా ఏమి ! అగ్రేసరశబ్దమును శ్రేష్ఠవాచకముగా గ్రహించి **''బాడబాదప్యగ్రేసరాః''** అనగా బడబాగ్నికంటె గొప్పదైన అను అర్థమును చెప్పవచ్చును. ఇట్లు ఈ విధముగా ఉల్లేఖింపతగినట్లున్న శ్రీసుదర్శనపురుషుడు మీకు తేజస్సును అనుగ్రహింపవలయును.

''చక్రరాజః భవతాం తేజసే భవతు''

## శ్రీసుదర్శన పురుషుడు మీకు అంతిమకాలంలో కృపజేయాలి

**79.** ఉగ్రంపశ్యాక్ష ముద్యద్భ్రుకుటి సముకుటం కుండలి స్పష్టదంష్ట్రం
చండాస్త్రై ర్బాహుదండై ర్లసదనలసమక్షౌమలక్ష్యోరుకాండమ్ ।
ప్రత్యాలీఢస్థపాదం ప్రథయతు భవతాం పాలనవ్యగ్ర మగ్రే
చక్రేశోఽకాలకాలేరితభటవికటాటోపలోపాయరూపమ్ ॥

ఉగ్రంపశ్యాక్షమ్ = అగ్నిని విఱజిమ్ము కన్నులను కల్గినది, ఉద్యత్ భ్రుకుటి = పైకిజనించిన కనుబొమలను కల్గినది (పైకెత్తబడిన కనుబొమలను కల్గినది), సముకుటమ్ = కిరీటముతో కూడినది, కుండలి = కర్ణాభరణములను కల్గినది, స్పష్టదంష్ట్రమ్ = వెలుగునట్టి కోఱపళ్లను



కల్గినది, చండాస్త్రైః = క్రూరములైన అస్త్రములనుకల, బాహుదండైః = భుజదండములతో, లసత్ = ప్రకాశించుచున్నది, అనలసమ = అగ్ని జ్వాలాసమానమైన, (సున్నితమైన), క్షౌమ = పట్టువస్త్రముచే, లక్ష్య = లక్షింపతగిన (చూడతగిన)), ఊరుకాండమ్ = అందమైన ఊరువులను కల్గినది, ప్రత్యాలీఢస్థపాదమ్ = ఎడమకాలును చాచి, కుడికాలును మడచియున్నది, పాలనవ్యగ్రమ్ = (మిమ్ములను) రక్షించుటలో ఆసక్తిని కల్గినది అగు, రూపమ్ = భయంకర రూపమును, చక్రేశః = సుదర్శనమూర్తి, భవతామ్ అగ్రే = మీ కట్టెదుట, అకాల = అకాలమున, కాల+ ఈరిత = మృత్యుదేవతచే నియమింపబడిన, భట = భటులయొక్క, వికట = భయంకరమైన, ఆటోప = ఆర్భాటముల, లోపాయ = లోపముకొఱకు (నాశనముకొఱకు), ప్రథయతు = ప్రకాశింపచేయవలెను.

అనుకూలుర విషయమున సౌమ్యమైన రీతిలో ప్రత్యక్షమగుటకు ఒక మనోహరమైన రూపము, ప్రతికూలురకు భయంకరముగా తోచుటకు వేరొక ఉగ్రమైన రూపమును శ్రీసుదర్శన భగవానునకు కలవుకదా ! వానిలో ప్రస్తుతము ఉగ్రరూపమును గూర్చి కవి ప్రస్తుతించుచున్నారు.

**(చక్రేశః భవతాం పాలనవ్యగ్రం రూపమ్ అగ్రే ప్రథయతు)** - పాలన మనగా ఇష్టప్రాపణము- అనిష్టనివారణమును. అనిష్టనివారణము లేనిదే ఇష్టప్రాపణము సంభవింపదు కావున అనిష్టనివారణము కొఱకు గ్రహింపతగిన భీషణ రూప మిచట తెలుపబడుచున్నది. అపమృత్యువు కలుగునట్లు అకాలములో యమభటులు వచ్చి తల ఏదియో, కాలు ఏదియో తెలియనట్లు నర్తించుచు, కోలాహలమును చేయునపుడు ఆ ఉపద్రవమును పోగొట్టుటకై శ్రీసుదర్శనభగవానుడు ఏ రూపముతో భక్తులముందు సాక్షాత్కరించునో ఆ రూపము ఇచట ప్రస్తుతము. అది ఎట్టిది అనగా-

**(ఉగ్రం పశ్యాక్షమ్) –''ఉగ్రం యథా తథా పశ్యంతీతి ఉగ్రం పశ్యాని, ఉగ్రం పశ్యాని అక్షీణి యస్య తత్''** అని ఇచటి విగ్రహవాక్యము. కడుపులో దేవునట్లు (కలియబెట్టునట్లు) చూచు భీషణములైన కన్నులను కల్గినది. ఇది ఒక అద్భుత ప్రయోగము.

**(ఉద్యద్భ్రుకుటి)** - భ్రుకుటి అనగా భ్రూభంగము. భ్రూభంగముయొక్క విజృంభణమును కల్గినది. **''ఉద్యంతి భ్రుకుటి ఉద్యద్భ్రుకుటి''** అని విగ్రహము.

**(సముకుటమ్)** - కిరీటముతో కూడియున్నది.

**(కుండలి) – ''కుండలే అస్య స్త ఇతి కుండలి''** అనగా కర్ణభూషణములతో కూడియున్నది.

**(స్పష్టదంష్ట్రమ్)** - స్పష్టముగా ప్రకాశించుచుండు కోఱపళ్లను కల్గినది. **''కుండల స్పష్టదంష్ట్రమ్''** అను వేరొక పాఠము సంస్కృత వ్యాఖ్యలో కలదు. **''కుండలాభ్యాం స్పష్టే దంష్ట్రే యస్య తత్''** అని అచటి వివరణము.

**(చండాస్త్రైః బాహుదండైః లసత్)** - అనంతరశ్లోకములో తెలుపబడు శత్రుఖండన పండితములైన అస్త్రములను కల్గిన బాహుదండములతో వెల్గునది,

**(అనలసమక్షౌమలక్ష్యోరుకాండమ్)** - అగ్నిజ్వాలవలె అతిసుకుమారమ్మైయున్న పట్టువస్త్రమును ధరించియుండుటచే, ప్రారంభమున లావుగానున్నవై క్రమముగా సన్నముగా నుండి, బలిష్ఠములై, మాంసములై వెల్గుచున్న ఊరుద్వయమును చక్కగా దర్శింప వీలగునట్లుండును.

**(ప్రత్యాలీఢస్థపాదమ్)** - (పూర్వము 75వ శ్లోకవ్యాఖ్యలో వివరించిన విధముగా) ప్రత్యాలీఢ సన్నివేశమునందున్న పాదములను కల్గినది. కావున ఇట్టి రూపముతో శ్రీసుదర్శన భగవానుడు మీ కట్టెదుట ప్రత్యక్షమ్మై, యమభటులను తఱిమికొట్టి అనుగ్రహింపవలయునని తాత్పర్యము.

''చక్రేశః పాలనవ్యగ్రం రూపం భవతామ్ అగ్రే ప్రథయతు''

---

## శ్రీసుదర్శన పురుషుడు మీకు సంపదను ఇవ్వాలి.

**80.** చక్రం కుంతం కృపాణం పరశుహుతవహౌ వంకుశం దండశక్తీ
శంఖం కోదండపాశౌ హలముసలగదావజ్రశూలాం శ్చ హేతీన్ ।
దోర్భిః సవ్యాపసవ్యై ర్దధ దతులబలస్తంభితారాతిదర్పైః
వ్యూహ స్తేజోఽభిమానీ నరకవిజయినో జృంభతాం సంపదే వః ॥

చక్రమ్ = చక్రమును, కుంతమ్ = కుంతమును, కృపాణమ్ = ఖడ్గమును, పరశుహుతవహౌ = పరశువును, అగ్నిని, అంకుశమ్ = అంకుశమును, దండశక్తీ = దండమును, శక్తి అను ఆయుధమును, శంఖమ్ = శంఖమును, కోదండపాశౌ = వింటిని, పాశమును, హలముసల గదావజ్రశూలాన్ +చ = హలము, రోకలి, గద, వజ్రము, శూలములనెడి, హేతీన్ = ఆయుధములను, అతులబల = అసమానమ్మైన బలముతో, స్తంభిత+ అరాతిదర్పైః = స్తంభింప చేసిన శత్రువుల దర్పమును కల్గినవగు, సవ్య+ అపసవ్యైః = కుడి ఎడమలలోనున్న, దోర్భిః = బాహువులతో, దధత్ = ధరించుచున్న, నరకవిజయినః = నరకాసురుని జయించిన, భగవానుని, తేజోభిమానీ = తేజస్సు అంతయు నాదేనని అభిమానించు, వ్యూహః = అవతారమ్మైన శ్రీసుదర్శనము,



వః = మీయొక్క, సంపదే = సంపదకొఱకు, జృంభతామ్ = విజృంభించు గాక !

పూర్వశ్లోకమున **''చండాస్త్రైః బాహుదండైః లసత్''** అనుటను కవి ఇందు వివరించుచున్నారు. **''షోడశోత్తుంగ బాహుః''** అని ముందు తెలిపిన విధమున శ్రీసుదర్శనుని బాహువులు పదునాఱు అగుటచే అతడు ఒక్కొక్క బాహువులో ఒక్కొక్క దివ్యాయుధమును గ్రహించియుండును. కుడివైపు గల బాహువులు ఎనిమిదింటిలో ఎనిమిది ఆయుధములు, ఎడమవైపుకల బాహువులు ఎనిమిదింటిలో ఎనిమిది దివ్యాయుధములును కలవు. ఇట్లు మొత్తము పదునాఱు ఆయుధములు. - శ్రీ దేశికులు రచించిన పరమతభంగమను వాదగ్రంథము న చివరలో **''తికిరిముఴు ఉయర్ కుంతమ్ దండఙ్కుశమ్. . . .''** అని ప్రారంభించి **''తిక్కూర- రవణైయరఙ్గర్ దేశొన్న మన్నియ తిరిశుడర్నచ్చొయ్య ఈరెణ్ పుయఙ్గళే''** అనుచు ముగించిన పాశుర మిచట స్మరణీయము. ఆ ఆచార్యులు అనుగ్రహించిన శ్రీషోడశాయుధస్తోత్రములో కూడ ఈపదునాఱు ఆయుధముల మహిమ భవ్యముగా కీర్తింపబడినది.

ప్రథమ పాదములో తెలుపబడిన చక్రము, ఈటె, కత్తి, గొడ్డలి, శతముఖాగ్ని, కుంతము, దండము, వేలాయుధము, అను ఎనిమది కుడివైపు ఎనిమిది బాహువులలోని ఆయుధములు. రెండవ పాదములో తెలుపబడిన శంఖము, విల్లు, పాశము, నాగలి, గద, రోకలి, వజ్రము, శూలము అను ఈ ఎనిమిది ఎడమవైపుగల బాహువులలోని ఎనిమిది ఆయుధములు. **''శూలోఽస్త్రీరోగ ఆయుధే''** అని మేదినీ నిఘంటువులో పుంలింగ నిర్దేశముచేయబడుటచే ఇచట శూలశబ్దము పుంలింగములో ప్రయోగింపబడినది.

**(అతులబలస్తంభితారాతి దర్పైః)** - ఆయుధము దాల్చని కేవలబాహువులు మాత్రమే శత్రువుల పీచ మణచగల్గినవి అయినచో, ఇక ప్రబలములైన ఆయుధములతో భూషితములైన అడుగవలయునా !

''నరకవిజయినో తేజోభిమానీ వ్యూహః వః సంపదే జృంభతామ్''

---

## శ్రీసుదర్శనుడు మీకు గొప్ప తేజస్సును ఇవ్వాలి.

**81.** పీతం కేశే రిపోరప్యసృజి రథపదే సంశ్రితేఽప్యుత్కటాక్షం
చంద్రాధఃకారి యంత్రే వపుషి చ దలనే మండలే చ స్వరాంకమ్ ।
హస్తే వక్త్రే చ హేతిస్తబకిత మసమం లోచనే మోచనే చ
స్తా దస్తోకాయ ధామ్నే సురవరపరిషత్సేవితం దైవతం వః ॥

కేశే = కేశములందు, రిపోః అసృజి+ అపి = శత్రువుయొక్క రక్తమునందు, పీతమ్ = బంగారు వర్ణము కలిగినదిగా, (పానముచేసినదిగా), రథపదే = చక్రమునందు, సంశ్రితే+ అపి = ఆశ్రితుని విషయమునందు, ఉత్కట+ అక్షమ్ = అంతిగంభీరమైన అక్షమును కలిగినది ( ఉద్భూతమైన కటాక్షమును కల్గినది), యంత్రే = యంత్రమునందు, వపుషిచ = శరీరమునందును, చంద్రాధఃకారి = క్రింద లిఖింపబడిన చంద్రుని కల్గినది (చంద్రుని తిరస్కరించునది), దలనే = శత్రుదళనమందు (సంహారమందు), మండలే చ = సుదర్శనబింబము నందును, స్వర+ అంకమ్ = విజయఘోషను గుర్తుగా కల్గినది ( ప్రణవమును గుర్తుగా కల్గినది), హస్తే = చేతియందు, వక్త్రేచ = ముఖమునందు, హేతిస్తబకితమ్ = ఆయుధములచే (జ్వాలలచే) వ్యాప్తమైనది, లోచనే = కన్నులయందు, మోచనే చ= స్వప్రయోగమునందు, అసమమ్ = విషమసంఖ్యను కల్గినది (సాటిలేనిది), సురవరపరిషత్ సేవితమ్ = దేవశ్రేష్ఠుల సంఘముచే సేవింపబడుచున్నది అగు, దైవతమ్ = (శ్రీసుదర్శనమను) దైవము, వః = మీకు, అస్తోకాయ ధామ్నే = అంతులేని తేజస్సుకొఱకు, స్తాత్ = కావలయును.

తుల్యయోగితాలంకార ప్రక్రియలో శ్రీసుదర్శనుని వర్ణించు ఈశ్లోకము అమరియున్న తీరు సకలసహృదయహృదయరంజకము. సర్వథా శ్లాఘ్యము.

**(కేశే పీతమ్, రిపోః అసృజి అపి పీతమ్)** – **''పీతో గౌరో హరిద్రాభః''** అని అమరము తెలుపుచున్నది. బంగారు రంగులోనున్న కేశములను కల దైవమని అర్థము. శత్రువుల రక్తము పక్షమున పీతమనగా పానముచేయబడినదని అర్థము. ఈ అర్థమున కర్మణిక్త ప్రత్యయాంతమైన పీతశబ్దము కర్త్రర్థకము అయినది. **''క్తో ఽధికరణేచ''** ఇత్యాది సూత్రవివరణమునందు **''కథం భుక్తా బ్రాహ్మణాః ఇతి. భుక్త మస్తి ఏషా మితి మత్వర్థీయో ఽచ్''** అను వచన మిచట అనుసంధేయము. **''పీతమస్య అస్తీతి పీతమ్''** అని వివరింపనగును. కాళిదాసు రఘువంశము రెండవ సర్గలో **''వనాయ పీతప్రతిబద్ధవత్సామ్''** అని ప్రయోగించుటయు స్మరణీయము.

**(రథపదే సంశ్రితే అపి ఉత్కటాక్షమ్)** - చక్రముపక్షమునందు ఉత్కటమైన, అనగా గంభీరమైన అక్షమును కల్గినదని అర్థము. రెండవపక్షమున ఆశ్రితులపట్ల ఉద్భూతమైన కటాక్షమును కల్గినదని అర్థము. ఇచట సభంగశ్లేష. ( చక్రము పక్షమున **''ఉత్కట + అక్షమ్''** అని, ఆశ్రితుల పక్షమున **''ఉత్+ కటాక్షమ్''** అని పదవిభాగమును చేయనగును.)

**(యంత్రే వపుషి చ చంద్రాధఃకారి)** – **''ప్రణవశశధరాధారషట్కోణవర్తీ''** అని ఇంతకుముందే తెలుపబడినట్లు చంద్రుని లిఖించి, దానిపై సుదర్శనయంత్రమును స్థాపించుటచే చంద్రుని అధఃకరించిన, అనగా క్రింద కల్గిన యంత్రమును కల్గినది చక్రము. రెండవఅర్థమున సుదర్శనుని దివ్యమంగళవిగ్రహము తన కాంతితో చంద్రుని తిరస్కరించు చున్నదని భావము.



**(దలనే మండలేచ స్వరాంకమ్)** - దళన మనగా శత్రుఖండనము. అందు స్వరమును, అనగా విజయమును సూచించు సింహనాదమును అంకముగా, అనగా గుర్తుగా కల్గినది. రెండవ అర్థమున, చక్రమండలము ప్రణవలాంఛితమై యుండును అని భావము.

**(హస్తే వక్త్రే చ హేతిస్తబకితమ్)** - ఆయుధము, జ్వాలయు హేతిశబ్దముచే తెలుపబడును. కావున మొదటి అర్థమున ఆయుధవిశిష్టమైన హస్తమును కల్గియుండుట అని, రెండవ అర్థమున జ్వాలాపరివృతమైన ముఖమును కల్గియుండుట అని చెప్పనగును. **''రవే రర్చి శ్చ శస్త్రం చ వహ్నిజ్వాలా చ హేతయః''** అని అమరము. **''స్తబకిత''** మను ప్రయోగముచే సుదర్శనభగవానుని జ్వాలలకు, ఆయుధములకును పుష్పసామ్యము ధ్వనించుచున్నది.

**(లోచనే మోచనే చ అసమమ్)** – **''త్రినయనవదనః''** అని పూర్వము తెలిపినట్లు, సుదర్శనము విషమలోచనము. (రెండవఅర్థమున) మోచన మనగా ప్రయోగము. శస్త్రప్రయోగమున సాటిలేనిదని భావము.

**''దైవతం వః అస్తోకాయ ధామ్నే స్తాత్''**

---

## శ్రీసుదర్శనుడు మీకు గొప్ప సంపదను ఇవ్వాలి.

**82.** చిత్రాకారైః స్వచారైః మితసకలజగజ్జాగరూకప్రతాపః
మంత్రం తంత్రానురూపం మనసి కలయతో మానయన్నాత్మగుహ్యాన్ ।
పంచాంగస్ఫూర్తినిర్వర్తితరిపువిజయో ధామ షణ్ణాం గుణానాం
లక్ష్మీం రాజాసనస్థో వితరతు భవతాం పూరుష శ్చక్రవర్తీ ॥

చిత్ర+ ఆకారైః = పలువిధములైన రీతులను కల, స్వచారైః = తనసంచారములచే (తన చారులచే), మితసకలజగత్ = కొలిచిన (తెలిసికొనిన) సకలలోకములను కల్గినవాడు, జాగరూకప్రతాపః = ఎల్లప్పుడు వెలుగుచున్న ప్రతాపమును కల్గినవాడు (ప్రకాశించు పరాక్రమము కలవాడు), మంత్రమ్ = సుదర్శన మంత్రమును, తంత్ర+ అనురూపమ్ = ప్రయోగ తంత్రమునకు తగినట్లు మనసి కలయతః = మనస్సులో ధ్యానించుచున్న, ఆత్మగుహ్యాన్ = ఆత్మభక్తులను, మానయన్ = బహుమానించువాడు. (మంత్ర = రహస్య వృత్తాంతములను, తంత్రానురూపమ్ = రాజతంత్రాను గుణముగా, మనసి కలయతః = మనస్సులోనే విచారించు చున్న, ఆత్మగుహ్యాన్ = అంతరంగ సేవకులను, మానయన్ = గౌరవించువాడు, పంచాంగ స్ఫూర్తినిర్వర్తిత = నేమి (కర్మల ఆరంభోపాయము) మొదలగు తన అంగములు అయిదింటితో నిర్వహించిన, రిపువిజయః = శతువిజయమును కలవాడు, షణ్ణాం గుణానామ్ = జ్ఞానము మొదలగు ఆఱు

గుణములకు (సంధి విగ్రహాది ఆఱుగుణములకు), ధామ = నివాసస్థానము, రాజాసనస్థః = చంద్రమండలమును ఆసనముగా కల్గి వేంచేసియున్నవాడు (సింహాసనమున వేంచేసియున్నవాడు)ను అగు, చక్రవర్తీ పురుషః = శ్రీసుదర్శనపురుషుడు (సార్వభౌముడు), భవతామ్ = మీకు, లక్ష్మీమ్ = సంపదను, వితరతు = ఇచ్చునుగాక !

**''చక్రవర్తీ పురుషః''** అను కర్తృవాచక పదము శ్లిష్టమగుటచే దానికి తగినట్లు శ్లోకము పూర్తిగా శ్లిష్టమై అమరియున్నది. **''చక్రే వర్తతే ఇతి చక్రవర్తీ''** అనువ్యుత్పత్తి సుదర్శనుని పక్షమున, **''చక్రం వర్తయితుం (భూమండలం నిర్వోఢుం) శీలమస్యేతి చక్రవర్తీ''** అని సార్వభౌమ పక్షమున గ్రహింపనగును. శ్రీసుదర్శనపురుషునకు, సార్వభౌమునకును అన్వయించునట్లు ఆఱు విశేషములను ప్రయోగించిన కవి చాతురీవైభవమును ఏమని శ్లాఘింపగలము ? -

**(చిత్రాకారైః స్వచారైః మితసకలజగత్)** - శ్రీసుదర్శనుని సంచారములు పేషణ- భస్మీకరణ- ఖండన- లుంఠన - కుట్టన- ప్రహరణాది భేదములతో విచిత్రమైన రీతులలో నుండును. వానిచే అతడు సకల లోకవ్యాపియై యుండును. సార్వభౌముని పక్షమున చారులనగా గూఢచారులు. వారు కాపాలికాది రూపభేదములచే పలువురు. వారులోకమునందు అంతట వ్యాపించియుందురు.

**(జాగరూకప్రతాపః) – ''స ప్రతాపః ప్రభావ శ్చ యత్తేజః కోశదండజమ్''** అను అమరకోశవచనమునుబట్టి సార్వభౌముడు తేజస్వియై యుండును. సుదర్శనపురుషుడు శత్రువులను ఎల్లప్పుడు తపించుచుండును.

**(మంత్రం తంత్రానురూపం మనసి కలయతః ఆత్మగుహ్యాన్ మానయన్)** - సుదర్శన మంత్రమును అహిర్బుధ్న్యసంహితలో తెలుపబడిన పద్ధతిని బట్టి ఆమంత్రమును గుహ్యముగా మనస్సున ధ్యానించువారి విషయమున శ్రీసుదర్శనుడు అనుగ్రహించునని తెలియుచున్నది సార్వభౌముని పక్షమున మంత్రమనగా గుప్త భాషణము. దానిని రాజతంత్రానుకూలముగా, రహస్యముగాచేయు అంతరంగసేవకుల విషయమున రాజు గొప్ప ఆదరమును కల్గియుండును. **''మంత్రం యత్నేన గోపయేత్''** అని కదా సూక్తి !

**(పంచాంగస్ఫూర్తినిర్వర్తితరిపువిజయః)** - జ్వాల, నాభి, నేమి, అరము, అక్షము అను తన అయిదు అవయవముల స్ఫురణములచే శత్రుసంహారమును నిర్వహించువాడు సుదర్శనపురుషుడు. సార్వభౌముని పక్షమున - **''కర్మణా మారంభో పాయః, పురుషద్రవ్యసంపత్, వినిపాత ప్రతీకారః, దేశకాలవిభాగః, కార్యసిద్ధిః''** అను శత్రుజయసాధకమగు అంగపంచకము



అనుసంధేయము. **''స్వామ్యమాత్యశ్చ రాష్ట్రంచ దుర్గం కేశో బలం సుహృత్, పరస్పరోపకారీదం సప్తాంగం రాజ్య ముచ్యతే''** అను కామందకీ నీతి ప్రకారము, **''స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలాని చ, రాజ్యాంగాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోఽపిచ''** అను అమరకోశవచనము బట్టి ఏడు అంగములని ఏర్పడుచున్నను ఇట్లు పంచాంగకథన ప్రకారమును కలదని పెద్దలందురు. మఱియు **''పౌరశ్రేణిభిః సహాష్టాంగక మపి రాజ్యమ్ ఇతి దర్శితమ్''** అని అమరసుధలోని వివరణమును బట్టి అష్టాంగము రాజ్యమనుకథనము ఉన్నదని ఏర్పడుటచే ప్రకృతపంచాంగత్వకథనమును ఇట్టి ప్రకారవిశేషమే అని భావింపనగును. **''పంచాంగస్య న్యాసస్య స్ఫూర్త్యా నిర్వర్తితో నిష్పాదితో రిపు విజయః''** అని వేరొక వివరణమునుకూడ సంస్కృత వ్యాఖ్యలో కలదు. **''కర్మణా మారంభోపాయః, పురుషద్రవ్యసంపత్, వినిపాత ప్రతీకారః, దేశకాల విభాగః, కార్యసిద్ధి శ్చేతి పంచాంగాని''** అని ఇంకొక వివరణము.

**(షణ్ణాం గుణానాం ధామ)** - జ్ఞానశక్తి బలైశ్వర్యవీర్యతేజస్సులను ఆఱు గుణములకు శ్రీసుదర్శనపురుషుడు వాసస్థానము. అట్లేసార్వభౌముడును - **''సంధివిగ్రహయానాసనద్వైధీభావ సంశ్రయ''** ములను ఆఱుగుణములకు స్థానము. అమరకోశసుధావ్యాఖ్యానమునకు గల టిప్పణిలో వీని వివరణమును కాననగును. **''రిపువిజయే ప్రస్తుతే సతి పంచాంగన్యాసః కర్తవ్యః, రిపుసంహారే కర్తవ్యేసతి షడంగన్యాసః కర్తవ్యః ఇతి మంత్రానుసంధానక్రమః''** అనుచు సంస్కృత వ్యాఖ్యాత వివరించెను. అనగా శత్రువిజయము కొరకు సుదర్శన షడక్షరీ మంత్రముతో పంచాంగన్యాసమును శత్రుసంహారము కొరకు షడంగన్యాసము చేయవలెనని మంత్రానుసంధాన క్రమము అని అర్థము.

**(రాజాసనస్థః) – ''రాజా మృగాంకే క్షత్రియే నృపే''** అని అమరము. **''చంద్రాధః కారియంత్రే''** అని పూర్వము తెలుపబడినట్లు సుదర్శన పురుషుడు చంద్రాసనమున నుండును. సార్వభౌముడును సింహాసనముననుండును.

**(లక్ష్మీం వితరతు)** - సంపత్ప్రదానముకూడ శ్రీసుదర్శనపురుషునకు, సార్వభౌమునకును సమానమే కదా ! ఇచ్చట ప్రకృతాప్రకృతములగు సుదర్శనపురుషుని, సార్వభౌముని వృత్తాంతములు రెండును ప్రస్తుతింపబడుటచే ప్రకృతాప్రకృతశ్లేష కలదు. దీనివలన సుదర్శనునకు సార్వభౌమ సాదృశ్యము స్ఫురించుచున్నదని వేరొక వ్యాఖ్య.

''చక్రవర్తీ పురుషః భవతాం లక్ష్మీం వితరతు''

---

**శ్రీసుదర్శనుడు మీకు మనోరథపూర్తిని కల్గించాలి.**

**83.** అక్షావృత్తాభ్రమాలాన్యరవివరలుఠచ్చంద్రచండద్యుతీని
జ్వాలాజాలావలీఢస్ఫుటదుడుపటలీపాండుదిఙ్మండలాని ।
చక్రాంతాక్రాంతచక్రాచలచలితమహీచక్రవాలార్తశేషా-
ణ్యస్త్రగ్రామాగ్రిమస్య ప్రదదతు భవతాం ప్రార్థితం ప్రస్థితాని ॥

అక్ష = అక్షమునందు, ఆవృత్త = పరిభ్రమించుచున్న, అభ్రమాలాని = మేఘసమూహములను కల్గినవి, అరవివరలుఠత్ = అరములలోని మధ్యభాగములందు పొర్లుచున్న, చంద్రచండద్యుతీని = చంద్రుని, సూర్యుని కాంతులను కల్గినది, జ్వాలాజాల = జ్వాలాసమూహములచే, అవలీఢ = స్పర్శింపబడి, స్ఫుటత్ = పగులుచున్న, ఉడుపటలీ = నక్షత్రసమూహములచే, పాండు = తెల్లగానున్న, దిక్+ మండలాని = దిక్ మండలములను కల్గినవి, చక్ర+అంత = చక్రనేమిచే, ఆక్రాంత = ఆక్రమింపబడిన, చక్రాచల = చక్రవాళపర్వతముచే, చలిత = కదుపబడిన, మహీచక్రవాల = భూమండలముచే, ఆర్త = క్లేశపఱుపబడిన, శేషాణి = ఆదిశేషుని కల్గినవి అగు, అస్త్రగ్రామ +అగ్రిమస్య = దివ్యాస్త్రములలో గొప్పది అగు సుదర్శనముయొక్క, ప్రస్థితాని = ప్రయాణములు, భవతామ్ = మీకు, ప్రార్థితమ్ = కోరిన దానిని, ప్రదదతు = ఇచ్చునుగాక !

శ్రీసుదర్శనుని గమనములు ఇందు రమ్యముగా వర్ణింపబడుచున్నవి. మేఘసమూహములు అక్షములలో తిరుగుచుండునట. చంద్రుడు, సూర్యుడును అరముల మధ్యలో పొర్లుదురట. నక్షత్రరాశులు శ్రీసుదర్శనుని జ్వాలాజాలములచే అభిభవింపబడి, దిగంతములలో చెదఱి, వ్యాపించి వానిని తెల్లగా చేయునట. చక్రనేమి చక్రవాళపర్వతపర్యంతము వ్యాపింప ఆక్రమించుటచే ఆపర్వతము కుచించుకొనగా, దానివలన భూమియు సంకోచమును పొందినదట. అందుచే తన సహస్రఫణములతో భూభారమును వహించు ఆదిశేషుడును ''నాకేమి మూడునో !'' అని ఆర్తుడయ్యెనట. ఇట్టివి సుదర్శనుని ప్రయాణ సంరంభములు. ప్రస్థిత శబ్దమిచట భావే క్త ప్రత్యయాంతము. ప్రయాణార్థకము

''అస్త్రగ్రామాగ్రిమస్య ప్రస్థితాని భవతాం ప్రార్థితం ప్రదదతు''

## శ్రీసుదర్శన పురుషుడు మీకు సుఖాన్ని కల్గించాలి.

**84.** శూలం త్యక్తాత్మశీలం స్పృణి రణుకఘృణిః పట్టిసః స్పష్టసాదః
శక్తి శ్శాలీనశక్తిః కులిశ మకుశలం కుంతధారః కుఠారః ।
దండ శ్చండత్వశూన్యో భవతి తను ధను ర్యత్పురస్తాత్ స వః స్తాత్
గ్రస్తాశేషాస్త్రగర్వో రథచరణపతిః కర్మణే శార్మణాయ ॥



యత్పురస్తాత్ = ఏ సుదర్శనముముందు, శూలమ్ = శూలాయుధము, త్యక్త + ఆత్మశీలమ్ = తన స్వభావమును కోల్పోయినది అయినదో, సృణిః = అంకుశము, అణుకఘృణిః = కాంతిని మాసిపోయినదగుచున్నదో, పట్టిసః = పట్టిసమను ఆయుధము, స్పష్టసాదః = స్పష్టమైన కార్శ్యమును కల్గినదైనదో, శక్తిః = శక్తిఅను ఆయుధము, శాలీనశక్తిః = గతించిన శక్తిని కల్గినదైనదో, కులిశమ్ = వజ్రము, అకుశలమ్ = కుశలములేనిదైనదో, కుఠారః=పట్టా కత్తి, కుంతధారః= పోయినపదును కల్గినదైనదో దండః = దండము, చండత్వశూన్యః = సాధువైనదో, ధనుః = ధనుస్సు, తనుః = కృశించినదో, వః = అట్టి, గ్రస్త+అశేష+అస్త్ర గర్వః = అన్ని ఆయుధముల గర్వమును అణచిన, రథచరణపతిః = చక్రాయుధము, వః = మీకు, శార్మణాయ = సుఖప్రదమైన, కర్మణే = కార్యముకొఱకు, స్తాత్ = అగునుగాక !

ప్రసిద్ధములైన ఆయుధము లన్నియు శ్రీసుదర్శనునిముందు అసత్కల్పమగుచున్న విధమును కవి ఇందు తెలుపుచున్నారు. శూలము శత్రుసంహార సామర్థ్యమనెడి తన స్వభావమును కోల్పోయినది. అంకుశము కాంతి తగ్గినదైనది. పట్టాకత్తి **(పట్టిసః)** అని పిలుబడు పట్టిసము కృశించినది. వజ్రము కుశలములేనిది అయినది. దండముయొక్క ప్రచండత పోయినది. ధనుస్సు కృశమైనది.. ఇట్లు మిగిలిన ఆయుధములన్నియు సుదర్శనము ముందు నిర్వీర్యములైనవి అని భావము.**''స్పష్టః సాదః కార్శ్యం యస్యసః''** అను విగ్రహమును **''స్పష్టసాదః''** అనువిశేషణమునకు చెప్పనగును. శక్తి అను ఆయుధము శక్తి హీనమైనది. **''స్యా దధృష్ణ స్తు శాలీనః''** అని అమరము.

''గ్రస్తాశేషాస్త్రవర్గః'' అను వేరొక పాఠముకలదు. శార్మణ మనగా సుఖసాధనము. **''శర్మణః సాధనమ్ శార్మణమ్''** అనివ్యుత్పత్తి. బ్రహ్మానంద సాధనములైన సత్కర్మములందు మీకు ప్రవృత్తిని కల్గించుగాక అని తాత్పర్యము.

**''రథచరణపతిః శార్మణాయ కర్మణే స్తాత్''**

## శ్రీసుదర్శనుడు మీకు స్థిరమైన ప్రశస్తిని కల్గించాలి.

**85.** క్షుణ్ణాజానేయబృందం క్షుభితరథగణం సన్నసాన్నాహ్యయూథం
క్ష్వేళాసంరంభహేలాకలకలవిగలత్ పూర్వగీర్వాణగర్వమ్ ।
కుర్వాణ స్సాంపరాయం రథచరణపతిః స్థేయసీం వః ప్రశస్తిమ్
దుగ్ధాం దుగ్ధాబ్ధిభాసం భయవివశశునాసీరనాసీరవర్తీ ॥

భయవివశ = భయముచే వివశుడైన, శునాసీర = ఇంద్రునియొక్క, నాసీర = సేనాముఖమందు,

వర్తీ (సన్) = వర్తించువాడై, క్షుణ్ణ+ ఆజానేయబృందమ్ = (యతాతథా) చూర్ణముచేయబడిన అశ్వసమూహములను కల్గినదగునట్లు, క్షుభితరథగణమ్ (యథాతథా) = శిథిలమైన రథసమూహమును కల్గినదగునట్లు, సన్నసాన్నాహ్యాయూథమ్ (యథాతథా) = యుద్ధసన్నద్ధులగు పదాతుల సమూహములు చెల్లాచెదఱుఅగునట్లు, క్ష్వేళాసంరంభ = సింహనాద సంరంభములు, హేలాకలకల = హేలాకోలాహలములు అనువీనియందు (గుఱ్ఱములతో గుఱ్ఱములను, రథములతో రథములను, గజములతో గజములను, పదాతులతో పదాతులను వధించుచూ చేయు హేలాకోలాహలము), విగలత్ పూర్వగీర్వాణగర్వమ్ (యథాతథా) = అసురుల గర్వము అణగునట్లును, సాంపరాయమ్ = యుద్ధమును, కుర్వాణః= చేయువాడగు, రథచరణపతిః = చక్రరాజము, వః = మీకు, దుగ్ధ+ అబ్ధిభాసమ్ = పాలసముద్రము వలె వెల్గునట్టి, స్థేయసీమ్ = శాశ్వతమైన, ప్రశస్తిమ్ = కీర్తిని, దుగ్ధామ్ = వృద్ధిచేయును గాక!

శ్రీసుదర్శనము యుద్ధరంగమునందు ప్రవేశించి రథగజతురగాదులను భగ్నముచేసి వ్యాపించు రీతి ఇందు స్తుతింపబడుచున్నది. **''ఆజానేయాః కులీనాశ్వాః''** అని అమరము. అనగా గొప్ప అశ్వములు. **''సన్నసాన్నాహ్యాయూథమ్''** అనుటకు– **''సన్నాః విశీర్ణాః, సాన్నాహ్యాయూథాః యస్మిన్ కర్మణి తత్''** అని విగ్రహము. ఈ పదము యుద్ధసన్నద్ధులగు పదాతుల సమూహమును తెలుపుచున్నదని సంస్కృత వ్యాఖ్యాత తెలిపెను. **''సాన్నాహ్యాః సమరోచితః ఇత్యమరః''** అని సంస్కృతవ్యాఖ్యాత ఉట్టంకించిన అమరకోశ ప్రమాణమిపుడు ఆ నిఘంటువులో లభించుటలేదు. **''సాన్నాయ్యయూథమ్''** అనునది సరిఅయిన పాఠమని **''సాన్నాయ్య''** శబ్దము విశేషవాచి అని కొందఱు అందురు. కోశములను పరిశీలింపనగును. అని శ్రీ. ప్ర. భ. అణ్ణా స్వామి సూక్తి.

**(క్ష్వేళాసంరంభ. . . .గర్వమ్)** – **''క్ష్వేళా తు సింహనాదః స్యాత్''** అని అమరము. సుదర్శనము యుద్ధభూమిలో చేయుసింహనాదసంభ్రమములను ఇది తెలుపుచున్నది. హేలాకలకలమనగా క్రీడాకోలాహలము. రథముతో వేరొక రథమును భగ్నము చేయుట, అశ్వముతో అశ్వమును చంపుట మొదలగు లీలలను అదిచేయును.

పూర్వగీర్వాణులనగా అసురులు. **''పూర్వదేవాః స్సురద్విషః''** అని అమరము. **''అత్యంతం స్థిరా స్థేయసీ''. ''దుగ్ధాబ్దే రివ భాః యస్యాః తామ్ దుగ్ధాబ్ధిభాసమ్''** కీర్తిని తెల్లగా వర్ణించుట కవి సమయము.

**(భయవివశ . . .నాసీరవర్తీ)** శత్రుభయవిహ్వలుడైన ఇంద్రుడు పరుగెత్తుకొని వచ్చి శరణమును పొందగా, శ్రీసుదర్శనము అతని సేనాముఖమందు ప్రవేశించి, అనుగ్రహించుట ఇచట సూచితము. సుదర్శనము ఇంతటి అపూర్వ కార్యములను నిర్వహించును. **''ద్రుతసభయ**



**శునాశీర''** అను వేరొకపాఠమును సంస్కృతవ్యాఖ్యాత తెలుపుచు **''భయేన సహితః సభయః, సచాసౌ శునాశీరశ్చ సభయశునాశీరః, ద్రుతశ్చ అసౌ సభయశునాశీరశ్చ ద్రుతసభయశునాశీరః''** అని వివరించెను.

''రథచరణపతిః వః స్థేయసీం ప్రశస్తిం దుగ్ధామ్''

## శ్రీసుదర్శనుడు మిమ్ములను కీర్తిని కలవారినిగా చేయాలి.

**86.** ద్రుహ్యద్దోశ్శాలిమాలిప్రహరణరభసోత్తానితే వైనతేయే
విద్రాతి ద్రాక్ ప్రయుక్తః ప్రధనభువి పరావర్తమానేన భర్త్రా ।
నిర్జిత్య ప్రత్యనీకం నిరవధికచరద్ధాస్తికాశ్వీయరథ్యం
పథ్యం విశ్వస్య దాశ్వాన్ ప్రథయతు భవతో హేతి రింద్రానుజస్య ॥

ద్రుహ్యత్ = ఇతరులకు హానిచేయుచున్న, దోఃశాలి = భుజబలమును కల, మాలి = మాలి అను అసురునియొక్క, ప్రహరణరభస = ఆయుధముల దెబ్బలచే, ఉత్తానితే = విముఖుడై, వైనతేయే = గరుడుడు, ద్రాక్ విద్రాతి సతి = వేగముగా పరుగెత్తుకొనిపోగా, ప్రధనభువి = యుద్ధరంగమునందు, పరావర్తమానేన = తిరిగివచ్చుచున్న, భర్త్రా = భగవానునిచే, ప్రయుక్తః (సన్) = ప్రయోగింపబడినవాడై, నిరవధికచరత్ = అంతులేక తిరుగుచున్న, హాస్తిక + అశ్వీయరథ్యమ్ = గజ, తురగ, రథసమూహములను కల్గిన, ప్రత్యనీకమ్ = శత్రుసైన్యమును, నిర్జిత్య = పూర్తిగా జయించి, వధించి, విశ్వస్య = భువనమునకు, పథ్యమ్ = హితమును, దాశ్వాన్ = ఇచ్చినవాడగు, ఇంద్రానుజస్య = భగవానునియొక్క, హేతిః = ఆయుధము (సుదర్శనము), భవతః = మిమ్ములను, ప్రథయతు = కీర్తిని కలవారినిగా చేయును గాక !

ఉత్తరరామాయణము నందు ఏడవసర్గలో శ్రీసుదర్శనము మాలి అను అసురుని తలను ఖండించిన కథ కలదు. మాలి మొదట గరుడుని తన గదతో మోదగా, గరుడుడు బాధతో పాఱిపోయెను. **''గదయాఽభిహత స్తేన మాలినా గరుడో భృశమ్, రణాత్ పరాఙ్ముఖం దేవం కృతవాన్ వేదనాతురః, పరాఙ్ముఖే కృతే దేవే మాలినా గరుడేన వై, ఉదతిష్ఠన్మహాన్ శబ్దో రక్షసా మివ నర్దతామ్, రక్షసాం రువతాం రావం శ్రుత్వా హరిహయానునుజః, తిర్య గాస్థాయ సంక్రుద్ధః పక్షీశే భగవాన్ హరిః, పరాఙ్ముఖోఽప్యుత్ససర్జ మాలే శ్చక్రం జిఘాంసయా, కాలచక్రనిభం చక్రం మాలే శ్శీర్ష మపాతయత్''** అను అచటి శ్లోకములు స్మరణీయములు.

''నిరవధికచరద్ధాస్తి కాశ్వీయరథ్యమ్'' అను ప్రయోగము తద్ధిత ప్రయోగము. **''హస్తినాం సమూహః హాస్తికమ్, అశ్వానాం సమూహః ఆశ్వీయమ్, రథానాం సమూహః రథ్యమ్''**

అని విగ్రహములు. **''దాశ్వాన్''** అనునది క్వసు ప్రత్యయాంతమైన నిపాతము. ఇచ్చినవాడని అర్థము. ఈ వైదికప్రయోగముయొక్క స్త్రీలింగరూపము **''దాశుషీ''** అని అగును. ఈ రూపము **''క్రీడత్ప్రాక్''** (67) అను శ్లోకమున ప్రయోగింపబడుట కాననగును.

**''ఇంద్రానుజస్య నేతిః భవతః ప్రథయతు''**

## శ్రీసుదర్శనుడు మీ కష్టాలను తీర్చాలి.

**87.** **నందిన్యానందశూన్యే గలతి గణపతౌ వ్యాకులే బాహులేయే**
**చండే చాకిత్యకుంఠే ప్రమథపరిషది ప్రాప్తవత్యాం ప్రమాథమ్ ।**
**ఉచ్చిద్యాజౌ బలిష్ఠం బలిజభుజవనం యో దదా వాదిభిక్షోః**
**భిక్షాం తత్ప్రాణరూపాం స భవదకుశలం కృష్ణహేతిః క్షిణోతు ॥**

ఆజౌ = (బాణాసుర) యుద్ధములో, నందిని = నంది, ఆనందశూన్యే (సతి) = ఆనందములేని వాడుకాగా, గణపతౌ = గణనాయకుడు (వినాయకుడు), గలతి (సతి) = వెనుకంజవేసిన వాడుకాగా, బాహులేయే = కుమారస్వామి, వ్యాకులే (సతి) = ఏమిచేయుటకు తోచక వ్యాకులమును పొందినవాడుకాగా, చండే = చండుడు అనువాడు, చాకిత్యకుంఠే = భయముచే స్తబ్ధుడు కాగా, ప్రమథపరిషది = (రుద్రుని) ప్రమథగణములన్నియు, ప్రమాథం ప్రాప్తవత్యామ్ (సత్యామ్) = భంగమును పొందినవి కాగా, యః = ఏ సుదర్శనుడు, బలిష్ఠమ్ = మిక్కిలి దృఢమైన, బలిజభుజవనమ్ = బాణాసురుని వేయి బాహువులను, ఉచ్ఛిద్య = ఛేదించి, తత్ ప్రాణరూపామ్ = అతని ప్రాణముల రూపముననున్న, భిక్షామ్ = భిక్షను, ఆదిభిక్షోః = ఆదిభిక్షువగు శివునకు, దదౌ = ఇచ్చెనో, సః = అట్టి, కృష్ణహేతిః = భగవానుని ఆయుధమగు సుదర్శనము, భవత్ + అకుశలమ్ = మీ కష్టములను, క్షిణోతు = తొలగించునుగాక !

శ్రీ సుదర్శనుడు బాణాసురుని వేయి బాహువులను త్రుంచిన వృత్తాంత మిచట వర్ణింపబడుచున్నది. మహాబలివంశమునందు జన్మించిన బాణాసురుడు ఒకానొక సమయమున శివుని నటనమును చూచి, దానికి తగినట్లు తనరెండు చేతులతో మద్దెలను వాయించెను. అందులకు శివుడు మెచ్చి అతనికి వేయిబాహువులను అగ్ని దుర్గమును, అంతులేని బలమును, గొప్పసంపదను, తాను సపరివారముగ అతని భవనము యొక్కవాకిలిలో కావలియుండుటను వరములుగా అనుగ్రహించెను. అబాణాసురుని కుమార్తె అగు ఉష ఒకనాడు ఒక పురుషునితో తాను కలసినట్లు కలగని, అంతకుముందు పార్వతి పల్కిన విధమున అతని విషయమున గొప్పప్రేమను కల్గియుండెను. తన ప్రాణసఖియగు చిత్రకళకు ఈ విషయమును తెలిపి, ఆమె



వలన ఆపురుషుడు శ్రీ కృష్ణుని పౌత్రుడు, ప్రద్యుమ్నుని పుత్రుడును అగు అనిరుద్ధుడేనని తెలిపికొనెను. అనతిని పొందుటకు తగిన ఉపాయమును ఏదైనను ప్రయోగింపవలెనని చిత్రకళను వేడగా, ఆమె తన యోగవిద్యా ప్రయోగముతో ద్వారకను చేరి, అనిరుద్ధుని తీసికొని, అతనిని ఆమె అంతఃపురమున విడచెను. ఉష అతనితో సుఖించుచుండెను. ఈ సంగతిని కావలివారిద్వారా గ్రహించిన బాణాసురుడు తనసేనతో అనిరుద్ధుని ఎదిర్చి, మాయతో యుద్ధము చేసి, అతనిని నాగాస్త్రముతో బంధించెను. ద్వారకలో అనిరుద్ధుడు కనుపింపకపోవుటచే యాదవులందఱు కలతచెందిరి. అపుడు నారదుడు జరిగిన వృత్తాంతమును అంతటిని శ్రీకృష్ణునకు తెలుపగా వెంటనే భగవానుడు గరుడుని స్మరించెను. గరుడుడు అచట ప్రత్యక్ష మయ్యెను. అతనిని అధిరోహించిన శ్రీకృష్ణుడు బలరామాదులు వెంటరాగా, బాణుని పురమగు శోణిత పురమునకు బయలుదేరెను. అపుడు ఆనగరమునకు సమీపమున కాపలికాయచున్న శివుని ప్రమథగణములు అతనిని ఎదిర్చెను. వారి నందఱినుగెలిచి, పిమ్మట శివునిచే ప్రయోగింపబడిన జ్వరదేవత మూడు కాళ్లు, మూడు శిరస్సులను కల్గినదై వచ్చి బాణుని కాపాడుటకై భగవానునితో యుద్ధ మొనర్చెను. అపుడు శ్రీకృష్ణుడు తానును ఒకానొక జ్వరదేవతను సృష్టించి, దానిని విడువగా అది శివుడు ప్రయోగించిన జ్వరదేవతను తఱిమి కొట్టెను. పిమ్మట బాణుని కోటను చుట్టియుండి, రక్షించుచున్న రుద్రానుచరులగు అగ్నిదేవులు అయిదుగురు భగవానుని ఎదిరింపగా, వారిని నాశనమొనర్చి స్వామి బాణునితో యుద్ధము చేయ ప్రారంభించెను. అతనికి సహాయముగా శివుడు, కుమారస్వామి, గణపతి, మొదలగు వారు పరివారముతో వచ్చి ఎదిరించి, పోరాడిరి. శ్రీకృష్ణుడు జృంభణాస్త్రమును ప్రయోగించి శివుని ఏమియు చేయలేని విధమున కట్టివేయగా, అతడు చేయునది లేక వెడలిపోయెను. కుమారస్వామిని, గణపతిని హుంకారములతో తఱిమికొట్టిన పిదప స్వామి చక్రాయుధమును గొని ప్రయోగించెను. అపుడు అది బాణుని బాహువులను ఖండఖండములుగా ఖండించి, అతని ప్రాణములను హరింపబోగా, పరమశివుడు అచటికి వచ్చి, స్వామికి నమస్కరించి, పలురీతులలో ప్రార్థించి, ఆబాణుని నాల్గుచేతులను, అతని ప్రాణములను మాత్రము విడచిపెట్టి రక్షింపవేడెను. ఆ ప్రార్థనను మన్నించి భగవానుడు అట్లే చేసెను. పిమ్మట అనిరుద్ధునకు ఉషను ఇచ్చి అతివైభవముగా వివాహము జరిపించెను. అనంతరము ద్వారకకు తిరిగి వచ్చెను.

రెండవపాదప్రారంభమున **''చండత్వకుంఠే''** అను పాఠాంతరము సంస్కృత వ్యాఖ్యానమున కలదు. **''బాహులేయః''** అనగా కుమారస్వామి. **''బహులానాం కృత్తికానా మపత్యమ్''** అని విగ్రహము. అనగా పలువురు కృత్తికల పుత్రుడు. **''తత్ప్రాణరూపాం భిక్షా మాదిభిక్షోః దదౌః''** శివుని ప్రార్థనకు అంగీకరించి కదా బాణాసురుని సజీవునిగా విడచినది.

''కృష్ణహేతిః భవదకుశలం క్షిణోతు''

## శ్రీసుదర్శనుడు మీకు నిరపాయమైన సంపదను ఇవ్వాలి.

**88.** రక్తౌఘాభ్యక్తముక్తాఫలలులితలలద్వీచివృద్ధౌ మహోబ్ధౌ
సంధ్యాసంబద్ధతారాజలధరశబలాకాశనీకాశకాంతౌ ।
గంభీరారాంభ మంభశ్చర మసురకులం వేదవిఘ్నం వినిఘ్నన్
నిర్విఘ్నం వః ప్రసూతాం వ్యవగతవిపదం సంపదం చక్రరాజః ॥

రక్త+ ఓఘ = (సముద్రములో వధింపబడిన అసురుల) రక్త ప్రవాహములచే, అభ్యక్త = పూయబడిన, ముక్తాఫల = ముత్యములతో, లులిత = కలసినవై, లసత్ = వెల్గుచున్న, వీచివృద్ధౌ = తరంగముల అభివృద్ధిని కల్గినదైన, సంధ్యా = సంధ్యాకాలమునందు, సంబద్ధ = సంబంధించిన (ఎఱ్ఱని), తారా = నక్షత్రములచే, జలధర = మేఘములచే, శబల = కర్బురవర్ణముగానైన, ఆకాశ = ఆకాశముతో, నీకాశ =సమానమైన, కాంతౌ = కాంతిని కల్గినదైన, మహా+ అబ్ధౌ = మహా సముద్రమునందు (ప్రవేశించి), అంభశ్చరమ్ = జలమందు చరించునది, వేదవిఘ్నమ్ = వేదమును హరించినది అగు, అసురకులమ్ = అసురసమూహమును, గంభీర+ ఆరంభమ్ (యథాతథా) = గంభీరమైన ప్రారంభముతో కూడికొనియుండునట్లు, వినిఘ్నన్ = సంహరించుచున్న, చక్రరాజః = సుదర్శన చక్రరాజము, వః= మీకు, వ్యపగతవిపదమ్ = తొలగిన ఆపదలనుకల (నిరపాయమైన), సంపదమ్ = సంపదను, నిర్విఘ్నమ్ (యథా తథా) = అడ్డులేకుండ, ప్రసూతామ్ = కల్గించును గాక !

బ్రహ్మదేవుని వద్దనుండి వేదములను అపహరించి, సముద్రమును జొచ్చిన అసురకులమును సుదర్శనము సంహరించిన వృత్తాంత మిందు ప్రస్తుతించుచున్నారు.

**(రక్తౌఘాభ్యక్తముక్తాఫలః)** - సముద్రమధ్యమందు ప్రవేశించి అసురులను సంహరించునపుడు వారి శరీరములనుండి బయటకు స్రవించిన రక్తధారలు ఆ సముద్రములో నున్న ముత్యములతో కలువగా తెల్లగా నున్న ఆముత్యములు ఎఱ్ఱగా అయ్యెను. అట్టి ముత్యములతో కూడిన సముద్రము తరంగములతో వృద్ధిచెందుచున్నది. ముత్యములున్న భాగము ఎఱ్ఱగా, అలలు వీచు భాగము నల్లగా నుండుటను చూడగా ఎట్లున్నదనుటను రెండవ పాదము తెలుపుచున్నది.

**(సంధ్యాసంబద్ధతారాజలధర . . .కాంతౌ)** - సంధ్యారాగరంజితములైన నక్షత్రములతో, కాలమేఘముతో కూడియున్న ఆకాశముతో సమానముగా సముద్రము



కన్పించుచున్నదని భావము. సముద్రస్థానమున ఆకాశము, ముక్తాఫలముల స్థానమున తారాగణములు, తరంగములస్థానమున మేఘములును, రక్తప్రవాహముల స్థానమున సంధ్యారాగమును గ్రహింపనగును. ఎఱుపు, నలుపు కలసిన విభిన్న వర్ణమునకు శబల మనిపేరు. స్వభావముచే నీలమైన ఆకాశము. సంధ్యా రక్తములైన నక్షత్రములతో, మేఘములతో కలసి కర్బుర వర్ణముగా కన్పించునట్లు, సహజముగా నీల వర్ణమైన సముద్రము, అసురుల రక్తముతో ఎఱ్ఱనైన ముత్యములతో, అలలతో వ్యాప్తమైన కర్బుర వర్ణముతో (చిత్రవర్ణముతో) కూడినదయ్యెను అని తాత్పర్యము.

**''గంభీరారంభమ్''** అనునది అసురుకులమునకు విశేషణముగా అన్వయించుట కంటె చక్రరాజక్రియావిశేషణముగాచేయుట మిక్కిలి స్వరసము. సంస్కృతవ్యాఖ్యాత దీనిని అసురకుల విశేషణముగా అన్వయించెను. **''వేదనిఘ్నమ్''** వేదములను హరించిన వారగుటచే వేద ప్రచారమునకు ఆటంకమును కల్గించిన వారని భావము. నీకాశమనగా సమానమని అర్థము.

**''లోఢృ- ఉన్మాదే''** అనుధాతువునుండి **''లులిత''** శబ్దము, **''లడ- విలాసే''** అను ధాతువునుండి **'లలత్'** శబ్దమును నిష్పన్నములు. **''లడయోర్లళయోశ్చైకత్వస్మరణాల్లలతీతి స్వామ్యాదయః''** అని సిద్ధాంత కౌముదిలో తెలుపబడినది.

''చక్రరాజః వః సంపదం నిర్విఘ్నం ప్రసూతామ్''

## శ్రీసుదర్శనుడు లోకాలు మెచ్చే సంపదను మీకు ఇవ్వాలి.

**89.** కాశీవిప్లోషచైద్యక్షపణధరణిజధ్వంససూర్యాపిధాన-
గ్రాహద్వేధాత్వమాలిత్రుటనముఖకథావస్తుసత్కీర్తిగాథాః ।
గీయంతే కిన్నరీభిః కనకగిరిగుహాగేహినీభి ర్యదీయాః
దేయా ద్దైతేయవైరీ స సకలభువనశ్లాఘనీయాం శ్రియం వః ॥

యదీయాః = ఏ సుదర్శనమునకు సంబంధించినవైన, కాశీవిప్లోష = కాశీనగరదాహము, చైద్యక్షపణ = శిశుపాలుని వధించుట, ధరణిజధ్వంస = నరకాసురవధ, సూర్యాపిధాన = సూర్యుని ఆచ్ఛాదించుట, గ్రాహద్వేధాత్వ = మొసలిని రెండుగా ఖండించుట, మాలిత్రుటన ముఖ = మాలిని ఖండించుట, మొదలగు, కథావస్తు = కథలను వస్తువులుగా కల, సత్కీర్తిగాథాః = గొప్పకీర్తిచరితలు , కనకగిరిగుహా = మేరుపర్వత గుహలను, గేహినీభిః = గృహములుగా కల్గి, నివసించునట్టి, కిన్నరీభిః = కిన్నరస్త్రీలచే, గీయంతే = గానముచేయబడుచున్నవో, సః

= అట్టి, దైతేయవైరీ = శ్రీసుదర్శనము, వః = మీకు, సకలభువన = సమస్త లోకములచే, శ్లాఘనీయామ్ = పొగడతగిన, శ్రియమ్ = సంపదను, దేయాత్ = ఇచ్చునుగాక !

**కాశీదహనవృత్తాంతము :–** తనను వాసుదేవునిగా చెప్పుకొనుచు అహంకరించుచున్న పౌండ్రకుని శ్రీకృష్ణుడు వధింపగా, అతని స్నేహితుడగు కాశీరాజు ఆసంగతిని విని భగవానుని, యాదవుల నందఱను, ద్వారకను నశింప చేయుటకు సంకల్పించి, పిశాచమును సృష్టించి, ప్రయోగించెను. అది ద్వారకకు వచ్చి అచటి జనులను బాధింపదొడగెను. ఈ సంగతిని వినిన శ్రీకృష్ణుడు దానిపై సుదర్శనమును ప్రయోగించెను. ఆ దివ్యాయుధము ఆ పిశాచమును తఱుముచు కాశీనగరము వరకు పోయి, దానిని , దానితో పాటు సహాయముగా వచ్చిన వారిని , ఆకాశీ పట్టణమును దహించి తిరిగి శ్రీకృష్ణుని వద్దకు చేరెను.

**చైద్యక్షపణకథ :–** చేదిదేశాధిపతియగు శిశుపాలుని శిరస్సును త్రుంచిన కథ ఇది. ఇంద్ర ప్రస్థనగరములో జరిగిన రాజ సూయయాగమునందు ధర్మరాజుచే శ్రీకృష్ణునకు అగ్రపూజ సమర్పించబడుటను చూచిన శిశుపాలుడు అంతులేని భగవద్దూషణములను పలుకగా, భగవానుడు సుదర్శనముతో అతని తలను ఖండించెను.

**ధరణి జధ్వంసము :–** ఇది నరకాసుర వధ. భగవానుడు వరాహావతారమును పరిగ్రహించి, భూమిని కోఱయొక్క అగ్రభాగముతో గుచ్చి, సముద్రమునుండి పైకెత్తినపుడు స్వామియొక్క స్పర్శచే భూదేవికి కుమారునిగా జన్మించినవాడగుటచే నరకుడు ధరణిజుడయ్యెను. అసమయమున జన్మను పొందిన వాడగుటచే అసురస్వభావమును కల్గినవాడయ్యెను. ఇతడు ప్రాగ్జ్యోతిషమను పట్టణమును నివాసముగాగొని, ప్రాణులందఱిని హింసించుచు, దేవ - సిద్ధ -గంధర్వాదుల కన్యలను , రాచకన్నెలను బలాత్కారముగా అపహరించి, వారిని వివాహమాడగోరి తన ప్రాసాదములో బంధించియుంచెను. వరుణుని ఛ్ఛత్రమును, మందరగిరిశిఖరమైన రత్నపర్వతమును, దేవమాతయగు అదితియొక్క కుండలములను అపహరించుటయేగాక , ఇంద్రుని ఐరావతమును కొనిపోవుటకొఱకు సమయమునకై వేచి యుండెను. అందుచే భయపడి తన వద్దకువచ్చి మొఱపెట్టిన ఇంద్రుని ప్రార్థనపై స్వామి గరుడుని సత్యభామతో కలసి అధిరోహించి, నరకుని పురిని చేరి సుదర్శనముతో అతనిని సంహరించెను.

సూర్యాపిధాన వృత్తాంతము 18వశ్లోకవ్యాఖ్యలో వివరముగా తెలుపబడినది. మొసలిని ఖండించిన వృత్తాంతము సుప్రసిద్ధము. మాలిత్రుటనకథ 86వ శ్లోక వ్యాఖ్యలో వివరింపబడినది. **''శ్రీమాలికనవనోడు తోళ్ళి మైకొళ్లవుమ్వల్లాయ్ శామాఱవనై నీయెణ్ణి చ్చక్కరత్తాల్ తలైకొణ్డాయ్''** అని పెరియాళ్వార్లు సాయించిన మాలికవధ వృత్తాంతమును మాలి త్రుటన



కథగా గొనువారును కలరు. మేరుగుహానివాసినులగు కిన్నరస్త్రీలు శ్రీసుదర్శనుని విజయగాథలను తమ తమ కిన్నరులతో కలసి హర్షప్రకర్షముతో పాడుచున్నారని తాత్పర్యము.

**''దైతేయవైరీ వః సకలభువనశ్లాఘనీయాం శ్రియం దేయాత్''**

## శ్రీసుదర్శనుడు మీ అజ్ఞానాన్ని ఖండించాలి.

**90.** నానావర్ణాన్ వివృణ్వన్ విరచితభువనానుగ్రహాన్ విగ్రహాన్ యః
చక్రేష్వష్టాసు మృష్టాసురవరతరుణీకంఠకస్తూరికేషు ।
ఆతారా ద్వర్ణమాలావధిషు వసతి యః పూరుషో వః స దేయాత్
వ్యధ్వై రుద్ఘాతసత్త్వై రుపహిత మబహిర్ధ్వాంత మధ్వాంతవర్తీ ॥

యః పురుషః = ఏ సుదర్శనపురుషుడు, మృష్ట = తుడువబడిన, అసురవరతరుణీ = అసుర శ్రేష్ఠుల కాంతల, కంఠకస్తూరికేషు = కంఠములలో (అలదిన) కస్తూరిని కల్గినవగు (అసుర స్త్రీల కంఠములందు పూయబడిన కస్తూరిని తుడచిన అని భావము), ఆతారాత్ = ప్రణవచక్రము మొదలు, అర్ణమాలావధిషు = అక్షరపంక్తి వరకు గల, అష్టాసు చక్రేషు = ఎనిమిది చక్రములలో నానావర్ణాన్ = పలువర్ణములను కల్గినవి, విరచితభువన+ అనుగ్రహాన్ = లోకములను అనుగ్రహించునవి అగు, విగ్రహాన్ = రూపములను, వివృణ్వన్ (నన్) = ప్రకాశింపచేయుచు, వసతి = వేంచేసియున్నాడో, అధ్వాంతవర్తీ = సాత్త్వికులమనస్సులయందు నివసించునట్టి , సః = ఆ సుదర్శనపురుషుడు, వః = మీకు, ఉద్ఘాతసత్త్వైః = సత్త్వగుణశూన్యమైన, వ్యధ్వైః చెడుమార్గములచే, ఉపహితమ్ = ఏర్పడతగిన, అబహిర్ధ్వాంతమ్ = ఆంతర తమస్సును, దేయాత్ = ఖండించును గాక (పోగొట్టునుగాక)

అహిర్బుధ్న్యసంహితలో ఎనిమిది చక్రములలో సుదర్శన పురుషుడు వేంచేసియున్న క్రమము, ఆఱు చక్రములలో వేంచేసియున్న సన్నివేశము వర్ణింపబడినది. వానిని అచటనే వివరముగా చూడనగును. సంస్కృత వ్యాఖ్యలో ఆవివరములు ఉట్టంకిపబడినవి. ఉపదేశ గమ్యములైన రహస్యార్థములను స్వచ్ఛందముగా ఆవిష్కరించరాదు కావున, మన్నింపుడని సహృదయులకు అంజలిని ఘటించుచున్నాను.

**(ఆతారా ద్వర్ణమాలావధిషు అష్టాసు చక్రేషు)** - ప్రథమచక్రము ప్రణవచక్రమని, చివరిదని అష్టమ చక్రము మాతృకా చక్రమనియు సంహితలో తెలుపబడినవి. అనగా మొదటిచక్రములో ప్రణవమంత్రము, చివరిచక్రములో వర్ణమాలా మంత్రము నిబద్ధములు.

లేక, ప్రతిచక్రములోపల తారావేష్టితముగా, బయట మాతృకావేష్టితముగా నుండునని సంస్కృతవ్యాఖ్య. అర్ణమాల అనగా అక్షరమాతృక. ఈ అష్టచక్రములు అసురులను వధించి, వారి పత్నులను విధవలుగా చేయుట వ్యక్తమగునట్లు - **''మృష్టాసురవరతరుణీ''** ఇత్యాది విశేషణము ప్రయోగింపబడినది. కంఠమునందు కస్తూరిని పూసికొనుట సౌమంగల్య సూచకము. ఈ అష్టచక్రములలోను లోకానుగ్రహార్థము నీలపీతాదియుక్తములగు రూపములను పరిగ్రహించియుండి శ్రీ సుదర్శన పురుషుడు వెలుగొందుచుండును. బ్రహ్మ, విష్ణు, నారాయణ, వాసుదేవ, అసిత, నారసింహ, సుదర్శన, మాతృకలని ఈ ఎనిమిది చక్రముల పేర్లు.

**''అధ్వాంతవర్తీ'' – ''న విద్యతే ధ్వాంతం (తమః) యేషాం తే అధ్వాంతాః – నిస్తమస్కాః – సాత్త్వికాః, తేషు వర్తతే''** అను వివరణ మిచట చెప్పనగును.. సాత్త్వికుల మనస్సులలో నివసించువాడని తాత్పర్యము. లేక, **''అధ్వనః మార్గస్య అంతే వర్తతే''** - అని వివరించిన వాక్ మానస మార్గమునకు అందని వాడనియు అర్థము వచ్చును. ఇట్టి సుదర్శన పురుషుడు -

**''ఉద్ధూత సత్త్వైః వధ్వైః సః ఉపహిత మ బహిర్ధ్వాంతం దేయాత్''** - రజస్తమః ప్రచురములైన దుర్మార్గములచే మీకు కలుగునట్టి ఆంతర తమస్సును పోగొట్టును గాక ! అనిభావము. ఇచటి **''దేయాత్''** అను క్రియ దివాదులలోని **''దో– అవఖండనే''** అను ధాతువునుండి పుట్టిన లిఙ్ రూపము ''వధ్యాత్'' అనిసంస్కృతవ్యాఖ్యాన పాఠము. **''వ్యధ్వో దురధ్వో విపథః కదధ్వా కాపథ స్సమాః''** అను అమరమును బట్టి వ్యధ్వమనగా చెడ్డమార్గము **''విరుద్ధః అధ్వా వ్యధ్వా''** అని వివరణము. **''ఉద్ధూత సత్త్వైః'', ''ఉద్ధూతం (నిరస్తం) సత్త్వం యేషు తైః''** అని ఇచటి వివరణము. సత్త్వగుణ కార్యలేశము అయినను లేని చెడ్డ మార్గములలో ప్రవేశించి, మీరు పొందిన అజ్ఞానమును సుదర్శనము పోగొట్టునుగాక ! అని తాత్పర్యము. **''ఉద్ధూతసత్త్వైః– ఉద్ధూతాని ప్రకంపితాని, ప్రాపితనరకానీతి యావత్. సత్త్వాని జంతుసమూహాః యై స్తైః''** అని, **''అథవా ఉద్ధూతసత్త్వైః వినాశితసత్త్వగుణైః''** అనియు సంస్కృతవ్యాఖ్య.

**''సః పురుషః వః అబహిర్ధ్వాంతం దేయాత్''**

---

## శ్రీసుదర్శనపురుషుడు మిమ్ములను రక్షించాలి.

**91.** ద్వాత్రింశత్షోడశాష్టప్రభృతిపృథుభుజస్ఫూర్తిభి ర్మూర్తిభేదైః
కాలాద్యే చక్రషట్కే ప్రకటితవిభవః పంచకృత్యానురూపమ్ ।



**అర్థానా మర్థితానా మహరహ రఖిలం నిర్విలంబై ర్విలంభైః**
**కుర్వాణో భక్తవర్గం కుశలిన మవతా దాయుధగ్రామణీ ర్వః ॥**

కాల+ ఆద్యే = కాలచక్రము మొదలగు, చక్రషట్కే, = ఆఱు చక్రములలో, పంచకృత్య + అనురూపమ్ = ఉత్పత్తి, స్థితి, సంహార , నిగ్రహానుగ్రహములను అయిదు వ్యాపారములకు తగినట్లు, ద్వాత్రింశత్ = ముప్పదిరెండు, షోడశ = పదునాఱు, అష్ట = ఎనిమిది, ప్రభృతి = మొదలగు, పృథు = పెద్ద, భుజస్ఫూర్తిభిః = భుజముల ప్రకాశమును కల, మూర్తిభేదైః = విగ్రహవిశేషములతో, ప్రకటితవిభవః = ప్రకాశింప చేయబడిన తన వైభవమును కలవాడు, అఖిలమ్ = సమస్తమైన, భక్తవర్గమ్ = భక్త సమూహమును , ఆర్థితానామ్ = (వారు వారు) కోరిన, ఆర్థానామ్ = విషయములయొక్క , నిర్విలంబైః = వేగముగానైన, విలంబైః = వితరణలచే, అహః + అహః = ప్రతిదినము, కుశలినమ్ = క్షేమమును కల్గినదిగా, కుర్వాణః = చేయువాడును అగు, ఆయుధగ్రామణీః = ఆయుధ ప్రధానుడగు సుదర్శనపురుషుడు, వః = మిమ్ములను, అవతాత్ = రక్షించుగాక !

అహిర్బుధ్న్యసంహితలో **''తత శ్చక్రమయం సర్వం జగత్ స్థావర జంగమమ్, చక్రాత్మాన మనాద్యంతం కాలం ప్రథమతః శ్రుణు, త్రినాభియుక్తం షణ్ణేమి పంచారం చక్ర మవ్యయమ్, సంవత్సరమయం యత్తత్ (1) కాలచక్ర మితి స్మృతమ్, తద్వశే వర్తతే నిత్యం చేతనాచేతనాత్మ కమ్, పరివర్తయతే దేవం తదేతత్ చక్రరూపధృత్, అరం తత్ (2) పురుషం చక్రం పురుషో యేన ధార్యతే, (3) చక్రం త్రింశదరం ప్రోక్తం శక్తి స్సా యేన ధార్యతే, (4) చక్ర మేకాదశారం తు బుద్ధి స్సా యేన ధార్యతే, అష్టారం (5) తన్మహచ్చక్ర మహంకారస్య ధారకమ్, అవ్యక్తాదివిశేషాంతై స్వరూపై రపరై ర్వృతమ్, చతుర్వింశతిసంఖ్యాతైః పురుషాత్మకనేమి యత్, (6) జగచ్చక్ర మితి ఖ్యాతం తచ్చ ప్రేరయతే స్వయమ్''** అనుచు కాలచక్రాది జగచ్చక్రాంతముగా ఆఱు చక్రములు తెలుపబడుటను చూడనగును.

వేరొక విధమైన చక్రషట్క విద్యయు కలదు. **''షడరం కాలచక్రం తత్ స కాలో యేన ధార్యతే, ఏకారం నైయతం చక్రం ద్వ్యరం తద్వాయుధారకమ్, త్ర్యరం తైజసమాఖ్యాత మాప్యం చతురరం మునే, పంచారం పార్థివం చక్రం పృథివీ యేన ధార్యతే'',** అను రీతిలో షడరము కాల చక్రము, పంచారము పృథివీచక్రము, చతురరము అప్చక్రము, త్ర్యరము తేజశ్చక్రము, ద్వ్యరము వాయుచక్రము, ఏకారము ఆకాశచక్రము.

ఇట్లు ఆఱు చక్రములలో ఉత్పత్తి, స్థితి, సంహార నిగ్రహ, అనుగ్రహములను అయిదు కార్యములను తగిన విధముగా ముప్పదిరెండు, భుజములతో, పదునాఱు భుజములతో, ఎనిమిది

భుజములతో, నాల్గుభుజములతో, రెండు భుజములతో కూడిన రూపములను పరిగ్రహించి సుదర్శన పురుషుడు వేంచేసి యుండును. ఇట్లు పలు భుజములను కల్గియుండుట భక్తజనులకు వారు కోరిన విషయములను ధారాళముగా అనుగ్రహించుట కొఱకు అనుట ఉత్తరార్ధములోని అంశము. **''నిర్విలంబైః''** అనునపుడు విలంబశబ్దార్థము కాలవిలంబము. తరువాతి విలంబశబ్దమునకుప్రదానమని అర్థము. **''విలంబైః ప్రదానైః, లంబ- ఆశ్రంసనే ఇత్యేతస్య ధాతోః విపూర్వకత్వేన ఔచిత్యాత్ ప్రధానార్థతా''** అని సంస్కృతవ్యాఖ్యాన వివరణము. కాని ఈధాతువుపాణిని ధాతుపాఠములో కనిపించుటలేదు. బహుశః అనుప్రాసార్థము విలంబశబ్దము ఇచట విలంబముగా ప్రయోగింప బడినదేమో ! **''విలంభస్త్వతివర్జనమ్''** అని కదా అమరము అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి సూక్తి. **''అనేన సకలజగదుత్పత్తి స్థితి సంహారానిష్టనిరసనేష్ట-ప్రాపణసామర్థ్యం ప్రతిపాద్యతే''** అనుచూ సంస్కృతవ్యాఖ్యాత ఈ సుదర్శనుడు సకల జగముల సృష్టిస్థితి లయములను ఇష్టప్రాపణ అనిష్టనివర్తనములను కలుగజేయునని తెలుపబడినదని పల్కెను. సుదర్శనుని పంచకృత్యలక్షణము అహిర్బుధ్న్యసంహితలో ఇట్లు తెలుపబడినది. **''అరాణి పంచకృత్యాని శక్తిః తస్యాః ప్రకల్పయేత్, తిరోభావం సృజంచైవ స్థితి సంహృత్యనుగ్రహాత్- ఇతి కాలచక్రషట్కమిదంవాభవతు''.**

సంస్కృతవ్యాఖ్యలో చక్రషట్క వివరణశ్లోకములు ఇట్లు ఉట్టంకింపబడినవి. **''తతః చక్రమయం సర్వం జగత్స్థావరజంగమమ్, చక్రాత్మాన మనాద్యంతం కాలం ప్రథమతః శృణు, త్రిణాభియుక్తం షణ్ణేని పంచారం చక్రమవ్యయమ్, సంవత్సరమయం యత్తత్కాలచక్ర మితి స్మృతమ్, తద్వశే వర్తతే విశ్వం చేతనాచేతన్మాకమ్, పరివర్తయతే విశ్వం తదేత తచ్చరూపధృత్, త్రియరం పౌరుషం చక్రం పురుషో యేన ధార్యతే, చక్రం త్రింశదరం ప్రోక్తం శక్తి స్సా యేన ధార్యతే, చక్ర మేకాదశారం తు బుద్ధి స్సా యేన ధార్యతే, అష్టారం తన్మహాచక్రమ్ అహంకారస్య ధారకమ్ అవ్యక్తాదివిశేషాంతతత్త్వరూపైః రరైః ర్వృతమ్, చతుర్వింశతి సంఖ్యాతైః పురుషాత్మకనేమి యత్, జగచ్చక్ర మితి ఖ్యాతం తచ్చ ప్రేరయతే స్వయమ్ ఏతత్ స్వరూపకాలాది చక్రషట్కే ప్రకీర్తితమ్''.**

''ఆయుధగ్రామణీః వః అవతాత్''

---

**శ్రీసుదర్శన యంత్రపురుషుడు మీకు తన సాక్షాత్కారాన్ని కలిగించాలి.**

**92.** కోణై ర్ణై స్సరోజై రపి కపిశగుణైః షడ్భి రుద్భిన్నశోభే
శ్రీవాణీపూర్వికాభిః దధతి విలసతః శక్తిభిః కేశవాదీన్ ।



**తారాంతే భూపురాదౌ రథచరణగదాశార్ఙ్గఖడ్గాంకితాశే**
**యంత్రే తంత్రోదితే వః స్ఫురతు కృతపదం లక్ష్మ లక్ష్మీసఖస్య ॥**

కపిశగుణైః = పిశంగవర్ణమునుకల, షడ్భిః కోణైః = ఆఱుకోణములతో, షడ్భిః అర్ణైః = షడక్షరములతో, షడ్భిః సరోజైః అపి = ఆఱు పద్మములతో, ఉద్భిన్నశోభే = అభివ్యక్తమైన సౌందర్యమును కల్గినది, శ్రీవాణీపూర్వికాభిః = శ్రీ, వాణి మొదలగు, శక్తిభిః = శక్తులతో, విలసతః = వెల్గు, కేశవాదీన్ = కేశవాది ద్వాదశమూర్తులను, దధతి = ధరించుచున్నది, భూపుర+ ఆదౌ = భూబింబమును ఆదిగా కల్గినది, తార+ అంతే = ప్రణవమును ఎల్లగా కల్గినది, రథచరణ = చక్రము, గదా = గద, శార్ఙ్గ = శార్ఙ్గమను ధనుస్సు, ఖడ్గ = ఖడ్గము, అనువీనిచే, అంకిత = గుర్తులుగా కల్గినవిగా చేయబడిన, ఆశే = తూర్పుమొదలగు దిక్కులను కల్గినది, తంత్ర+ ఉదితే = అహిర్బుధ్న్యసంహితాదులలో తెలుపబడినది అగు, యంత్రే = శ్రీసుదర్శన యంత్రమునందు, కృతపదమ్ = వేంచేసియున్నవాడు, లక్ష్మీసఖస్య = శ్రియఃపతియొక్క, లక్ష్మ = అసాధారణచిహ్నమైన సుదర్శనము, వః = మీకు, స్ఫురతు = ప్రకాశించునుగాక !

కవి ఇందు సుదర్శనయంత్ర సన్నివేశప్రకారమును అహిర్బుధ్న్యసంహితాదులలో తెలుపబడిన విధమున వర్ణించుచున్నారు. ఆ విషయ మిచట దిఙ్మాత్రముగా తెలుపబడుచున్నది. పరమగుహ్యము, ఉపదేశగమ్యమును అగు విషయము కావున ఆచార్య ముఖమున దానిని అభ్యసించుట మేలు. ఈ యంత్రవర్ణన ''గాయత్ర్యర్ణార చక్రే'' అను శ్లోకము వరకు చేయబడినది.

**(షడ్భిః కోణైః అర్ణైః సరోజై రపి)** - షట్కోణములు, షడరములు, షట్పద్మములును కూడిన యంత్రము శ్రీసుదర్శనయంత్రము. **''సహస్రార హుం ఫట్''** అనునది శ్రీసుదర్శన షడక్షరి.

**(కపిశగుణైః)** - యంత్రముమధ్యలో వేంచేసియున్న సుదర్శనపురుషుడు రక్తవర్ణుడగుటచే, రక్తాంబరుడగుటచే, రక్తకేశుడగుటచే, రక్తలోచనుడగుటచే కోణ- అర్ణ, సరోజములన్నియు కపిశవర్ణమును కల్గియుండును.

**(శ్రీవాణీపూర్వికాభిః . . . .)** - కేశవాది- దామోదరాంత ద్వాదశమూర్తులను ముగ్గురు ముగ్గురుగా నాల్గు విభాగములు చేసి, వాసుదేవ వ్యష్టిభూతులగు కేశవ-నారాయణ, మాధవులకు శ్రీవ్యష్టిభూతలగు శ్రీశక్తులు మూడు, సంకర్షణ వ్యష్టి భూతులగు గోవింద, విష్ణు, మధుసూదనులకు వాణీ శక్తులు మూడు, ప్రద్యుమ్న వ్యష్టి భూతులగు త్రివిక్రమ, వామన, శ్రీధరులకు వాక్ శక్తులు మూడు. అనిరుద్ధ వ్యష్టిభూతులగు హృషీకేశ, పద్మనాభ, దామోదరులకు మృడానీ శక్తులు మూడు - ఇట్టి శక్తులతో కూడియున్న కేశవాది త్రికచతుష్టయమును యంత్రము ధరించియుండును. **''వికసతః''** అను పాఠాంతరము

సంస్కృతవ్యాఖ్యలో కలదు.

**(తారాంతే భూపురాదౌ)** - శ్రీసుదర్శనయంత్ర సాధకులు మొదట భూబింబమును ధ్యానించి, క్రమముగా చివరలో సుదర్శనగర్భప్రణవముతో సిద్ధిని పొందుదురనియు, అది తెలియునట్లు **''తారాంతే భూపురాదౌ''** అని ఇచట చెప్పబడినదని పెద్దలందురు. యంత్ర విన్యాసక్రమములో భూపురమును ముందుగా నివేశనము చేసి, చివరలో ప్రణవమును నివేశించు క్రమమును వేరొకటి కలదు కావున దానిని ఇచట కవి తెలుపుచున్నారనియు మరికొందరు చెప్పుదురు.

**(రథచరణగదా . . . )** - యంత్రములో తూర్పుమొదలగు నాల్గుదిక్కులలో క్రమముగా చక్రము, గద, శార్ఙ్గము, ఖడ్గము అను నాల్గు ఆయుధములను విన్యాసముచేయవలెను. ఈ క్రమములో అహిర్బుధ్న్య సంహితాదులలో తెలుపబడిన యంత్రమునందు వేంచేసియుండు శ్రీసుదర్శనపురుషుడు శ్రియఃపతికి పర్యాయభూతుడు అనుటను **''లక్ష్మీసఖస్య లక్ష్మ''** అను ప్రయోగము తెలుపుచున్నది.

**''లక్ష్మీసఖస్య లక్ష్మ వః స్ఫురతు''**

## శ్రీసుదర్శనుడు మీ అనారోగ్యాన్ని తీర్చాలి.

**93.** దంష్ట్రాకాంత్యా కడారే కపటకిటితనోః కైటభారే రధస్తాత్
ఊర్ధ్వం హాసేన విద్ధే నరహరివపుషో మండలే వాసవీయే ।
ప్రాక్ప్రత్యక్ సాంధ్యసాంద్రచ్ఛవిభరభరితే వ్యోమ్ని విద్యోతమానః
దైతేయోత్పాతశంసీ రవి రివ రహయ త్వస్త్రరాజో రుజం వః ॥

అధస్తాత్ = క్రిందిభాగమగు భూప్రదేశములో, కపట కిటితనోః = కపట వరాహమూర్తియైన, కైటభారేః = భగవానునియొక్క, దంష్ట్రాకాంత్యా = దంత కాంతిచే, ఊర్ధ్వమ్ = పైభాగమున, నరహరివపుషః = నృసింహమూర్తి రూపముయొక్క (భగవానుని యొక్క), హాసేన = చిఱునవ్వుచే, విద్ధే = సంబంధింపబడినది, (కావుననే), కడారే = కపిలవర్ణమైన, వాసవీయే మండలే = మాహేంద్ర మండలమునందు, ప్రాక్ప్రత్యక్ సాంధ్య = ప్రాక్సంధ్యయొక్క, ప్రత్యక్ సంధ్యయొక్క, సాంద్ర = నిబిడమైన, చ్ఛవి = కాంతియొక్క, భర = సమూహముచే, భరితే = నిండిన, వ్యోమ్ని = ఆకాశమునందు, దైతేయ+ ఉత్పాతశంసీ = అసురుల వినాశనమును సూచించు, రవిః ఇవ = సూర్యుని వలె, విద్యోతమానః = వెల్గుచున్నదైన, అస్త్రరాజః = చక్రరాజము, వః = మీయొక్క, రుజమ్ = రోగమును, రహయతు = పోగొట్టునుగాక !



అహిర్బుధ్న్యసంహితలో మాహేంద్రమండలమును ఒక యంత్రసన్నివేశము తెలుపబడినది. దానిని కవి ఇందు ప్రస్తుతించుచున్నారు.

**''వరాహరూపిణం దేవం శంఖచక్రధరం వరమ్, భూమౌ చ సహితం భూమ్యా సంస్మరేత్ పురుషోత్తమమ్, అంబరే నరసింహం తు చింతయే దమితౌజసమ్''** అనుచు క్రింది భాగములో శ్రీవరాహమూర్తిని, ఊర్ధ్వభాగమున నరసింహమూర్తిని ధ్యానింపవలెనని విధించబడుటను దృష్టిలో నుంచుకొని ప్రస్తుతశ్లోకము రచింపబడినది. క్రిందగల శ్రీవరాహమూర్తియొక్క దంతకాంతి, పైన వేంచేసియున్న శ్రీనరసింహస్వామియొక్క చిఱునవ్వు శోభయు కలసి కడారవర్ణమై పరిణమించిన స్థితిని దర్శింపగా దైత్యుల వినాశసూచనార్థముగా ఆకాశమునందు కన్పించిన ఉత్పాతసూర్యునిస్థితి స్మరణకు వచ్చునట్లున్నది. వరాహదంష్ట్రాకాంతియు, నరసింహ హాసకాంతియు స్వభావముగనే తెల్లనివైనను ఉపాధివశముచే ఎఱ్ఱనివని గ్రహింపనగును. వరాహమూర్తి హిరాణ్యాక్షుని వధించినపుడు అతని రక్తప్రవాహము పెల్లుబకగా దాని కాంతి దంష్ట్రలో సోకి అదియు ఎఱ్ఱగా అయినది. అట్లే, హిరణ్యకశిపుని శరీరమునుండి స్రవించిన రక్తముయొక్క ఎఱ్ఱని కాంతివలన శ్రీనారసింహుని హాసమును ఎఱ్ఱగా అయినది. ఇవి రెండు వరుసగా ప్రాక్సంధ్యాకాంతిస్థానమున, ప్రత్యక్ (పడమర) సంధ్యాకాంతిస్థానమున గ్రహింపనగును. సంధ్యల వర్ణము ఎఱుపు అగుటచే ఇట్లు ఔపాధికవర్ణవ్యత్యయమును గ్రహింపవలసియున్నది. లేక, **''ఉత్పాతశంసీ రవిః''** అనుటచే ఉత్పాతకాలములోని సంధ్యలవర్ణము తెల్లగానే యుండియుండవలెనని, సూర్యుని కాంతిమాత్రము ఎఱ్ఱగానే ఉండియుండవలెననియు తలచి, ఉన్నదున్నట్లుగనే నిర్వహింపవచ్చుననియు వివరించువారు కలరు. వాలి సుగ్రీవుల భేదమును గ్రహించుటకై శ్రీరాముడు సుగ్రీవుని కంఠమున మాలను అలంకరించిన పిదప అప్పటి స్థితిని వాల్మీకి వర్ణించుచు, **''స తయా శుశుభే శ్రీమాన్ లతయా కంఠసక్తయా, విపరీత ఇవాకాశే సూర్యో నక్షత్రమాలయా''** అని పల్కిరి. ఈరామాయణసూక్తికి పలు విధములైన వివరణలను వ్యాఖ్యాతలు చేసిరి. **''ఉత్పాతకాలే హి మధ్యాహ్నే నక్షత్రాణి దృశ్యంతే ఇత్యుచ్యతే జ్యోతిశ్శాస్త్రే. రాత్రౌ ఇంద్రధనుర్దర్శే దివా నక్షత్రదర్శనే, తత్ రాష్ట్రనాథనాశ స్స్యాత్ ఇతి గర్గస్యభాషితమ్''** అని సంస్కృతవ్యాఖ్యానము. విపరీత కాలమునందు జరుగరానివి జరుగుననుట ఒక వివరణము అగుటచే ప్రాక్- ప్రత్యక్ సంధ్యలు ఒకే కాలమున సంభవించుటయు, సూర్యుడు ఎఱ్ఱగా అగుటయు, సంధ్యలు తెల్లగా నుండుటయు- ఇవి అన్నియు సంభావ్యములేనని చెప్పనగును. అహిర్బుధ్న్యసంహితలలో తెలుపబడిన సుదర్శనయంత్రవిన్యాసక్రమములో నున్న **''వరాహరూపిణం దేవం శంఖచక్రధరం వరమ్, భూమౌ తు సహితం భూమ్యా సంస్మరేత్ పురుషోత్తమమ్, అంబరే నారసింహం తు చింతయే దమితౌజసమ్, భీషణం ఘటితానేక**

**భూషణంధారితాసురమ్''** ఇత్యాది శ్లోకములు ఇచట ప్రమాణీకరణీయములు. అహిర్బుధ్న్యసంహితలోని సుదర్శనచక్ర యంత్రోద్ధారమునకు సంబంధించిన వివరణ శ్లోకములు సంస్కృతవ్యాఖ్యలో చూపబడినవి. విస్తృతిభయముచే వానిని ఇచట ఉట్టంకించుటలేదు.

''అస్త్రరాజః వః రుజం రహయతు''

---

## శ్రీసుదర్శనుడు శత్రువిజయాన్ని మీకు కల్గించాలి.

**94.** **కోణే క్వాపి స్థితోఽపి త్రిభువనవితత శ్చంద్రధామాఽపి రూక్షః**
**రుక్మచ్ఛాయోఽపి కృష్ణాకృతి రనలమయోఽప్యాశ్రితత్రాణకారీ ।**
**ధారాసారోఽపి దీప్తో దినకరుచిరోఽప్యుల్లసత్తారకశ్రీః**
**చక్రేశ శ్చిత్రభూమా వితరతు విమతత్రాసనం శాసనం వః ॥**

క్వాపి కోణే = యంత్రైకదేశమునందు, స్థితః + అపి = వేంచేసియున్నను, త్రిభువనవితతః = త్రిలోకముందు వ్యాపించియున్నవాడు, చంద్రధామా అపి = ఆహ్లాదకరమైన కాంతిని కలవాడైనను, (చంద్రుని వాసస్థానముగా కలవాడైనను), రూక్షః = తీక్ష్ణమైన వ్యాపారమును కలవాడు (శత్రుభీషణుడు), రుక్మచ్ఛాయః+ అపి = స్వర్ణమువంటి కాంతినికలవాడైనను, కృష్ణ+ ఆకృతిః = నీలవర్ణుడు (భగవానుని ఆకారభూతుడు), అనలమయః + అపి = అగ్నిమయుడగుటచే ఆశ్రయములను అశనముగా గ్రహింపవలసియున్నను (అగ్నిరూపుడైనను), ఆశ్రితత్రాణకారీ = ఆశ్రితుల రక్షణమును చేయువాడు, ధారాసారః + అపి = వర్షధారలు ప్రవహించువాడు అయినను, (సేనాముఖమున బలిష్ఠుడు, అంచులలో పదును కలవాడు), దీప్తః = జ్వలించువాడు (జాజ్వల్యమానముగా ప్రకాశించువాడు), దినకరరుచిరః + అపి = సూర్యప్రకాశుడైనను, ఉల్లసత్తారకశ్రీః = వెలుగునట్టి నక్షత్రశోభను కలవాడు, (ప్రకాశించు ప్రణవకాంతిని కలవాడు) (కావుననే), చిత్రభూమా = విరుద్ధ ధర్మాశ్రయత్వరూపమైన, ఆశ్చర్యకరమైన మహిమను కల, చక్ర+ ఈశః = శ్రీసుదర్శనుడు, వః = మీకు, విమత త్రాసనమ్ = శత్రువులకు భయంకరమైన, శాసనమ్ = ఆజ్ఞను, వితరతు = ఇచ్చునుగాక !

పూర్వము 18వ శ్లోకమును **''భ్రామ్యంతీ సంశ్రితానామ్''** అనుచు విరోధాలంకార ప్రక్రియలో రచించినట్లే, ఈ శ్లోకమునుకూడ కవి ఆపాతప్రతీతిలో విరోధము తోచువిధమున, అర్థాంతరముతో ఆ విరోధము తీరు విధమున రచించిన వైఖరి అత్యద్భుతము.



**(కోణే క్వాఽపి స్థితోఽపి . . . . )** - ఒక మూలలో మాత్రము నున్నవాడు లోకమంతయు వ్యాపించెను అనుట ఇచటి విరోధము. **''అణో రణీయాన్ మహతో మహీయాన్''** అను న్యాయమున ఆశ్రితాను గ్రహార్థము చిన్నరూపమును పరిగ్రహించి యంత్రమున సుదర్శన పురుషుడు ఉండును. స్వరూపేణ సర్వత్ర వ్యాపించి యున్నవాడనుటచే పై విరోధము తీరినది. **''చరణం పవిత్రం వితతం పురాణమ్''** ఇత్యాది శ్రుతి వాక్యములు స్మరణీయములు. సుదర్శనాష్టకములోని **''షడరచక్రప్రతిష్ఠిత, సకలతత్త్వప్రతిష్ఠిత''** అను ప్రయోగమిట్టిదే.

**(చంద్రధామా అపి రూక్షః)** – **''చది-ఆహ్లాదనే''** అనుధాతువునుండి పుట్టిన చంద్రశబ్దము, ఆహ్లాదకరమను అర్థ మిచ్చును. **''చందతి ఆహ్లాదయతి ఇతి చంద్రమ్, ధామ యస్య సః''** అను వివరణమువలన చంద్రుని వాసస్థానముగా కలవాడనుట ఏర్పడుటచే ఆ విరోధము పరిహృతము. **''శశధరాధారషట్కోణవర్తీ''** అని, **''చంద్రాధః కారియంత్రే''** అనియు పూర్వము తెలుపబడినది కదా ! చంద్రవర్తిత్వము, శత్రువిషయమున రూక్షత్వమును అవిరుద్ధములు.

**(రుక్మచ్ఛాయోఽపి కృష్ణాకృతిః)** - స్వర్ణసమాన మైన కాంతిని కల్గియుండుట, నల్లగా ఉండుటయు పరస్పర విరుద్ధములు. **''కృష్ణాకృతిః– కృష్ణస్య భగవతః ఆకృతిః పర్యాయః''** అను వివరణమువలన సుదర్శనుడు భగవానునకు మారురూపమను అర్థము ఏర్పడుటచే పై విరోధము తొలగినది. సుదర్శనుడు భగవదభిన్నుడుకదా !

**(అనలమయోఽపి ఆశ్రితత్రాణకారీ)** - తనకు ఆశ్రయమగు కాష్ఠాదులను తిను అగ్నికి ఆశ్రయాశనుడని పేరు. ఆశ్రితభక్షకత్వము, ఆశ్రితరక్షకత్వమును పరస్పరవిరుద్ధములు. **''అసలమయః''** అనుటకు అగ్నివలె జ్వలించువాడను అర్థమును గ్రహించినచో పై విరోధము తీరును.

**(ధారాసారోఽపి దీప్తః)** – **''ధారాయాః ఆసారః''** అనగా జలధారల ప్రవాహము. దానికి దీప్తత్వము విరుద్ధము. **''ధారా సేనాగ్రభాగే''** అను విశ్వకోశవచనమును బట్టి **''ధారాసేనాగ్రిమస్కంధే''** అను మేదిని వచనమును బట్టియు, సేనాముఖమున బలిష్ఠుడను అర్థమును **''ధారాసారః'' (ధారాయాం సారః)** అను ప్రయోగమునకు చెప్పుటచే పై విరోధము తొలగును. **''సారః''** అనగా బలిష్ఠుడు. అంచులలో పదునుగలవాడనియు అర్థము. **''ధారా కోట్యా నిశితః''** అని సంస్కృతవ్యాఖ్య.

**(దినకరరుచిరోఽపి ఉల్లసత్తారకశ్రీ)**- సూర్యుడు వెల్గునపుడు నక్షత్రములు వెల్గుట విరుద్ధము. తారకమనుటకు ప్రణవమను అర్థమును చెప్పిన పై విరోధము తీరును. ప్రకాశించు ప్రణవకాంతిని కలవాడను అర్థమును **''ఉల్లసత్తారకశ్రీః''** అను ప్రయోగమునకు చెప్పవలయును.

''యస్య చ్ఛాయాసమానా లసతి పరిసరే రోహిణీ తారకాగ్య్రా'' అని పూర్వోక్తము కదా !

''చక్రేశః వః విమతత్రాసనం శాసనం వితరతు''

## శ్రీసుదర్శనుడు మీ సోమఱితనాన్ని పోగొట్టాలి.

**95.** శుక్ల శ్శక్ర ! స్తవ స్తే సహ దహన ! కలాం కాల ! తేఽయం న కాలః
కిం వో రక్షాంసి ! రక్షా ! తవ ఫలతు పతే యాదసాం పాదసేవా ।
వాయో ! హృద్యోఽసి భర్తు స్త్యజ ధనద ! మదం సేవ్యతాం త్ర్యంబకేతి
ప్రాహు ర్యద్యంత్రపాలాః స దనుజవిజయీ హంతు తంద్రాలుతాం వః ॥

(హే) శక్ర = దేవేంద్రా !, తే = నీయొక్క, (నీవు చేయు), స్తవః = స్తుతి, శుక్లః = శుద్ధమైయున్నది, (హే) దహన = అగ్నీ !, కలాం సహ = క్షణ కాలము సహింపుము, (హే) కాల = ఓ యముడా !, తే = నీకు, అయమ్ = ఇది, సకాలః = సమయముకాదు, (హే) రక్షాంసి = ఓ రాక్షసులారా !, వః = మీకు, కిం రక్షా = రక్షణ ఏమి ?; (హే) యాదసాం పతే = ఓ వరుణదేవా !, తవ = నీయొక్క (నీవుచేయు), పాదసేవా = శ్రీసుదర్శనపాదపరిచర్య, ఫలతు = ఫలించుగాక !, (హే) వాయో = ఓ వాయుదేవా !, భర్తుః = స్వామికి, హృద్యః అసి = సంతోషకరుడవైయున్నావు, (హే) ధనద = ఓ కుబేరా !, మదం త్యజ = గర్వమును వీడుము, (హే) త్ర్యంబక = ఓ ముక్కంటీ, సేవ్యతామ్ = (నీచే సుదర్శనుడు)సేవింపబడుగాక !, ఇతి = అని, యత్ = ఏ, యంత్ర పాలాః = సుదర్శనయంత్ర పాలకులు, ప్రాహుః = పల్కుదురో, సః = ఆ, దనుజవిజయీ = సుదర్శనుడు, వః = మీయొక్క, తంద్రాలుతామ్ = సోమఱితనమును, హంతు = పోగొట్టునుగాక !

శ్రీసుదర్శనుని సేవింపవచ్చి, వినయముతో నిలచిన అష్టదిక్పాలకులు మొదలగు అనేక దేవబృందములను, రాక్షసులను ఉద్దేశించి సుదర్శనయంత్రపాలకులు పల్కువిధమిచట తెలుపబడుచున్నది. దేవేంద్రుని చూచి ''ఓయీ ! నీవు చేయు స్తుతి శబ్దార్థ పౌష్కల్యముతో, భక్తిప్రకర్షతో నిర్మలమై యున్నది'' అని, అగ్నిని చూచి, ''నీవు కొంతసేపు వేచియున్నచో సుదర్శనుని సేవింపవచ్చును'' అని, యమునితో ''నీకిపుడు అవకాశము లేదు పిమ్మట రమ్ము'' అని, రాక్షసులను చూచి ''మీరు ఇక ఉజ్జీవింప ఉపాయము కలదా ?'' అని, వరుణునితో చూచి ''నీవు చిరకాలముగా సుదర్శనుని పాదములను సేవించుట ఫలప్రదమగును గాక !'' అని, వాయువును చూచి - ''నీవు గొప్ప భక్తుడవు కావున సుదర్శనునకు సంతోషమును కల్గించు వాడవైతివి'' అని, కుబేరునితో - ''నేనేకదా ధనపతిని అను అహంకారమును వీడుము''



అని, శివునితో - ''సుదర్శనుని సేవించి, ఉజ్జీవింపుము'' అనియు ఇట్లు యంత్రపాలకులు పల్కుచున్నారు. అట్టి వైభవమునుకల సుదర్శనుడు మీ సోమరితనమును పోగొట్టునుగాక ! **''కాల ! తే యానకాలః''** అను పాఠాంతరము కలదు.

''సః దనుజవిజయీ వః తంద్రాలుతాం హంతు''

## శ్రీసుదర్శనుడు మీ శోకాన్ని తీర్చాలి.

**96.** గాయత్ర్యర్ణారచక్రే ప్రథమమనుసఖస్మేరపత్రారవిందే
బింబం వహ్నే స్త్రికోణం వహతి జయజయాద్యష్టశక్తౌ నిషణ్ణా ।
శోకం వోఽశోకమూలే పదసవిధలసద్భీమభీమాక్ష భీమా
పుంసో దివ్యాస్త్రధామా పురుషహరిమయీ మూర్తి రస్యత్వపూర్వా ॥

ప్రథమమనుసఖస్మేరపత్రార విందే = ద్వాదశాక్షరీమంత్రవర్ణములసంఖ్యతో సమసంఖ్యనుకల (పన్నెండు) వికసించిన దళములను కల కమలమును కల్గినది. వహ్నేః = అగ్నియొక్క, త్రికోణం బింబమ్ = త్రికోణరూపమైన బింబమును, వహతి = కల్గినది, జయజయాది + అష్ట = జయశీలమునుకల జయమొదలగు ఎనిమిది, శక్తౌ = శక్తులుగుకల్గినది అగు, గాయత్రీ + అర్ణారచక్రే = గాయత్రీ వర్ణసమసంఖ్యయైన (ఇరువదినాల్గు) అరములను కల చక్రములో , అశోకమూలే = అశోకవృక్షము మూలదేశమున, నిషణ్ణా = కూర్చునియున్నది, పదసవిధ = పాదసమీపమునందు, లసత్ = ప్రకాశించుచున్న, భీమ = భయంకరములైన, భీమ + అక్ష = రెండు భీమాక్షులచే, భీమా = భీషణమైనది, అగు, దివ్యాస్త్రధామా = చక్రమును వాసస్థానముగా కల్గియున్న, పుంసః = సుదర్శన పురుషుని, పురుషహరిమయీ = నరసింహమయమైన, అపూర్వా = విలక్షణమైన, మూర్తిః = రూపము, వః = మీయొక్క, శోకమ్ = దుఃఖమును, అస్యతు = పోగొట్టునుగాక !

ప్రస్తుత శ్లోకమున వర్ణింపబడిన అంశము అహిర్బుధ్న్య సంహితలోని 26 వ అధ్యాయములో విస్తరముగా ప్రతిపాదింపబడినది. ఈ శ్లోకమునుండి **''యస్మిన్ విన్యస్య''** అను చివరిశ్లోకమువరకు సుదర్శననారసింహమంత్రప్రభావము తెలుపబడినదని సంస్కృతవ్యాఖ్యానము.

**(గాయత్ర్యర్ణారచక్రే) – ''చతుర్వింశత్యరం చక్రం సునేమి రుచిరాకృతి''** అను అచటి సూక్తి స్మరణీయము. గాయత్రీ మంత్రవర్ణసంఖ్య ఇరువదినాల్గుకదా ! **''గాయత్ర్యాః అర్ణాని చతుర్వింశత్యక్షరాణి, తాన్యేవ అరాణి యస్య తత్''** అని వేరొక వివరణము సంస్కృతవ్యాఖ్యలో

కలదు. కాని అరశబ్దమునకు అక్షరము అను అర్థము కానవచ్చుట లేదు.

**(ప్రథమమనుసఖస్మేరపత్రారవిందే)** - ప్రథమ మనువు అనగా వాసుదేవ ద్వాదశాక్షరి. అందలి అక్షరములు పన్నెండు. ఆసంఖ్యలో దళములను కల పద్మముయొక్క నివేశనము చేయవలెనని అహిర్బుధ్న్యసంహితలో తెలుపబడినది. అచటి **''మధ్యే చక్రం న్యసేత్ పద్మం యుక్తం ద్వాదశభి ర్దలైః''** అను శ్లోకమిచట స్మరణీయము. ప్రథమవ్యూహమగు వాసుదేవుని ప్రతిపాదించుటచే వాసుదేవద్వాదశాక్షరి ప్రథమమనువు అయినది.

**(బింబం వహ్నే స్త్రికోణం వహతి)** – **''చక్రాబ్జ కర్ణికాస్థానే న్యసే దాగ్నేయ మండలమ్''** అను అచటి సూక్తి స్మరింపతగినది.

**(జయజయాద్యష్టశక్తౌ)** – **''చింతయే దథ చక్రస్య సమంతా దష్టయోషితః, ఊర్ధ్వ మాబద్ధకేశాఢ్యాః తచ్ఛక్తీః ప్రాప్తయౌవనాః, సర్వాలంకారసంయుక్తాః ద్విభుజా మాల్యధారిణీః, ప్రాచ్యాం దిశి జయాం దేవీం పీతాం వర్ణాం విచింతయేత్, ఆగ్నేయ్యాం మోహినీం దేవీం శ్యామలా మాయతేక్షణామ్, యామ్యా మనుస్మరేత్ దేవీం విజయాం కృష్ణరూపిణీమ్, రక్తవర్ణాం తథా దేవీం నైఋత్యాం హ్లాదినీం తథా, అజితాం పీతవర్ణాం తు ప్రతీచ్యాం సంస్మరేత్ పరామ్, వాయవ్యాం దిశి మాయాం తు కృష్ణవర్ణాం సనాతనీమ్, ఉదీచ్యాం రక్త వర్ణాంతా మాశాయా మపరాజితామ్, ఐశాన్యాం సంస్మరేత్ సిద్ధిం ధూమ్రవర్ణా మతః పరమ్''** అను అహిర్బుధ్న్యసంహితావచనములు ఇచట స్మార్యములు.

**(అశోకమూలే)** – **''సమాసీన మశోకస్య మూలే కాలానలద్యుతిమ్''** అను సంహితా సూక్తి అనుసంధేయము.

**(పదసవిధలసత్ భీమ భీమాక్షభీమా)** – **'' ఏవం విన్యస్య తత్పాదపర్యంతే విన్యసే దుభౌ, తదాజ్ఞాకారిణౌ భౌమౌ నీలనీరదవిగ్రహౌ, ఉదగ్రకాయౌ భీమాక్షౌ భీమాయుధధరా వరౌ, దంష్ట్రాకరాళవదనౌ విన్యసేత్ వృత్తలోచనౌ''** అను అహిర్బుధ్న్య సంహితా ప్రమాణములను స్మరింపనగును.

**(పురుషహరిమయీ అపూర్వా మూర్తిః)** **''తన్మధ్యే యోగపట్టేన పినద్ధాంగం సనాతనమ్, నారసింహం చతుర్బాహుం చతుశ్చక్రధరం వరమ్''** ఇత్యాదికము అనుసంధేయము. కావున ఇట్టి సన్నివేశముతో నరసింహమూర్తిగా సేవను అనుగ్రహించు శ్రీ సుదర్శనుడు మీకు ఆర్తి పోగొట్టునుగాక! అని తాత్పర్యము.

సంస్కృతవ్యాఖ్యలో సుదర్శననారసింహ యంత్రోద్ధారక్రమము ఇట్లు వివరింపబడినది. **''ఆచార్య ప్రసాదేన కించిదవగతః యంత్రోపరాగమధ్యే గాయత్రీవర్ణసంఖ్యాతత్తదక్షరసంబంధారం రమణీయ నేమివేష్టితం చక్రం విలిఖ్య, చక్రమధ్యే**



**ద్వాదశదళం కమలం విలిఖ్య, ద్వాదశదళేషు ద్వాదశాక్షర – వాసుదేవ మంత్రక్షరాణి నిక్షిప్యతత్కమలకర్ణికాస్థానే త్రికోణమ్ ఆగ్నేయమండలం విలిఖ్య, తత్ప్రాంతే చాశోకశాఖాం సన్నిధాయ, తన్మూలే సమాసీనమ్ పరికలితచతుశ్చక్ర– చతుర్భుజవిరాజితం యోగపట్టపరివేష్టితదివ్యాంగం కాలానలసంకాశం శ్రీనృసింహం ప్రతిష్ఠాప్య, తచ్చరణసమీపే భయంకరవిగ్రహౌ భీమాక్షసంజ్ఞికౌ పురుషౌ విలిఖ్య, చక్రస్య ప్రాగ్భాగే జయాం, చాగ్నేయే మోహినీం, యామ్యే విజయాం చ, నైఋతే హ్లాదినీం చ, పాశ్చాత్యే అజితాం చ, వాయవ్యే మాయాం చ, ఉదగ్భాగే అపరాజితాం, ఈశాన్యే నిధిం చ సంస్మృత్య సాధకః సంపూర్ణకామో భవేత్''** ఈక్రమమునకు సంబంధించిన అహిర్బుధ్న్య సంహితావచనములు సంస్కృతవ్యాఖ్యానములో ఉదాహరింపబడినవి. విస్తరభీతిచే వానిని ఇచట ఉట్టంకించుట లేదు.

''పుంసః పురుషహరిమయీ మూర్తిః వః శోకమ్ అస్యతు''

## శ్రీసుదర్శన పురుషుడు మీకు ఉత్తమ యశస్సును కల్గించాలి.

**97.** పాశ్చాత్యాశోకపుష్పప్రకరనిపతితైః ప్రాప్తరాగం పరాగైః
సంధ్యారోచిస్సగంధైః స్వపదశశధరం ప్రేక్ష్య తారానుషక్తమ్
పద్మానా బద్ధకోశా నివ సురనివహై రంజలీన్ కల్ప్యమానాన్
చక్రాధీశోఽభినందన్ ప్రదిశతు సదృశీ ముత్తమశ్లోకతాం వః ॥

పాశ్చాత్య + అశోకపుష్ప = వెనుకవైపుగల అశోకవృక్షముయొక్క పుష్పముల, ప్రకర = సమూహములనుండి, నిపతితైః = క్రిందపడినవి, సంధ్యారోచిస్సగంధైః = సంధ్యాకాలములోని కాంతితో సమానమైనవి అగు, పరాగైః = పుప్పొడులచే, ప్రాప్తరాగమ్ = ఎఱ్ఱనైన, తార+ అనుషక్తమ్ = ప్రణవసంబంధమునుకల (నక్షత్రసంబంధమును కల), స్వపదశశధరమ్ = స్వస్థానమైన చంద్రమండలమును, ప్రేక్ష్య = చూచి, ఆబద్ధకోశాన్ = మూసిన కోశములను కల్గినవగు, పద్మాన్+ ఇవ (స్థితాన్) తామరపూలవలె నున్న, సురనివహైః = దేవసమూహములచే, కల్ప్యమానాన్ = సమర్పింపబడు, అంజలీన్ = అంజలిబంధములను , అభినందన్ = అభినందించుచు, చక్ర+ అధీశః = శ్రీ సుదర్శనపురుషుడు, వః = మీకు, సదృశీమ్ = (తనకీర్తికి) తగిన, ఉత్తమశ్లోకతామ్ = ఉత్తమ యశస్సుకు , ప్రదిశతు = ఇచ్చునుగాక !

శ్రీ సుదర్శనభగవానుని సేవించుటకై వచ్చు దేవగణములు అంజలిబంధములను ఘటించుటను కవి చమత్కరించుట ఇందలి విషయము. కమలములు చంద్రుని చూడగానే

ముకుళించును. అట్లే దేవతల కరకమలములను శ్రీ సుదర్శన యంత్ర సన్నివిష్టుడైన చంద్రుని దర్శించి అంజలిబంధవ్యాజముతో ముకుళించుచున్నవి అన్నట్లున్నది. **''సమాసీన మశోకస్య మూలే కాలానలద్యుతిమ్''** అని తెలుపబడుటచే పాశ్చాత్య (వెనుక) భాగములోనున్న అశోక వృక్షములలోని ఎఱ్ఱని పూలనుండి రాలిన పుప్పొడిచే చంద్రునకు అరుణ్యాశయము కల్గినట్లు చెప్పబడినది.

**(తారానుషక్తమ్)** - నక్షత్రసంబంధమైన అర్థము, ప్రణవమునకు సంబంధించిన అర్థమును శ్లిష్టము. వాగ్విన్యాసవైఖరివలన తారాశశాంక వృత్తాంతములు స్మరింపచేయబడిన వనుటలో విప్రతిపత్తి లేదు.

**(ప్రేక్ష్య ఆబద్ధకోశా నివ)** - అసత్కార్యాసక్తుని చూచినచో పెద్దలు కన్నులు మూసి కొందురు కదా ! ఇచటను తారాశశాంక గాథ స్మారితము.

**(అభినందన్ చక్రాధీశః వః సదృశీమ్ ఉత్తమశ్లోకతాం ప్రదిశతు)** - **''సమానానా ముత్తమశ్లోకోఽస్తు''** అను శ్రుతి స్మరణకు వచ్చునట్లు కవి ప్రయోగించువారగుటచే **''సదృశామ్''** అను పాఠమును యుక్తమే. **''సదృశా మితి షష్ఠీబహువచనమ్, సమానానాం మధ్యే ఇత్యర్థః''** అని శ్రీ ప్రభ అణ్ణాస్వామి వివరణము. తనతో సమానులగు వ్యక్తులలో అని భావము. **''పద్యే యశసి చ శ్లోకః''** అను అమరకోశవచనమువలన ఉత్తమశ్లోకమనగా గొప్పకీర్తి.

''చక్రాధీశః వః సదృశీమ్ ఉత్తమశ్లోకతాం ప్రదిశతు''

## శ్రీసుదర్శన నారసింహమూర్తి మీ సాంసారిక తాపాన్ని తీర్చాలి.

**98.** రక్తాశోకస్య వేదస్య చ నిహితపదం ప్రాప్తశాఖస్య మూలే
చక్రై రస్త్రై స్తదాద్యై రపి మహితచతుర్ద్విశ్చతుర్బాహుదండమ్ ।
ఆసీనం భాసమానం స్థిత మపి భయత స్త్రాయతాం తత్త్వ మేకం
పశ్చా త్పూర్వత్ర భాగే స్ఫుటనరహరితామానుషం జానుషా ద్వః ॥

ప్రాప్తశాఖస్య = పలు శాఖలను కల (శాఖావిభాగములను కల) రక్త + అశోకస్య = ఎఱ్ఱని అశోకవృక్షముయొక్క, వేదస్య చ = వేదముయొక్కయు, మూలే = మూల ప్రదేశమున (ప్రణవమునందు) నిహితపదమ్ = వేంచేసియున్నది, చక్రైః తదాద్యైః అస్త్రైః అపి మహితచతుః ద్విః శ్చతుః బాహుదండమ్ = నాల్గు చక్రములచే అలంకరింపబడిన, నాల్గుబాహుదండములను, చక్రముమొదలగు ఎనిమిది ఆయుధములచే అలంకరిపబడిన ఎనిమిది బాహుదండములను కల్గినది, పశ్చాద్భాగే = వెనుకభాగమున, అసీనమ్ =వేంచేసియున్నదై, భాసమానమ్ = ప్రకాశించుచున్నది, పూర్వత్ర భాగే = ముందుభాగమునందు, స్థితమ్ = నిలచినదై, భాసమానమ్



అపి = ప్రకాశించుచున్నదియు, స్ఫుటనరహరిత + అమానుషమ్ = (వెనుకవైపు) నరసింహత్వము, ముందువైపు నరత్వమును ప్రకాశింపచేయబడిన, దివ్యమైన, ఏకం తత్త్వమ్ = అద్వితీయమైన ఒకానొక తత్త్వము, వః = మిమ్ములను, జానుషాత్ భయతః = సాంసారిక భయమునుండి, త్రాయతామ్, = రక్షించునుగాక !

చక్రముయొక్క ముందు భాగములో శ్రీ సుదర్శన పురుషునిగా, వెనుక భాగమునందు నరసింహమూర్తిగా సేవను అనుగ్రహించుచు వెల్గొందుచున్న సన్నివేశము ఒకటి కలదు. దానికి కవి మంగళ మాశాసించు చున్నారు.

**''పశ్చాద్భాగే ప్రాప్తశాఖస్య రక్తాశోకస్య మూలే నిహిత పదం చక్రైః మహిత చతుర్బాహుదండమ్ ఆసీనం భాసమానం స్ఫుటనరహరితాకం తత్త్వమ్, పూర్వత్ర భాగే ప్రాప్తశాఖస్య వేదస్య మూలే నిహితపదం చక్రాద్యై రస్త్రైః మహితద్విశ్చతుర్బాహుదండమ్ స్థితం భాసమానం స్ఫుటమానుషం తత్త్వం వః జానుషాత్ భయతః త్రాయతాత్''** అనుచు విభజించి అన్వయింపనగును. చక్రముయొక్క వెనుకభాగమున శాఖోపశాఖముగా వృద్ధిచెందిన అశోకవృక్షముయొక్క మూలములో నరసింహమూర్తిగా వేంచేసియుండి, నాల్గుబాహువులతో చక్రము దాల్చి వెలుగుచుండుట గమనింపతగినది. **''నారసింహం చతుర్బాహుం చతుశ్చక్రధరం పరమ్, సమాసీన మశోకస్య మూలే కాలానలద్యుతిమ్''**, ఇత్యాదికము అహిర్బుధ్న్య సంహితలో తెలుపబడినది. **''ప్రణవశశధరాధారషట్కోణవర్తీ''** అనునట్లు ప్రణవమున నుండుట మొదటిపాదమున తెలుపబడినది. కాణ్వకాక కాలాపాది భేదముతో పలు శాఖలను కల్గిన వేదమునకు మూలము ప్రణవమే కదా ! **''యో వేదాదౌ స్వరః ప్రోక్తః వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య''** ఇత్యాది సూక్తి ఇచట స్మరింపనగును.

**''ద్విర్గుణితాః చత్వారో బాహుదండాః యస్య తత్''** అను విగ్రహమును **''ద్విశ్చతుర్బాహుదండమ్''** అను సమాసమునకు చెప్పనగును. **''ద్వా త్రింశత్ షోడశాష్టప్రభృతి పృథుభుజస్ఫూర్తిభిః మూర్తిభేదైః''** (91) అను శ్లోకమునందు చెప్పబడిన రీతిలోని అష్టభుజ యుక్తమూర్తి ప్రక్రియను ఇచట తెలిపిరి. **''ఆసీనం, స్థితమ్''** అనునవి వెనుక కూర్చునియున్న స్థితిని, ముందు నిలచి యున్న భంగిమను తెలుపును.

**(ఏకం తత్త్వమ్)** - ఒక తత్త్వమే ఇట్లు ముందు వెనుకలలో రెండు రూపములకు పరిగ్రహించి వెల్గుచున్నది.

**(జానుషాత్ భయతః వః త్రాయతామ్)** - జన్మ కల్గిన వెంటనే పలు విధములైన భయములును కల్గును. కావున వానిని పోగొట్టి రక్షించునుగాక ! అని తాత్పర్యము. **''స్ఫుటతరహరితామానుషమ్''** అను వేరొక పాఠమును సంస్కృవ్యాఖ్యాత ఆదరించి, **''హరితా**

చ మానుషం చ హరితామానుషే, స్ఫుటతరేచ తే హరితామానుషే స్ఫుటతరహరితామానుషే, **యస్య తత్''** అను విగ్రహమును తెలిపెను. అర్థమున భేదములేదు.

**''స్ఫుటనరహరితామానుషం తత్త్వం వః జానుషాత్ భయాత్ త్రాయతామ్''**

## శ్రీసుదర్శన మూర్తి మీకు తన సాక్షాత్కారాన్ని కల్గించాలి.

**99.** **ప్రాణే దత్తప్రయాణే ముషితదిశి దృశి త్యక్తసారే శరీరే**
**మత్యాం వ్యామోహవత్యాం సతమసి మనసి వ్యాహతే వ్యాహృతే చ ।**
**చక్రాంతర్వర్తి మృత్యుప్రతిభయ ముభయాకారచిత్రం పవిత్రం**
**తేజ స్త స్తిష్ఠతాం వ స్త్రిదశకులధనం త్రీక్షణం తీక్ష్ణదంష్ట్రమ్ ॥**

ప్రాణే = ప్రాణము, దత్తప్రయాణే = ప్రయాణముచేయునవి కాగా, దృశి = కన్నులు, ముషితదిశి = మూసికొనినవి కాగా, శరీరే = ఒడలు, త్యక్తసారే = పోయిన శక్తిని కల్గినదికాగా, మత్యామ్ = బుద్ధి, వ్యామోహవత్యామ్ = వ్యామోహమును పొందినది కాగా, మనసి = మనస్సు, సతమసి = చీకటితో కూడుకొన్నదికాగా, వ్యాహృతే వ్యాహతే చ = మాటతడబడినదియు కాగా, మృత్యుప్రతిభయమ్ = మృత్యుభయంకరమై, ఉభయ+ ఆకారచిత్రమ్ = మానవరూపము కలసిన సింహరూపమును గ్రహించియుండుటచే చిత్రమైన, పవిత్రమ్ = పరిశుద్ధమైన, త్రిదశకులధనమ్ = దేవకులమునకు ఆపద్ధనమైన, త్రీక్షణమ్ = మూడుకన్నులను కల్గిన, తీక్ష్ణదంష్ట్రమ్ = పదునైన దంష్ట్రలను కల్గిన, చక్ర+ అంతర్వర్తి = శ్రీసుదర్శనమునందువేంచేసియున్న, తత్ = ఆ, తేజ = తేజస్సు, వః = మీకు, తిష్ఠతామ్ = స్వస్వరూపమును ప్రకాశింపచేయును గాక !

శరీరులు మరణాసన్న దశలో స్థితి చెడి, తడబడి, అలమటించుటను పూర్వార్ధమున కవి తెలిపిరి. అట్టిదశలో చక్రాంతర్వర్తియైన నరసింహమూర్తి మీకు సేవను అనుగ్రహించి తాద్వాత్వికమైన (అప్పటి) భయమును పోగొట్టి రక్షింపవలెనని భావము.

**(వః తిష్ఠతామ్)** - ఇచట **''వః''** అనునది చతుర్థీబహువచనము. **''శ్లాఘ హ్రూఙ్ స్థాశపామ్ జ్ఞీప్స్యమానః'' (1-4-34)** అని అనుశాసనము. **''తిష్ఠతామ్''** అను ఆత్మనే పదప్రయోగము ''ప్రకాశనస్థేయాఖ్యయోశ్చ'' (1-3-23) అను సూత్రానుసారము చేయబడినది. ఆ తేజస్సునిలచి, తన స్వరూపమును మీకు తెలుపును గాక ! అని భావము. శ్లోకములోని **''పవిత్ర''** మను పదము **''చరణం పవిత్రమ్''** అను శ్రుతివాక్యమును తలపింపచేయును. **''ముషితదృశి''** అను పాఠాంతరమును కలదు. అపుడు అపహరింపబడిన దర్శనమును కల్గినది అని అర్థము. ఇచటి దృక్ శబ్దము దర్శనార్థకము. పిమ్మటనున్నది



నేత్రార్థకము. **''పవిత్రం''** అనువిశేషణముచే **''చరణం పవిత్రం''** ఇత్యాది వైదికసూక్తి స్మరణీయమని సంస్కృతవ్యాఖ్య.

**''చక్రాంతర్వర్తి తేజః వః తిష్ఠతామ్''**

## శ్రీసుదర్శనమూర్తి మీకు సకలార్థప్రదుడు కావాలి.

**100.** **యస్మిన్ విన్యస్య భారం విజయిని జగతాం జంగమస్థావరాణామ్**
**లక్ష్మీనారాయణాఖ్యం మిథున మనుభవత్యత్యుదారాన్ విహారాన్ ।**
**ఆరోగ్యం భూతి మాయుః కృత మిహ బహునా యద్యదాస్థాపదం వః**
**తత్త త్సద్య స్సమస్తం దిశతు స పురుషో దివ్యహేత్యక్షవర్తీ ॥**

లక్ష్మీనారాయణాఖ్యం మిథునం = లక్ష్మీనారాయణులను దివ్యదంపతులు, జంగమస్థావరాణామ్ = సకల చరాచరముల రూపములోనున్న, జగతామ్ = లోకములయొక్క, భారమ్ = నిర్వహణ భారమును, విజయిని = విజయశీలుడగు, యస్మిన్ = ఏ సుదర్శనమందు, విన్యస్య = నిక్షిప్తముచేసి, అత్యుదారాన్ = మిక్కిలి గొప్పదైన, విహారాన్ = లీలలను, అనుభవతి = అనుభవించుచున్నారో, దివ్యహేతి+ అక్షవర్తీ = సుదర్శన చక్రముయొక్క, అక్షమునందు వేంచేసియున్న, సః = ఆ, పురుషః = సుదర్శనపురుషుడు, వః = మీకు, ఆరోగ్యమ్ = రోగములు లేని స్థితిని, భూతిమ్ = కొఱతలేని సంపదను, ఆయుః = దీర్ఘాయువును, ఇహ బహునా కిమ్ = ఇట్లు పలు పల్కుట ఎందులకు ?, ఆస్థాపదం యత్ యత్ = (మీరు) ఆశపడినది ఏది ఏదికలదో, తత్ తత్ సమస్తమ్ = వానిని అన్నిటిని, సద్యః = వెంటనే, దిశతు = ఇచ్చును గాక!

ఇందు కవి శ్రీసుదర్శనపురుషుని సకలాభీష్ట ప్రదత్వమును స్తుతించుచున్నారు.

**''శ్రీరంగచంద్రమస మిందిరయా విహర్తుం విన్యస్య విశ్వచిదచిన్నయనాధికారమ్, యో నిర్వహత్యనిశ మంగులిముద్రయైవ సేనాన్య మన్యవిముఖా స్తమశిశ్రియామ''** అనుచు విష్వక్సేనులు దివ్యదంపతులను భోగవిలాసములందు నిర్విచారముగా ప్రవర్తింపచేసి, తాము విశ్వధురంధరులై యుందురని తెలుపబడినట్లే, శ్రీసుదర్శపురుషుడును లోక రక్షణభారమును నిర్వహించుట పూర్వార్ధమున ప్రస్తుతింపబడినది. అట్లు విశ్వరక్షాదీక్షనుకల శ్రీసుదర్శన పురుషుడు ఆశ్రితులకు అనుగ్రహించు ఫలములను తెలుపుచు **''ఆరోగ్యం భూతి మాయుః''** అనిన వెంటనే అసంఖ్యేయములైన ఫలములను విభజించి పల్కుట తమకు సాధ్యమా ! అని అచ్చెరు వొందుచు, ఎవరు ఎవరు ఏ యే ఫలములను ఆశింతురో వానిని అన్నిటిని శ్రీసుదర్శన భగవానుడు అనుగ్రహించుననుచు కవి స్తుతిని ముగించిరి. **''బహునా కృతమ్''** అనగా పలు మాటలు పలుకుట ఎందులకు ? అని భావము.

''దివ్యహేత్యక్షవర్తీ స పురుషః సమస్తం దిశతు''

## ఫలశ్రుతి

**101.** పద్యానాం తత్త్వవిద్యాద్యుమణిగిరిశవీథ్యంగసంఖ్యాధరాణామ్
అర్చిష్ష్వంగేషు నేమ్యాదిషు చ పర మతః పుంసి షడ్వింశతే శ్చ ।
సంఘై స్సౌదర్శనం యః పఠతి కృత మిదం కూరనారాయణేన
స్తోత్రం నిర్విష్టభోగో భజతి స పరమాం చక్రసాయుజ్యలక్ష్మీమ్ ॥

అర్చిషి= జ్వాలల విషయమునందు, నేమి+ ఆదిషు = నేమి మొదలగు, అంగేషు = అవయవముల విషయమునందును, తత్త్వవిద్యా = తత్త్వముల సంఖ్యయగు ఇఱువదినాల్గు, విద్యా = విద్యలసంఖ్యయగు పదునాల్గు, ద్యుమణి = ఆదిత్యుల సంఖ్యయగు పన్నెండు, గిరిశ = రుద్రులసంఖ్యఅగు పదునొకండు, వీథి+అంగ = వీథి అనురూపకముయొక్క అంగముల సంఖ్యఅగు పదమూడు అను, సంఖ్యాధరాణామ్ = క్రమముగా ఈ సంఖ్యలను కల్గినవి, అతఃపరమ్ = అవయవ వర్ణనకుపిమ్మట, పుంసి = అవయవియగు సుదర్శనపురుషుని విషయమున, షడ్వింశతేః + చ = ఇరువది ఆఱు సంఖ్యను కల్గినవియు అగు, పద్యానామ్ = శ్లోకముల యొక్క, సంఘైః = సమూహములతో, కృతమ్ = రచింపబడిన, ఇదమ్ = ఈ, సౌదర్శనమ్ = శ్రీసుదర్శనభగవానునకు చెందిన, స్తోత్రమ్ = స్తోత్రమును, యః = ఎవడు, పఠతి = పఠించునో, సః = అతడు, నిర్విష్టభోగః = ఐహిక భోగములను అనుభవించినవాడై, పరమామ్ = గొప్పదైన, చక్రసాయుజ్యలక్ష్మీమ్ = శ్రీసుదర్శన భగవానునితో పరమసామ్యమను లక్ష్మిని, భజతి = పొందును.

ఈ స్తోత్రము చివరలో కవి దీనిని పఠించుట వలన కల్గు ఫలితమును (ఫలశ్రుతిని) తెలిపి పరిసమాప్తి చేయుచున్నారు.

మొదట జ్వాలావర్ణన పరములైన ఇరువదినాల్గు శ్లోకములను, పిమ్మట నేమి వర్ణన పరములైన పదునాల్గు శ్లోకములను, అనంతరము అరవర్ణన పరములైన పండ్రెండు శ్లోకములను, తదనంతరము నాభివర్ణన పరములైన పదునొకండు శ్లోకములను, అనంతరము అక్షవర్ణనపరములైన పదమూడు శ్లోకములను, చివరలో పురుషవర్ణన పరములైన ఇరువది ఆఱు శ్లోకములను కల్గిన ఈ స్తోత్రమును అనుసంధించువారు **''ఇరుబ్కడల్ ఉలకమాణ్డు వెన్కుడైక్కోళ్''** అని, **''కణ్డార్ వణజ్గక్కళియానై మీదే కడల్ శూళులకు క్కొరు కావలనాయ్ విణ్తోయ్నెడువెణ్కుడై నిళలిన్ కీళ్ విరినీరులకమాణ్డు''** అనియు తెలుపబడిన విదమున ఐహిక భోగములకు లోటులేనట్లు



అనుభవించి, పిమ్మట శ్రీసుదర్శన భగవానునితో పరమ సాయుజ్యలక్ష్మిని పొంది ఆనందింతురు అని భావము.

సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అనుచు మోక్షము నాల్గు విధములుగా చెప్పబడుచున్నది. **''లోకేషు విష్ణో ర్నివసంతి కేచిత్ సమీప మృచ్ఛంతి చ కేచి దన్యే, అన్యేతు రూపం సదృశం భజంతే సాయుజ్య మన్యే స తు మోక్ష ఉక్తః''** అని శ్రీభాగవతమున తెలుపబడినది. వీనిలో సాయుజ్యమోక్షమే మిక్కిలి గొప్పది అనుట **''మోక్షం సాలోక్యసారూప్యం ప్రార్థయే న కదాచన, ఇచ్ఛామ్యహం మహాబాహో సాయుజ్యం తవ సువ్రత''** అను జితంతే స్తోత్రమున వ్యక్తమగుచున్నది. **''సయుజో భావః సాయుజ్యమ్''** అనునది సాయుజ్యశబ్దవివరణము. భోగ్యవస్తువులో భోక్తయై, వెంట అన్వయించుటయే సాయుజ్యము, సప్రకార బ్రహ్మమను భోగ్యమున పరబ్రహ్మము, ముక్తులును భోక్తలై అన్వయించుటచే ముక్తుడు సయుక్ అనబడును. **''సామరస్యం హి సాయుజ్యం వదంతి బ్రహ్మవాదినః''** అని శాకటాయనుడు తెలిపెను. ఐక్యమే సాయుజ్యమనుచు కొందఱు చేయు వివరణము ప్రమాణవిరుద్ధము. సుదర్శనమూర్తి భగవానునకు ఇష్టవినియోగార్హుడైనట్లే స్తోత్రమును పఠించు భక్తుడును భగవానునకు ఇష్టవినియోగార్హుడగునని పిండితార్థము.

(తత్త్వవిద్యాద్యుమణి . . . .) – **''పాఙ్గెమ్బులనుమ్ పాఱియెన్దుమ్''** అనునట్లు తత్త్వములు ఇరువది నాల్గు. **''అంగాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతా చతుర్దశ''** అనివిద్యలు పదునాల్గు. ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులును ప్రసిద్ధులు. **''వీథ్యంగ''** అనుటకు బదులు **''విద్యంగ''** అను అపపాఠము పలు చోట్ల కానవచ్చు చున్నది. నాటక లక్షణమును తెలుపు ప్రతాప రుద్రీయాదులలో **''వీథ్యంగన్యాముఖాంగత్వాదుచ్యంతేఽత్ర స్వభావతః, ఉద్ఘాత్యకావలగితే . . . .మృదవాని త్రయోదశ''** అనియుండుటను కాననగును. సాహిత్యదర్పణకారుడును **''వీథ్యామేకోభవే దంక''** అని వీథిని నిర్వచించి దాని అంగములు **''అస్యా స్త్రయోదశాంగాని నిర్దిశంతి మనీషిణః''** అని పదమూడుగా తెలిపెను. ఇట్లు కవి ఈశ్లోకముతో ఈ స్తోత్రమును పఠించుట వలన కల్గు ఫలములను తెలిపి, పరిసమాప్తి చేసిరి.

''సౌదర్శనం స్తోత్రం యః పఠతి సః చక్రసాయుజ్యలక్ష్మీం భజతి''
కూరనారాయణాభిఖ్యయతీశాన ప్రసాదితమ్ ।
శ్రీమత్సుదర్శనస్యేదం శతకం భక్తభేషజమ్ ॥

అనంత రంగరామోఽయం వ్యాచకార యథామతి ।

అనుగృహ్ణంతు విద్వాంసః వత్సలాః గుణతత్పరాః ॥

శ్రీమద్భి రఘునాథార్య గురువర్యైః పరిష్కృతా ।
జ్వాలేయం కల్పతాం ప్రీత్యై సతాం నిష్పక్షపాతినామ్ ॥



## అనుబంధః

### శ్రీసుదర్శనషడక్షరీమంత్రః

ఓమ్ సహస్రార హుం ఫట్

శ్రీసుదర్శనగాయత్రీమంత్రః

ఓమ్ సుదర్శనాయ విద్మహే మహాజ్వాలాయ ధీమహి తన్న శ్చక్రః ప్రచోదయాత్

### శ్రీసుదర్శనషట్కమ్

1. సహస్రాదిత్యసంకాశం సహస్రవదనం ప్రభుమ్ ।
సహస్రదం సహస్రారం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥

2. హసంతం హారకేయూరమకుటాంగదభూషణైః ।
శోభనై ర్భూషితతనుం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥

3. స్రాకారసహితం మంత్రం వదంతం శత్రునిగ్రహమ్ ।
సర్వరోగప్రశమనం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥

4. రణత్కింకిణిజాలేన రాక్షసఘ్నం మహాద్భుతమ్ ।
వ్యాప్తకేశం విరూపాక్షం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥

5. హుంకారభైరవం భీమం ప్రణాతార్తిహరం ప్రభుమ్ ।
సర్వదుష్టప్రశమనం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥

6. ఫట్కారాంత మనిర్దేశ్యం దివ్యమంత్రేణ సంయుతమ్ ।
శుభప్రసన్నవదనం ప్రపద్యేఽహం సుదర్శనమ్ ॥

7. ఏతై ష్షడ్భిః స్తుతో దేవః ప్రసన్నః శ్రీసుదర్శనః ।
రక్షాం కరోతు సర్వాత్మా సర్వత్ర విజయీ భవేత్ ॥



### శ్రీసుదర్శనాష్టకమ్

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

ప్రతిభటశ్రేణిభీషణ - వరగుణస్తోమభూషణ
జనిభయస్థానతారణ - జగదవస్థానకారణ,
నిఖిలదుష్కర్మకర్శన- నిగమసద్ధర్మదర్శన
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 1 ॥

శుభజగద్రూపమండన - సురజనత్రాసఖండన
శతమఖబ్రహ్మవందిత - శతపథ బ్రహ్మనందిత,
ప్రథితవిద్వత్సపక్షిత - భజదహిర్బుధ్న్యలక్షిత
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 2 ॥

స్ఫుటతటిజ్జాలపింజర- పృథుతరజ్వాలపంజర
పరిగతప్రత్నవిగ్రహ- పరిమితప్రజ్ఞదుర్గ్రహ,
ప్రహరణగ్రామమండిత - పరిజనత్రాణపండిత
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 3 ॥

నిజపదప్రీతసద్గణ - నిరుపధిస్ఫీతషడ్గుణ
నిగమనిర్వ్యూఢవైభవ - నిజపరవ్యూహవైభవ,
హరిహయద్వేషిదారణ - హరపురప్లోషకారణ
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 4 ॥

దనుజవిస్తారకర్తన - దనుజవిద్యావికర్తన
జనితమిస్రావికర్తన - భజదవిద్యానికర్తన,
అమరదృష్టస్వవిక్రమ - సమరజుష్టభ్రమిక్రమ
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 5 ॥

ప్రతిముఖాలీఢబంధుర - పృథుమహాహేతిదంతుర
వికటమాలాపరిష్కృత - వివిధమాయాబహిష్కృత
స్థిరమహాయంత్రయంత్రిత - దృఢదయాతంత్రయంత్రిత
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 6 ॥

మహితసంపత్సదక్షర - విహితసంపత్షడక్షర
షడరచక్రప్రతిష్ఠిత - సకలతత్త్వప్రతిష్ఠిత,
వివిధసంకల్పకల్పక - విబుధసంకల్పకల్పక
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 7 ॥

భువననేత స్త్రయీమయ - సవనతేజస్త్రయీమయ
నిరవధిస్వాదుచిన్మయ - నిఖిలశక్తేజగన్మయ,
అమితవిశ్వక్రియామయ - శమితవిష్వగ్భయామయ
జయ జయ శ్రీ సుదర్శన - జయ జయ శ్రీసుదర్శన ॥ 8 ॥

ద్విచతుష్క మిదం ప్రభూతసారం పఠతాం వేంకటనాయక ప్రణీతమ్ ।
విషమేఽపి మనోరథః ప్రధావన్ న విహన్యేత రథాంగధుర్యగుప్తః ॥

కవితార్కిక సింహాయ కళ్యాణ గుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥



## శ్రీషోడశాయుధస్తోత్రము

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

స్వసంకల్పకలాకల్పై రాయుధై రాయుధేశ్వరః ।
జుష్ట ష్షోడశభి ర్దివ్యై ర్జుషతాం వః పరః పుమాన్ ॥

యదాయత్తం జగచ్చక్రం కాలచక్రం చ శాశ్వతమ్ ।
పాతు వ స్తత్పరం చక్రం చక్రరూపస్య చక్రిణః ॥

యత్ప్రసూతిశతై రాసన్ రుద్రాః పరశులాఞ్ఛితాః ।
స దివ్యో హేతిరాజస్య పరశుః పరిపాతు వః ॥

హేలయా హేతిరాజేన యస్మిన్ దైత్యా స్సముద్ధృతే ।
శకున్తా ఇవ ధావన్తి స కున్తః పాలయేత వః ॥



దైత్యదానవముఖ్యానాం దణ్డ్యానాం యేన దణ్డనమ్ ।
హేతిదణ్డేశదణ్డోఽసౌ భవతాం దణ్డయే ద్ద్విషః ॥

అనన్యాన్వయభక్తానాం రున్ధ న్నాశామతఙ్గజాన్ ।
అనఙ్కుశవిహారో వః పాతు హేతీశ్వరాఙ్కుశః ॥

సంభూయ శలభాయన్తే యత్ర పాపాని దేహినామ్ ।
స పాతు శతవక్త్రాగ్నిహేతి ర్హేతీశ్వరస్య వః ॥

అవిద్యాం స్వప్రకాశేన విద్యారూప శ్ఛినత్తి యః ।
స సుదర్శననిస్త్రింశః సౌతు వ స్తత్త్వదర్శనమ్ ॥

క్రియాశక్తిగుణో విష్ణో ర్యో భవత్యతిశక్తిమాన్ ।
అకుణ్ఠశక్తి స్సా శక్తి రశక్తిం వారయేత వః ॥

తారత్వం యస్య సంస్థానే శబ్దే చ పరిదృశ్యతే ।
ప్రభోః ప్రహరణేన్ద్రస్య పాఞ్చజన్య స్స పాతు వః ॥

యం సాత్త్విక మహంకార మామనన్త్యక్షసాయకమ్ ।
అవ్యా ద్య శ్చక్రరూపస్య తద్ధను శార్‌ఙ్గ ధన్వనః ॥

ఆయుధేన్ద్రేణ యేనైవ విశ్వసర్గో విరచ్యతే ।
స వ స్సౌదర్శనః కుర్యా త్పాశః పాశవిమోచనమ్ ॥

విహారో యేన దేవస్య విశ్వక్షేత్రకృషీవలః ।
వ్యజ్యతే తేన సీరేణ నాసీరవిజయోఽస్తు వః ॥

ఆయుధానా మహం వజ్ర మిత్యగీయత య స్స వః ।
అవ్యా ద్దేతీశవజ్రోఽసౌ దధీచ్యస్థి సముద్భవః ॥

విశ్వసంహృతిశక్తి ర్యా విశ్రుతా బుద్ధిరూపిణీ ।
సా వః సౌదర్శనీ భూయా ద్గదప్రశమనీ గదా ॥

యాత్యతిక్షోద శాలిత్వం ముసలో యేన తేన వః ।
హేతీశముసలేనాశు భిద్యతాం మోహమౌసలమ్ ॥

శూలిదృష్టమనో ర్వాచ్యో యేన శూలయతి ద్విషః ।
భవతాం తేన భవతా త్రిశూలేన విశూలతా ॥

అస్త్రగ్రామస్య కృత్స్నస్య ప్రసూతిం యం ప్రచక్షతే ।
సోఽవ్యా త్సుదర్శనో విశ్వ మాయుధైః షోడశాయుధః ॥

శ్రీమద్వేంకటనాథేన శ్రేయసే భూయసే సతామ్ ।
కృతేయ మాయుధేన్ద్రస్య షోడశాయుధసంస్తుతిః ॥

❀ ❀ ❀

## శ్రీసుదర్శనసహస్రనామస్తోత్రమ్

కైలాసశిఖరే రమ్యే ముక్తామాణిక్యమండపే ।
రత్నసింహాసనాసీనం భర్తారం పరివారితమ్ ॥

భర్తారం సర్వధర్మజ్ఞం పార్వతీ పరమేశ్వరమ్ ।
బద్ధాంజలిపుటా భూత్వా పప్రచ్ఛ వినయాన్వితా ॥

పార్వత్యువాచ

యత్త్వయోక్తం జగన్నాథ శుభసంచయ మిచ్ఛతా ।
సౌదర్శన మూర్తేః శస్త్రం నాస్తి చాన్య దపి ప్రభో ॥

తత్ర కాచి ద్వివక్షాఽస్తి తమర్థం ప్రతి మే ప్రభో ।
ఏవ ముక్త స్త్వహిర్బుధ్న్యః పార్వతీం ప్రత్యువాచ తామ్ ॥

అహిర్బుధ్న్య ఉవాచ

సంశయో యది తే తత్ర బ్రూహి త్వం తు వరాననే ।
ఇత్యేవ ముక్తా గిరిజా గిరిశేన మహాత్మనా ॥

పునః ప్రోవాచ సర్వజ్ఞం జ్ఞానముద్రాధరం ప్రభుమ్ ।

పార్వత్యువాచ

లోకే సౌదర్శనం మంత్రం యంత్రం తత్తత్ప్రయోగవత్ ॥

సర్వం విజ్ఞాతు మన్యత్ర యథావత్ సమనుష్ఠితమ్ ।
అతివేల మశక్తానాం తన్మార్గం భృశ మిచ్ఛతామ్ ॥

కో మార్గః కా గతి స్తేషాం కార్యసిద్ధిః కథం భవేత్ ।
ఏత న్మే బ్రూహి లోకేశ త్వదన్యం కో వదే దముమ్ ॥

ఈశ్వరః



## శ్రీసుదర్శనమంగళాశాసనమ్

మంగళం చక్రరాజాయ మహనీయగుణాబ్ధయే ।
పద్మనాభకరాంభోజపరిష్కారాయ మంగళమ్ ॥

కాశీవిప్లోషకారాయ కల్యాణగుణశాలినే ।
మాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్ ॥

గజేంద్రార్తిహరాయాస్తు గ్రాహద్వేధాత్వకారిణే ।
నరకాసురసంహర్త్రే నానారూపాయ మంగళమ్ ॥

చణ్డాస్త్రాంచితదోర్దండఖణ్డితామరశత్రవే ।
చామీకరనిభాంగాయ చారునేత్రాయ మంగళమ్ ॥

చైద్యాసురశిరోహర్త్రే చన్ద్రాహ్లాదకరాయ చ ।
శ్రీమతే చక్రరాజాయ శ్రితార్తిఘ్నాయ మంగళమ్ ॥

❀ ❀ ❀

(ఈపాశురములు శఠకోపసూరి విరచితమైన తిరువాయ్‌మొళి ప్రబంధములోని ఏడవ శతకము, నాల్గవదశకములోనివి. వీనిని పెద్దలు సుదర్శనస్తుతిగా అనుసంధించు ఆచారము కలదు. బహుశః ఈ దశకములోని మొదటి ప్రయోగము సుదర్శనభగవానుని భగవన్మంగళాశాసన పరత్వమును తెలుపుచుండుటచే అట్టి ఆచారము ఏర్పడెనేమో !)

1. ఆళియెళ చ్చఙ్గుమ్‌విల్లుమెళ । తిశై
   వాళియెళ త్తణ్డుమ్‌వాళు మెళ । అణ్డమ్
   మోళైయెళ ముడిపాదమెళ । అప్పన్
   ఊళియెళ ఉలగఙ్గొణ్డవాఱే.

2. ఆఱుమలైక్కు ఎదిర్‌న్దోడుమొలి । అర
   వూఱుశులాయ్ మలైతేయ్‌క్కుమొలి । కడల్
   మాఱుశుళన్ఱు అళైక్కిన్ఱవొలి । అప్పన్
   శాఱుపడ అముదఙ్గొణ్డనాన్ఱే

3. నాన్ఱిలవేళ్ మణ్ణుమ్‌తానత్తవే । పిన్నుమ్
   నాన్ఱిలవేళ్ మలైతానత్తవే । పిన్నుమ్
   నాన్ఱిలవేళ్ కడల్‌తానత్తవే । అప్పన్
   ఊన్ఱియిడన్దు ఎయిఱ్ఱిల్ కొణ్డనాళే

4. నాళుమెళ నిలనీరుమెళ । విణ్ణుమ్
   కోళుమెళ ఎరికాలుమెళ । మలై

తాళుమెుళ్హి చ్చుడర్ తానుమెుళ్హి । అప్పన్
ఊళియెుళ్హి ఉలగముణ్డవూణే

5. ఊణుడైమల్లర్ తదర్ద్దవాలి । మన్నర్
ఆణుడైచ్చేనై నడుజ్గుమొలి । విణ్ణోళ్
ఏణుడైత్తేవర్ వెళిప్పట్టవాలి । అప్పన్
కాణుడైప్పారదమ్ కైయఱైపోళ్హుదే.

6. పోళ్హుదుమెలిన్ద పున్శెక్కరిల్ । వాన్తిశై
శూళ్హుమెుళ్హున్దు ఉదిరప్పునలా । మలై
కీళ్హ్ దుపిళన్ద శిజ్గమొత్తదాల్ । అప్పన్
ఆళ్హ్ తుయర్ శెయ్దు అశురరైక్కొల్లుమాఱే.

7. మాఱునిరైత్తు ఇరైక్కుమ్శరజ్గళ్ । ఇన
నూఱుపిణమ్ మలైపోల్ పురళ । కడల్
ఆఱుమడుత్తు ఉదిరప్పునలా । అప్పన్
నీఱుపడ ఇలజ్గైశెఱ్ఱనేరే.

8. నేర్శరిన్దాన్ కొడిక్కోళ్హికొణ్డాన్ । పిన్నుమ్
నేర్శరిన్దాన్ ఎరియుమనలోన్ । పిన్నుమ్
నేర్ శరిన్దాన్ ముక్కణ్మూర్త్తికణ్డీర్ । అప్పన్
నేర్ శరివాణన్ తిణ్డోళ్ కొణ్డవన్నే.

9. అన్నుమణ్డోరెరికాల్ విణ్మలైముదల్ ।
అన్నుశుడర్ ఇరణ్డుపిఱవుమ్ । పిన్నుమ్
అన్ను మళ్హైయుయిర్ తేవుమ్మఱ్ఱుమ్ । అప్పన్
అన్నుముదల్ ఉలగమ్ శెయ్దదు మే.

10. మేయ్నిరైకీళ్హ్పుగ మాపురళ । శునై
వాయ్నిఱైనీర్ పిళిఱిచ్చొరియ । ఇవ
ఆనిరైపాడి అజ్గే యొడుజ్గ । అప్పన్
తీమళ్హైకాత్తు కున్నమెడుత్తానే

11. కున్నమెడుత్తపిరాన్ అడియారొడుమ్ ।
ఒన్నినిన్ఱ శడకోపనురై శెయల్ ।
నన్నిపునైన్ద ఓరాయిరత్తుళ్ళివై ।
వెన్నితరుమ్ పత్తుమ్ మేవిక్కఱ్ఱార్క్కే

❦ ❦ ❦



# శ్లోకానుక్రమణిక

---



# శ్రీసుదర్శనయంత్రము